# మేలిముసుగు

# (PAINTED VEIL)

రచన:

సామర్‌సెట్ మాగమ్

అనువాదం:

రమేష్




పబ్లిషర్సు:

భవాని పబ్లిషింగ్ హౌస్

ఉయ్యూరు

(కృష్ణాజిల్లా)

ప్రచురణ 1957

ప్రతులు 1200

డిస్ట్రిబ్యూటర్సు:

ఆదర్శ గ్రంథమండలి

బకింగ్‌హాంపేట పోస్టు,

విజయవాడ - 2

మూల్యమ్ రు 3-50

# మేలిముసుగు

## 1

ఆమె త్రుళ్ళిపడి కెవ్వున అరచింది.

"ఏం జరిగింది ? ఏమిటది ?" అన్నాడతను.

గది కిటికీ తలుపులన్నీ మూసేవున్నాయి. అయినా ఆమె భయంతో కంపించిపోవడం అతడు గమనించాడు.

"ఇప్పుడెవరో ద్వారంముందు నిలబడ్డారు."

"ఏ కుర్రవాడో, దాదీయో అయివుంటారు."

"కాదు. నేను భోజనం చేయగానే నిద్రపోతానని వాళ్ళందరికి తెలుసు, వాళ్ళెవరూ ఈ సమయాన ఇటురారు"

"ఇంకా మరెవ్వరై వుంటారంటావ్?"

ఆమె పెదవులు కంపిస్తున్నాయి. 'వాల్టర్' అని చాలా నెమ్మదిగా అంది.

ఆమె పురుషుని బూటులవంక సైగచేసింది. పురుషుడు వాటిని వేసుకోవాలనుకున్నాడేగాని అప్పటికే అతడు ధైర్యం కోల్పోయాడు. ఆమె బొబ్బరింపు అతడిని చాలా భయపెట్టింది. పరిస్థితి అతడికి కష్టంగా కన్పించింది. బూటులు తొందరలో తిరగేసి తొడగబోయాడు. భయంతో ధైర్యాన్ని కోల్పోయిన స్త్రీ ఆతడిని వెళ్ళమన్నట్లు త్వరపెట్టింది. ఆమె తనగౌను వేసుకుంది. జుట్టంతా రేగివుంది. దువ్వెన తీసుకుని

ఆమె జుత్తుసరిచేసుకుంది. పురుషుడు రెండవ బూటు తొడిగే లోపు ఆమె అతడికోటు నందించింది.

"నేను బయటి కెలా వెళ్ళను?"

"కొద్ది సేపాగు, నేనొకసారి చూస్తాను. ఇప్పుడెవరూ లేరు."

"ఊహు! అతడు వాల్టర్ అయివుండడు, సాయంత్రం అయిదు గంటలకు ముందుగా అతడు తన పరిశోధనాలయం నుంచి తిరిగిరాడు."

"అయితే మరి అతడెవరు?"

ఆ సమయమందా యిద్దరూ చాలా నెమ్మదిగా మాట్లాడుతున్నారు. ఆమె కంపించిపోతుంది. ఈ విధంగా అయితే ఆమె పిచ్చిదాతుందనిపించింది పురుషునికి; ఈ ఆలోచనతో అతడు కినుక వహించాడు. ఇదంత సురక్షిత ప్రదేశం కానప్పుడు ఏ ఆపదా రాదని ఆమె తనతో ఎందుకు చెప్పిందా యని ఆలోచించాడు. స్త్రీ ఊపిరిబిగబట్టి పురుషుని భుజంపై చేయివేసింది. స్త్రీ చూపులు నిలిచిన దిక్కుకు అతడూ చూశాడు. బయటకు వరండావేపున్న కిటికివంక స్త్రీ చూస్తూంది. కిటికి మూయబడేవుంది. కిటికి గిలక తిరిగివుంది. వరండాలో మనుషులు నడచిన ధ్వనేమీ విన్పించటంలేదు. నిశ్చలమైన ఆ దృశ్యానంతా చూసి భయంతో గగుర్పాటు కలిగింది. ఏదో అజ్ఞాతశక్తికి భయపడినట్లు వారిద్దరూ ఆ విధంగానే భీతితో క్రుంగిపోయి రెండవ కిటికివంక చూశారు. దాని గిలకకూడా తిరిగివుంది. ఇదంతా చూసి భయంతో

# 3

కెవ్వున అరవడానికన్నట్లు కిటీ నోరు తెరచింది. కాని పురుషుడిది గమనించి ఆమె నోటిని చేతితో మూసివేశాడు. ఆ కేక అరచేతికి, వ్రేళ్ళకు మధ్య చిక్కుకుని ఆగిపోయింది.

కిటీ హఠానంగా అతనిపైన వాలిపోయింది - ఆమె కాళ్ళు కంపిస్తున్నాయి - ఆమె మూర్ఛ చెందుతుందేమో అన్నట్లుంది. పురుషుని దవడలు భయంతో కదనొక్కుకుపోయాయి. అతడు కిటీని లేవదీసి మంచంమీద కూర్చోపెట్టాడు. శ్వేతవస్త్రంవలె ఆమె పాలిపోయినట్లయింది. పురుషుని చెక్కిళ్ళ రంగుకూడా పూర్తిగా మారిపోయింది. అతడు కిటీ ఆసరాగా నిలబడి ఆ గిలకకేసి చూస్తున్నాడు. ప్రస్తుతం వారిద్దరూ ఏమీ మాట్లాడటంలేదు. అంతలోనే వెక్కి వెక్కి ఏడుస్తున్నట్లు గమనించాడతడు.

'దయయుంచి ఇప్పుడటువంటిదేమీ చేయకు'' అని అతడు కొంచెం కినుకగా అన్నాడు. ''మనం ప్రస్తుతం లోన వున్నాం! లోన వుండటానికే వచ్చాం ఇక్కడికి- ఇప్పుడిహ సందేహ నివృత్తిచేసుకుని మనం ధైర్యం వహించాలి.''

కిటీ తనరుమాలు కొరకు వెదుకో సాగింది. పురుషుడు చేతిసంచీ సందించాడు.

''నీ టోపీ యెక్కడుంది?''

"దాన్ని క్రిందే వదలి వచ్చాను"

''హరి, భగవంతుడా!''

"నువ్వు ధైర్యంగా వుండు ముందు, ఆవచ్చినమనిషి వాల్టర్ కాదంటున్నానుగా. కావాలంటే పందెంకాస్తాను —

అతడు వాళ్లరే అయితే నేను నీకు వందరూపాయిలు ఇస్తాను—కానట్లయితే నువ్వు నాకు ఒకరూపాయి ఇవ్వు చాలు. ఐనా ఎటూగాని సమయంలో అతడు ఎందు కిక్కడకు వచ్చాడో నాకు బోధపడటంలేదు. అత డేనాడైనా మధ్యాహ్నం ఇంటకి వచ్చేవాడేనా ?''

''ఎన్నడూ రాలేదు.''

''అయితే ఇహ నీయిష్టం వచ్చిన పందెం కాస్తాను. ఆయనా వచ్చివుంటుంది.''

నవ్వుముఖంతో కిటీ అతడికేసి చూసింది. పురుషుడు మాటిమాటికి చెప్తున్న ధైర్యవచనాలు విని ఆమె మనస్సు కుదుటపడింది. ఆతడి చేతుల్ని కిటీ తనచేతుల్లోకి తీసుకుని మెల్లగా వత్తింది. ఆమెకు ధైర్యం కలిగించటంలో పురుషుడెంతో సహాయపడ్డాడు.

''చూడు, ఇహమనం ఇక్కడ యిలా ఎంతోసేపు వుండలేము. నువ్వు ఇష్టపడితే వరండాలోకి వెళ్ళిచూసిరా'' అన్నాడు.

''నా కాళ్ళల్లో నిలబడేఓపిక కూడా చచ్చిపోయింది''

''బ్రాందీ ఏమైనా వుందా మీ ఇంట్లో?''

లేదన్నట్లు కిటీ తలూపింది. దట్టంగావున్న ఆమె కనుబొమలు గాబరావల్ల మరీ దట్టమైనాయి. ఇప్పుడిహ తనేమి చేయాలో అర్ధంకాలేదామెకు. చటుక్కున ఆమె తన రెండు చేతుల్ని గట్టిగా నొక్కుకుంది.

"అతడు ఒకవేళ బయట నిరీక్షిస్తున్నాడనుకో, మరి అప్పుడో?"

పురుషుడు బలవంతంగా లేని నవ్వు తెచ్చుకొన యత్నించాడు. కంఠస్వరం ఆతడి అదుపులోనే వుంది. తన మాటల యందు విశ్వాసముందతనికి.

"అలాంటి సందేహం ఏమీ లేదు. కిటీ! లేచిచూడు. అయినా ఇప్పుడు నీభర్త ఇక్కడ ఎందుకుంటాడు? ఒకవేళ అతడు ఇక్కడికి రావటమే సంభవించివుంటే – క్రిందపరాయి పురుషునిటోపీ – పైనతలుపులు లోనవేసివుండటం చూసి కూడా ఏదో రభసచేయకుండా మెదలకుండా ఎందుకు వూరుకుంటాడు? వచ్చింది ఏ నౌకరో అయివుంటాడని నాఉద్దేశ్యం. చైనావాడైతేనే ఇలా తలుపు గిలకలు తిప్పుతారు, మరొకరు ఇలాచేయరు." ఈ మాటలతో కిటీ మళ్ళీ ఈ ప్రపంచంలోకి వచ్చింది.

"ఆ వచ్చింది ఆయా అయినా అంత మంచిపనిగాదు"

"అబ్బ ఆమెనయితే ఏదోవిధంగా సరిపెట్టుకోవచ్చు. భగవంతుని భయం చూపిస్తాను ఆమెకు నేను. ప్రభుత్వ ఆఫీసరైనందుకు మరే లాభమున్నా లేకపోయినా కోరిన పనిని చేయించుకోవచ్చును."

అతడు చెప్పేదంతా కిటీకి వాస్తవంగానే కనిపించింది. ఆమెలేచి నిలబడి అతడికేసి చేతులు చాచింది. పురుషుడు ఆమె పెదవుల మీద చుంబించాడు. మనస్సులో ఆమె అతనిని పూజిస్తుంది. పురుషుడు తన కౌగలినుంచి ఆమెను వదిలాడు.

కిటికీ వరకు వెళ్ళింది ఆమె. గొళ్ళెంతీసి నెమ్మదిగా తలుపు తెరచింది. కొద్దిగా తొంగిచూసింది; యెవరూ లేరక్కడ. తలుపు తెరుచుకుని ఆమె వసారాలోకి వెళ్ళింది. తరువాత తన భర్త గదిలోకికూడా వెళ్ళి చూసింది. రెండు గదులూ ఖాళీగానే వున్నాయి. మళ్ళీ ఆమె తన పడక గదికి తిరిగివచ్చి పురుషునికి సంజ్ఞ చేసింది.

"ఎవరూ లేరు."

"అదంతా నీ భ్రమేనని నా అభిప్రాయం."

"నవ్వుతా రెందుకు; భయంతో నా గుండెలు అవిసి పోయాయి! నవ్వకు వెళ్ళి హాలులో కూర్చో. మేజోళ్ళు, బూటులు వేసుకుని వస్తాను నేను.

## 2

కిటీ చెప్పగానే అతడు వెళ్ళి పోయాడు. అయిదు నిముషాల్లో కిటీ కూడా తయారై క్రిందికి వచ్చేసింది. అతడు కూర్చుని సిగరెట్ త్రాగుతూ వున్నాడు.

"కాస్త బ్రాందీ, ఒక సోడా దొరుకుతుందా?"

"ఆఁ! ఇప్పుడే పంపిస్తాను."

ఇద్దరూ మెదలకుండా కూర్చుని నౌకరు కొరకు ఎదురు చూస్తున్నారు. నౌకరు రాగానే కావల్సిందేదో కిటీ అతడికి ఆదేశించింది. "పరిశోధనాలయానికి ఫోను చేసి డాక్టరు వాల్టర్ అక్కడ వున్నాడో లేదో అడిగి తెలుసుకో. వాళ్ళు నీ కంఠాన్ని గుర్తించరు" అని అతడితో చెప్పింది కిటీ.

పురుషుడు లేచి ఫోను దగ్గరకు వెళ్ళాడు, నంబరడిగి వాల్టర్ ఫేన్ అక్కడ వుందీ లేనిదీ అడిగి రిసీవరు పెట్టేశాడు.

"ఇవాళ మధ్యాహ్నం భోజనం తరువాత అతడు అటు వెళ్ళనే లేదట." అన్నాడు కిటీతో. "ఒక వేళ ఇక్కడకుగాని ఏమైనా వచ్చాడేమో నౌకర్ని అడిగి తెలుసుకో" అని కూడా చెప్పాడు.

"అడిగేటంత ధైర్యం లేదు నాలో. అతడు ఇక్కడికే గనుక వచ్చివుంటే నేను కలుసుకోక పోవటం చాలా తప్పే అవుతుంది."

ఇంతలో నౌకరు బ్రాంది, సోడా తెచ్చాడు. టవున్సెండ్ స్వయంగానే పోసుకుని త్రాగసాగాడు. కిటీనికూడా త్రాగవల్సిందిగా కోరాడు టవున్సెండ్, కాని నిరాకరించిందామె.

"ఒక వేళ ఆ వచ్చిన మనిషి వాల్టరే అయితే ఏం జరుగుతుంది?" అడిగింది కిటీ.

"అతడేమీ పట్టించుకోడు దీనిని."

"ఏమిటి? వాల్టరా?" ఆమె కంఠంలో శంకిస్తున్న భావం నిండివుంది.

"అవును, అతడు కాస్త లజ్జా స్వభావంగల మనిషిగా నాకు అనిపిస్తుంది. కొందరు ఇలాంటివి పట్టించుకోరు. ఇలాంటి విషయాల్లో కలిగించుకున్నందువల్ల కలిగే పరిణామం చేజేతులా అపకీర్తిని కొని తెచ్చుకోవటం మినహా మరేమీ వుండదు. అతడు వాల్టర్ అయివుండడనే నా నమ్మకం. ఒక

వేళ ఆవ్యక్తి అతడే అయినా ఈ విషయంలో ఏమీ మాట్లాడను. అతడు చూసీ చూడనట్లు వినీ విననట్లు వూరుకుంటాడనే నా వుద్దేశ్యం.''

ఒక్క క్షణకాలం నిశ్చలంగా వుంది కిటీ.

''అయితే మరీ మంచిదే. నువ్వతడిని దారిలో పెట్టుకోవచ్చు'' అని అతడు మందహాసం చేశాడు. ఆమందహాసం చూసే కిటీ పడిచచ్చేది. ఆ చిరునగవు అతడి కళ్ళల్లోంచి మెల్లగా ముఖంలోకి దిగి వచ్చేది. అందమైన పలువరుస, ఆదరహాసం కిటీని పులకింపచేసేది; ఆ దరహాస ప్రతిరూపం ఆమె శరీరమంతటా పెనవేసుకున్నట్లనిపించేది.

"నాకు విచారం లేదు'' అంది ఆమె. ఆమె మాటలో ప్రసన్నతవుంది.'' అతడుకూడా ఇందుకే తగిన వాడు.''

'' నాదే తప్పు.''

'' ఎందు కొచ్చావ్ నువ్వు. నేను నిన్ను చూస్తూనే వుండి పోయాను.''

"నన్ను నేను నిగ్రహించుకో లేక పోయాను.''

'' ప్రియా! ''

కిటీ అతడికేసి వాలింది. మెరుస్తూన్న అతడి నల్లని కళ్ళనిండా కామ వాంఛనిండివుంది. ఆమె అతడికేసి చూస్తూనే వుండి పోయింది. ఆమె నోరు తెరచివుంది. తన చేతులు రెండూ ఆమె మెడచుట్టూ వేశాడు టవున్సెండ్. కిటీ నిస్సహాయురాలివలె చాచిన ఆ చేతుల వశమయి పోయింది.

"నువ్వు ఎప్పుడూ నాయందు విశ్వాసం వుంచు" అన్నాడు అతడు.

"నీతో నేనెంతో సంతోషంగా వున్నాను. అంత సుఖాన్ని నేనుకూడా నీకు ఇవ్వగలిగితే ఎంత బాగుండును!"

"ఇప్పు డిహ నీకు భయం వేయటం లేదు."

"వాల్టర్‌యందు నాకు ద్వేషం" అని అన్నది ఆమె.

దీనికి జవాబు ఏమి చెప్పాలో టవున్సెండ్‌కు తెలియ లేదు. కిటీని ముద్దు పెట్టుకున్నాడు అతడు. కిటీ ముఖం అతడి కంటే ఎంతో మృదువుగా వుంది. తరువాత అతడు తన చిన్ని బంగారు గడియారంకేసి చూశాడు.

"నేనేం కోరుతున్నానో నీకు తెలుసా?"

"తలుపు వేయనా? ఆమె దరహాసంచేసింది.

అతడు 'వద్దు' అని సైగచేశాడు. మళ్ళీ ఒకసారి ఆమె అతడి కౌగలిలో ఇమిడి పోయింది. అతడు వెళ్ళిపో గోరుతు న్నాడని గమనించి ఆమె అతడినుంచి వేరయింది.

"సిగ్గువేయటం లేదు. కాస్తయినా ఆఫీసు దృష్టి వుండదు. వెళ్ళు వెళ్ళిపో!"

కిటీతో పరిహాసమాడాలనే కోర్కెను ఆపుకోలేక పోయాడు టవున్సెండ్.

"వెంటనే నానుంచి విముక్తి పొందాలని చూస్తున్న ట్లుగా కనిపిస్తుంది" అన్నాడు అతడు పరిహాసంగా.

"నేను నిన్ను వెళ్ళనివ్వదలచటం లేదనేది నీకు తెలుసు"

కిటీ సమాధానం మెల్లగావుంది, అందులో లోతువుంది—గాంభీర్యంవుంది. టవున్సెండ్ సంతోషంగా నవ్వేశాడు.

"నా ముద్దుల కిటీ! నీ విహా ఆ వచ్చిన అజ్ఞాత వ్యక్తి గురించి ఆందోళన చెందకు. మనస్సును పాడు చేసుకోవద్దు. ఆ వచ్చింది ఆయా అయివుంటుందని నా ధృఢ విశ్వాసం. అయినా ఒకవేళ నీకేదైనా కష్టపడాల్సివస్తే, నిన్నేమాత్రం కష్టపడనీయను, నమ్ము"

"నీకు బాగా మంచి అనుభవం వుందా?"

అతడు దరహాసం చేశాడు. అతడి ఆకర్షణీయమైన దరహాసం!

"లేను, కాని ఈ రెండు బుజాలపైనవున్న నాతలలో వుండే బుద్ధిమీద నాకు నమ్మకం వుంది.

# 3

వెళుతూవున్న చార్లీకేసి చూస్తూ కిటీ వరండాలో నిల బడి వుంది. చేతులు ఊపుతూ అతడు కిటీని అభినందించాడు. అతడ్ని చూడగానే కిటీకి పులకించినట్లుండేది శరీరం. టవున్సెండ్ వయస్సు నలభై ఒక్క సంత్సరం, కాని శరీరం మాత్రం బిగిసి దృఢంగా వుంటుంది. యువకులవలె ఉంటుంది అతడి నడక.

వసారాలో నీడగావుంది. అక్కడ నిశ్శబ్దంగావుంది. ప్రేమలోని తృప్తితో ఆమె శాంతముగా వుంది. అక్కడే వుండి పోయింది ఆమె. హైప్పీ—లైలీలో పర్వతం మీద ఒక అంచున వారి ఇల్లు వుంది. ఇంతకంటే ఎక్కువ ప్రియమైన

ఇంటిలో వారువుండలేరు. రెండవ వైపున రేవులో నిండుగా వుండే ఓడల కేసి ఆమెదృష్టి ఎప్పుడైనా పొరబాటుగా పోతే పోయి వుండచ్చును. ఆమె కేవలం. తన ప్రేమికుడ్ని గురించే ఆలోచిస్తూవుంది.

నిజంగా మధ్యాహ్నం తరువాత జరిగింది మూర్ఖత్వమే, కానిటవున్సెండ్ కోరినప్పుడు ఎలా నిరాకరించ గలుగుతుంది? రెండు మూడు పర్యాయాలు అతడు భోజనం అనంతర వచ్చే వున్నాడు. చిటపటలాడే ఎండలోపడి వచ్చాడు. ఇటువంటప్పుడు మరెవ్వరూ బైటకి వెళ్ళాలనే తలచరు. అతడు వస్తూ పోతూ వుండటం పిల్లలుకూడా ఎవరూ గమనించ లేదు. హాంకాంగ్‌లో వుండటం దుర్భరమయి పోయింది కిటీకి. ఆమెకు చైనీయుల ఈ పట్టణమంటే ద్వేష మేర్పడింది. విక్టోరియా రోడులోవున్న ఆ భవనానికి వెళ్ళటం అంటే ఆమెకు అసహ్యం కల్గింది, చార్లీ టవున్సెండ్‌ను కలుసుకుంటానికి ఆమె అక్కడికే వెళుతూ వుంటుంది. అది ఒక దుకాణదారుని ఇల్లు, అక్కడ కూర్చునివుండే చైనావాళ్ళు ఆమె వెళ్ళేసరికి ముక్కు చెవులు ముడుచుకొని చూసేవారు. మెట్లకుండా తనను గది వరకు సాగనంపే ఆముసలి వాడి చిరునవ్వు ఆమెకు చెడుగా కన్పించేది. ఆ గది షాపుకు వెనుకవైపున వుంది. దాన్ని చూస్తేనే ఆమెకు ద్వేషంతో వణుకు పుట్టేది.

ఆమె మొదటిసారి చార్లీని ఈ గదిలో కలుసుకున్నప్పుడు," అబ్బ ఎంత మురికి కూపంగావుంది. వుందిగదూ?" అని అడిగింది.

"అవును నీవు రాకముందు వరకూ అలాగేవుండేది,"

అన్నాడతడు కాని చార్లీ ఆమెను తన బాహువుల్లోకి తీసుకుని కౌగలించుకున్నప్పుడు ఆమె అంతా మరచిపోయింది.

తను స్వతంత్రంగా లేక పోవడం ఎంత దురదృష్టం. వారిద్దరూ స్వతంత్రులు కారు. కిటీకి చార్లీ భార్య నచ్చదు. కిటీ ఆలోచన లిప్పుడు డోరోధిట ఫ్రెన్డ్ వైపుకు మళ్ళాయి. డోరోథీ ఎంత మురికి పేరు. కనీసం ఆమె వయస్సు ముప్పది ఏడు సంవత్సరాలుంటుంది. చార్లీ ఆమెను గురించి ఎప్పుడూ ఏమి చెప్పలేదు. చార్లీకి ఆమె విచారమే లేదు. డోరోథీ అతనిని వేధించింది. కాని చార్లి ఎంతో మంచివాడు కిటీ చార్లియందు తనకున్న ప్రేమ భావానికి నవ్వొకుంది. డొరొథీ కిటీకంటే పొడగరి; చురుకైనదే. ఆమె జుత్తుబూడిద రంగు, పసుపు పచ్చగానూ ఉంటుంది. ఆమెలో ఇంక మరే అందమూ లేదు. యౌవనంలో అందముగాఉండి ఉండనచ్చు. ఆమె ముక్కు నొసలు మంచివే. వాటిల్లో ప్రత్యేకత ఏమీ లేదు. ఆమె నేత్రాలు నీలివర్ణంగా ఉంటాయి — ఆమె బుగ్గలుకూడా అందముగా ఉండవు. మంచి మంచి దుస్తులే ధరించేది. కిటీ ముఖంలో నవ్వు చిందింది; ఆమె తన భుజాల నెగురవేసింది.

డొరొథి టఫ్రెన్డ్ కంఠస్వరముతో మాధుర్యం లేదనే విషయాన్నెవరూ వ్యతిరేకించరు. ఆమె పిల్లలకు మంచి తల్లికాగలదని రుజువైందని చార్లి ఎప్పుడూ ఆమెను గురించి అనేవాడు. కిటీ తల్లి ఇటువంటి స్త్రీలను సాధు స్త్రీలంటూ ఉండేది. కాని కిటీకి డొరొథీ ఎప్పుడూ నచ్చలేదు. ఆమె పద్ధతులు, పరిస్థితులంటే కిటీకి అయిష్టం, తమ యింటికి

భోజనానికి వచ్చే వారిని ఆమె ఆహ్వానించే పద్ధతి కిటీకి అయిష్టం. అతిథులమధ్య చాలా స్వల్పాసక్తితో సంచరిస్తుం దనేది ఆమె ఆచార వ్యవహారాల వల్లనే స్పష్టమవుతుంది. డొరొథికి తన బిడ్డలయందు మినహా మరే వస్తువుయందు అభి రుచిలేదని కిటీ అభిప్రాయం.

ఆమె యిద్దరుకొడుకులు ఇంగ్లండులోచదువుతున్నారు. మరో ఆరు సంవత్సరాల కొడుకును వచ్చేసంవత్సరం తన వెంట ఇంటికి తీసుకువెళ్ళాలనుకుంటుంది. ఆమె ముఖంలో మోహంనిండి వుండేది ఆమె నవ్వుతూనే వుండేది — సంతో షంగానూవుండేది — ఆమె సంభాషణాపద్ధతికూడా అందంగా వుండేది. అయినా ఇవన్నీ ఎన్నివున్నా ఆమె తననుతాను వేరుగా దూరంగా వుంచుకోవాలనుకుంటున్నట్లనిపించేది. పట్టణంలో ఆమెకు చెలికత్తెలుకూడా వున్నారు, వాళ్ళామెను పొగుడుతూవుండేవారు. శ్రీమతి టవున్సెండ్ తనను సాధారణ స్త్రీగా భావించడంలేదుగదా అనుకునేది కి. ఆమెసిగ్గు పడింది. తనను ఘనంగా భావించడానికి తగినకారణమెక్కడా ఆమెకు కన్పించలేదు. తనతండ్రి వలసరాజ్య గవర్నరైనమాట నిజమే. హోదావున్నంతకాలం ఘనంగానేవుంటుంది. ఎప్పు డైనా ఒకగొప్ప హోదాలోవున్న వ్యక్తి ఎక్కడికైనా వెళ్ళితే కూర్చున్నవాళ్ళు లేచి నిలబడి ఆహ్వానిస్తారు, అభినందిస్తారు. కాని రిటైరైన గవర్నర్నెవరు పట్టించుకుంటారు? డొరొథి టవున్సెండ్ తండ్రికి పించనువస్తుంది. అతడు అర్ల్స్‌కోర్ట్‌లో ఒక చిన్నయింటిలో వుంటున్నాడు. కిటీ తల్లి కిటీని పిలిపించ డానికి సంకోచిస్తుంది. కిటీ తండ్రి బెర్నార్డ్ గార్సిన్‌కు

కె. సి. బిరుదులభించింది. కొద్దిరోజుల్లోనే జడ్జీ కావచ్చు. సరే, ఏదో ఒకటి! ప్రస్తుతం ఆయన దక్షిణ కేసింగ్టన్‌లో వుంటున్నాడు.

# 4

వివాహం అయినతరువాత కిటీ హాంకాంగ్ వచ్చింది. ఇక్కడ సంఘంలో తనభర్త అంతస్తునుబట్టే తనను గుర్తిస్తున్నారనేది గ్రహించింది కిటీ ఈ విషయంలో ఎప్పుడు రాజీ పడదలచుకోలేదనేది కఠోరసత్యం. తనకు సన్నిహితంగా వచ్చిన వాళ్ళుమాత్రం ఆమెను గౌరవించారు. వచ్చిన ప్రారంభంలో తరచు ప్రతిరోజూ దంపతులిద్దరూ ఏదోఒక పార్టీకి వెళ్ళవలసి వచ్చేది. ఒకసారి ఆమె గవర్నరుగారి విందుకు వెళ్ళింది; అక్కడ ఆమెను క్రొత్తపెండ్లికూతురుకు జరిగినంత గౌరవమర్యాదలు చేశారు, కాని ఆమె త్వరగానే గ్రహించుకుంది – ఒక సైంటిస్టు భార్యా కావడంమూలంగానేగాని ఆమెకు ప్రత్యేక విలువేమీ లేదు, ఈ ఆలోచన రాగానే ఆమెకు కినుక కలిగినటయింది.

"అయిదు నిముషాలుకూడా తనయింటిలో వుండగోరే పురుషుడొక్కడూ ఇక్కడలేకపోవడం ఎంత నీచవిషయం. మా అమ్మగనుక యిక్కడవుండివుంటే రుమె ఎన్నడూ తన యింటికి ఎవర్నీ పిలవడానికి ఇష్టపడదు'' అని కిటీ తనభర్తతో అంది.

''అందుకు నీవేమీ విచారించకు, నీకు సంబంధించిన

విషయం కానప్పుడు అనవసరంగా ఎందుకు మనస్సుపాడు జేసుకుంటావ్?''

"చికాకు పడగూడనమాట నిజమే. కాని వీళ్ళంతా శుద్ధమూర్ఖులని దీనివల్లన తెలియడంలేదా. ఈ విషయాన్నా లోచించినప్పుడు ఎంతబాధ కలుగుతుంది — నా ఇంటికిప్రతి నిత్యము ఎంతోమంది వస్తూఉంటారు. కాని పనికిరాని చెత్తా చెదారంవలె నేను వేరుగాపడి ఉండాల్సివస్తుంది.''

''సాంఘిక దృష్టితో సైంటిస్టుకు సంఘంలో ఏమీ మూలబంధమేలేదు'' అని వాల్టర్ నవ్వుతూ అన్నాడు.

''డిన్నర్లు వగైరాలకు ఇతర ఆఫీసుల్లోని వారివెంట వెళ్ళడం నాకెంత హాస్యాస్పదంగా ఉందో చెప్పలేను'' అని కిటీ నవ్వుతుంది — తానన్నమాటలు భర్తకు కష్టంకలిగిస్తా యేమోననే అయిఉంటుంది. వాల్టర్‌కు బహుశా కిటీ దరహా సంలో దాగిఉన్న రహస్యం అర్థమైఉంటుంది. అతడు సిగ్గుపడి కిటీ చేతుల్ని తన చేతుల్లోకి తీసుకున్నాడు. ''కిటీ, నిజంగా నాకూ చాలాబాధగానే ఉంది. కానైనా నీ వీ విషయాల్ని గురించి బాధపడకు'' అన్నాడు.

## 5

ఆరోజు మధ్యాహ్నం ఆ వ్యక్తి వాల్టరై ఉండడు.తప్పక ఎవడో ఒక పనిమనిషే అయిఉంటాడు. కాని ఒక వేళ ఎవడో పనిమనిషే అయితే బాగుపడేదిగాని, చెడేదిగాని ఏముంటుంది. ఈ చైనా నౌకర్లు దౌర్భాగ్యులు, ఏదోవిధంగా రహస్యాలన్నీ

తెలుసుకుంటారు — సంతోషమేమిటంటే వాళ్ళెప్పుడూ నోటికి తాళాలు వేసుకునేఉంటారు.

ఆరోజు కిటికీగడి నెమ్మదిగా కదిలిన విషయం గుర్తు రాగానే కిటీ హృదయం అదరిపోయేది. తాను, చార్లి ఇటువంటి ఆపదలో పడకూడదని ఆమె ఆలోచించేది. ఇంతకంటే తానే వెళ్ళి అక్కడ ఆ షాపులో కలుసుకుంటేనే మంచిది. అక్కడకు వెళ్ళడం ఎవరు చూసినా అదివవరూ గమనించనే గమనించరు; ఇద్దరూ అక్కడ నిస్సంకోచంగా కలుసుకోవచ్చు. షాపు యజమానికి చార్లి తెలుసు; చార్లి ఎవరు — ఏమిటి అనేదికూడా అతడికి తెలుసు. అతడెన్నడూ అసిస్టెంట్ వలన శ్రెకటరీకి విరుద్ధంగా ఒక మాటకూడా మాట్లాడేటంత మూర్ఖుడుకాడు. చార్లి తనను ప్రేమిస్తున్నాడనీ, తా నందుకేమీ అభ్యంతరపెట్టి బాధకలిగించలేనని అమెకు తెలుసు.

ఆమె వరండాలోనుంచి లేచి హాలులోకి వచ్చింది. సోఫాలో విశ్రాంతిగా కూర్చుని సిగరెట్ కోసంచేయిచాచింది. ఎదురుగా ఒక పుస్తకము, దానిమీద వ్రాసినకాగితం కన్పించాయి. కిటీ ఆ కాగితం తెరచి చూచింది. పెన్సిల్ తో వ్రాసి ఉంది—

డియర్ కిటీ !

ఇది నీ పుస్తకం. నే నిది నీకు పంపుదామనుకుంటుండగానే డాక్టరు ఫేన్ కలిశారు. ఇంటికేవెళ్ళుతున్నాను గనుక తానే తీసుకువెళ్ళుతానని ఆయన చెప్పారు.

వి. హెచ్.

కిటీ బెల్ నొక్కింది "పుస్తకం ఎవరు తెచ్చారు? ఎప్పుడు తెచ్చారు?" అని నౌకరు రాగానే అడిగింది.

"బాబుగారే తెచ్చారమ్మా! ఆయన భోజనమైన తరువాత వచ్చారు."

అయితే అతడు వాల్టరే, ఆమె వెంటనే చార్లీకి ఫోను చేసింది. కిటీకి తెలిసిన విషయాలన్నీ చార్లీకి తెలియజేసింది. "నేనేం చేయను?" అని అడిగింది.

"నే నిప్పుడొక అత్యవసర సమావేశంలో మునిగి వున్నాను. ఇప్పుడు నీతో మాట్లాడ లేను. నీవు పూర్తిగా నిశ్చింతగా ఉండమని నా అభిప్రాయం."

కిటీ రిసీవరు పెట్టేసింది. ముఖాన్ని చేతుల్లో కప్పుకుని పరిస్థితి అంతటినీ ఆలోచించ నారంభించింది. బహుశా ఆమె యిప్పుడు నిద్రపోతూ ఉంటుందని వాల్టర్ భావించి ఉండ వచ్చు. ఒక వేళ తలుపు లోపలవేసి వున్నంత మాత్రాన ఆమె ఏదో అనుచిత కార్యంచేసినట్లు అర్థం కాదుగా. ఒక వేళ చార్లీ, తానూ, అప్పుడేమైనా మాట్లాడారేమోనని ఆలోచిం చింది. పైగా క్రింద చార్లీ టోపీకూడా ఉందిగా. చార్లీ తన టోపీని క్రింద వదలిపెట్టడం ఎంత తెలివి తక్కువ పనిచేశాడు ...కాని ఇందులో చార్లీది మాత్రం తప్పేముంది? ఇది చాలా సాధారణమైన విషయం. వాల్టర్ ఆటోపీ చూశాడనటానికి మాత్రం నిదర్శనమేముంది?

వాల్టర్ తొందరలో ఉండి ఉండవచ్చు, ఈ ఉత్తరంతో బాటు పుస్తకాన్నికక్కడ పెట్టి ఉంటాడు. బహుశా ఈ వైపు

గానే ఏదైనా పనివుండి వెళ్ళుతూవుండి ఉంటాడు. అతడు గదిలోనికే రావలిస్తే ముందు తలుపు దగ్గరకు వచ్చే తట్టే వాడు; కిటికీలతో కుస్తీలెందుకు పడతాడు. నేను నిద్ర పోతున్నాననే అతడు భావిస్తే, అలవాటుకు విరుద్ధంగా అత డెందుకు విఘ్నం కలిగించాడు. ఛీ! తానెంత తెలివి తక్కువ పని చేసింది.

కిటీ కొంచెం కుదుటబడింది — మరల అప్పుడే ఆమె హృదయంలో ఏదో బాధనిపించింది. ఆ బాధ చార్లీని కలుసు కుంటానికే వత్తిడి చేస్తుంది. బాధ కలగడం సహజమే, తనకు సహాయం చేస్తానని అతడు మాట యిచ్చాడు — తనకు సహాయం చేస్తాడు. ఆమెకు ఎన్ని ఆపదలు వచ్చినా సరే, ఆమె అతడి మైత్రి మాత్రం వదలదు, సరే!.......వాల్టర్ను గోలచెయ్యనివ్వు. ఆమెకు సహాయంగా చార్లీ ఉండనే వున్నాడు, ఆమెకు ఎవరి చింతా లేదు. వాల్టర్ గోల చేయ గానే కిటీకి చార్లీ మద్దతు ఉందని తెలుసుకుంటాడు. కిటి వాల్టర్నెప్పుడూ ప్రేమించనే లేదు, ఇక యిప్పుడు చార్లీని ప్రేమించేటప్పుడు ఆమెకు వాల్టర్ కౌగిలింత చాలా బాధ కలిగించేది. ఆమె వాల్టర్తో ఉండగోరడం లేదు. ఒక వేళ అసలు వాల్టర్ ఆ విషయాన్నెలా నిరూపిస్తాడో కిటీకి అర్థం కాలేదు. ఒక వేళ వాల్టర్ కిటీపై నిందను ఆరోపిస్తే ఆమె పూర్తిగా తిరస్కరిస్తుంది. ఒక వేళ అంతా చెడిపోయే పరి స్థితేవస్తే ఉన్న వాస్తవాన్నంతా విషంవలె వాల్టర్ చెవుల్లో గుమ్మరిస్తుంది — తరువాత వాల్టర్ ఏమి చేసుకున్నా తన కేమీ బాధ్యత ఉండదు.

# 6

వివాహమైన మూడు మాసాలకే కిటీకి తానేదో చాలా పెద్ద అపరాధం చేసినట్లనిపించింది. కాని అందులో ఆమె కంటే ఆమె తల్లి అపరాధం ఎక్కువ ఉంది.

కిటీ గదిలో ఆమె తల్లి ఫొటో ఒకటుంది; ఆమె వ్యాకుల దృష్టి ఆఫొటో పైబడింది. ఇంతకూ తానా ఫొటోను అక్కడ ఎందుకు ఉంచిందో ఆమెకు అర్థం కాలేదు. ఆమెకు తన తల్లితో ఎక్కువ సంబంధ మేమీ లేదు. ఆమె తండ్రి ఫొటోకూడా ఒకటుంది. కాని అది క్రింద గదిలో పియానో మీద ఉంది. తన తండ్రి ముఖం ఎంతో నీరసంగానూ, ఫొటోను అయోగ్యంగా ఉంటుంది. ఫొటో గ్రాఫరు ఆయనకు మంచి దుస్తులు వేయించి, నవ్వమని కోరాడు, కాని ఆయన నవ్వలేక పోయాడు. ఆయన కళ్ళు ఎంతో అలసి పోలసినట్లు-పై పెదవి చాలా పెద్దది, ముఖం చిన్నది. కాని కిటీ తల్లి ఫొటో దీనికి విరుద్ధంగా ఆకర్షణీయంగా ఉంటుంది. తన భర్త కౌన్సిలర్‌గా నియమించబడి కోర్టుకు వెళ్ళేముందు ఆమె ఆ దుస్తులు ధరించింది. ఆమె జుట్టులో చిన్న చిన్న ఈకలు ఉన్నాయి, చేతిలో అందమైన పుష్పాలున్నాయి. ఆమె నిండుగా అలంకరించుకుని నిల్చుంది. కిటీ తల్లికి అప్పుడు ఏబది సంవత్సరాలుంటాయి. నిడుపాటి శరీరము, విశాలమై ఎత్తుగా ఉన్న వక్షము, ఆమె దవడ ఎముకలు పెద్దవి; పొడవైన ముక్కు—అందంగా ఉంటుంది. మృదువైన జుట్టు, నల్లగా, వత్తుగా ఉంటుంది. కిటీకి అవెప్పుడూ రంగు వేసినట్లుగా కన్పించేవి.

ఆమె చంచలమైన నల్లని సుందర నేత్రాలు, ఇది ఆమె వ్యక్తిత్వంలోని ప్రముఖభాగం. ఎవరితోనైనా మాట్లాడుతూవుంటే ఆమె కన్నులు స్థిరముగా ఉండేవికావు, అవి ఎదుట వ్యక్తి మొదలుచుట్టూ అంతటా కలదిరిగేవి, తరువాత తిరిగి ఆ వ్యక్తిని లక్షించేవి. ఆమె తమను విమర్శిస్తుందనో, లేక తమతో మాట్లాడటాని కామెకు సమయం లేదనో అందరూ భావించేవారు. ఆమె చుట్టుపట్ల ఎంత చిన్న విషయము జరిగినా సరే పట్టించుకోకుండా ఉండేదిగాదు. కిటీ తల్లి భావాలకు, మాటకు సామ్యమేమీ లేదు.

# 7

శ్రీమతి గార్ట్రిసన్ క్రూరమైనది, లోభి, కీర్తికండూతి గలది, మూర్ఖురాలైన స్త్రీ. ఆమె లివర్‌పూల్‌లోని ఒక వకీలు కూతురు. బెర్నార్డ్ గార్ట్రిసన్‌కు ఆమెతో వివాహం జరిగినప్పుడు యువకుడు జీవితంలో నెగ్గుతాడు అనిపించేది. శ్రీమతి గార్ట్రిసన్ తండ్రిగారి అభిప్రాయంకూడా ఇదే—కాని జరిగిందలాకాదు. అతడు శ్రమజీవి—యోగ్యుడుకూడాను, కాని ఆయనలో ముందుకు పోవాలనే ఇచ్ఛాశక్తి పూర్తిగా లోపించింది. శ్రీమతి గార్ట్రిసన్, గార్ట్రిసన్ నెప్పుడూ ప్రేమించలేదు కాని కీర్తి తన భర్తద్వారానే లభిస్తుందనే విషయం ఆమెకు తెలియ లేదు. ఆమె తన భర్తను తన యిష్టంవచ్చిన మార్గాన నడిపించాలనుకుంది. అందులో ఆమెకు భర్తయందు దయాభావనమేమీ లేదు. తన భర్త కోర్కెకు విరుద్ధమైన పనిని ఆమె ఎప్పుడైనా అతడికి చెప్పిందంటే, దానికై అతడిని ఊపిరి

సలుపనీకుండా చేయడంతో చివరి కతడు తన అపజయాన్ని అంగీకరించేవాడు. అటు ఒక ప్రక్క తమ పనికి ఉపయోగ పడే మనుషులతో ఆమె పరిచయాలేర్పరచుకునేది. ఆమె పెద్ద పెద్ద లాయర్లతో పరిచయం కలిగించుకుంది. వాళ్ళు ఆమె భర్తకు కేసులకు సంబంధించిన సంక్షిప్త వివరాలు తెలియజేసేవారు. ఆ లాయర్ల భార్యలతో కూడా ఆమె దోస్తీ వృద్ధి చేసుకుంది. శ్రీమతి గార్టిసన్ అక్కడి జడ్జీలను, వారి భార్యలనుకూడా పూర్తిగా తెలుసుకుంది. రాజకీయ రంగం లోనికి క్రొత్తగా వచ్చిన వారితో కూడా ఆమె పరిచయాన్ని పెంపొందించుకునేది. గత పాతికేళ్ళలోనూ ఆమె డిన్నర్లకు ఎవరైనా పిలిచిందంటే వారంటే ఇష్టముండి కానేకాదు, అయినా ఆమె పెద్దపెద్ద డిన్నర్లే చేసింది. ఆమె లోభి. ఎంత పెద్ద డిన్నర్లయినా తా నితర్లకంటే సగం ఖర్చుతోనే జరప గలననేది, చూపాలనుకునేది. ఆమె జరిపిన డిన్నర్లు చాలా ఆడంబరంగా, అలంకృతంగా తక్కువఖర్చుతో చేసేది. తన యింటివద్ద జనం బ్రాందిత్రాగినప్పుడు వాళ్ళే బ్రాందీ త్రాగు తున్నారో తెలుసుకోగూడదనే ఆమె ఉద్దేశ్యం. ఆమె సీసాల నెప్పుడూ పొడిగుడ్డల్లో చుట్టి వుంచేది, జలమంతా దానిని ప్రసిద్ధ శాంపైన్ బ్రాంది అనుకునే త్రాగుతున్నారనుకునేది.

బెర్నార్డ్ గార్టిసన్ ప్రాక్టీసు బాగానే జరుగుతూ ఉండేది. ఆదాయంకూడా వట్టివట్టి ఆదాయంగాదు. ఆయనతరువాత వకీలు వృత్తిలోకి దిగిన అనేకమంది లాయర్లనాతడు ఎన్నోమైళ్ళ వెనకకి తోక్కేశాడు. శ్రీమతి గార్టిసన్ బెర్నార్డ్‌ను ఎన్నికల్లో నిలబెట్టింది ఎన్నికల ఖర్చంతటికీ పార్టీయే

భరించింది — కాని శ్రీమతి గార్ట్సన్ తన లోభితనాన్ని మాత్రం వదల్లేదు — ఆమె తన చేతిలోని చిల్లిగవ్వకూడా ఎన్నికలకు ఖర్చుచేయలేదు. బెర్నార్డ్ చందాలు ఎన్ని వసూలుచేసినా చాలా తక్కువయేది. ఫలితం జరగాల్సిందే జరిగింది. బెర్నార్డ్ ఎన్నికల్లోఓడిపోయాడు. శ్రీమతిగార్ట్సన్ తనభర్త ఎన్నికల్లో నెగ్గుతాడని కనే కలలన్నీ పేకమేడసలె కూలిపోయాయి — అయినా ఆమె ఆ గాఢమైన నిరాశ నెదిర్చింది. తనభర్త ఓడిపోయినా ఆమెకు సంతోషంగానే ఉంది, ఎందుకనంటే ఎన్నికలపేరుతో పెద్దపెద్దవాళ్ళ పరిచయాలు ఏర్పడ్డాయి. ఎన్నికల్లోకూడా తనభర్త శుద్ధమూర్ఖుడని ఆమెకు తెలుసు. తనభర్త పార్టీలోనే ఉండాలనీ, ఎప్పుడైనా ఏదైనా ఖాళీ ఏర్పడితే మరల అవకాశం లభిస్తుందనే ఆమె కోరుతుంది.

కాని బెర్నార్డ్ బాగా జూనియరు. కొందరు వయస్సులో అతడికంటే చిన్నవాళ్ళైనప్పటికీ ఎన్నికైయారు.

బెర్నార్డ్‌కు కూడా అవకాశం రావడం అవసరం. లేకపోతే అతడు జడ్జికాలేడు. అందుకే శ్రీమతి గార్ట్సన్ తన చెలికత్తెలతోనేగాక తనకంటే వయస్సు తక్కువ స్త్రీలతో కూడా డిన్నర్లకు వెళ్ళవలసి వస్తుంది. కాని కొద్దరోజులనుంచి ఆమెకు భర్తలో — తా సింతకుముందెన్నడు చూడనటువంటి మంకు తనము కన్పిస్తుంది. కె. సి. (కింగ్సు కౌన్సిలర్) అయినా తనకు పని లభించదని అతడు తలచేవాడు. అందుకే 'దూరపు కొండలు నునుపు' అంటూండేవాడు. దీనితో శ్రీమతి గార్ట్సన్‌కు ఆగ్రహం కలిగేది. "మానసిక

వికాసం పొందనివాళ్ళకే ఇటువంటి సామెతలు" అని ఆమె అనేది. దానికి జవాబుగా బెర్నార్డ్, "దీనివలన ఆదాయం కూడా సగానికి సగమే వుంటుంది" అనేవాడు — అయినా భార్యముందు తనవాదన నిర్జీవము, నిష్ఫలము అనేదికూడా అతడికి తెలుసు. ఆమె ఏమీ వినదు. శ్రీమతి బెర్నార్డ్ తన భర్తను అలసుడనేది. ఆమె అతడినెన్నడూ శాంతంగా వుండనిచ్చేదిగాదు,చివరకు భర్త భార్యముందు తల వంచవలసివచ్చేది అతడు పదవికొరకు విజ్ఞప్తిచేశాడు. అతనికి పదవి లభించింది.

అతడు భ్రమగా భావించిన భావాలు సత్యమేనని నిరూపితమయాయి. నాయకుని రూపంలోకూడా అతనివలన చెప్పుకోదగినంత పనేమీ జరగలేదు. బెర్నార్డుకు నిరాశకలిగింది, అయినా అతడు తన భార్యకు నిరాశ నే మాత్రమూ తెలియనీయలేదు. అతడు మొదటికంటే శాంతస్వభావం గలవాడైయాడు. అతడు మొదటినుంచీ ఆ స్వభావంగల వ్యక్తి అవడంవల్ల ఈ పెరిగిన శాంత స్వభావాన్నెవరూ గమనించలేదు. కుమార్తెలాయన్ని తమ సంపాదనకు ఆధారమని మాత్రమే గుర్తించారు. యింటింటికి తిరిగి తమకోసం సుఖ - భోగాలు, దుస్తులు, వుండటానికి నిరాసను — వీటన్నిటికి కావల్సిన డబ్బును సమకూర్చ యత్నించడమే వారి అభిప్రాయాల ప్రకారం తండ్రి చేయవలసినపని. అతడి తిప్పలవల్లనే ఇంటి ఆదాయం తగ్గిపోయిందని భావించే ప్రస్తుతం ఆయన్ను ద్వేషిస్తున్నారు. ఎన్నడూ వారా కోర్కెలులేని వ్యక్తి నిగురించి అంతకు మించి తెలుసుకోనాలనుకోలేదు. అతడు ప్రాతఃకాలమే — ఉదయమే ఇంటినుంచి వెళ్ళేవాడు, రాత్రికే భోజ

నానికి వచ్చేవాడు; దీనివలన బెర్నార్డు తన ఇంటిలోనే అపరిచితుడయ్యాడు. కుమార్తెలందరిదీ ఒకటే అభిప్రాయం; అతడు తమ తండ్రిగనుక ఆతడినుంచి తమకు ప్రేమ లభించాలి.

# 8

శ్రీమతి గార్ట్రిసన్ చాలా ధైర్యంగల స్త్రీ. ఆమె తన ప్రపంచంలో తనచుట్టూ వుండేవారికెన్నడూ సంఘర్షణలో తనకపజయం కలిగిందనేది ఏ మాత్రమూ తెలియనీయలేదు. తన నిరాశాభావాన్ని ఇతరులదృష్టిలో పడనీయలేదు. ఆమె ప్రశాన్తమైన డిన్నర్లు చేస్తూంది. వెనుకటివలెనే సంతోషంగా స్నేహితుల్ని, చెలికత్తెల్ని కలుసుకుంటుంది. ఆమెలో ఆ సంఘంలో మాట్లాడటానికి అపారమైన మాటలఖజానావుంది. ఎక్కడైనాసరే ఆమె హాజరైనచోట జనం హూనంగా ఉండగలిగేవారుకారు. ఆమెలో జనాన్ని మాటల్లో తన్మయపరచే కళవుంది.

బెర్నార్డు గార్ట్రిసన్ ఎప్పుడైనా హైకోర్టు జడ్జీఅయినా లేక ఏవలసకైనా పంపితే, కాని అలా కానంతవరకు వేల్సులోని ఏదో ఒక పట్టణపు రికార్డర్‌గా నియమింపబడినా గార్ట్రిసన్ సంతోషిస్తుంది. శ్రీమతి గార్ట్రిసన్‌కు తన కుమార్తెలపై ఎన్నో ఆశ లుండేవి. ఒకవేళ తన కుమార్తెలను ఎవరికైనా శ్రీమంతులకిచ్చి వివాహాలు చేయగలిగితే అపజయాలవలన కలిగిన విషాదం తగ్గిపోగలదని ఆలోచించేది. ఆమెకు ఇద్దరు కుమార్తెలు — కిటీ, డోరిస్ – డోరిస్ అందమైందికాదు. ఆమె ముక్కు పొడవు – ఆమె శరీరంలో ఎక్కడా ఏమీ

ఆకర్షణలేదు. కనుకనే శ్రీమతి గార్డినర్‌కు ఆమెయందు ఎక్కువ సానుభూతి లేదు. ఎవరైనా యువక శ్రీమంతునితో డోరిస్ వివాహం జరగాలనేదేగా ఆమె కోరేది.

కిటీ నఖశిఖపర్యంతం సంపూర్ణ సౌందర్యవతి అన్నట్లుం టుంది. ఆ సౌందర్యవిషయం చిన్నతనంలోనే తెలిసిపోయింది. విశాలమైన నేత్రాలు – చంచలములు – ఉంగరములజుత్తు – ఎరుపు బూడిదవర్ణములు కలిసివుంటుంది. అందమైనపలువరుస శరీర నిర్మాణమంతా ఆకర్షణంగానే వుంటుంది. అయినా ఆమె సర్వాంగసుందరి మాత్రం కాదు. ఆమె గడ్డము చదరంగా వుంటుంది, ముక్కుకూడా పొడవుగావుంటుంది, డోరిస్ ముక్కంత పొడవుమాత్రంలేదు. ఆమె సౌందర్యానికి ప్రముఖ కారణం ఆమె యౌవనమే. గుబాళించు యౌవనంలోనే కిటీ వివాహం చేయాలని ఆమె ఆలోచించుకుంది.

కిటీలోని స్వచ్ఛందయౌవనం అతి ఆకర్షణీయంగా వుం డేది. ఆమె శరీరాకృతి, ఆ వంపులు ఎంతో అందంగా వుం టాయి. ఆమె కన్నులు, వాటిపైనవున్న పెద్దపెద్ద రెప్పలు చూసేవారికి చక్కలిగింతలు పెడ్తాయి. శ్రీమతి గార్డినర్ కిటీపై తన వాత్సల్యాన్నంతా గుమ్మరించేది. కిటీ వివాహం ఘనంగా జరగాలనీ, గొప్ప శ్రీమంతునికి, గౌరవనీయ కుటుం బంలోనివాని కిచ్చి చేయాలనీ ఆమె కోరుకునేది.

తాను నిజంగానే సౌందర్యవతిగా కావాలి అనేభావం తోనే కిటీ పెంచబడింది. అయినా కిటీకి అప్పుడు తన తల్లి భావంపై సందేహం కలిగేది. శ్రీమతి గార్డినర్‌కూడా మంచి మంచి వేడుకల్లో పాల్గొంటానికి అవకాశం కల్పించుకునేది,

వెంట కిటీని తీసుకువెళ్ళటంమాత్రం మరచేదిగాదు. అటువంటి చోటులందే చాలా గొప్పవారితో పరిచయాలేర్పడతాయని ఆమె నమ్మకం. కిటీ ఎక్కడకు వెళ్ళినా విజయం పొందేది. ఆమె హృదయాకర్షణీయమైనది – పైగా అందమైనది. అతి స్వల్పకాలంలోనే పజనునుండికి పైగా ఆమెకు తమ ప్రణ యాన్ని నివేదించుకున్నారు.

కాని వారిలో ఒక్కరూ ఆమెకు నచ్చలేదు. కిటీ అం దరితో నవ్వుతూ మాట్లాడేది, కాని ఎవరితో ఏ విధమైన సం బంధము వుంచుకునేదిగాదు. ప్రతిఆదివారము సాయంత్రమయే సరికి వారింటివద్ద అనేకమందియువకులు గుంపులుగా జేరేవారు కిటీని వాళ్ళకు దూరంగా వుంచాలనే భావమే శ్రీమతి గార్టి సన్ కెప్పుడూ కలుగలేదు. కిటీ అందరితోనూ పరిహాసాలాడేది. అందరి హృదయాల్లోనూ స్థానం సంపాదించుకోడానికి ఒకరి కొకర్ని స్నేహం చేసేది. ఆ యువకులెప్పుడైనా ఆమెముందు వివాహ ప్రస్తావన తెచ్చినప్పుడు, ఆమె చాలా గంభీరంగా, క్రమపద్ధతితో వారి ప్రస్తావనను త్రోసిపుచ్చేడిది.

ఈ విధంగా గుబాళించు యౌవనపు ప్రథమ సంవత్సరం గడచిపోయింది. మర్రో ఏడాదికూడా గడచింది — అయినా ఇంతవరకు తనకు, తన తల్లి కోర్కెలకు తగిన యోగ్యతగల వారెవరూ లభించలేదు. కిటీ ఇంకా యువతే—ఇంకా మరి కొంతమందిని చూడవచ్చు—మరికొంత కాలం నిరీక్షించవచ్చు. ఆడ పిల్లలకు 21 సంవత్సరంలోపు వివాహం చేయగూడదని శ్రీమతి గార్టిసన్ తన చెలికత్తెలతో చెప్తూవుండేది. మూడవ. నాల్గవ సంవత్సరాలుకూడా నిరుపయోగంగానే గడచిపో

యాయి. ఇద్దరు ముగ్గురు పాత ప్రేమికులు కిటీకి తమ ప్రేమను తిరిగి నివేదించుకున్నారు — కాని వారు ప్రయోజన శూన్యులు—వారివద్ద, ధనంలేదు. మరొక ఇద్దరు ముగ్గురు వయస్సులో కిటీ కంటె చిన్నవాళ్ళుకూడా ప్రస్తావన తెచ్చారు; ఒక రిద్దరు పెద్ద హోదాల్లో వున్నవాళ్ళుకూడా అడిగారు కాని వారు రిటైరైయారు. వారిలో ఒకని వయస్సు యాభై మూడు సంవత్సరాలు. కిటీ యింకా తన అభిప్రాయం లోనేవుంది. ఆమె బింబల్డన్‌కు, లార్డ్సుకు వెళ్ళాతూవుండేది-డాన్సు చేసేది. కాని ఇంతవరకు ప్రతిష్ఠగల శ్రీమంతు డెవరూ ఆమెతో వివాహ విషయం ప్రస్తావించలేదు. ఇప్పుడిక శ్రీమతి గార్టిసన్‌కు కొంచెం విచార మేర్పడింది. కిటీ ఇప్పుడిక యువకులకు బదులుగా నలభై, అంతకుమించిన వాళ్ళను మాత్రమే ఆకర్షించ గలగడం శ్రీమతి గార్టిసన్ గమనించింది. ఇక ఒకటి రెండు సంవత్సరాలు గడిస్తే కిటీ ఇప్పుడున్నంతా అందంగాకూడా వుండదనీ, పైగా ప్రతి సంవత్సరం యువతులు పెరిగి పోతున్నారనీ ఆమె ఆలోచించింది. శ్రీమతి గార్టిసన్ ఈ విషయాన్ని గురించి ఇంట్లో ఏమీ చర్చించలేదుగాని, ఇప్పుడైనా యోగ్యుడైన పురుషుని వివాహమాడనిచో ఆమె కోర్కె పూర్తిగా మంటగలసిపోతుందని కిటీకి హెచ్చరిక చేసి చెప్పింది.

కిటీకి ఇదంతా ఏమీ అర్ధం కావడం లేదు. తానింకా నాలుగు సంవత్సరాలకు పూర్వమున్నట్లే అందంగా వున్నాననే ఆమె భావించేది — ఇంకా ఇప్పుడు ఎక్కువ సౌందర్యవతినై యాననుకునేది. గడచిన నాలుగు సంవత్సరాలలోనూ ఆమె దుస్తులు ధరించే కళలో మాత్రం ప్రవీణురాలైంది. ఒక

వేళ ఆమె ఇప్పటికైనా వివాహం చేసుకోదలిస్తే డజనుమంది యువకులు పేర్లుచెప్పి ముందుకు వస్తారు. తన మనస్సులో వున్న వ్యక్తి లభిస్తాడనికూడా ఆమెకు విశ్వాసముంది. ఆలస్య మైతే కావచ్చు, కాని లభిస్తాడు. శ్రీమతి గార్డినర్ ఇందుకు విరుద్ధంగా విషయాన్ని ఎక్కువ గంభీరంగా తలచింది. ఆమె యింత వరకు యోగ్యుణ్ణి ఎందుకు అన్వేషించుకో లేక పోయిందీ అనే కుమార్తెను గురించి తల్లి హృదయం ఆక్రోశిస్తుంది. తరువాత శ్రీమతి గార్డినర్ క్రింద వుదహరించిన అంతస్తుగల యువకుల్లో తన అన్వేషణ ప్రారంభించింది. ఇప్పుడామె వ్యాపారుల్లోనూ, ప్లీడర్లలోనూ తన అన్వేషణ సాగించింది. ఇంతకుముందు పైవాళ్ళంటే ఆమె ముఖం ముడుచుకుని అయిష్టం చూపి నప్పటికీ, వారి నెవర్నీ ఎన్నుకో నప్పటికీ వీరిలోనే ఎవరైనా అభివృద్ధికిరాగల ప్రతిభావంతుడు తన కుమార్తెకు లభించాలని కోరుతుంది.

కిటీ ఇప్పుడు పాతిక సంవత్సరాల అవివాహిత. శ్రీమతి బెర్నార్డ్ నిరాశ చెందసాగింది. ఈ నిరాశతో నిండే ఆమె అప్పుడప్పుడు కిటీని విదలించి కొట్టేది. ఇలా ఎంత కాలం తండ్రి పోషిస్తూవుంటాడనికూడా ఆమె కిటీని అడిగింది. "నీ తండ్రి నీకు పూర్తి అవకాశాల నిచ్చాడు; కష్ట పరిస్థితుల్లో కూడా డబ్బిచ్చాడు, కాని నీవేమీ చేయలేక పోయావు," అని ఆమె కిటీతో అంది. శ్రీమతి గార్డినర్‌కు తన తప్పు లెప్పుడూ కన్పించలేదు. ఆమె మూలంగానే సంపన్న కుటుంబపు యువకుల వైపుకు ఆకర్షణ ంలిగింది. తన అజ్ఞానం కారణంగానే ఆమె కిటీని సఫలం చెందకుండా చేసింది. అటు

డోరిస్ అందమైందికాదు. ఆమె డ్యాన్సుకూడ బాగా చేయలేదు. యౌవనపు ప్రథమ పాదంలోనే జాఫ్రీడెన్సన్‌తో ఆమె వివాహం నిశ్చయమైంది. జాఫ్రీ యోగ్యుడైన ఒక ధనిక సర్జన్ కుమారుడు. జాఫ్రీకి వారసత్వంలో ఒక బిరుదుకూడా లభిస్తుంది; చిన్నదైనా బిరుదు బిరుదే. అతడి భవిష్యత్తు సుఖమయం.

ఇక కిటి ఆదుర్దాతో వెంటనే వాల్టరు-ఫేన్‌ను వివాహమాడింది.

# 9

కిటీకి వాల్టర్ కొద్దిరోజుల పరిచయమే కాని అతనియందు ఆమెకెప్పుడూ ఆకర్షణలేదు. వారిద్దరూ మొట్టమొదట ఎక్కడ కలుసుకున్నారోకూడా ఆమె కేమాత్రం గుర్తులేదు. వివాహ నిశ్చయం జరిగినతరువాత అతడే 'తాను మిత్రులతోపాటు ఫలానా డాన్సులో కలుసుకున్నాను' అని చెప్పాడు. కిటీ అతనియందప్పుడు ఏమాత్రం దృష్టి వుంచి వుండదు. ఒకవేళ ఆమె ఎప్పుడైనా వాల్టర్‌తో కలసి డాన్సుచేసివున్నా దానికి కారణం వాల్టర్ మంచివాడని భావించడంకాదు. తనది సంతోష స్వభావం గనుక చేసివుంటుంది. ఆమె ఎవరితో కలసైనా డ్యాన్సు చేయగలుగుతుంది. మరొకడాన్సులో తాను కిటీతో మాట్లాడినట్లు వాల్టర్ చెప్పాడు. ఆమె ఏడాన్సు కెళ్ళినా ప్రతిచోటా వాల్టర్‌ను చూసినట్లు అప్పుడామెకు గుర్తుకొచ్చింది. అప్పుడు కిటీ పరిహాసదరహాసంతో 'నేను మీతో ఎన్నోడాన్సుల్లో పాల్గొన్నాను. కాని తమపేరు తెలుసుకోలేకపోయాను, మీ పేరు చెప్పండి' అంది.

వాల్టర్‌కు విస్మయం కలిగింది. 'మీరు పేరే తెలియ దంటున్నారు. నే నిదివరకే మీకు పరిచయం చేయబడ్డాను' అన్నాడు.

"కాని భ్రమ కలగవచ్చు. నాకు సందేహామే; బహుశా మీకుకూడా నా పేరు తెలియ దనుకుంటాను."

అతడు చిన్నగా నవ్వాడు. అతడి ముఖం గంభీరంగా వుంది, కొంచెం వ్యాకులంగానూవుంది. కాని అతడి దరహాసం చిందే ముఖం ఆకర్షణీయంగా వుంది.

"లేదండి, నాకు తెలుసు" ఒక క్షణం ఆగి అతడు "మీకు పేరు తెలుసుకోవాలని ఆసక్తిగావుందా ?" అని అడిగాడు.

"ఒక స్త్రీకి వున్నంతగా నాకూ వుంది"

"అయితే నాపేరు మరెవరినైనా అడిగి తెలుసుకోవాలనే అభిప్రాయంకూడా మీకు కలుగలేదా?"

కిటీకి కొంచెం సంతోషంకలిగింది. ఆతడివిషయం నేను తెలుసుకోగోరతా ననే విషయం ఇంతకూ వాల్టర్‌కు ఎలా తెలిసిందా అని ఆమె ఆలోచించింది. ఆమె వాల్టర్‌ను సంతోష పరచాలనుకుంది. మెరుస్తున్న కళ్ళతో మెఱుపువంటి నవ్వు నవ్వుతూ ఆమె వాల్టర్ వంక చూసింది. అడవిలోచెట్ల సమీపాన ఒక చిన్న కోనేరువున్నట్లు, రాత్రంతా దానిమీద మంచు కురిసినట్లుగా వుంది.

"అయితే పేరేమిటి?"

"వాల్టర్ ఫేన్"

అతడు డాన్సు కెందుకొస్తున్నాడో కిటీ ఎప్పుడూ తెలుసుకోలేకపోయింది. అతడికి డాన్సులోనూ ప్రావీణ్యతలేదు తనతోనా పెద్ద పరిచయంలేదు. వాల్టర్ తనను ప్రేమిస్తున్నాడేమో అనుకుంది ఒకప్పుడు. కాని భావం కలుగగానే ఆమె దాన్ని అణచేసుకుంది — దానికి తావీయలేదు. తానెవర్ని కలుసుకున్నా వాళ్ళందరు తనను ప్రేమిస్తున్నారనుకునే ఆడ పిల్లలు కిటీకి తెలుసు. కిటీ వారి అజ్ఞానానికి నవ్వేది. కాని దీనివలన ఆమెదృష్టి వాల్టర్ ఫేన్ వైపుకు ఎక్కువ ఆకర్షింప బడింది. వాల్టర్ ఇతర యువకులవలె తన ప్రేమనుప్రదర్శించ లేదు. వాళ్ళల్లో అనేకమంది ఆమెతో స్పష్టంగా తమప్రేమను చెప్పుకున్నారు. అనేకమంది తమ కౌగిలింతల్లోనూ ముద్దుల్లోనూ ఆమెను ముంచెత్తాలనుకున్నారు. అనేక మంది ఆమెను కౌగలించుకున్నారుకూడా. కాని వాల్టరుఫేను ఆ విధంగా ఎప్పుడూ చేయనూ లేదు. అతడు తరచు మౌనంగానే ఉండేవాడు. కిటీకి ఆమౌన మెప్పుడూ చెడుగా కన్పించ లేదు; కారణం ఆమెకు తానుగానే మాట్లాడే అలవాటుంది. ఒక వేళ ఆమె ఎప్పుడైనా ఏదైనా రిమార్కు చేస్తే అతడు నవ్వేవాడు. అదే ఆమెకు బాగుండేది. వాల్టర్ మాట్లాడి నప్పుడు అతనిలో మిత్రత్వం వుండదనేదికూడా ఆమె గమనించింది. అతడు చాలా లజ్జాశీలి. అతడెక్కడో తూర్పువ వుంటున్నాడనీ — ప్రస్తుతం శెలవులకు ఇంటికి వచ్చాడనీ ఆమెకు తెలిసింది.

ఒకసారి ఆదివారం ఆమె కెన్సింగ్టన్‌లో ఎవరింటికో వెళ్ళింది. అక్కడ షుమారు 12-13 మంది మనుషులున్నారు. వాల్టర్ అక్కడ కొద్దికాలం కూర్చున్నాడు. అక్కడాతనికి

విశేష సంతోషం కలుగ లేదు. అతడు తిరిగి వచ్చాడు. కిటీ తలి వాల్టరును గురించి కిటీ నడిగింది.

"నాకు తెలియదు. మీరాయన్ని పిలవ లేదా?" అని కిటీ అంది.

"అవును, నేనతన్ని బేడ్లీలో కలుసుకున్నాను. నీవు తెలుసునని అతడే చెప్పాడు. అతడు నిన్న నేకసార్లు డాన్సులో చూచాడట. అతడు నిన్ను కలుసుకున్నాడట ప్రతి ఆదివారం ఇంటి దగ్గరేవుంటానని నేను చెప్పాను."

"అతని పేరు ఫేన్ తూర్పు నెక్కడనో పని చేస్తు న్నాడు."

"అవును, అతడు డాక్టరు. అతడు నిన్ను ప్రేమిస్తు న్నాడా?"

"నన్ను నమ్మి, నాకు తెలియదమ్మా."

"నీ విప్పుడు తెలివిగలదానివై యావు. నిన్నెవ్వడు ఎవరు ప్రేమిస్తున్నారోకూడా తెలుసుకొనగల వని నేననుకుం టున్నాను."

ఒక వేళ అతడు నన్ను ప్రేమిస్తూవున్నాకూడా నేనతన్ని వివాహం చేసుకోను.

శ్రీమతి గార్ట్సన్ మౌనం వహించింది. ఆమెకు కిటీ మాట నచ్చలేదు. ఆమెకు విచారం కల్గింది. ఆమె మౌనంలో భారంవుంది. కిటీ కపించింది. తానెక్కడైనా ఎవర్నైనా వివాహం చేసుకోవాలని తల్లి కోరుతున్నట్లు ఆమెకు తెలుసు అతడెటువంటి వాడు అనే ఆలోచనే వాళ్ళకు లేదు. నేను వివాహమాడటం మాత్రమే వాళ్ళకు సంతోషం కల్గిస్తుంది.

# 10

ఆ తరువాత వారంలో కిటీ ఫేను మూడుసార్లు కలుసుకుంది ఫేలో వున్న ముకుళీభావము అదివరకటికంటే చాలా తగ్గిపోవటం ఆమె గమనించింది. అతడిప్పుడు సరిపడినంత మాట్లాడుతున్నాడు. ఫే డాక్టరైనప్పటికి ప్రాక్టీసు చేయటం లేదు. అతడు జీవశాస్త్రంలో డాక్టరు. కిటీకి ఈమాటయొక్క అర్థంకూడా తెలియదు. అతడు హాంకాంగ్‌లో ఉద్యోగం చేస్తున్నాడు, అతడు ఆరు రాలుకాలంలో ఇక్కడినుంచి తిరిగి వెళ్ళిపోతాడు. చైనానుగురించి చాలావిషయాలు చెప్పేవాడు ఇప్పటివరకు కిటీ తననుగురించిన పొగడ్తలు వినడానికే అల వాటు పడివుంది — తననుగురించిన పొగడ్తలే వినాలనుకునేది. హాంకాంగ్‌ను గురించిన విషయాలు, అక్కడిజీవితం— వాటి ప్రభావం కిటీపై బాగాపనిచేసింది. అక్కడిప్రజలకు ముఖ్యంగా క్లబ్బులు, రేసులు ఉంటాయనీ—వాళ్ళు పోల్, గాల్ఫ ఆటలాడతారని విన్నప్పుడామెకు మరీ కుతూహలం కలిగింది.

"అక్కడిజనం డాన్సుకూడా చేస్తారా?"

"చేసారనే నా ఉద్దేశ్యం"

ఒకవేళ తనను రెచ్చగొట్టి మచ్చికచేసుకొనుటకే ఫేన్ ఈ విషయాలన్నీ చెబుతున్నాడేమో ననికూడా కిటీ అప్పుడప్పుడు ఆలోచించేది. తమ సొసయిటీ ఫేన్‌కు నచ్చినట్లామె కనిపించేది, కాని ఫే ఈ విషయంలో తన నోటితో ఏమీ చెప్పలేదు. తరువాత ఆదివారం ఫే తిరిగి కిటీ యింటికి

వచ్చాడు. కిటీ తండ్రికూడా ఆసమయమందింటివద్దనేవున్నాడు. వర్షం కురుస్తూవుండటంతో అతడా రోజు చాలా దీర్ఘసంభాషణే జరిగింది. ఫేజ్ వెళ్ళినతరువాత 'మీరతనితో ఏమి మాట్లాడారని' కిటీ తండ్రినడిగింది.

"అతను హాంకాంగ్‌లో వుంటున్నాడని మాటల్నిబట్టి తెలుస్తుంది. అక్కడి న్యాయాధికారి నా పాతస్నేహితుడే. ఫేజ్ సాధారణ ప్రతిభావంతుడైన యువకుడనే కన్పిస్తుంది."

తన కుమార్తె లిద్దరికీ పెండ్లి కొడుకులను వెతకి వెతకి తండ్రికి యువకులంటేనే ద్వేషమేర్పడిందని కిటీకి తెలుసు. గత నాలుగు సంవత్సరాలుగా ఎంతోమంది యువకుల్ని సన్మానించి విసిగి పోయాడు.

" నాన్నగారూ! మీకు నా మిత్రునియందు ఇష్టం లేదు" అంది.

తండ్రి చాలా నిరాశా దృష్టితో ఆమెవైపు చూస్తూ వున్నాడు.

"అతనిని వివాహమాడాలనే అభిప్రాయం నీకుందా?"

" ఏమీ లేదు. "

"అతడు నిన్ను ప్రేమిస్తున్నాడా ?"

"అతని పద్ధతుల్లో దేనిలోనూ అది కనుపించదు."

"అతడంటే నీ కిష్టమేనా?"

" అంతెక్కువగా కాదు. అప్పుడప్పుడు నాకునచ్చుదు."

ఫేస్ కిటీ ననుసరించి నడుచుకునే మనుష్యుల్లో వాడు కాదు. సాధారణమైన ఒడ్డు పొడుగు గల మనిషి, చురుకైన

శరీరం, గడ్డాం మీసాలు వుంచుకోడు, ముక్కు ముఖం చాలా అందంగానే వుంటాయి. కనుపాప నల్లగా వుంటుంది. ఆకన్నులు చంచలములు కావు. ఆ కన్నుల్లో జిజ్ఞాస వుంది_సరళములు కావు. ఈ అందమంతటితో అతడు అందంగానే కన్పించాలిగాని వాస్తవానికలా కనుపించడు. ఆతడి అవయవమొక్కొక్కటి ఎంత అందంగా సృష్టించబడిందాయని కిటీ అప్పుడప్పుడు ఆలోచించేదేగాని వాటన్నిటి కలిపి చూచినప్పుడు అందమని చెప్పలేము. అతడి ముఖం ప్రశాంతంగా వుంటుంది. ఆతడి మాటల్లో వ్యంగ్యము మిళితమై వుంటుంది. ఫేణ తనకు తగినవాడు కాడనీ, అతడిలో ఏమీ ఆకర్షణ లేదనీ కిటీ భావించేది.

శరత్తు ముగింపు కొచ్చింది_ఇద్దరూ ఒకరి నొకరు తగినంత అర్థం చేసుకున్నారు. అయినా ఫేణ మొదటవున్నంతగానే కిటీకి దూరంగానే వుండే వాడు. ఆతడిలో సంకోచ భావం లేదు___కాని అతడి మాటలలో ఏమీ ఆకర్షణగానీ ఆత్మీయతగానీ లేవు. కిటీ తనలో తాను తర్కించుకుని ఫేణ తనను ప్రేమించటం లేదనే నిర్ణయానికి వచ్చింది. 'అతడు నన్ను కలుసుకుని సంతోషిస్తాడు, నాతో మాట్లాడాలనుకుంటాడు, కాని నవంబరులో తిరిగి హాంకాంగ్ వెళ్ళిపోయే విషయమే గుర్తించడని ఆమె ఆలోచించేది. ఫేణ ఎప్పుడూ ఏదో ఒక నర్సుల హాస్పటల్లో మునిగి వుంటాడు, అక్కడే ఎవరైనా ఫాదరుగా రమ్మాని వుంటుంది, ఒకని మానుషి, సరళ స్వభావము, అందములేనిది, శ్రమించేది, ఆతడి కటువంటి భార్యయే కావాలి అనికూడా ఆమె భావించుకునేది.

ఈలోపే డోరిస్, జాఫ్రీ డెన్నర్‌ల వివాహ ప్రధానం జరిగింది. డోరిస్‌కు పదునెవిమిదవ ఏటనే ఘనంగా వివాహం జరుగ బోతుంది. కిటీ కిప్పుడు పాతిక సంవత్సరాలైనా అవివాహితగానే వుంది. ఒకవేళ ఆమె వివాహం చేసుకొనక పోతే? ఆ సంవత్సరం ఒకరు మాత్రమే ఆక్స్‌ఫర్డులో చదువుతున్న ఇరువదేండ్ల కుర్రాడు వివాహ ప్రస్తావన తెచ్చాడు. కిటీ తనకంటే అయిదేండ్లు చిన్నవాని నెన్నడూ వివాహ మాడలేదు. కిటీకి వ్యాకులము హెచ్చసాగెను. రాను రాను ప్రశాంతి తగ్గు చుండెను. గత సంవత్సర మామె ఒక మారు మనువువానిని వివాహమాడ నిరాకరించింది. అతడికి ముగ్గురు బిడ్డలున్నారు. అతనికి 'నైట్' అనే బిరుదుకూడా లభించింది. తాను పుట్టకుండావుంటే బాగుండేదని కిటీ ఆలోచించేది. తల్లి ఇప్పుడిక పెద్ద ప్రళయం లేపుతుంది. ఇక డోరిస్; కిటీ కారణంగా అందరూ ఆమెయెడ వుదాసీనంగా వుండేవారు ఆమెకే ఇప్పుడెంతో ఘనంగా వివాహం జరుగుతుంది. ఆమెకెంతో మంచి యువకుడు లభించాడు, ఇవన్నీ ఆలోచించినప్పుడు కిటీ హృదయం నిరాశతో కృంగి పోయేది.

# 11

ఒకనాటి సాయంత్రం కిటీ యింటికి తిరిగి వస్తున్నప్పుడు బ్రోంప్టన్ రోడ్డులో వాల్టర్ ఫేన్ కలిశాడు. 'పార్కులోకి పోయి తిరుగుదాం' అన్నాడు ఫేన్ మాటల సందర్భంలో కిటీకూడా వెంటనే ఇంటికి వెళ్ళాలనుకోడం లేదు. ఆసమయమందు పార్కులో తిరగడమే ఆమెకు ఇష్ట మనిపించింది.

ఇద్దరూ పార్కువేపుకు నడచారు. వారి మాటల కొక క్రమ మేమీ లేదు. ఎప్పటివలెనే ఏవేవో మాట్లాడుకుంటూ నడు స్తున్నారు. వచ్చే గ్రీష్మ ఋతువులో ఎక్కడికైనా బయట ప్రదేశాలకు వెళ్ళే అభిప్రాయం వుందాయని ఫేఇ కిటీ నడి గాడు.

"మేమెప్పుడూ ఏదో గ్రామానికి వెళుతూవుంటాం. నాన్నగారు పనులతో పూర్తిగా అలసిపోతారు, అందుకు పూర్తిగా ప్రశాంతంగా వుండే విజన ప్రదేశానికి వెళ్ళాలని ఆయన కోరుతూ వుంటారు."

కిటీ చాలా నెమ్మదిగా మాట్లాడుతూవుంది. తన తండ్రి నిజంగానే పనులతో అలసి పోతాడనీ, అప్పుడాయనకు ప్రశాంత విజనప్రదేశాల కోర్కె కలుగుతుందనేది ఆమె అంత రాత్మ అంగీకరించటం లేదు. ప్రశాంత విజన ప్రదేశాల్లో ఖర్చు మాత్రం తక్కువవుతుంది. అంతేగాని తండ్రికి విశ్రాంతి కావాలనేది ఏమీ లేదు.

"మనం కొద్దిసేపు ఆయెదురుగావున్న కుర్చీల మీద కూర్చుందామా?" అన్నాడు వాల్టర్. "రండి, అక్కడే కూర్చుందాం." అంది కిటీ.

కుర్చీలపై కూర్చోగానే ఫేఇలో సంతాప చిహ్నాలు పొడగట్టాయి.

ఫేఇను అర్థంచేసుకోడం చాలా కష్టం. కిటీ మాట్లాడు తూనే వుంది, సంతోషంగాకూడా వుంది, కాని ఇంతకూ తనను ఫేఇ పార్కుకు ఎందుకు రమ్మన్నాడు అనేది ఆమెకు

ఆశ్చర్యంగా వుంది. బహుశా ఫేఞ్‌కు ఆ హాంకాంగ్‌లోని దుర్భలమైన అందంలేని నర్సు గుర్తుకొచ్చి వుంటుంది; ఇంతలో నే ఫేఞ్ కిటీవంక చూచాడు. తా నామె మాటల్ని విన్పించుకోడం లేదని ఆమెకు తెలియజేసేందుకు మధ్యలో ఆమె మాటకు అడ్డు తగిలాడు. ఆతని ముఖం పూర్తిగా వివర్ణంగా వుంది—వెల్లవేసిన గోడవలె తెల్లగా వుంది.

"నేను మీతో ఒక విషయం మాట్లాడాలను కుంటున్నాను."

కిటీ ఆతడి వంక చూచింది. ఆతడి కళ్ళల్లో ఏదో ఆవేదన, ఏదో బాధవున్నట్లని పించిందామెకు — జిజ్ఞాస వుంది. ఆతడి కంఠం భారంగా వుంది. అతడు నెమ్మదిగా మాట్లాడుతున్నాడు, కిటీ అప్పటి స్థితిని ఆకళింపు చేసుకొనక పూర్వమే, "నీవు నన్ను వివాహమాడ ఇష్టపడతావా?" అని ఫేఞ్ అడిగాడు. ఆమె విస్మయంగా కళ్ళప్పగించి చూడసాగింది.

"నిన్ను నేను ప్రేమిస్తూన్నాననే విషయం నీకెప్పుడూ తెలియలేదా?"

"నీ వెన్నడూ వెలిబుచ్చలేదు గదా?"

"అవును, నా పద్ధతి కొంత అసభ్యమైందే; నేను విలువగా భావించిన విషయాలను గురించి అధికంగా మాట్లాడను"

కిటీ హృదయంలో ఆందోళనము హెచ్చింది. ఇంతకు ముందుకూడా అనేక పర్యాయములు ఆమె ముందు వివాహ ప్రస్తావనలు వచ్చేవున్నాయి, కాని వాటన్నిటి దృష్టి వేరు. ఎంతో సంతోషంతో, ఎంతో కళాత్మకంగా ఆమెకు విన్న

వించబడేవి. ఆమె వాటికి జవాబుకూడా ఆవిధంగానే చెప్పింది నేటి వరకు ఇంతకు ముందెవ్వరూ ఇంత ఆకస్మికంగా, గంభీరంగా ఈ విషయాన్ని ప్రస్తావించి వుండరు.

"నీది చాలా మంచి అలవాటు," అని కిటీ సందేహంగా జవాబు చెప్పింది.

"మొదటి సారి నిన్ను కలుసుకున్నప్పటి నుంచే ఆకర్షించావు. ఇంతకుముందే నిన్నడగాలనుకున్నాను. కాని అలా అడగా లనుకున్నప్పుడెల్లా నన్ను నేను సంభాళించుకో లేకపోయాను."

"ఆ మాటేమంత అతకడం లేదు" అంది కిటీ.

కిటీకి పరిహసించుటకు కొద్ది అవకాశం లభించేసరికి ఆమె సంతోషంగావుంది. ఆ రోజు పారవశ్యము కలిగించే గాలి వీస్తూవుంది—పగలు సూర్య దర్శనమైంది; అటువంటి మనోజ్ఞ వాతావరణంలో ఇటువంటి గంభీర విషయాన్ని విని కిటీకి సంతాపం కల్గింది. కిటీ జవాబు విని ఫేణ హృదయం జారి పోయింది.

"నేను నిరాశ పొందదలచుకో లేదనే నా అభిప్రాయం ఇప్పుడిక నీవు గ్రామానికీ, నేను చైనాకు వెళ్ళిపోతున్నామనే ఈ రోజీ విషయ మడిగాను."

"నీకు సంబంధించినంత వరకు నేనీ విషయాన్నెన్నడూ ఆలోచించనే లేదు." అని కిటీ నిస్సహాయంగా జవాబు చెప్పింది.

ఫేజ్ మరేమీ మాట్లాడలేదు. అతడు సంతాపహృదయంతో తల వంచుకుని క్రింద పచ్చిగడ్డివంక చూస్తూ కూర్చున్నాడు. ఫేజ్ విషయంలో కిటీ కింతవరకు ఒక అభిప్రాయలేక పోయినప్పటికీ నేడామెదృష్టి ఫేజ్ వైపుకు ఆకర్షింపబడింది. నేటివరకు మరెవ్వరూ ఇంత గంభీరంగా, గౌరవంగా, ఆమెముందు ఇంత బరువుగా వివాహప్రసక్తి తేలేదు. ఫేజ్ తన ప్రేమను వెలిబుచ్చిన విధానానికి ఆకర్షించబడింది.

"నాకు కొంచెం ఆలోచించుకునే గడువివ్వు"

అప్పటికీ ఫేజ్ ఏమీ మాట్లాడలేదు. మౌనమేవహించాడు. కిటీ తన నిర్ణయాన్ని చెప్పేటంతవరకు అతడామెను అక్కడే ఆపాలనుకుంటున్నాడా? అయితే అది మోసమే అవుతుందని కిటీ ఆలోచించింది. తాను తల్లితో సంప్రదించాలి తాను తన మాటను పూర్తిజేసి వెళ్ళిపోవాలని అనుకున్నదే గాని — జవాబుగా అతడేమైనా చెప్తాడేమోనని ఆగిపోయింది. కాని ఇప్పుడిక — కూర్చున్నచోటునుంచి లేవాలనుకున్నా లేవలేకపోతుంది. కిటీ ఫేజ్ వంక చూడకపోయినప్పటికీ అతడక్కడే వున్నసంగతి ఆమెలో పనిచేస్తూనేవుంది. ఇటువంటి పురుషుని వివాహమాడే విషయాన్ని గురించి కిటీ ఎన్నడూ ఆలోచించివుండలేదు.

"నీవు నాకేమీ తెలియదు — నేను నిన్నేమీ అర్థం చేసుకోలేదు"అని ఆమె బిగ్గరగానే అంది.

ఫేజ్ తలపైకెత్తాడు. తలవనితలంపుగానే ఇద్దరికన్నులు కలుసుకోవడం కిటీ గమనించింది. అతని కన్నులలో అమాయకత్వంవుంది — ఆమె ఇంతవరకు మరెవ్వరితోనూ అటు

వంటి భావం చూచివుండలేదు—ఆ కన్నులలో ఒక విలక్షణ మైన కరుణా భావం పొడసూపుతుంది.

"నే నింకొంత వ్యవహారజ్ఞానాన్ని సంపాదించుకో వాలి, ఏమంటావ్?" అని ఫేన్ అడిగాడు.

"పూర్తిగా! మీలో ఇంత ముకుళీభావమెందుకో తెలియదు"

కిటీ ఈ రోజు విన్న వివాహ ప్రసక్తి ధోరణి ఆమెకు చాలా అరుచి కలిగించింది. ఇటువంటి అవసరములప్పుడు లేదనే జవాబుకు పద్ధతి ఇదే. కిటీ అతనెన్నడూ ప్రేమించ లేదు. ఆప్రసక్తి వినగానే తానెందుకు గట్టిగా జవాబు చెప్ప లేదా అనే కిటీ ఆలోచిస్తూవుంది.

"నేనొక శుద్ధ మూర్ఖుణ్ణి. ప్రపంచములో నీవు మాత్రమే నా ప్రేమకు పాత్రురాలవని నాకు తెలుసు—నేను నిన్నెంతగా ప్రేమిస్తున్నానో మాటల్లో వ్యక్తం చేయలేను," అని అన్నాడు ఫేన్.

సమస్య ఇప్పుడు మరింత జటిలమైంది. ఫేన్ అన్న మాట కిటీ హృదయాన్ని ఆందోళన పరచినట్లైంది. ఫేన్ మాట్లాడే తీరే ఇదని, కనుక అతను నిజంగానే విరక్తుడు కాడనీ ఆమె తలంచింది. ఆక్షణాన కిటీకి ఫేన్ ఎప్పటికంటే ఎంతో ప్రియ ముగా కన్పించాడు—డోరిస్ వివాహం నవంబరులో జరుగు తుంది. అప్పుడు ఫేన్ చైనా ప్రయాణంలో వుంటాడను కుంది. నేనితన్ని వివాహ మాడితే నేనుకూడా అతనితో వుంటానని భావించింది. డోరిస్ వివాహ మప్పుడు నేనామెకు దాసీగా కన్పిస్తాను; అలా వుండట మేమంత మంచిదిగాదు.

ఆపరిస్థితినుంచి తనను కాపాడు కోవాలనుకుంది. అయితే డోరిస్‌కు వివాహం జరుగుతుంది, తాను అవివాహితగానే మిగిలి పోతుంది. డోరిస్ వయస్సు తనకంటే ఎక్కువ అనేది అందరికీ తెలుసు, ఈ అభిప్రాయమే ఆమెను బాధిస్తుంది—ఆపరిస్థితుల్లో మరీ బాధిస్తుంది. ఫేతో తన వివాహం ఆదర్శమనిపించు కోదు; కాని జరిగేది వివాహమే ఆ తరువాత ఇక్కడ లేకుండా చైనాలో వుంటుంది. కిటీ కిప్పుడు తన తల్లి పరిహాస బాణాలను తలచుకుని భయం కలుగ సాగింది—కాని నా వివాహ మింత వరకు ఎందుకు కాలేదు. నా తోటిబాలిక లందరూ దరిదాపు అందరూ వివాహితులే. వారిలో చాలా మందికి పిల్లలుకూడా కలిగారు. తన చెలికత్తెలను కలుసుకొని వారి పిల్లలను ముద్దాడి ముద్దాడి అలసి పోయినట్లనిపించింది. వాల్టర్ ఫే ఆమెకు జీవితంలో ఒక నూత్న దృశ్యాన్ని పరిచయం చేశాడు. కిటీ వికసిత దరహాసంతో ఆతని వైపు తిరిగింది.

“నేను మకురు తనంగానే నిన్ను వివాహమాడుటకు అంగీకరిస్తే నీవు కనీసం ఎంతత్వరలో వివాహం చేసుకో గల్గుతావు?”

ఈమాట వినడంతోనే ఫే ఆనందంతో పొంగిపోయాడు. వెలవెలబారిన ఆతడిముఖం అరుణకిరణం దాల్చింది.

“ఇప్పుడే — తక్షణం. వెంటనే, అతిత్వరగా. మనం మన అదృష్టయాత్రకు ఇటలీవెళ్ళుదాం, ఆగస్టు, సెప్టెంబరు అక్కడే ఉందాం.”

అయితే గ్రామంనుంచి తనకు విముక్తి కలుగుతుందని

కిటీ ఆలోచించింది. ఆకస్మికంగా ఆమె దృష్టిపథంలో మరు నాటి వార్తాపత్రికలో "నూత్నవధువు తూర్పుప్రయాణసన్నాహం, త్వరలో వివాహం జరుగనున్నది" అనేవార్త అచ్చయినట్లే కన్పించింది. తల్లివిషయం ఆమెకు బాగుగా తెలుసు ; ఆమెను ఆయత్తపరచవచ్చు. ఇప్పుడిక డోరిస్‌విషయం వెనక బడిపోతుంది. ఇక డోరిస్ వివాహం ఆడంబరంగా, ఘనంగా జరిగినప్పుడు తాను ఇక్కడకు చాలాదూరానవుంటుంది — చాలాదూరాన.

కిటీ తనచేయి చాచింది.

"నీవు నాకు అందముగానే వున్నావు — నేను నీకు తగిన యోగ్యతపొందే అవకాశాన్నివ్వు"

"అయితే ఇది స్వీకారంగా ఎంచనా?" అన్నాడు ఫేన్.

"తప్పక—తప్పకుండా, మరేమిటి."

# 12

కిటీ వాల్టర్ ఫేన్‌ను మొదటే చాలా స్వల్పంగా అర్థం చేసుకోగలిగింది. కాని వివాహానంతరంకూడా తనభర్తను మరేమీ అదనంగా తెలుసుకోలేకపోయింది. వివాహమై కూడా ఇప్పటికి రెండు సంవత్సరాలు గడచిపోయింది. మొట్ట మొదట ఆమె వాల్టర్ ఫేన్‌లోని దయామయాకారాలకు ద్రవించింది ; అతడు చాలా జిజ్ఞాసగలమనిషి. అతడు కిటీసుఖాన్ని గురించి పూర్తిగా శ్రద్ధతీసుకునేవాడు. కిటీకూడా ఎన్నడూ ఎటువంటి అనుచితమైనవీ కోరివుండలేదు. ఫేన్ అనేక సమ

యాలయందు తన భార్యకు కానుకలు బహూకరించేవాడు. కిటీకి ఎప్పుడైనా కొంచెం అనారోగ్యం కలిగినా అతడెంతో శ్రమపడి ఆమెకు సేవచేసేవాడు. అప్పుడప్పుడు అతడికేదైనా పని పురమాయిస్తే కిటీకి తనయందు అపారకరమైన ప్రేమ వుందని ఫేఁ భావించేవాడు. ఫేఁ చాలా సంస్కారంగల వాడు. టాక్సీనుంచి దిగేటప్పుడు చేతినిసహాయంగా అందించే వాడు. ఎప్పుడైనా ఫేఁ ఆమెగదికి వెళ్ళవలసివస్తే ముందు తెలియపరచి వెళ్ళేవాడు. సాధారణప్రజలు తమ భార్యలఎడ సరళంగా వ్యవహరించేటట్లే ఫేఁ కిటీయందు చూపేవాడు. అతడు కిటీకి సేవచేశేవాడు. ఎవరో సహ యాత్రికుడు పల్లెటూరిలో ఒకేయింటిలో ఉంటున్నట్లుంది. వ్యవహారమంతా సుఖమయంగానేవుంది. హాస్యాస్పదంగాకూడా వుంది. ఒకవేళ ఫేఁ మరికొంత సాధారణంగా వ్యవహరిస్తే కిటీకి ఎక్కువ ఆనందం కలిగివుండేది. దాంపత్యజీవిత ఆకర్షణకూడా ఆమెను ఫేఁకు సమీపమయే ప్రోత్సాహాన్ని కలిగించలేకపోయింది. అతడు కామాతురుడు, అప్పుడప్పుడు అనుచితంగా కూడా వ్యవహరించేవాడు, అంతేగాక అతడు యోచనాపరుడుకూడా.

కిటీ ఎప్పుడూ భర్తయొక్క యోచనను గురించే ఆలోచించ లేదు. అతడి ఆత్మనిగ్రహం ఎందుకో కిటీకి తెలియదు లేకపోతే ఫేఁలో ముకుళీభావం అధికంగానైనా వుండాలి లేదా అతడటువంటి వాతావరణంలోనైనా పెరిగి వుండాలి. తాను ఫేఁ కౌగిలిలో వున్నప్పుడు అతడు చిన్న పిల్లలవలె మాట్లాడేవాడు, ఇది గమనించి నప్పుడు కిటీకి ద్వేషంతో కూడిన దుఃఖం కలిగేది—ఆవాల్టరే మామూలు ఇతర సమ

యాల్లోనైతే ఇటువంటి నిరర్థకపు మాటలే ఆలోచించడు—మాట్లాడనుకూడా లేడు. ఒకసారి ఇటువంటి మాటలకే కిటీ అతనిని విదలించికూడా కొట్టింది. అప్పుడిక నెమ్మదిగా కిటీని కౌగలించివున్న చేతులు పట్టుదప్పి జారిపోయాయి, ఆ తరువాత ఒక్కమాటకూడా మాట్లాడకుండా అతడు లేచి గది నుంచి వెళ్ళి పోయాడు. కిటీ అన్న మాటల్లో ఫేఁకు బాధ కలిగించే భావం ఏమాత్రం లేనే లేదు. ఒకటి రెండు రోజుల తరువాత కిటీ ఫేఁతో, "ఓ బాబుగారూ! మీరేమైనా మాట్లాడండి, నాకెంత మాత్రం అయిష్టం కలుగదు," అని చెప్పింది. అప్పుడు ఫేఁ కొంచెం సిగ్గు పడుతూ నవ్వాడు. ఫేఁ బాగా హృదయం విప్పి మాట్లాడే స్వభావంగల మనిషి కానేకాడు. లోలోపల యోచించుకునే మనిషి. ఎక్కడైనా పార్టీల్లో జనం పాడుతుంటేగాని, వాయిస్తేగాని వాల్టర్ వాటిల్లో రసాన్ని ఎప్పుడూ ఆసాదించ లేదు. అతడొక ప్రక్కగా కూర్చుని నవ్వు ముఖంతో చూస్తూవుండే వాడు, అతడు కూర్చునే చాలా ఆనందాన్ని పొందుతున్నట్లు కనిపించేది. అతడు కేవలం మర్యాద కోసమే దరహాసం చేస్తూన్నట్లు అర్థమయేది. ఆతడి దరహాసంలో వ్యంగ్యం వుండేది. ఆ సమయమందు ఆయన్నెవరు చూసినా— "డాన్సు—పాటల్లో మునిగివున్న వాళ్ళందరూ మూర్ఖులనే అతడు భావిస్తున్నాడని" అనకుండా వుండలేరు. కిటీవలె వుత్సాహంతో, ఉల్లాసంతో అతడెప్పుడూ క్లబ్బులు, పార్టీల డాన్సుల్లో పాల్గొన లేక పోయాడు. చైనాకు ప్రయాణం కాకపూర్వం కాంతివంతమైన దుస్తులు ధరించడ నికికూడా తిరస్కరించే వాడు—అప్పుడు

అందరూ అటువంటివే ధరించారు. ఇవన్నీ నిరర్థకమూ, భారమూ అనే ఫేజ అభిప్రాయానికి కీ చాలా దుఃఖం కలిగింది.

కిటీ సంతస హృదయంగల స్త్రీ. రోజంతా అవిరామంగా మాట్లాడుతూనే వుండాలని ఆమె కోర్కె. ఆమె నవ్వు స్వభావసిద్ధమైనది. ఫేజ మౌనం ఆమె హృదయంలో గుచ్చుకునేది. అప్పుడప్పుడు జవాబివ్వటం అనవసరమైన విషయాని కతడు జవాబు చెప్పేవాడు కాడు; కానైతే అతడు జవాబు చెప్పే వాతావరణం ఎంతో సజీవంగా వుండి విషయం ఇంకొంత మనోహరంగా కన్పిస్తుంది. ఆరోజు వర్షంకురుస్తూవుంది; 'ఎంత కుంభవర్షం కురుస్తుంది' అంది కిటీ. ఫేజ 'జవాబు కెదురు చూసింది. "అవునవును, చూడు!" అంటాడని కిటీ ఆశించింది. కాని ఫేజ ఏమీ మాట్లాడ లేదు. అటువంటి సమయాల్లో వాల్టర్‌ను పట్టుకుని వూపి పారేయాలని కిటీ కోరేది.

"చూడు ఎంత కుంభవర్షం కురుస్తుందో అన్నాను," అని కిటీ మరొక సారి తిరిగి అంది.

" అవును, నేను మొదటి సారే విన్నాను," అని చాలా తీయగా అన్నాడు.

ఒక వేళ జవాబు నాకు బాధ కలిగిస్తుందేమోననే ఇంత తియ్యగా చెప్పాడేమో అనుకుంది కిటీ. ఆ విషయంలో అతడు మాట్లాడ దలచ లేదు గనుకనే అతడేమీ అనలేదు. కిటీ దరహాసంచేసింది. పరిస్థితి ఈ విధంగానే వుంటే కొంత కాలానికి మానవ జాతి భాషను వుపయోగించడమే మరచి పోతుందని ఆమె తలంచింది.

# 13

వాల్టరులో ఎటువంటి ఆకర్షణా లేదనేది అంగీకరించా ల్సిందే. ఈ కారణంతోనే అతడిని చాలా తక్కువమంది ఎరుగుదురు. కిటీ హాంకాంగ్ వచ్చి చాలా తక్కువ కాలమైనప్పటికీ ఆమె ఫేన్‌ను గురించి తెలుసుకుంది. కిటీకి తన భర్త పనిలో ఎక్కువ నమ్మకం లేదు. ఆమె దృష్టిలో ఫేన్ ప్రభుత్వ బ్రాక్టీరియాలజిస్టు కావటం ప్రత్యేక గౌరవంగల దేమీకాదు. వాల్టర్‌కూడా ఎన్నడూ కిటీతో తన పనిని గురించి మాట్లాడటం తగినదిగా భావించలేదు. ప్రారంభంలో ఆ పనిని గురించి కిటీ కొంచెమో-గొప్పో తెలుసుకోవాలనుకుంది,— ఇటువంటి పని ఆమెకు పూర్తిగా క్రొత్తకావడమే దానికి కారణం; కాని వాల్టర్ పరిహాసంగా త్రోసేశాడు.

"అంతా విసుగు కలిగించేది, టెక్నికల్ పని," అన్నాడతడు. ఆ పనిలో ఆదాయంకూడా అధికంగా లేదని ఒక సారి వాల్టర్ చెప్పాడు.

వాల్టర్ ప్రశాంత వాతావరణానికి చెందిన మనిషి. కిటీ అతడి పుట్టుక, ఆతని విద్య, ఆతని జీవితాన్ని గురించి అతనినే సూటిగా అడిగి తెలుసుకోగల్గింది. కాని వాల్టర్‌కు ఇటువంటి ప్రశ్నలు రుచించవు. అతడు తన విషయంలో ఎటువంటి ప్రశ్న విన్నా విరక్తి చెందుతాడు. ఒకొక్కప్పుడు కిటీ ప్రశ్నల వర్షం కురిపించేది. అప్పుడతడు జవాబుచెప్పేపద్ధతి కూడా విచిత్రంగా వుండేది. వాల్టర్ ప్రశ్నలకు జవాబు తన సహజస్వభావకారణంగానే చెప్పటంలేదని ఆమెకు తెలిసింది.

అతడు తెలిసివుండికూడా తనవిషయంలో ఏమీరాదాచేవాడు కాడు. తననుగురించిన విషయాలు వాల్టర్‌కు భారంగాతోచేవి. అటువంటి సమయమందే అతనిలో సంకోచం తలెత్తేది, తాను చిక్కులో పడిపోయానని తేలికగా భావించేవాడు. వాల్టర్ సహజంగా బాహాటంగా మాట్లాడే అలవాటుగల వాడు. అతడికి చదివే వ్యసనముంది — కాని కిటీకి అతడి పుస్తకాలు ఏమీ రుచించేవికావు. అతడు శాస్త్రగ్రంథాలు చదువనిచో నైనా చరిత్రగ్రంథాలు చదివేవాడు. వాల్టర్ ఎన్నడూ ఖాళీగా కూర్చొనడు — కూర్చొనకపోతే విశ్రాంతి తీసుకోవాలి. వాల్టర్ విశ్రాంతే కోరడని కిటీ అభిప్రాయం. వాల్టర్‌కు ఆటలంటే ఎక్కువమక్కువ, అతడు తరుచు టెన్నీస్ బ్రిజ్ ఆడేవాడు.

ఇంత సారంలేని మనిషి ఇంతకూ తననెలా ప్రేమించ గలడా అనే కిటీ ఆలోచించేది. తనలో తనకే తెలియకుండా వుండే — శాంతంగల, ఈ సారంలేని మనిషితో తానెలానిర్వ హించగలుగుతుంది, అనే అభిప్రాయమే కిటీని ఆందోళనపరి చేది. అయినా వాల్టర్ తనను గాఢంగా ప్రేమిస్తున్నాడనే నమ్మకం ఆమెకుంది. వాల్టర్ కిటీ పిచ్చివాడు, కిటీని సంతోష పెట్టడానికి అతడు ప్రపంచంలోని ఏపనైనా చేయగలిగేవాడు. కిటీకై వాల్టర్ మైనపుబొమ్మన్నట్లుండేవాడు. 'కిటీ ప్రేమించే వారిపట్ల — ఎరిగున్నవారిపట్ల — పొగిడేవారిపట్ల, వాల్టర్ ముభావంగా ఎందుకుంటాడా? అని ఆమె ఆలోచించేది. ఇదివాల్టర్‌లో అంతర్హితమైవున్న పెద్దబలహీనతగాదా? వాల్టర్ చాలా చతురుడు, తెలివిగలవాడని ఇతరులు అతడినిగురించి

భావించినట్లే కిటీకూడా ఆ ప్రకారమే ఆలోచించేది. కాని దీనికి నిదర్శనము అరుదుగా లభించేది; వాల్టర్ తన ప్రత్యేక మిత్రులతో వున్నప్పుడు ఆనందంగా వుండేవాడు. అతడు అధికానందంగా వుండటం కిటీ ఎన్నడుకూడా చూడలేదు. వాల్టర్ ఆచరణవలన కిటీ సందిగ్ధావస్థలో చిక్కుకునేదికాదు, ఆమెకు భారంగా కనుపించేదీగాదు, కానీ అసంతృప్తిమాత్రం తప్పక కలిగేది.

## 14

కిటీ టవున్సెండ్ భార్యను పార్టీల్లో అనేకపర్యాయాలు కలుసుకున్నప్పటికీ టవున్సెండ్ పరిచయం చాలాకాలానికి కలిగింది. కిటీ వాల్టర్ వెంట వారింటికి డిన్నరుకు వెళ్ళింది. కిటీ అతనిని కలుసుకొనుటకు విశేషాసక్తి నేమీ చూపలేదు. చార్లెస్ టవున్సెండ్ వలసరాజ్య అసిస్టెంటు శెక్రటరీ. డిన్నరు చేసినగది చాలా విశాలమైనది. హాంకాంగ్‌లో సాధారణంగా ఇళ్ళను అలంకరించిన పద్ధతిలోనే ఆగదికూడా అలంకరించబడింది. డిన్నరులో చాలామంది పాల్గొన్నారు; కిటీ, వాల్టర్ లిద్దరూ అందరి తరువాతవచ్చారు. వారొచ్చినప్పుడు ప్రత్యేక దుస్తులు ధరించిన చైనా సర్వర్లు కాక్‌టెల్ వడ్డిస్తున్నారు. శ్రీమతి టవున్సెండ్ వారిని ఆహ్వానించింది.

బాగా ఒడ్డుపొడుగుగల ఒక అందమైన పురుషుడు ఆమెవద్ద నిలబడి వుండటం కిటీ గమనించింది.

"వీరు నాభర్త" అని శ్రీమతి టవున్సెండ్ పరిచయం చేసింది. 'మీతో కూర్చునేఅదృష్టం పొందగలనా?"అన్నాడు టవున్సెండ్.

కిటీ ఇంతవరకూ ఆందోళనగావుంది. ఈ మాటవిని ఆమెకు కొంచెం ధైర్యం కలిగింది. టవున్సెండ్ ముఖంలో వికసిత దరహాసముంది. ఆతని కన్నుల్లో విస్మయం ఉండటం కూడా కిటీ గమనించింది. ఆమె గ్రహించుకుంది; గ్రహించుకుని ఒక దరహాసం చిందించి ఆతని నభినందించింది.

"నే నీరోజు డిన్నరు బహుశా తినలేనేమో!" అన్నారు చార్లెస్, "డిన్నరు ఇంత ఘనంగా వుంటుందని తెలిస్తే ఎంత బాగుండేది."

"కాని, తమ రెందుచేత తినలేరు?"

"నాకు ముందుగా చెప్పి వుండవలసింది?"

"ఏమిటి చెప్పివుండవలసింది?"

"ఎవరూ ఏమీ చెప్పలేదు. ఒక సర్వాంగసుందరిని ఎదుర్కొనవలసి వస్తుందని నాకేమి తెలుసు"

"అయితే ఇందుకు నేను మీకేమిసహాయం చేయగలను?"

"ఏమీలేదు. నేను మీతో మాట్లాడతాను. కాని మీరు అత్యంత సౌందర్యవంతులనిమాత్రం నేను తప్పక ఎన్ని పర్యాయాలైనా చెప్తాను."

కిటీలో ఈ భావమేమీ ఎక్కువ పనిచేయలేదు. ఈయన భార్య నన్నుగురించి ఏమి చెప్పిందోననే ఆమె ఆలోచించసాగింది. అతడు తప్పక అడిగేవుంటాడు. టవున్సెండ్ పారవశ్యంతో ఇంకా కిటీవైపే చూస్తూవున్నాడు. అతడు

తన భార్యను, "శ్రీమతి ఫే ఎలావుంటుంది" అని అడిగిన విషయం ఆకస్మికంగా జ్ఞప్తికొచ్చింది.

"చాలాబాగుంటుంది. అచ్చం సినీతారవలేవుంటుంది" అని శ్రీమతి చార్లెస్ జవాబుకూడా చెప్పివుంది.

"ఆమె ఏమైనా స్టేజీపై పనిచేస్తుందా?"

"లేదు లేదు. ఆమె తండ్రి డాక్టర్రో, వకీలో ఏదోఅటు వంటిదే. ఆమెను మనయింటికి డిన్నరుకు పిలుద్దామనేనా అభిప్రాయం"

"కాని ఇప్పుడంత తొందరేమీలేదు"

టేబుల్‌పై కిటీ సరసనేకూర్చుని, వాల్టర్ హాంగ్‌కాంగ్ వచ్చినప్పటినుంచీ తానాయన్నెరుగుదునని చార్లెస్ కిటీకి చెప్పాడు.

"మేము కలిసే బ్రిజ్ఆడతాం. బ్రిజ్ఆటలో క్లబ్బులో నుంచి ప్రావీణ్యంగల ఆటగాడని అంటారందరూ."

కిటీ తిరిగివచ్చేటప్పుడు తనభర్తకీ విషయంచెప్పింది.

"అదేమంత పెద్దవిషయంగాదు" అన్నాడు వాల్టర్.

"ఆయనెలా ఆడతాడు" కిటీ అడిగింది.

"అంత చెడేమీ కాదు. మంచిముక్కలువస్తే బాగా ఆడతాడు, నచ్చినముక్కలు రాకపోతే ఆశవదులుకుంటాడు."

"నీఅంత బాగా ఆడగలుగుతాడా?"

"నా ఆటనుగురించి నాకేమీ భ్రమలేదు. రెండవతరగతికి చెందిన ఆటగాళ్ళలో నేను బాగా ఆడగలవాడనని చెప

గలను. ఆయన మొదటితరగతి ఆటగాళ్ళకుచెందిన వాడనని టవున్సెండ్ అభిప్రాయం. కాని నిజానికదేమీ కాదు''

"ఆతడు నీకిష్టం లేదా?"

"అతడంటే నాకు ఇష్టమూలేదు; అయిష్టమూలేదు. అతని పనిలో అతడేమీ చెడ్డవాడు గాదనే నాఅభిప్రాయం. అతడు మంచి ఆటగాడనికూడా జనం అంటారు. కాని ఆయనంటే నాకేమీ ఆసక్తి లేదు''

కిటీకి జవాబు రుచించలేదు. ఈ విధమైనజవాబు ఆమె వినటం మొదటిపర్యాయమూగాదు. "ఇంత వివేకమేమవసరం? లేకపోతే మనిషియందు మక్కువైనా వుండాలి లేదా లేకుండా వుండాలా?" అని ఆమె ఆలోచించసాగింది. కిటీకి చార్లెస్ చాలా బాగా నచ్చాడు. అతడు బహుశా ఆవలసలో అందరి కంటే అధిక ప్రసిద్ధిచెందిన మనిషి. సెక్రటరీ యిక రిటైరై పోతాడనీ, టవున్సెండే తరువాత దానికి నియమించబడతాడనేది జనంలోవున్న సాధారణ అభిప్రాయం. అతడు టెన్నిస్, పోలో, గోల్ఫ క్రీడల్లో పాల్గొంటాడు. అతడు రేసు గుర్రాలనుకూడా పెంచేవున్నాడు. ఆతడు ఎవరిమేలుకోసమైనా ఎల్లప్పుడు సిద్ధంగా వుంటాడు. తనను గురించి ఆతడు గొప్పచెప్పుకోడు. అతడి సంభాషణా పద్ధతెంత బాగుంటుంది అనే కిటీ ఆలోచిస్తూంది. "అయితే తా నతని మాటలన్నిటిని ఎందుకని వినలేదు, తానెంత మూర్ఖురాలు''అని ఆమె అనుకుంది.

ఆ సాయంత్రం చాలా ఆనందంగా గడచి పోయింది. కిటీ చాలా ఆనందంగా వుంది. వారిద్దరికి లండను విషయాలు–

అక్కడి థియేటర్ల విషయాలు—క్లబ్బులను గురించి సంభాషణ జరిగింది.

డిన్నర్ ముగిసిన తర్వాత అతిథుల హాలులోకూడా అతడు తిరిగి తనవద్దనే కూర్చున్నాడు. అంత విశేషమైన మాట లేమీ కాక పోయినా కిటీ అతని మాటలకు నవ్వుతూనే వుంది—వాటిల్లో ఒక మెఱుపు వుంది, ఆత్మీయతవుంది, అవి ఎవరి మనస్సునైనా ఆకర్షిస్తాయి. నిజంగానే అతడు ఆకర్షణంగా వుంటాడు. అందుకే అతని మాటలయందంత మక్కువ కలిగింది.

చార్లెస్ పొడగరి — ఆరడుగుల మనిషి, కిటీకి ఆతని శరీర నిర్మాణం అందంగా కన్పించింది. ఆతడి ప్రతి అవయవం అందంగా తగినట్లే వుంది, ఆతని శరీరంలో ఎక్కడా నిరర్ధకమైన లావు తనమే కన్పించదు. అతడూ మంచి దుస్తులు ధరించే అలవాటు గలవాడు. కిటీకి బలిష్ఠుడంటే చాలా యిష్టము. ఆమె కన్నులలో వాల్టర్‌ను గురించి జిజ్ఞాసవుంది. ఆమె చార్లెస్ దుస్తుల్ని, ఆతడి గుండీలను, వాస్కెట్ గుండీలను కూడా పరిశీలనగా చూచింది. వేడిమివల్ల టవున్సెండ్ ముఖం శ్యామల వర్ణంగా మారినా ఆతడి చెక్కిళ్ళు మాత్రం ప్రకృతి సిదమైన అరుణిమంతో ప్రకాశిస్తున్నాయి. చార్లెస్ మీసాలు చాలా చిన్నవే, అయినా వుంగరాలు తిరిగి మెలిబెట్టబడి వున్నాయి. ఆతడి జుట్టు నల్లగా వుంటుంది — చిన్నదైనా చక్కగా బ్రెష్ చేయబడి వుంది. దట్టమైన కనుబొమలు, కన్నులు అతనిలోని ప్రత్యేకాంగములే. ఆ కన్నులలో దయా దరహాసాలు దాగి వున్నాయి, కలుసుకున్న వారి నెవ

రినైనా సరే చాలా తేలికగా ఆకర్షించ గలుగు తాయి. ఇటువంటి నీలవర్ణ నేత్రాలున్నవారెప్పుడూ ఎవర్నీ దుఃఖపెట్ట రని కిటీ అభిప్రాయం.

తన ప్రతిబింబాన్నొకదాన్ని టవున్సెండ్‌వద్ద వదలి వచ్చానని కిటీ దృఢవిశ్వాసం. చార్లెస్ తనను పొగడటమే ఇందుకొక కారణం — తనతో రసాత్మకంగా మాట్లాడాడు. ఎంతో తాఫీగా నిబ్బరంగా మాట్లాడాడు తనఇంటివద్ద పార్టీలో ప్రతి ఒక్కరికి మక్కువ కలిగేట్లు సంభాషించాడు. ఆమె అక్కడినుంచి బయలుదేరినప్పుడు చార్లెస్ కరస్పర్శచేసి, తన చేతిని నెమ్మదిగా నొక్కాడు. "తిరిగి మనం త్వరగానే కల్సు కుంటామని ఆశిస్తున్నాను" అన్నాడు. మాట చిన్నదేకాని దానిలో ఎంతో అర్థం అంతర్హితమై వుంది. ఆతడి కన్నులు మరల కల్సుకునేందుకు ఆహ్వానిస్తున్నట్లున్నాయి. కిటీ అర్థం చేసికొనడంలో ఏమీ పొరబాటు పడలేదు.

"హాంకాంగ్‌లో కలుసుకోవటం గొప్ప సంగతేంకాదు ఇది ఎంతో చిన్నప్రదేశం; అవునుగదూ?"

# 15

మూడు మాసాల స్నేహానికే ఇటువంటి సంబంధా లేర్పడతాయనే అభిప్రాయం ఎవరికీ ఏర్పడదని కిటీ భావిస్తూ ఉంది. 'తాను మొదటి సాయంత్రపు సమావేశంతరువాత కిటీకొరకు పిచ్చివాడినైపోయా' నని ఆ తరువాత చార్లెస్ ఆమెతో చెప్పాడు. కిటీవంటి అందమైన స్త్రీని జీవితంలో తా నెన్నడూ చూచివుండలేదని చార్లెస్ అనేవాడు. ఆ రోజు

సాయంత్రం కిటీ ధరించిన దుస్తులుసైతం అతడికి గుర్తున్నాయి. అవి కిటీ వివాహసందర్భంలో తయారుకాబడినవే. ఆ రోజు సాయంత్రం కిటీని కమలపుష్పానికి పోల్చిచెప్పాడు. చార్లెస్ చెప్పకముందే అతడు తనను ప్రేమిస్తున్నాడని కిటీ గ్రహించుకుంది. ఈ అభిప్రాయంతో ఆమెకు భయంగా వుండేది, చార్లెసుకు దూరంగా వుంటుండేది. కాని అతడికి దూరంగా వుండటం కిటీకి కష్టతరమే. ఆమె చార్లెస్ కౌగిలినుంచిపారిపోయేది—పారిపోయేది; అటువంటప్పుడు గుండెదడ హెచ్చేది. కిటీ ఎన్నడూ ఎవర్నీ ప్రేమించి ఉండలేదు. ఇప్పు డీ అనుభవము ఆమెకు క్రొత్తగావుంది. ఆమెకు ఆశ్చర్యంకలిగేది – విచిత్రమైన గిలిగింత కలిగేది. తన భర్త వాల్టర్ యందు ఆమె హృదయంలో ప్రేమలేదని ఇప్పుడామెకు తెలిసింది — అది ఆకస్మికంగా అతడియందు సానుభూతి కలిగింది. వాల్టర్ తనకు విసుగు కలిగిస్తున్నాడు – వాల్టరంటే ఆమె విసిగిపోయింది. కిటీ అతనిని బాధించేది – తమాషాచేసేది, అయినా వాల్టర్ ఆమెకోర్కెకు వ్యతిరేకంగా ఆ తమాషాలో లీనమైపోయేవాడు. కిటీ వాల్టరంటే కొంచెం భయపడేది, కాని ఇప్పుడామెకు తనలో తన కెక్కువ విశ్వాసము కలిగింది. ఆమె వాల్టరును బాధించేది, కాని వాల్టర్ ముఖంలోని పరిహాస దరహాసాన్ని చూచి ఆనందించేది. ఇటువంటి సమయాలందతడు కిటీ ఆనందాన్ని విస్మయంగా చూచేవాడు. ఇక వాల్టరులో మానవత్వపు గుణాలు కూడుకుంటున్నాయని కిటీ భావించేది.

కాని చార్లెస్ ఆ మె జీ వి తం అడుగిడినప్పటినుంచి వాల్టరుకు ఆమెకు వున్న సంబంధాలు వికృతం కాజొచ్చాయి

ఆమె వాళ్లరువంక చూడ నిచ్ఛగించడం కూడాలేదు—గంభీర ఆత్మనిగ్రహం దరహాసం లేకుండా వుండటమే ఆమెకు హాయిగావుండేది. కిటీకి వాళ్లరుయందు తనకున్న ఈవిరక్తితో ఆనందించేది. ఏది ఎంతజేసినా చార్లెస్‌ను గురించే చేసేది,అది కూడా లేకపోతే బహుశా చార్లెస్‌ను కలుసుకోలేకపోవచ్చు. అంతిమ నిర్ణయం చేసుకునేముందు ఆమె సందిగ్ధంలోపడింది—ఆమె చార్లెస్ ప్రేమకు తల వగ్గాలని లేకపోవడం యిందుకు కారణం గాదు — ఆమె చార్లెస్‌ను స్వయంగానే ఎంతగానో ప్రేమిస్తుంది — అయితే మరెందుకనంటే ఈ నిర్ణయానికి ఆమె సంస్కారాలు అడ్డొస్తున్నాయి. ఆమెకు తరువాత చాలా విస్మయంకలిగింది. (ఎందుకనంటే ప్రథమపాదం కేవలం ఒక ఘటనతోనే పూర్తయింది — అది ఎదుట జరగనప్పుడు దానిని యిరువురు గ్రహించలేరు.) మొదటికంటే ఇప్పుడు తనలో ఏమీ భేదం కన్పించకపోవటం ఆమెకు చాలా విస్మయం కలిగించింది. ఏదో కొంత మార్పు జరిగి తీరుతుందని ఆశించింది—తాను పూర్వపు కిటీగా గాక పూర్తిగా మరొకవిధంగా మారిపోతానని అనుకునేది. అద్దంలో తన ప్రతి రూపాన్ని చూచుకుని తాను మునుపటి కిటీనే అనుకుని ఆశ్చర్య పడేది.

"నాయందు నీవు అసంతృప్తి చెందావా?"

"లేదు—నిన్ను పూజిస్తున్నాను" అని కిటీ తగ్గుస్వరంతో జవాబు చెప్పింది. "నీ సమయమంతా నిరర్థకంగా పాడుచేసుకొన్నానని నీ కిప్పటికీ అభిప్రాయం కలుగలేదా? నేను శుద్ధ మూర్ఖురాలను."

# 16

కిటీకే అప్పుడప్పుడూ భారంగా కన్పించే ఆమెఆనందం, ఆమె అందాన్ని పెంపొందించేది. తన వివాహానికి కొద్దిగా ముందు తన యౌవనం జారిపోతున్నట్లనిపించింది. ఆమె అలసి పోయినట్లు, వాడిపోయినట్లుండేది. కొందరు ఏమాత్రం ఆలో చనే లేకుండా ఆమెలో ఇప్పుడిక అందం లేదనేశేవారు. కాని పాతిక సంవత్సరాల అవివాహితకు, వివాహితకు ఎంతో అం తరముంటుంది. అప్పుడామె పైరేకులు వెలవెలబారిన గులాబి మొగ్గలాంటిది. తరువాత ఒక్కసారిగా ఆమె గులాబివలె పూర్తిగా వికసించింది. కాంతివంతమైన ఆమె కన్నులలోని కాంతి వృద్ధిచెందింది. ఆమెశరీరం — తన ఆరోగ్యానికి ఆమె ఎల్లప్పుడూ గర్వించేది, దాని నెప్పుడూ కాపాడుకునేది — అది కోమలము, మృదులముగా మారింది. పుష్పములుకూడా ఈర్ష్యచెందేంతగా ఆమె శరీరం కోమలము, మృదులమైంది. ఆమె మరొకసారి తిరిగి పదునెనిమిదేండ్ల సుకుమారిగా కన్పిం చింది. ఆమె సౌందర్యం శిఖరాగ్రమందుకుంది. ఆమెనుచూసి మౌనం వహించటం కష్టంగావుండేది. కిటీ చెలికత్తెలు అప్పు డప్పుడు ఆమెను ఒంటరిగా చూసి బిడ్డ కలుగబోతుందా అని అడిగేవారు. కొందరు విరక్తులు; ఒకప్పుడు కిటీనిగురించి ఆమె అందమైనదే గాని ముక్కు కొంచెం పొడవు అన్నవారందరూ బహుశా తామామెను తప్పుగా చూశామని ఇప్పుడాలో చిస్తున్నారు. మొదటిపర్యాయం చూచినప్పుడు చార్లీ "ఇంత సౌందర్యమా" అని విస్మయపడినంత ఆకర్షణీయంగా కిటీ ఇప్పుడుంది.

వారిద్దరూ చాలా యుక్తిగా ఎత్తులు వేస్తూయుండే వారు. చార్లీ ప్రపంచాన్ని చూచి వున్నాడు గనుక అతడికే విచారమూలేదు కాని కిటీని చూచి అతడేప్రమాదాన్ని కొని తెచ్చుకోగోరటం లేదు. వారు తరచు విజన ప్రదేశంలో కలుసుకోలేక పోతున్నారు. చార్లీకి అందులో సగమైనా చాలు, కాని కిటీ కొరకు ఏర్పాట్లు చేయాల్సే వుండేది. ఒక్కొక్కప్పుడు క్యూరీ షాపులోనే కలుసుకునే వారు—మరొకప్పుడు మధ్యాహ్న భోజనానంతరం ఇంట్లో ఎవరూ వుండరు గనుక అతడు కిటీ యింటికే వచ్చేవాడు కాని కిటీ అతనిని ఇంటి వెలుపలె ఎక్కువ కలుసుకునేది. కిటీ నతడు కలుసుకున్నప్పుడు సేవాబంధ పద్ధతిగా కలుసుకునే వాడు. కిటీకి అతని ఆచరణ అందంగా వుండేది. అతనిది నవ్వుముఖం అందరినీ ఈ విధంగానే కలుసుకునే అలవాటున్న మనిషి.. అతని సంభాషణము విని, "అతడు కొద్దిసేపటికే కిటీని తన కౌగిలిలో బంధించివేస్తాడని ఎవరూ అనలేరు.

చార్లీ కిటీకి పూజ్యుడు. 'పోలో' ఆటకు వెళ్ళేముందు ఆ డ్రస్సుధరించి, బూటు వేసుకుంటే చూస్తేనే ఉప్పొంగిపోయేది. టెన్నిస్‌కు వెళ్ళడానికి డ్రస్సు వేసుకున్నప్పుడు అతడు పూర్తిగా యువకునివలె వుండేవాడు. చార్లీకికూడా తన శరీరమంటే గర్వమే. కిటీ మరెవ్వరి శరీరాన్ని చార్లీ శరీరంవలె బలిష్ఠంగానూ, అందంగానూ వుండటంచూడ లేదు. అతడు తన శరీరమందు చాలా శ్రద్ధ వహించేవాడు. అతడెన్నడూ డబల్ రొట్టె, వెన్న, బంగాళాదుంపలు తినే ఎరగడు. నిత్యమూ వ్యాయామం చేసేవాడు. కిటీ ఆతడి చేతుల్ని

గర్భవతికి పంపిన కానుకలవలె స్థిరంగా వుంచుకోవాలనే ఆసక్తితో వుండేది. చార్లి చాలా మంచి ఆటగాడు. గత సంవత్సరమతడు టెనిస్-చాంపియన్‌షిప్‌ను జయించాడు. అతడు డ్యాన్సు చేసినా ఎంతో అందంగా వుండేది. కిటీ ఎన్నడూ ఇంత మంచి 'డ్యాన్సరు'ను చూడ లేదు. అతనితో డ్యాన్సు చేయాలనుకున్న అనేకమందికి అది స్వప్నమే. చార్లీనిచూస్తే అతడు నలభై ఏండ్ల వాడని ఎవరూ అనుమానించరు. అతడు నలభైఏండ్లవాడని కిటీ చెప్పనే చెప్పింది, కాని ఆమె నమ్మనే లేదు.

"నాకు నమ్మకం లేదు, నీవబద్ధమాడు తున్నావ్— నీవయస్సు పాతిక సంవత్సరాలకు మించి వుండదు," అని ఆమె అనేది.

అతడు నవ్వేవాడు, ఆమెకు ఆనందం కలిగేది.

"డియ్యర్, నా కుమారుని వయస్సే పదిహేనేండ్లు నేను మధ్య వయస్కుణ్ణి మరి రెండు మూడు సంవత్సరాలకు వృద్ధుడనై పోతాను," అనేవాడు.

"నీవు వంద సంవత్సరాల వాడివైనా సరే, పూజిస్తూ వుంటాను." కిటీకి చార్లీ నల్లని దట్టమైన కనుబొమ్మలంటే చాలా యిష్టం. ఒక వేళ ఈ కనుబొమ్మల అలంకారంతోనే ఆ నీలి కన్నులు చూసేవాళ్ళను విస్మయ పరచడం లేదుగదా యని ఆమె ఆలోచించేది.

చార్లీ సర్వగుణ సంపన్నుడని కిటీ భావించేది. అతడు పియానో వాయిస్తాడు—హాస్య గీతాలు ఎంతో బాగా పాడ తాడు. అతడి స్వరంలో ఎంత పరిపక్వత-ఎంతటి మాధుర్యం

వుంటుంది. కిటీ దృష్టిలో చార్లీ చేయలేని పనంటూనే లేదు. అతడు తన ఆఫీసు పనికూడా చాలా నేర్పుతో చేసేవాడు. విశేషంగల కార్యమేదైనా పూర్తయినప్పుడు గవర్నరు తనను అభినందించాడని కిటీకిచెప్తే ఆమె సంతోషంపట్ట లేక పోయేది. ఆతడి దరహాసంతో కిటీ కొరకు ప్రేమపొంగి వచ్చేది—"నేను గనుక నే ఇంత కఠినమైన పనిని చేయగలిగాను, మరొకరైతే దీనిని పూర్తిచేయ గలిగే వారు కారు." అనే వాడు.

కిటీ ఆలోచించేది—"నేను వాల్టర్‌కు భార్యగా కాక భగవంతుని కృపవల్ల ఈతని భార్యనైతే......?"

# 17

కిటీ, చార్లీ సంబంధాలు వాల్టర్‌కు పూర్తిగా అవగతమే ననే విషయాన్ని నిశ్చయంగా చెప్పలేము. ఒకవేళ అతనికి తెలియకపోతే మంచిదే. ఇదంతా అతనికి తెలియకుండానే వుండాలి; అత డీ విషయాన్ని ఎరుగున్నా మంచిదే. అందరి సమస్య తీరుతుంది. ప్రారంభంలో చార్లీ నెన్నిసార్లు చూచినా తనివితీ రేదికాదు. అప్పుడు కిటీ చాటుమాటుగా అతనిని కలుసుకుంటూవుండేది — కాని రానురాను చార్లీయందు మమత పెరిగినకొద్దీ ఆమె మార్గంలోని అవరోధాలు ఎక్కువ బాధగా తయారయాయి. అనుక్షణం చార్లీతోనే వుండాలని ఆమె కోరుకునేది. ఈ సంఘ వ్యవస్థ దుష్టశాపంవలె వుందనీ, ఆ కారణంగానే తా వింతగా ఆలోచించి అన్నీ చేయవలసి వస్తుందని చార్లీ అప్పుడప్పుడు కిటీతో అనేవాడు. ఈ అవ రోధాలు లేకుండా తా మిద్దరూ స్వతంత్రులైతే ఎంతబాగుం

డును. కిటీ చార్లీమాటను గ్రహించుకునేది. ఇద్దరిలోఎవరూ అపకీర్తిని వరించగోరటంలేదు. జీవితప్రవాహాన్ని మరో దిక్కుకు మళ్ళించాలన్నా చాలా ఆలోచన ఆకళింపుఅవసరమే, వారు విముక్తంచేయబడితే అప్పుడంతా ఎంతసులభంగా తేలికగా తేలిపోతుంది.

వారి కూటమివలన ఎవరికీ ఏమీహాని జరగటంలేదు. చార్లీయందు శ్రీమతి చార్లీ అభిప్రాయాలు ఆమె బాగుగా ఎరుగును. వా రిద్దరిలో కొంతకాలంగా ఒకరియందొకరికి ప్రేమలేదు. పరిస్థితులు, అలవాటు, బిడ్డలబంధనం మొదలైన వాటి కారణంగా మాత్రమే ఇద్దరూ ఒకేచోట వుంటున్నారు. ఆమెకంటే చార్లీ కిదంతా చాలా తేలిక. వాల్టర్ ఆమెను ప్రేమిస్తున్నాడు. కాని ఆతనెప్పుడుచూసినా తనపనిలో లీనమై వుంటాడు.

పురుషుడన్నతరువాత క్లిబ్బవగ్రైరాలు కూడావుంటాయి. ప్రారంభంలో అతడికి బాధనిపించొచ్చు, కాని తరువాత తరువాత అలవాటుపడతాడు. అతడు మరెవరినైనా ఎందుకు వివాహంమాడకూడదు? వాల్టర్ ఫేలో ఏమిచూచి వివాహం చేసుకున్నావని కూడా ఒకసారి చార్లీ కిటీనడిగాడు.

కొద్ది క్షణాలకు పూర్వం ఈ ఆలోచనలో తానెందుకు భయపడ్డానాయని కిటీ కొంచెంగా నవ్వుతూ ఆలోచించింది. ఆమె చార్లీతో వుండటం వాల్టరు చూసే వున్నాడు. ద్వారం తాళపుగుబ్బ ఆకస్మికంగా తిరగటంచూచి ఎవరైనా నిజంగా త్రుళ్ళిపడతారనేది నిజమే. మహా అయితే వాల్టరేమి చేస్తాడో వారికి తెలుసు—అందుకు వారిద్దరూ సర్వ సిద్ధంగా వున్నారు.

వాల్టర్ ఏదో ఒకటి నిర్ణయించుకుంటే తామాశించే కోర్కె నెరవేరుతుందనే కిటీ, చార్లీ లిద్దరూ కోరుకుంటున్నారు.

వాల్టర్ సజ్జనుడు. అతడు కిటీని ప్రేమిస్తున్నాడు, ఆమెకు న్యాయం చేయాలనుకుంటున్నాడు; కిటీ తనను విడాకులడగాలని ఆశిస్తున్నాడు. కిటీ చార్లీ లిద్దరూ తప్పుగా భావించారు, తమ తప్పును వారు త్వరగానే తెలుసుకున్నారు. కిటీ తన మార్గాన్ని నిర్ధారణ చేసుకుంది; వాల్టర్‌తో ఏమి చెప్పాలి, ఎలావ్యవహరించాల అనేది ఆమె బాగా ఆలోచించుకుంది. ఆమె మైత్రీ పూర్వకంగా వ్యవహరిస్తుంది,—నవ్వు ముఖంతో వుంటుంది, దృఢంగా వుంటుంది. వారిలో జగడమాడే ప్రశ్నే వుదయించదు. తరువాతైనా తాను వాల్టర్‌ను చూచి ఆనందిస్తుంది. రెండు సంవత్సరాలు తాను, వాల్టరు నెఱపిన దాంపత్య జీవితానుభవం వాల్టర్ పాలిట అమూల్యమైన నిధిగా వుండిపోతుందని ఆమెకు నమ్మకముంది.

శ్రీమతి టవున్సెండ్‌కు చార్లీకి విడాకులివ్వడానికి అభ్యంతరం వుండదని కిటీ ఆలోచిస్తుంది. ఇక ఇప్పుడామె కనిష్ఠ పుత్రుడుకూడా ఇంగ్లండు వెళుతున్నాడు. శ్రీమతి టవున్సెండ్ అక్కడే వుండాలికూడా, హాంకాంగ్‌లో ఆమె కేవిధమైన ఆసక్తికూడా లేదు. ఇంగ్లండులో ఆమె తన బిడ్డలతోబాటు హాయిగా కాలక్షేపం చేయగలుగుతుంది, పైగా డొరొథి టవున్సెండ్ తల్లి దండ్రులు వుండేదికూడా అక్కడే.

ఒక వేళ ఇలా జరగడం సంభవిస్తే అందరి చిక్కులు తొలగి పోతాయి, అపకీర్తి వుండదు, ఎవరి దృష్టికీ చెడుగానూ వుండదు. ఇక అప్పుడు తనకు చార్లీకి వివాహం జరు

గుతుంది. కిటీ దీర్ఘంగా నిట్టూర్చింది — తామిద్దరూ ఎంత సంతోష పడతారు. ఆ ఆనందాన్ని పొందటానికి కొద్ది గొప్ప కష్టాన్ని సహించవచ్చు. కిటీ మనస్సులో ఆలోచనా పరంపరలు వరుసగా లేచాయి—ఒక ఆలోచన తరువాత ఒకటిగా త్వరగా వచ్చి పోతున్నాయి. తమ వివాహం తరువాత జీవిత మెలా వుంటుంది—ఎంతో ఆనందంగా వుంటుంది—తామిద్దరూ ప్రయాణంలో జంటగా వుంటారు. తాము నివసించే ఆ గృహం,—చార్లీ యొక్క సాంఘిక స్థితి ఎంతో ఉన్నతంగా వుంటుంది—మరి వాటన్నింటిలో తాను స్వయంగా ఏమేమి సహాకరిస్తుంది. చార్లీ తననెంతో ప్రేమిస్తాడు, ఆమె పాలిట ఆరాధ్యుడవుతాడు.

కాని ఈ స్వప్నపు కునికిపాటు చెదిరిపోయేది. స్వరంలో ఏదో అపస్వరంవచ్చి ఆనందాన్ని, హాయిని పాడుచేసినట్లనిపించేది. వాల్టర్ ఇంటికి తిరిగివస్తాడు, తాను వాల్టరును కలుసుకోవలసి వుంటుంది అనేది ఆలోచించినప్పుడు ఆమెహృదయం దడ హెచ్చేది. ఆరోజు మధ్యాహ్నంతరువాత అతడేమీ అనకుండానే వెళ్ళిపోవటం ఎంత ఆశ్చర్యం. ఆమె అతనికి భయపడటంలేదు — అయినా ఎందుకోసమో చింతాక్రాంతురాలైంది. తన ఇచ్ఛవచ్చినట్లు ఒక రాద్ధాంతం చేసుకున్నందు వలన లాభమేముంది? అతనికి చాలాబాధకలిగిందని కిటీ ఆలోచించింది. ఆమె వాల్టర్‌కు బాధకలిగించగోరటంలేదు — కాని తాను వాల్టర్‌కు బాధకలిగించగోరటం లేదు — కాని, తాను వాల్టర్‌ను ప్రేమించలేకపోతే అందులో తనదోషమేముంది? నెపములు బెట్టటంవలన లాభమేముంది? నిజాన్నే

ఎందుకు చెప్పకూడదు. ఇక అతనికేమీ క్లేశముండదని, తాను చార్లీ చేసిన తప్పును అంగీకరించటమే మేలనీ, తానెల్లప్పుడు వాల్టర్‌ను గౌరవిస్తానని ఆమె ఆలోచించింది.

ఈ ఆలోచనరాగానే కిటీకి భయం కలిగినట్లనిపించింది. ఆమె అరచేతులు చమటతో తడసిపోయాయి. భయం కలిగినట్లనిపించగానే వాల్టర్ యందామెకు క్షుధకలిగింది. ఒకవేళ అతడు రాద్ధాంతమే చేయదలచుకుంటే, అదే జరగనివ్వు — అతడు ప్రతిగా ఆలోచించిన దానికంటే అదనంగానే పొందాల్సి వస్తుందని అతడూ గుర్తుంచుకోవాలి. తనకు వాల్టరంటే లేశమాత్రంకూడా ప్రేమలేదని స్పష్టంగా చెప్పేస్తుంది — వివాహానంతరం తానుచేసిన పనికి ఆమె పశ్చాత్తాప పడని రోజేలేదు. వాల్టరెంత మందమతిగలమనిషి? ఎంతగానో, అతడు కలత గలిగించాడు. నేను విసిగిపోయాను — కలతజెందాను — అసంతృప్తిచెందాను — అతడు అందరికంటే తాను చాలా మంచివాడననుకుంటాడు — మాటలాడటానికి తగినవాడుకూడాకాడు. ఆమె వాల్టర్‌లోని ఈ గంధముతో పరక్కిచెందింది, ఆతడి అతకని ఆత్మనిగ్రహంతో విసిగిపోయింది. తనలోతాను లీనమైపోవాలనుకున్న పరిస్థితుల్లోనైతే ఆత్మనిగ్రహం సరియైనదే కావచ్చు — అంతా తనే తప్పమరే బాధ్యతావుండకూడదు. కిటీకి వాల్టర్ యందు ద్వేషంకలిగింది. ఆమె అతడి చుంబనములనుండి దూరంగా పారిపోవాలనుకునేది. తనే గొప్పనుకుంటానికి అతనిలో ఆధిక్యమేముంది. ఎంత అసహ్యంగా డాన్సుచేస్తాడు? పార్టీల్లో ముఖం వ్రేళ్ళాడేసుకుని కూర్చుంటాడు, ఏమీ వాయించనూలేడు. పాడనూ

చేతరాదు — 'పోలో' కూడా ఆడలేదు. టెన్నిస్‌కూడా క్రొత్త ముఖంవలె తెలియకుండా ఆడతాడు. మరి 'బ్రిజ్'? హుఁ!

కిటీ వాల్టర్‌తో తెగతెంపులు చేసుకుంటానికి ఉగ్ర రూపంతో సిద్ధపడింది. 'ఈరోజు ఇంటికి వచ్చి నాతో మాట్లాడనీ చూస్తాను' అనుకుంది. ఇప్పటికి జరిగినదానికంతటికీ అతడే అపరాధి. ఇంతకూ అతడికి తెలియటమే మహాభాగ్యం. ఆతడిని చూడటంకూడా ఇష్టంలేనంతగా ఆమె ద్వేషిస్తుంది. వాల్టర్‌కు తెలియటమే నిజానికి గొప్ప ఉపకారం.

ఇక చిక్కంతా తీరేపోయింది. వాల్టర్ తననెందుకు ఒంటరిగా వదలివేయడు? అతడు వెంటబడి పెళ్ళిచేసుకున్నాడు— ఇప్పుడామెకు ఆతడంటేనే విరక్తి కలిగింది.

"విరక్తిచెందాను" అని ఆమె బిగ్గరగాఅంది. కిటీ క్రోధంతో కంపిస్తూంది. "విసిగిపోయాను, విరక్తిచెందాను"

అప్పుడే ఆమె గేటుగుండా లోనికి వచ్చి కారుధ్వని వింది. అతడు పైకి వస్తున్నాడు.

# 18

వాల్టర్ గదిలోనికి వచ్చాడు. కిటీ గుండెదడ మితిమీరిపోతుంది. ఆమె చేతులు వణకిపోతున్నాయి. అదృష్టవశాత్తు అప్పుడామె సోఫాలో పడుకునివుంది. ఆమెచేతిలో ఏదో పుస్తకం తెరచివుంది— చదువుతున్నట్లేవుంది. వాల్టర్ ద్వారం చెంత క్షణకాలం ఆగాడు. ఇద్దరికళ్ళు కలుసుకున్నాయి. కిటీ హృదయం జారిపోయింది. సమస్తశరీరంలోనుంచి ఏదో తీవ్ర

మైన అల దూసుకుపోయినట్లనిపించిం దామెకు — వాల్టర్ ముఖమంతా పాలిపోయి ఉంది. తమ వివాహానికి ముందు కిటీ ఒకసారి ఈ రూపాన్ని చూసింది. తాము ఒకానొకపార్కులో కూర్చుని వున్నప్పుడు వాల్టర్ వివాహప్రసక్తి తెచ్చాడు. అతడి స్థిరమైన నల్లని నేత్రాలు చాలా పెద్దవిగా కన్పిస్తున్నాయి అతడి కన్నీ తెలుసు.

“ఈ రోజు చాలా త్వరగా వచ్చారే?” అంది కిటీ.

ఆమె పెదవులు కంపిస్తున్నాయి. అతికష్టంగా ఈ మాటలు బయటకు వెలువడ్డాయి. ఆమె విపరీతంగా భీతిచెందింది. స్పృహతప్పి పడిపోను గదా యని అనిపించిందామెకు.

“లేదే, నేను రోజూ వచ్చే సమయానికే వచ్చాను”

కిటీకి వాల్టర్ కంఠధ్వని అపరిచితంగా కన్పించింది. వాక్యంలోని అంతిమ భాగం కొంచెం గట్టిగాఅన్నట్లనిపించింది— మాట్లాడటానికి మాత్రమే అతడు జవాబిచ్చినట్లుంది. తన కంపిత శరీరాన్ని వాల్టర్ చూడగూడదనే అనుకుంది. ఏదో అజ్ఞాతశక్తితోనే బొబ్బరింపే అణచుకోగలిగింది. వాల్టర్ ముఖం తిప్పేసుకున్నాడు.

“నేను దుస్తులు మార్చుకుంటానికి వెళ్ళుతున్నాను.”

అతడు గదినుంచి వెళ్ళిపోయాడు. తాను ముక్క-ముక్కలైనట్లనిపించింది కిటీకి.

కొద్ది క్షణాలవరకు ఆమె ఎటూ కదలలేకపోయింది. కొద్దిసేపటి తరువాత ఆమె జబ్బుపడినవాళ్ళు లేచినట్లు నెమ్మదిగా సోఫానుంచి లేచింది — ఇంకా చాలా బలహీనంగా

ఉన్నట్లనిపించింది. తనకాళ్ళపై తన భారాన్ని నిలబెట్టుకోగల నసే నమ్మకంకూడా ఆమెకు లేకుండాపోయింది. కుర్చీలు, బల్లల్ని ఊతగొంటూ ఆమెగదినుంచి వరండాలోకి వచ్చింది. ఆమె తన గౌను ధరించి వాల్టరున్న గదికి వెళ్ళింది. అక్కడ వాల్టరేనో చిత్రాన్ని పరికిస్తున్నాడు. కిటీ అతిప్రయాసతో గదిలోనికి వెళ్ళగలిగింది.

"క్రిందికి వెళ్ళుదామా, భోజనం సిద్ధంగా వుంది"

"నన్ను గురించే ఇంతవరకు ఆగావా?"

కిటీ పెదవుల కంపనం మరీ హెచ్చింది.

ఇప్పుడిక ఆమె మరేమి మాట్లాడగలుగుతుంది?

ఇద్దరూ కూర్చున్నారు. ఒక క్షణకాలం ఇద్దరిలో ఎవరూ మాట్లాడలేదు. తరువాత వాల్టరే మాట్లాడాడు — ఆతడిమాట ఈ ఏకాంతంలో భయంకరంగా వున్నట్లనిపిస్తుంది "ఎంప్రెస్ ఈరోజు రాలేదు — ఒకవేళ ఈ తుఫానువలన ఆగిపోయి వుండదుగదా?" అన్నాడు.

"ఆమె ఈరోజు రావాలా?"

"అవును"

కిటీ ఇప్పు డాతనివైపు చూసింది. వాల్టర్ కన్నులు ముందున్నపళ్ళెంలో లీనమై వుండటం ఆమె గమనించింది. మరల తిరిగి అతను ఆ విధంగానే ఏదో అర్థంలేని విషయాన్ని చెప్పాడు. ఏదో టెన్నిస్ పోటీనిగురించి చెప్తున్నాడు, సాధారణంగా ఆతడి కంఠస్వరం బాగుంటుంది—కాని ఈసమయంలో

అతడు ఒకే ధ్వనిలో — పెద్దగా మాట్లాడుతున్నాడు. అది అతడిస్వభావాని కెంతమాత్రం అతకడంలేదు.

అతడెంతో దూరంనుంచి మాట్లాడుతున్నాడని కిటీ భావించింది. సంభాషణ జరిగినంతసేపూ అతడి కన్నులు పళ్ళెంవంకన్నా చూస్తున్నాయి—లేదా బల్లవంకన్నా చూస్తున్నాడు, మధ్య మధ్య చిత్రాలవైపు చూసేవాడు. అతడు కిటీవైపు చూడనేలేదు. వాల్టర్ నన్నుచూసి సహించలేక పోవచ్చు అనుకుంది కిటీ.

"పైకి వెళ్ళుదామా?" భోజనం ముగిసినతరువాత వాల్టర్ అన్నాడు.

కిటీ లేచింది — వాల్టర్ తలుపు తెరిచాడు. అప్పుడు కూడా అతడికన్నులు క్రింద దేనినో చూస్తూవుండటం కిటీ గమనించింది. వా రిద్దరూ రెండవగదికి చేరగానే వాల్టర్ మరల పత్రిక తీసుకున్నాడు.

"ఇది క్రొత్తపత్రికా? నే నింతవరకూ చూడనేలేదు"

"నాకు తెలియదు — నే నంతగా గమనించలేదు"

ఆ పత్రిక చాలా రోజులుగా అక్కడ పడి వుందనీ, వాల్టర్ దానిని పూర్తిగా చదివాడనికూడా కిటీకి బాగా తెలుసు. అతడు కూర్చుని పత్రికచూడ నారంభించాడు. కిటీ తిరిగి సోఫాలో పడుకుంది, ఆమె మరల అదే పుస్తకం తీసుకుంది. వారిద్దరూ సాయంత్రం ఖాళీగా వున్నప్పుడు సాధారణంగా పేక ఆడేవారు. నేడు వాల్టర్ విశ్రాంతిగా మడత కుర్చీలో కూర్చుని పత్రిక చదవడంలో లీనమైపోయినట్లు కన్పి

స్తున్నాడు. అయినా ఇంత వరకు అతడు ఒక పేజీకూడా తిరగేయలేదు. కిటీకూడా చదవడానికెంతో ప్రయత్నించింది, కాని ఫలము చెందలేక పోయింది. శబ్దాలు, వాక్యాలు అసలు కన్పించడమే లేదన్నట్లుంది. చదవడానికామె చేసే అనవసర శ్రమతో తలనొప్పి ప్రారంభమైంది.

అత డెప్పుడు మాట్లాడతాడు ?

దాదాపు ఒక గంట వరకు ఇద్దరు మౌనంగానే కూర్చుని వున్నారు. కిటీ చదివే నెపాన్ని వదిలేసింది—ఆ నవలను ఒడిలో పెట్టుకుని నిస్సారంగా ఒక దిక్కుకు చూస్తూ వుంది. తను చేసే ఏపనివలనా ఏవిధమైన ధ్వని కలుగకూడదనుకుంది. వాల్టర్ అదేవిధంగా కూర్చుని వున్నాడు, ఆతడి కన్నులు స్థిరంగా పత్రికలో పాతుకపోయాయి. ఆతడి స్థైర్యము కిటీ పాలిట శత్రువైంది. ఒక క్రూరజంతువు పంజావిప్పి విరుచుకు పడబోతున్నట్లనిపించింది.

ఆకస్మికంగా ఆమె కంపనం జెందింది. కిటీ తన రెండు చేతుల్ని పెనవేసుకుంది; ఆమె పూర్తిగా పాలిపోయింది. "ఇక ఇప్పుడు," అనుకుంది.

అదేవిధంగా శాంతంగా, సూటిగా తల పైకెత్తకుండానే వాల్టర్ అన్నాడు," నేను కొద్దిగా పని చేసుకోవాలి. నేనిక 'స్టడీ'కి వెళతాను. నాపని పూర్తయే సరికి నీవు నిద్రేపోతావు."

"నేనివాళ చాలా అలసిపోయాను."

"మంచిది—నమస్కారం."

"నమస్కారం."

వాల్టరా గదినుంచి వెళ్ళి పోయాడు

# 19

మరునాడుదయం కిటీ త్వరగా చార్లీ ఆఫీసుకు ఫోను చేసింది.

"అవును ! ఎందుకు ఏమిటి?"

"నేను నిన్ను కలుసుకోవాలనుకుంటున్నాను"

"డియర్! నేను చాలాపనిలో వున్నాను. పైగా నే నెప్పుడూ పనిలో మునిగివుండేవాడిని గదా!"

"కలుసుకొనటం చాలా అవసరం. నేను ఆఫీసుకు బయలుదేరి రానా ?"

"అర్రే, వద్దు వద్దు. ఒకవేళ నేనే నీ స్థానంలోవున్నా అలా ఎన్నడూ చేయను"

"అయితే నీవే ఇక్కడకు బయలుదేరి రా"

ప్రస్తుతం నే నిక్కడినుంచి కదలటానికే వీలులేదు. మధ్యాహ్నం తరువాత ఎందుకు కలుసుకోగూడదు ? పైగా నేను మీ యింటికి రాకపోవడమేమంచిది"

"నేను నిన్ను వెంటనే కలుసుకోగోరుతున్నాను"

ఒక క్షణం ఆగిపోయింది. కిటీ లైన్ కట్ అయిందను కుంది.

"ఏమిటి, నీవక్కడున్నావా?" కిటీకంఠం ఆందోళనగా వుంది.

"ఉన్నాను, నే నాలోచిస్తున్నాను; ఎందుకు? ఏమైనా జరిగిందా?"

"నేను టెలిఫోనులో చెప్పను"

మరొక నిముషం మౌనం.

"సరే చూడు! పది నిముషాలు మాత్రమే కలుసుకో గలుగుతాను. నీ వదేషాపుకు బయలుదేరి వెళ్ళు. వీలైనంత త్వరగా నే నక్కడకు వస్తాను."

"ఆ షాపు వద్దకా?" కిటీ ఆశ్చర్యంగా అడిగింది.

"లేకపోతే ఇప్పుడు హాంకాంగ్‌లో హోటల్ హాలు లోనో, లాడ్జిలోనో కలుసుకోలేము."

కిటీ చార్లీ కంఠంలోని కోపాన్ని గ్రహించింది.

"మంచిది, నే నక్కడికే వస్తాను."

# 20

కిటీ విక్టోరియా రోడ్డులో రిక్షానుంచి దిగి ప్రక్కవున్న పల్లంగా – సంకరంగా వున్న గల్లీగుండా బయలుదేరింది. కొద్దిసేపటికే ఆమె క్యూరీషాపుకు చేరుకుంది. ఆమెఒకక్షణం ఆగింది—తననెవరో చూస్తున్నట్లనిపించింది—తరువాత నిశ్చింతగా ముందుకు నడచింది. బయటనే ఒక కుర్రవాడు వచ్చే కస్టమర్ల కోసం నిలబడి వున్నాడు—అతడు నవ్వుతూ కిటీని

ఆహ్వానించాడు. కుర్రవాడు చైనా భాషలో లోనవున్న ఒక మనిషి కాదేశించాడు. అంతలో పొట్టిగావున్న లావుపాటి మనిషి మొద్దు ముఖంతో బయటకొచ్చాడు. అతడు కిటీని అభినందించాడు. కిటీ వేగంగా లోనికి దూసుకు పోయింది.

"మిస్టర్ టవున్సెండింకా రాలేదు. మీరు పైభాగానికి వెళ్ళండి."

షాపు వెనుకకువెళ్ళి కిటీ ఇరుకైన నల్లని మెట్లద్వారా పై భాగానికి చేరుకుంది. ఆ చైనా మనిషి ఆమెను పై వరకు సాగనంపి గది తలుపు తెరచాడు. గదిలో శ్వాసాడటం లేదు—అక్కడ మదం వాసన వేస్తుంది. ఆమె ఒక బెంచీ మీద కూర్చుంది.

ఒక క్షణం తరువాత శిధిలావస్థలోవున్న ఆమెట్లపై భారమైన అడుగుల ధ్వని విన్పించింది. చార్లీ లోనికిరాగానే తలుపు మూసివేశాడు. ఆతని ముఖం గంభీరంగా వుంది. కాని కిటీని చూడగానే ఆ గంభీరమంతా నీరుగారిపోయింది, ఆతడి సహజ దరహాసం ముఖంలో ప్రకాశించింది. అతడు కిటీని కౌగలిలోనికి తీసుకొని పెదవులపై చుంబించాడు.

"ఇప్పుడు చెప్పు, ఏమిటి బాధ?"

"నీవు ఎదురుగావుంటే చాలా ఆనందంగా వుంటుంది." అని కిటీ దరహాసంచేసి జవాబిచ్చింది.

చార్లీ పక్కమీద కూర్చుని సిగరెట్ ముట్టించుకో సాగాడు.

"ఇవ్వాళ చాలా విచారంగా కన్పిస్తున్నావేం?"

"అవును, రాత్రంతా కంటిమీద కునుకే లేదు," అంది కిటీ జవాబుగా. చార్లీ పరిశీలనగా కిటీవంక చూశాడు. అతడింకా దరహాసం చేస్తూనే వున్నాడు. కాని ఆదరహాసం సహజమైనదిగా లేదు, తెచ్చి పెట్టుకున్నట్లుంది.

చార్లీ వ్యాకులంగా వున్నాడని కిటీకి కనిపించింది.

"నీ వెరుగుదువా," అంది.

ఒక క్షణం మౌనంగా వుండి," అతడేమన్నాడు?" అని అడిగాడు చార్లీ.

"ఏమీ అనలేదు."

"ఏమిటి! అయితే, అతడికన్నీ తెలుసునని నీవెందుకు ఆలోచిస్తున్నావ్?"

"ప్రతి విషయంలోను! అతడి కన్నులు—అతడు నిన్న రాత్రి భోజన సమయమందు సంభాషించిన పద్ధతి."

"ఏం, అంత అనుచితంగా వుందా?"

"లేదు! పైగా చాలా మృదువుగా వుంది. పెండ్లయిన తరువాత నన్ను ముద్దు పెట్టుకోని మొదటి పర్యాయం నిన్న రాత్రే."

కిటీ కళ్ళు క్రిందికి దించుకుంది. బహుశా చార్లీ గ్రహించి వుండడని ఆమె తలచింది,—సాధారణంగా వాల్టర్ కిటీని కౌగిలిలో బిగించుకుని పూర్ణకామేచ్ఛతో ఆమె పెదవులపై చుంబించేవాడు.

"ఇంతకూ అతడెందుకని ఏమీ అనలేదని నీ అభి
ప్రాయం?"

"నాకు తెలియదు."

కొంచెం సేపు మౌనం. కిటీ విగ్రహంవలె నిశ్చలంగా ఆ బెంచీమీద కూర్చుని ఉత్సుక నయనాలతో చార్లీని వీక్షించుచుండెను. అంతలోనే చార్లీ ముఖం గంభీరంగా మారింది, ఆతడి ముఖంలో భయంఛాయగా వుంది. పెదవులు అంటుకుపోయినట్లున్నాయి,—ఆకస్మికంగా ఆతడి కన్నులలో ఏదో వెలుగు తళుక్కుమంది.

"అతడేమీ అనడనే నా వుద్దేశ్యం."

కిటీ జవాబేమీ చెప్పలేదు. చార్లీ అభిప్రాయమేమిటో కూడా కిటీ గ్రహించుకోలేకపోయింది.

"ఇటువంటి విషయాన్ని ప్రథమపర్యాయమే చూచిన వారిలో ఇతడు మొదటివాడేంగాదు. అల్లరిచేసినందువలన అతడికి వచ్చేదేముంది. అతడు గందరగోళమే చేయాలనుకుంటే అతడప్పుడే నీ గదిలోనికి వచ్చేవాడు 'ఈ మాటలు చెప్పినతరువాత చార్లీ కన్నులు ప్రకాశించాయి, ఆతడి పెదవులపై తిరిగి దరహాసం విరిసింది' అప్పుడే అయితే మనం నిజంగా శుద్ధ మూర్ఖులమే."

"నీవు నిన్నరాత్రి అతడిముఖం చూసివుంటే ఎంతో బాగుండేది"

"అతడప్పుడు వికలమనస్కుడైవుండి వుంటాడని నా అభిప్రాయం, ఉండాలికూడామరి. ఏ పురుషునికైనా ఇటు

వంటివిషయం కష్టదాయకంగానే వుంటుంది. వాల్టర్ కనీసం ఈ విషయంలో వ్యర్థంగా కీచులాడడు" కిటీ అతనిమాటలను సమర్థిస్తూ, "నా ఉద్దేశ్యంకూడా అదే మరి. అతడు చాలా యోచనాపరుడు — సాధువు — అది నాకు బాగుగా తెలుసు."

"అయితే అది మనకుమరీమంచిది. ఒక వేళ ఆస్థానంలో నీవే వుంటే ఏం చేస్తావో కొంచెం ఆలోచించు. ఒకేఒక మార్గంవుంది, అది మనిషిముఖం చాటేయటమే — ఏమీ చూడనట్లుగా నటించడమే. అతడుకూడా చేసేదదేనని నేను పందెం వేయగలను." మాట్లాడి న కొద్దీ చార్లీ తీవ్రపడు తున్నాడు. ఆతడి నీలినేత్రాలు మెరుస్తున్నాయి. అతడిప్పుడు తనసహాస దరహాసరూపంలో వున్నాడు.

"అతనివిషయంలో నేనేమీ కటువుగా మాట్లాడను. ఇక నాకూ సెక్రటరీ అయేఅవకాశం రాబోతుంది. వాల్టర్ నాతో జోక్యంపెట్టుకొనకపోవటమే మంచిది. అతడు తన పనేమిటో తాను చూసుకోవాలి. ఒక వేళ అతడు అల్లరేగనుక చేస్తే వలస — శాఖద్వారా అతడికేమైనా మేలు జరుగుతుం దని నీవనుకుంటున్నావా?— నమ్ము— అతడు మౌనంగావుంటే అతడికే మేలుకలుగుతుంది, ఒక వేళ అల్లరేచేస్తే తనచేతితో తన కంట్లోనే పొడుచుకుంటాడు."

పాపం, వాల్టర్ సహజంగా చాలా సిగ్గుగలవాడు అని కిటీ మౌనంగా కూర్చుని ఆలోచిస్తుంది. జనం అనే అవాకులు చవాకులు అతడు సహించలేడు. కాని డబ్బు, మర్యాద

చూసుకుని అతడెన్నడూ మౌనం వహించడు. చార్లీకి అతడు బొత్తిగా తెలియదు — అర్థం చేసుకోలేదు.

"నాకోసం అతడు ఉన్మత్తుడనే విషయం నీవెప్పుడైనా ఆలోచించావా?"

చార్లీ జవాబేమీ చెప్పలేదు. కాని కొంటెగా — చూస్తూ దరహాసం చేశాడు.

అతడావిధంగా వుండటం కిటీకెంతో ఆకర్షణగావుండేది.

"అయితే ఏం జరుగుతుంది. నీవేం చెప్పదలచావో నాకు తెలుసు"

"సరే! పురుషుడు తనను గాఢంగా ప్రేమిస్తున్నాడనే స్త్రీ ఎల్లప్పుడు భావించుకుంటుంది"

"భేష్, ఏంమాట చెప్పావంటే ?"

"కాని నేను చెప్పేదేమిటంటే ఈమధ్య నీవు నీభర్త యందు శ్రద్ధవహించటం మానేశావ్. ఇక ఇప్పుడతడు మొదటంతగా నిన్ను ప్రేమిస్తూ వుండకపోవచ్చు"

"నీవు నాకోసం ఉన్మత్తుడవు కాదనే విషయం నాకు బాగుగా తెలుసు."

"ఓహూ! ఇదే మరి నీ తప్పు."

ఆమాట విన్న కిటీకి ఎంతో హాయిగలిగింది. ఇది ఆమెకు తెలుసు, అదే చార్లీనోటిద్వారా విని కిటీ హృదయం వికసించింది. చార్లీ మాట్లాడుతూ లేచివచ్చి కిటీ సరసన కూర్చున్నాడు. అతడు కిటీ నడుముకు చేతులుచుట్టేశాడు. ఒక క్షణ

మాగి, "పిచ్చిదానా! చింతించకు నమ్ము, భయపడాల్సిన అగత్యమేమీలేదు. అతడేవిూ చూడనట్లే నటిస్తాడని నాకు బాగా నమ్మకముంది. ఇటువంటిమాటలు ప్రభుత్వానికి చెప్ప రని నీకు తెలుసు. అతడు నిన్ను ప్రేమిస్తున్నాడని–బహుశా అతడు నిన్నొదగోరక పోవచ్చునని నీ వంటున్నావు."

కిటీ చార్లీ పైకి వంగింది. ఆమెశరీరం నిర్జీవంగా చార్లీ బాహుల్లో వుంది. వాల్టర్ విషయంలో ఈ ప్రేమను ఆలో చించటమే కిటీని కలవరపర్చేస్తుంది. తనకెన్ని కష్టాలుకలిగినా సహించగలిగేంతగా వాల్టర్ ఆమెను ప్రేమిస్తున్నాడనీ, అం దుకు అప్పుడప్పుడు కిటీ ఆతనికి ప్రేమభిక్ష పెడ్తూవుండాలని చార్లీ చెప్పాడు. కిటీ ఇది అర్ధంచేసుకుంటుంది, కాని ఆపని తాను కేవలం చార్లీ విషయంలో నే చేయగలుగుతుంది.

అతడు పూర్తిగా దాసుడై వుండాలని కోరుతున్నాడనే ఆలోచన కలుగగానే వాల్టరుయందు కోపంముంచుకువచ్చింది.

కిటీ తన చేతుల్ని చార్లీ మెడచుట్టూ పెనవేసింది. "నీ వెంతమంచివాడవు. నే నిక్కడికి వచ్చినప్పుడు విపరీతంగా కం పించిపోతున్నాను, అటువంటిది నీ వెంతో సహజంగా అంతా చక్కబర్చావు."

చార్లీ తన చేతులతో కిటీ ముఖాన్ని పైకెత్తి ఆమెను ముద్దు పెట్టుకున్నాడు.

"డారి ంగ్!"

"నీవలన నాకెంతో హాయి లభిసుంది," అంది కిటీ నమ్మకంతో.

"నీవేమీ వ్యాకుల పడకు, నేను నిన్ను రక్షిస్తాను. నిన్నిటువంటి ఎదురు దెబ్బలు తిన నీయను."

కిటీకి ధైర్యం కల్గింది. కాని ఆకస్మికంగా తన భవిష్యత్తులోని కలలు చెదిరిపోవటంచూసి విచారపడింది. ఇక ఇప్పుడు అపాయాలన్నీ తొలగి పోయాయనుకున్నప్పటికీ వాల్టర్ తనకు విడాకు లిచ్చేయాలనీ ఆమె కోరుకుంటుంది. "నాకు నీ ఆధారమేగా వుంది." అంది కిటీ.

"వుండాల్సిందే,"

"నీవు వెళ్ళి భోజనం చేయవా?"

"తగులబడనీ వెధవ భోజనం."

చార్లీ కిటీని తన బిగికౌగిలిలోకి చేర్చుకున్నాడు. ఇరువురి అధరములు కలసి పోయాయి.

"చార్లీ నన్ను వెళ్ళనివ్వు."

"లేదు వీల్లేదు."

కిటీ ముఖంలో కించిత్ దరహాసం పరుగెత్తింది. సంతృప్తిగల ప్రేమ దరహాసం. విజయస్మితము. చార్లీ కన్నులలో కామం ముంచుకొస్తుంది. అతడు కిటీని తన చేతుల్లోకి ఎత్తుకుని తలుపు గొళ్ళెం తగిలించాడు.

# 21

మధ్యాహ్నం తరువాత కిటీ వాల్టరును గురించి చార్లీ చెప్పిన విషయాలన్నింటినీ వరుసగా ఆలోచిస్తూ వుంది. ఆసా

యంత్రం వాల్టర్ కిటీలు బయటకు భోజనానికి వెళ్ళవలసి వుంది. సాయంత్రం వాల్టర్ క్లబ్బునుంచి తిరిగివచ్చి నప్పుడు కిటీ అలంకరించుకుంటుంది. వాల్టర్ గది ముందుకువచ్చి తలుపుపై చిటిక వేశాడు.

"రానచ్చు"

అతను తలుపు తెరువ లేదు.

"నేను దుస్తులు వేసుకుంటానికి వెళుతున్నాను. నీ కింకా ఎంత ఆలస్యముంది?"

"పది నిమిషాలు."

అతడు మరేమీ మాట్లాడకుండానే తన గదికి వెళ్ళి పోయాడు. ఆతడి కంఠధ్వని గత రాత్రివలెనే గంభీరంగానూ, బరువుగానూ వుంది, కిటీ కిప్పుడు తనయందు చాలా నమ్మకం కలిగింది. కిటీ వాల్టర్ కంటే ముందే ముస్తాబైయింది. క్రిందికి వచ్చి కారులో కూర్చుంది.

"నేను చాలా ఆలశ్యం చేశాను."

"అభ్యంతర మేమీ లేదు," అని కిటీ జవాబిచ్చి దరహాసంచేసింది. త్రోవలో సంభాషించటానికి కిటీ రెండు మూడు పర్యాయాలు వృధా ప్రయాసపడింది. కాని వాల్టర్ తీవ్రమైన జవాబులు చెప్పాడు. కిటీకి విసుగు కలిగింది. 'అతడంత ముభావంగా వుండాలనుకుంటే ఉండవీ, నాకూ ఏమీ ఫర్వాలేదు,' అనుకుంది గమ్యస్థానానికి వెళ్ళేవరకు ఇద్దరూ పూర్తిగా మౌనం వహించారు. అది చాలా పెద్దవిందు అనేక మంది వచ్చారు, రక రకాల పదార్థాలున్నాయి. కిటీ తన

చుట్టూవున్న వారితో సంభాషించే సమయంలో వాల్టర్‌నూ గమనిస్తూనే వుంది. ఎవరో చాలా ఘోర దుఃఖాన్ని కలిగించినంతగా ఆతడి ముఖం పూర్తిగా పాలిపోయి వుంది.

"మీభర్త చాలా బలహీనంగా కన్పిస్తున్నారు. ఎండదెబ్బ తగలలేదుగదా? లేక ప్రస్తుతం పని అధికమైందా?"

"ఆయన పనిచేయటమే ఎప్పుడు ఎక్కువ"

"బహుశా మీరు త్వరలో వెళ్ళుతారనుకుంటాను."

"అవును, గత సంవత్సరంవలె ఈ సంవత్సరంకూడా జపానుకు వెళ్ళాలని అభిప్రాయం. వెళ్ళకపోతే నే నీ అగ్గికి చచ్చిపోతాననే డాక్టరు చెప్తున్నాడు" అని కిటీ జవాబిచ్చింది.

విందులు వగయిరాలలో వాల్టర్ కిటీని గమనించే అలవాటులేదు, ఈ రోజు కూడా గమనించలేదు. కారులో కూర్చున్నేప్పుడుకూడా ఈ రోజు వాల్టర్ ముఖం తిప్పేసుకోవటం కిటీ గమనించింది. కాని కారు దిగేప్పుడుమాత్రం మర్యాదకోసమని అతడు కిటీకి సహాయపడ్డాడు. అక్కడ, విందులో తనచుట్టూవున్న స్త్రీలతో మాట్లాడేప్పుడుకూడా ఆతడి ముఖంలో నీరసదరహాసమైనా లేదు. పైగా నీరసమైనచూపులో, రెప్ప వేయకుండా వారిని చూస్తూవున్నాడు. అప్పుడాతడి నేత్రాలు పాలిపోయిన అతడి ముఖంలో నిజంగా చాలా పెద్దవిగా కన్పించాయి. నిటారుగా నిశ్చలంగా కూర్చున్నాడు.

"ఎంత గొప్ప స్నేహితుడు లభించాడు!" అని కిటీ వ్యంగ్యంగా ఆలోచిస్తూంది.

నిజానికతని కన్నీ తెలుసు, అందుకేమీసందేహంలేదు అతడు చాలా క్రోధంగాకూడా వున్నాడు, కాని అతడేమీ అనడెందుకని? ఇంత తెలిసిన తరువాతకూడా తాను నన్ను ప్రేమిస్తున్నాడు. ఒకవేళ తనను వదిలేస్తానని భయంతో మాత్రమే చెప్పడంలేదా? ఈ అభిప్రాయమే కిటీకి వాల్టర్ యందు విరక్తి భావాన్ని కలిగించింది. కాని కిటీ స్వభావమంచిది, 'వాల్టర్ నాభర్త, నా తిండి బట్టలు, నివాసము మొదలైన ఏర్పాట్లన్నీ చక్కగా చేస్తున్నాడు. కాని, అయితేఅతడు నా మార్గానికి అవరోధం కానంతవరకు నేనతనియందు మంచిగా నడచుకుంటా'' నని కిటీ మరల ఆలోచించుకుంది. అతనిలోని ఈ ముభావం బహుశా ఆవిషయభారంవలన కావచ్చు. వాల్టర్ అపకీర్తికి చాలా ఎక్కువగా భయపడతాడని చార్లీ చెప్పింది నిజమే. ఒకసారి వాల్టర్ ఒకకేసు విషయంలో సాక్ష్యానికి పిలిపిస్తే, అంతకు వారంరోజులముందునుంచి అతడు నిద్రేపోలేదని చార్లీ చెప్పాడు. నిజంగా వాల్టర్లోసిగ్గు ఒక రోగమే.

ఇంకోవిషయంకూడా వుంది. పురుషులు దంభికులై వుంటారు. ఇటువంటివిషయాలు ఎవరికీ తెలియవని వారు తలచినంతవరకు వారుకూడా ఆ విషయాలను మరచేవుంటారు వాల్టర్కూడా అందుకే నెట్టుకుపోతున్నాడు. వాల్టరుకు తన మంచిచెడులు, తనస్థితి బాగుగా గ్రహించుకుంటాడని చార్లీ చెప్పినవిషయం ఆమెకు గుర్తొచ్చింది. చార్లీకి ప్రభుత్వంలో ఎంతో పేరుంది. పైగా ఇక వలసప్రభుత్వ సెక్రటరీ కాబోతున్నా డిప్పుడు. అతడు వాల్టరుకు ఎంతో సహాయం చేయ

గలదు. ఒకవేళ వాల్టర్ ఏమన్నా పెద్దరాద్ధాంతంచేస్తే ఏమవుతుంది? అనికూడా మరల ఆలోచించింది. ఆలోచనకలగటంతోనే విచారం కలిగింది. చార్లీ ఎంతో దృఢనిశ్చయంగల మనిషని ఆలోచించినప్పుడు పొంగిపోయేది — తాను చార్లీ కౌగిలిలో ఎంత నిర్జీవంగా వుండేది — ఈ పురుషులుకూడా ఎంత విచిత్రమైనవాళ్ళు – కిటీ వాల్టర్ నెన్నడూ ఇంత అధముడుగా ఎంచలేదు. కాని ఆ నీచస్వభావాన్ని కప్పుకుంటానికే ఆ గాంభీర్యమనే ముసుగని ఏకు తెలుసు. ఆలోచించిన కొద్దీ కిటీకి చార్లీ చెప్పిందంతా నిజమేననే నమ్మకం ధృవపడుతుంది. మరల వాల్టరును గురించి ఆలోచించింది. ఆ ఆలోచనలలో తన భర్తయందు ఆమె కేమాత్రం ఆకర్షణ లేదు — ఆత్మీయతాలేదు.

వాల్టర్ చుట్టూవున్న స్త్రీలు తమ స్నేహితులతో సంభాషించటం ప్రారంభించినప్పుడు వాల్టర్ ఒక్కడే ఏకాకిగా ఉండిపోవటం ఆమె గమనించింది. అతను కళ్ళుప్పగించి ఎదురుగుండా చూస్తున్నాడు. తానొక విందులో వున్నాననేదికూడా ఆతడికేమాత్రం గుర్తులేదు, ఆతడి కన్నుల్లో విషాదం శాశ్వతరూపాన్ని ధరించి నిలిచిపోయింది. కిటీకి బలంగా ముందుకు పడద్రోసి నట్లనిపించింది.

## 22

మరునాడు కిటీ మధ్యాహ్న భోజనానంతరం విశ్రాంతి తీసుకుంటున్న సమయంలో గదితలుపుపై చిటికలు వేయటంతో త్రుళ్ళిపడింది. కిటీ పగలు ఆ సమయమందు ఇతరవ్యాపకమేదీ కోరదు. ఆమె 'ఎవరు?' అంది కోపంగా.

"నేనే !"

కిటీ తన భర్తకంఠాన్ని గుర్తించి వెంటనే లేచికూర్చుంది.

"లోనికి రండి"

"నేను నిన్ను నిద్రలేపాను" అని వాల్టర్ గదిలో అడుగు పెట్టగానే అన్నాడు.

గత రెండుమూడు రోజులనుంచి కిటీ వాల్టరుతో సహజంగా, మృదువుగానే సంభాషిస్తూవుంది. ఇప్పుడుకూడా అదే విధంగా "అవును, మేల్కొల్పారు" అంది.

"నా గదివరకూ వస్తావా? నీతో కొన్నివిషయాలు మాట్లాడాలి"

కిటీ హృదయం దడదడ హెచ్చుగావుంది.

"గౌను వేసుకుని వస్తాను"

వాల్టర్ వెళ్ళిపోయాడు. కిటీ లేచి గౌను వేసుకుంది. ఆమె అద్దంలో ముఖం చూసుకుంది. దుఃఖం గూడుకట్టుకుంది. బుగ్గలపై ఎరుపువేసుకుంది. సిద్ధమై ద్వారంలో ఒకక్షణకాలం సంకోచంతో ఆగిపోయింది, సంభాళించుకొని, మనస్సునుదిట్ట పర్చుకుని వాల్టర్ గదికి వెళ్ళింది.

"మధ్యాహ్నం ఈ సమయమందెలా వచ్చారు? నేనెన్నడూ ఈ సమయమందు రావడం చూడలేదే?"

"నీవు కూర్చోవూ?"

వాల్టర్ కిటీవైపు చూడకుండానే మాట్లాడాడు. వాల్టరనగానే ఆమె కూర్చుంది. ఆమె కాళ్ళు వణకిపోతున్నాయి.

గొంతు పూడిపోయినట్లయింది. ఆమె మౌనంగావుంది. వాల్టర్ కూడా కూర్చొని సిగరెట్ వెలిగించుకుంటున్నాడు.

రెప్ప వేయకుండా వాల్టర్ గది నలుమూలలా చూస్తున్నాడు. సంభాషణ ఆరంభించటానికి కొంచెం కష్టపడుతున్న ట్లనిపిసుంది.

ఆకస్మికంగా అతడు కిటీని పరికించిచూశాడు. ఇన్ని రోజులకు మరల అతడు కిటీ నీవిధంగా చూశాడు. తలవని తలంపుగా అత డీనాడు చూడటంతో కిటకీ భయంకలిగింది, ఆమె బొబ్బరించాలనుకుంటుంది.

“నీవు మీ-తాన్-ఫూను గురించి విన్నావా? ప్రస్తుతం పేపర్లలో దానినిగురించి చాలా వ్రాస్తున్నారు” అన్నాడు వాల్టర్.

కిటీ విస్మయంగా వాల్టర్ వంక చూసింది, ఆమెగాబరా పడుతుంది. “అదే ఆప్రదేశమేగా? ప్రస్తుతం అక్కడ కలరా వ్యాపించి వుంది. గతరాత్రే దానినిగురించి మిష్టర్ ఆరబ్ నాంట్ వివరంగా చెప్పాడు” అంది.

“అక్కడ మహామారి వ్యాపించింది. గత చాలాసంవత్సరాలుగా అక్కడి ప్రజలు ఇటువంటి జబ్బును చూసివుండరని నా ఉద్దేశ్యం. అక్కడ ఒక మిషనరీ డాక్టరు పనిచేస్తూ ఉండేవాడు. కొద్దిరోజులక్రితమే అతడు చనిపోయాడు. ఫ్రెంచి కాన్వెంటీవారు, కస్టమ్సు అధికారులు మొదలైనవారు ఉండిపోయారు; మిగిలినవాళ్ళు వెళ్ళిపోయారు.”

వాల్టరింకా కిటీని చూస్తూనేవున్నాడు. కిటీ అతడి

ముఖంమీదినుంచి తన చూపుల్ని మరల్చుకోలేకపోయింది. ఆమె అతడి ముఖభావాలను చదవాలని యత్నిస్తుంది, కాని ఆమె ఆపని చేయలేకపోయింది. ఆమె చూడగలుగుతున్నది వాల్టర్ ముఖంమాత్రమే. రెప్పవేయకుండా ఎలాచూస్తున్నా ......?... రెప్ప వేయలేదు.

ఫ్రెంచి సన్యాసినులు చేయగలిగినంతవరకు చేస్తున్నారు పాపం. వారు తమ అనాథశరణాలయాన్ని హాస్పటలుగా మార్చుకున్నారు, అయినా అక్కడి ప్రజలు పురుగుల వలె చనిపోతున్నారు. అక్కడకువెళ్ళి పనిచేయటానికి నేను నా పేరిచ్చాను."

"నీవా?" కిటీ చాలాబిగ్గరగా నేలంది. ఒకవేళవాల్టర్ వెళ్ళిపోతే తాను ప్రశాంతంగా, స్వేచ్ఛగా జీవితం గడుపుకోగలనని మొదట ఆమె భావించింది. ఏబాధాలేకుండా తాను చార్లీని కలుసుకోగలుగుతుంది... కాని తన అభిప్రాయానికి తనకే దెబ్బతగిలినట్లుంది. ఆమె వెలవెల బోయింది. వాల్టర్ అదేపనిగా చూస్తూవుండటంతో కిటీకి బాధకలిగింది.

"అది అవసరమా?" అని ఆమె మధ్యలో అడిగింది.

"అక్కడ విదేశీ డాక్టర్లెవరూ లేరు"

"నీవు డాక్టరువు కాదుగా నీవేమో జీవ-శాస్త్రివి"

"ఏం, నేను ఎం. డి. ని దీనిలో పనిచేయకముందు నేను హాస్పటల్లో చాలావరకు పనిచేసేవున్నాను. పైగా జీవశాస్త్ర ప్రవీణుడను. ఇది మరీమంచిది. నాకు పనిచేయడానికి మంచి అవకాశంకూడా వుంటుంది."

వాల్టర్ సహజంగా, చురుకుగా మాట్లాడుతున్నాడు. కిటీ వాల్టర్ వైపు చూచినప్పుడు అతని కన్నుల్లో దరహాసం స్పష్టంగా కన్పిస్తుంది. ఆమె కేమీ బోధపడలేదు.

"కాని అక్కడ అపాయమెంతుంది?"

"కావల్సినంత."

అతడు మందహాసం చేశాడు. ఆతడి అభిప్రాయాన్ని బట్టి వెళ్ళటానికే నిర్ణయించుకున్నట్లుంది. కిటీ తలను అరచేతిపై మోపుకుంది. ఆత్మహత్యా! అక్కడకు వెళ్ళటం ఆత్మహత్య కాకపోతే మరేమిటి? భయంకరం!!

వాల్టర్ ఇవన్నీ చేస్తాడని కిటీ ఎన్నడూ అనుకోలేదు. లేదు, తానతనిని అక్కడకు వెళ్ళనివ్వదు. అది నిర్దయే అవుతుంది. ఒక వేళ తాను వాల్టర్‌ను ప్రేమించలేక పోయిందంటే అందులో తన దోషమేముంది? వాల్టరు కిటీ కోసం తనను హత్య చేసుకోటానికి కిటీ ఎంత మాత్రం సమ్మతించదు. కన్నీరు ముంచు కొచ్చింది.

"ఎందుకు. నీవేడుస్తున్నావ్?" ఆతడి కంఠధ్వని చాలా నీరసంగా వుంది.

"నీవు వెళ్ళటం అవసరమేమీ కాదుగా?"

"లేదు, నేను స్వయంగా సంతోషంతో వెళ్ళుతున్నాను"

"వాల్టర్! వెళ్ళవద్దు. నీకేమైనా జరిగితే ఏమవుతుంది? ఆలోచించు ప్రాణంపోతే అప్పుడు?"

వాల్టర్ ముఖభావంలో ఏమీ మార్పు కలుగ లేదు. అతడు కొద్దిగా చిరునవ్వు నవ్వాడు. అతడు జవాబు చెప్ప లేదు.

"ఆ ప్రదేశం ఎక్కడ?" కొంచెం ఆగి కిటీ అడిగింది.

"మీ-తాన్-ఫూ? పడమటి నదీతీరాన వుంది. మనం నది వరకు వెళ్ళాలి. అక్కడనుంచి కుర్చీలమీద వెళ్ళాల్సుం టుంది.

"ఈ మన మంటే ఎవరు?"

"నీవు, నేను."

కిటీ వాల్టర్‌ను చూసింది. ఒక వేళ తాను తప్పుగా విన్నానేమో అనుకుంది. మందహాసంతో ఇప్పుడు వాల్టర్ పెదవులు విప్పారాయి. ఆతడి నల్లని నేత్రాలు కిటీపై నిలి చాయి.

"నన్నుకూడా వెంట తీసుకు వెళ్తావా?

"నా దృష్టిలో నీ కలాగే కావాలి"

కిటీ ఉక్కిరిబిక్కిరై పోయింది. కంపించింది.

"కాని అది స్త్రీలు వుండదగిన ప్రదేశం కాదు. మిష నరీ తన భార్యను ఎప్పుడో అక్కడనుంచి పంపేశాడు. ఎమ్. పి. సి. వాళ్ళుకూడా భార్యా బిడ్డల్ని అక్కడినుంచి పంపే శారు. ఆమె ఇక్కడే వుంది. నేను ఒక విందులో ఆమెను కలుసుకున్నాను. అక్కడ కలరా వ్యాపించటం వల్లనే తా నిక్కడకు వచ్చానని ఆమె చెప్పినట్లు నాకు గుర్తుంది."

"అక్కడ అయిదుగురు ఫ్రెంచి సన్యాసినులు వున్నారుగా!"

కిటీ కళావిహీనమై పోయింది.

"నేను నీ వుద్దేశ్యాన్ని తెలుసుకోలేక పోయాను. అక్కడకు వెళ్ళటం పిచ్చితనంకాక మరేమవుతుంది." ముట్టుకుంటే ముడుచుకుపోయే మొక్కలాంటిదాన్ని నేను. నేనీ హాంకాంగ్ వేడి వాతావరణంనుంచి మరెక్కడికైనా వెళ్ళాలని డాక్టర్ హెవర్డ్ సలహా యిచ్చాడు. నేనక్కడి వేడిని ఎలా సహించగలుగుతాను—పైగా కలరా! నా ప్రాణాలు పైనే ఎగిరి పోతాయి. ఇది తెలిసివుండి నూతిలో పడటమే అవుతుంది. నేను వెళ్ళాలనే ప్రశ్నే లేదు. నేను చచ్చే పోతాను."

వాల్టర్ జవాబుచెప్పలేదు. కిటీ నిస్సహాయంగా అతడి వంక చూస్తుంది. వాల్టర్ముఖంలోని శ్యామవర్ణమిప్పుడింకా అధికమైంది, అతనిని చూచి కిటీ భయపడింది. అతడికళ్ళు తనను ద్వేషంగా చూస్తున్నట్లు గమనించింది...... నేను చని పోవాలనే అతడు కోరుతున్నాడా?

"ఇవన్నీ శుష్కదండగ విషయాలు. ఒకవేళ నీవక్కడకు వెళ్ళాలని ఆలోచించుకుంటే నీయిష్టంవచ్చినట్లు చేసుకో కాని నేను వెళ్ళను. జబ్బంటేనే నాకు ద్వేషం. కలరావంటి మహామారి పైగా. నేనేమీ వీరవనితనని చెప్పుకోవటంలేదు, ఇంకా స్పష్టంగా చెప్పాలంటే నాకు చావాలనీలేదు. జపాను వెళ్ళేంతవరకూ నే నిక్కడే వుంటాను."

"నేనంత భయంకరప్రదేశానికి వెళ్తున్నానుగదా, నీవు నన్ను ఒంటరిగా వెళ్ళనివ్వవని నే నాలోచించాను."

ఇప్పుడిక వాల్టర్ స్పష్టంగా కిటీని పరిహాసిస్తున్నాడు. ఆమె చిక్కులో పడిపోయింది. వాల్టరు చెప్పేది సత్యమా లేక తనను భయపెట్టే ప్రయత్నంమాత్రమేనా అనేది ఆమెకు అర్థమేకావటంలేదు.

"నాకేమీ పనిలేనిచోట, పైగా నేనేమీ చేయలేని చోటుకు వెళ్ళనంతమాత్రాన ఎవరైనా నిందిస్తారంటే నాకేమీ బోధపడటంలేదు."

"నీవు చాలాపని చేయగలుగుతావు. నీవు నాకుఆనందం కలిగించగలుగుతావు, నా సుఖశాంతుల్ని గురించి శ్రద్ధ తీసుకోగలుగుతావు."

కిటీ మరీ వివర్ణం చెందింది.

"నీమాటలు నాకర్థంకావు"

"కనీస జ్ఞానమున్న మనిషెవరైనా నా మాటల్ని అర్థంచేసుకోగలుగుతాడనే నా అభిప్రాయం"

"వాల్టర్! నేనురాను. నన్నడగడం నీనిర్దాక్షిణ్యమే"

"అయితే నేనూవెళ్ళను. వెంటనే విజ్ఞప్తి పంపిస్తాను."

# 23

కిటీ స్తభించిపోయింది. ఆమె వాల్టరువైపే చూస్తుంది. వాల్టరు చెప్పిందంతా తలవనితలంపుగా జరిగిందే. అన్నీవిని కూడా కిటీ ఏమీ అర్థం చేసుకోలేకపోయింది.

"ఇంతకూ నీ అభిప్రాయం ఏమిటి?" అంది ఆమె. కిటీకి తన కంఠస్వరమే తప్పుగా తోచింది. ఆమె వాల్టరుముఖంలోకి చూసింది. వాల్టరువిన్నాడు. అతడిముఖం తిన్నగా నిశ్చలంగా వుంది; ఆమెయందు క్రోధ ద్వేష భావం వుంది.

"నేనున్నదానికంటే ఇంకెక్కువ మూర్ఖురాలని నీవనుకుంటున్నట్లుంది"

కిటీ ఏమీ చెప్పలేకపోయింది. ఈపరిస్థితిలో కోపంగా ఉంటే పనిజరుగుతుందో మౌనం వహిస్తేనో తెలుసుకోలేక పోతుంది. వాల్టరు ఆమె మనోభావాల్ని చదువుతున్నట్లున్నాడు.

"నేనంతా నిరూపించగలను"

కిటీ ఏడ్చింది. హృదయంలో బాధ, కన్నీటిరూపంతో ప్రవహించసాగింది. ఆమె కళ్ళు తుడుచుకోలేదు. ఏడ్వడం వలన ఆమెకు తనను తాను నిగ్రహించుకొనుటకు ఆధారం లభించినట్లయింది. ఆమెమనస్సు ఖాళీగావుంది — శూన్యంగా ఉంది. వాల్టరుకు వీటితో ఏమీ సంబంధంలేనట్లుంది. ఆతడి మౌనం కిటీకి భయకారణమౌతుంది. ఆకస్మికంగా వాల్టరు వ్యగ్రుడైయ్యాడు.

"నీవు ఏడ్చిమొత్తుకోవటంవలన వచ్చేది పోయేదేమీ లేదు."

వాల్టరుయొక్క నిస్సారము, సాధువైన కంఠస్వరం చూసి కిటీ ఉత్సాహం పెరిగింది.

"నాకేమీ లెఖ్ఖలేదు. నేను నీకు విడాకులిచ్చేస్తాను. నీవు పురుషుడవు, నీకేమీ కష్టంవుండదు."

"కాని నీమూలకంగా నన్ను నేనెందుకు కష్టాలకు బలి చేసుకోవాలో చెప్పగలవా?"

"నీకు సుఖాలు-కష్టాలు అనే సమస్యే లేదు—కాని, మానవునిగా వ్యవహరించమని చెప్తే అనుచితం కాదను కుంటాను."

"నాకు నీ సుఖాన్ని గురించి చాలా శ్రద్ధవుంది."

కిటీ కన్నీరు తుడుచుకుంది.

"ఇంతకూ నీవు కోరేదేమిటి?"

"చార్లీ ప్రతివాదైన పరిస్థితుల్లోనే నిన్ను వివాహ మాడగలుగుతాడు. కాని విషయమెంత హేయమైనదంటే శ్రీమతి చార్లీని ఎంతో వత్తిడిచేస్తేనేగాని చార్లీకి విడాకులివ్వ డం జరుగుతుంది."

"నీవేవో అర్థంలేనివి మాట్లాడుతున్నావు" అంది కిటీ రోషంగా.

"మూర్ఖురాలా!"

వాల్టరు కంఠంలో ద్వేషముంది. కిటీకి క్రోధం కల్గింది. క్రోధానికి కారణంకూడావుంది. వాల్టరు ఇంత స్పష్టంగా మా ట్లాడేవాడని ఇంతకుముందెన్నడూ తలచలేదు. వాల్టరు నేటి వరకు కిటీతో ఎల్లప్పుడు మాధుర్యమైన కంఠంతో సంభాషించే వాడు. తన సుఖాలముందు తలవగ్గేవాడిగానే కిటీ వాల్టరును భావించుకుంది.

"నీవు నిజం తెలుసుకోదలిస్తే విను. చార్లీ నన్నేతు

ణంలోనైనా వివాహమాడతాడు. డొరొథి, ఆయన భార్య కావాలనుకున్నప్పుడు విడాకులిస్తుంది...... మేమిద్దరమూ స్వతంత్రులమవగానే వివాహం చేసుకుంటాం.”

“చార్లీ ఎప్పుడైనా నీతో ఇటువంటిదేదైనా చెప్పాడా లేక నీవు పగటి కలలు గంటున్నావా?”

ఆతడి పద్ధతిలో పరిహాసం స్పష్టంగా కన్పిస్తుంది. కిటీ కొంచెం గాబరాపడింది. చార్లీ వివాహవిషయంలో కిటీతో ఏమీ చెప్పలేదు.

“చార్లీ అనేక పర్యాయాలు చెప్పాడు.”

“నీవు చెప్పేది శుద్ధ అబద్ధం.”

“అతడు నన్ను హృదయపూర్వకంగా ప్రేమిస్తున్నాడు. నేనుకూడా అతనిని ప్రేమిస్తున్నాను; ఆవిషయం నీకుకూడా తెలిసింది. ఇందులో నేనేమీ దాచటం లేదు. ఎందుకు దాయాలి? మా యిద్దరికి ప్రేమ కలిగి సంవత్సరం గడిచి పోయింది. నేను గర్విస్తున్నాను. అతడు ప్రపంచములో అన్నిటికంటే మిన్నగా నన్ను ప్రేమిస్తున్నాడు. నీవుకూడా తెలుసుకోవటం మంచిదే అయింది. చాటు మాటుగా కలుసు కోవటమంటే మేమూ విసిగి పోయాం. నేను నిన్ను వివాహ మాడటం చాలా తప్పే చేశాను. నేను అజ్ఞానురాలిని, నేను చేసుకోవలసింది కాదు. నేను నిన్నెన్నడూ ఏ మాత్రం లక్ష్య పెట్టలేదు. మనిద్దరిలో మచ్చుకుకూడా సామ్యం కుదరలేదు. నాకు నచ్చిన వ్యక్తులు, నీకు నచ్చరు, నీకు నచ్చిన వస్తువు లంటే నాకు ద్వేషం. ఈ రోజంతా పరిష్కారమవడంకూడా మంచే జరిగింది.”

వాల్టర్ ఏ భావమూ, చలనమూ లేకుండా కిటీవంక చూస్తున్నాడు. కిటీ మాటలన్నీ అతడు విన్నాడు — కాని అందుకతడేమీ చలించలేదు.

" నేను నిన్నెందుకు వివాహమాడానో తెలుసా?" ఎందుకంటే నీవు నీ చెల్లెలి పెండ్లికంటే ముందు వివాహం చేసుకోదలచావు." నిజమే. ఈ వాస్తవంకూడా వాల్టరు దృష్టిలో పడింది అనుకుంది కిటీ. క్రోధము, ద్వేషంలోకూడా ఆమె పెదవులపై రసహీన దరహాసం పరుగెత్తింది.

"నిన్ను గురించి నేను చాలా ఘన విషయాలేమీ ఆలోచించ లేదు. నేను కలలుగనలేదు. నీవు మూర్ఖురాలవు, నిరుద్యోగినివి, చెడిపోయిన బాలికవనుకున్నాను. అయినా నేను నిన్ను ప్రేమించాను. నీ అలవాట్లు, పనులు అన్నీ హీన మైనవని నేనెరుగుదును, కాని నేను నిన్ను ప్రేమించాను. నీవు గొప్పదానివి కాదనికూడా తెలిసి నిన్ను ప్రేమించాను. నీవు ప్రేమించిన దానినే నేనూ ప్రేమించాల్సి వచ్చిందని ఆలో చించుకుంటే నాకే నవ్వొస్తుంది. నేను మూర్ఖుణ్ణి, అసభ్యుణ్ణి కాదని నీకు చెప్పాలనుకునే వాడిని అపకీర్తిని తెచ్చుకోవటం నాకిష్టం లేదు."

"నాకు తెలుసు, జ్ఞానమంటే నీకు ద్వేషం — అయినా పనులన్నీ నీవు కోరినట్లే చేశాను. ఇతర పురుషుల్ని తెలివి తక్కువవాళ్ళనుకున్నట్లే నన్నుకూడా అనుకోవాలనే నేను నిన్ను పూర్తిగా ఆలోచించుకోనిచ్చాను. నీ సౌఖ్యంకోసమే నీవు నన్ను వివాహమాడావనేదికూడా నాకు తెలుసు. వాట న్నిటినీ మరపించుకుని నిన్ను ప్రేమించాను. నీవు నా ప్రేమకు

ప్రతిఫలం ఇవ్వటంలేదని కూడా గమనించాను. అదే మరితరులైతే ఎంతైనా జరిగేది. కాని నేనలాంటిదేమీ చేయలేదు. నా ప్రేమకు ప్రతిఫలాన్నసలు నీనుంచి నేనేనాడూ కోరనే లేదు. అయినా ఎందుకు ప్రతిఫలం ఇస్తావా అనేదికూడానేను గమనించలేదు. ప్రేమకు అర్హుడుగా నన్ను నేనెన్నడూ భావించుకోలేదు. నేను నిన్ను ప్రేమిస్తున్నాను, నాకదేచాలు, ఎప్పుడైనా పొరపాటుగా నీ కన్నులలో నాయందు స్నేహభావం కన్పిస్తే నేను సంతోషంపట్టలేక పొంగిపోయేవాడిని. నేనెన్నడూ నా ప్రేమను నీకు భారంగావుండేట్లు చేయలేదు. ఎప్పుడైనా నీలో అసంతృప్తి కలిగితే నేను వెంటనే గ్రహించుకునేవాడిని. చాలామంది భర్తలు తమ హక్కు-అధికారంగా ఎంచేదానిని నేను ఉపకారమాత్రంగా భావించాను.''

కిటీ ఇంతవరకూ ఎప్పుడూ తననుగురించి తీయగా సుఖస్తుతితో కూడిన పొగడ్తలనే వింటూవుండేది. నేడు మొదటిసారిగా ఇదంతా విని ఆమెభయం తీవ్రమైన క్రోధంగా మారింది. ఆమె గొంతు తడియారిపోయింది. రక్తం గడ్డకట్టుకుపోయింది. స్త్రీ దర్పానికి దెబ్బకగిలినప్పుడు ఆమె బెబ్బులికంటే భయంకరంగా, క్రూరంగా తయారవుతుంది. దవడలు అదరాయి, కళ్ళనుంచి నిప్పులు కురవసాగాయి కాఠిన్యంగూడు కట్టుకుంది _ కాని ఆమె తన క్రోధాన్ని నిగ్రహించుకుంది.

''ఒకవేళ ఎవరైనాపురుషుడు ఏ స్త్రీనైనా సంతృప్తిపరచలేకపోయాడంటే ఆ దోషం పురుషునిదే; స్త్రీదికాదు''

''పూర్తిగా''

వాల్టర్ అన్న ఈ మాట కిటీ క్రోధాన్ని మరింతరెచ్చ గొట్టింది. కాని శాంతంగావుండే దీనికి ప్రతీకారం చేయాలను కుంది.

"నేను పెద్దగా చదువుకున్న దానినీకాదు, చెప్పుకోదగి నంత నేర్పరినీగాదు. నే నొక సాధారణ స్త్రీని. నేను పెరిగి పెద్దదాన్నయిన సమాజంలో ఆదరించబడే విషయాలేనాకూ మక్కువగావుంటాయి. నాకు సినిమాలు, టెన్నిస్, థియేట ర్లంటే యిష్టం, ఇవి వచ్చిన పురుషులే నాకు నచ్చుతారు. నీ ఇష్టాలను చూసి నిజంచెప్పాలంటే నేను లోలోపల కుమిలి పోయేదానిని. అవి నా కెన్నడూ నచ్చలేదు."

"నాకు తెలుసు"

"నీవు కోరినవిధంగా నేను తయారుకాజాలనందుకు నాకు విచారంగావుంది. నీవు నన్నెప్పుడూఆనందపరచలేక పోయావు, నీయందు నాలో ద్వేషమేవుండేది. కాని అందుకు నాదోషమేమీ లేదు."

"అని నేనటంకూడా లేదు."

క్రోధంతో వాల్టర్ పెడబొబ్బలుపెట్టి హంగామాచేస్తే కిటీ సమస్య తేలిపోతుంది. కాలిన ఇనుము, కాలిన ఇనుముకే లొంగుతుంది. వాల్టర్లోని ఆత్మనిగ్రహం చాలా విలక్షణ మైనది. మరెన్నడూ లేనంతగా ఆసమయంలో కిటీ హృదయం వాల్టర్యందు ద్వేషంతో నిండిపోయింది.

"నీవు మనిషివే, అదేనాకు సందేహం. నీవు తలుపులు బద్దలుకొట్టి లోని కెందుకురాలేదు? నేను చాగ్లీ లోనవున్నా

మని నీకు తెలుసు. నీవతన్ని కొట్టవచ్చు. కాని నీవు భయ పడి వుంటావు?"

ఈ మాటతో కిటీ ముఖంలో కొంచెం ఎర్రదనం కన్పించింది. కొంచెం సిగ్గుపడింది. వాల్టరులో ఏమీ చలనం లేదు. నీరసంగావున్న ఆతడి కన్నుల్లో కాఠిన్యాన్ని చూసింది. క్షణిక దరహాస ఛాయ ఆతడి పెదవులపై యాడి మాయమైంది.

"కావచ్చు, అదీ అయివుండవచ్చు. ఆ విధంగా నేను బాగా దెబ్బలాడ గలను."

"కిటీకి జవాబు తట్టలేదు, వాల్టర్ కన్నులు కిటీపై కేంద్రీ కృతమై వున్నాయి.

"నీవు నన్ను విడాకులెందుకు ఇవ్వనివ్వవు."

వాల్టర్ ఆమెనుంచి చూపు మళ్ళించాడు. సరిగ్గా తన కుర్చీలో కూర్చుని అతడు సిగరెట్టు వెలిగించాడు. ఏమీ మాట్లాడకుండానే సిగరెట్ ఆసాంతం కాల్చేశాడు, ఒకసారి గట్టిగా పీల్చి సిగరెట్ పారేస్తూ కొంచెం మందహాసంచేశాడు అతడు మరొకసారి కిటీవైపు చూశాడు.

"శ్రీమతి చార్లీ తన భర్తకు విడాకులిస్తానని నాకు వాగ్దానంచేస్తేగాని, విడాకుల అనంతరం ఒక వారానికి నిన్ను వివాహమాడతానని చార్లీ నాకు వ్రాసియిస్తేగాని నా కేటు వంటి అభ్యంతరం వుండదు."

ఆమాట చెప్పబడిన పద్ధతి కిటీకి బాధ కల్గించింది, కాని ఆమెలోని స్వాభిమానం ఈ షరతును అంగీకరించడానికి సుముఖం చేసింది.

"ఈ విధంగా నీవు గొప్ప ఉపకారం చేస్తావు."

వాల్టర్ ఆకస్మికంగా బిగ్గరగా నవ్వేశాడు. కిటీకి ఆగ్రహం కల్గింది

"నీవెందుకూ నవ్వుతావ్? ఇందులో నవ్వాల్సిన విషయమేముంది?"

"ఓహో క్షమించు, నాపరిహాసంకూడా విచిత్రమైనదే." భీతిజెందిన కిటీ వాల్టరును చూస్తూవుంది. కఠినంగా నిందించాలనుకుంది, కాని ఆమెకు ఏమీ కన్పించలేదు. వాల్టర్ గడియారంవంక చూసుకున్నాడు.

"నీవు చార్లీని కలుసుకోవాలనుకుంటే కాస్త కుదుటబడు. ఒకవేళ నావెంట మీ-తాన్-ఫూ రాదలిస్తే మనం ఎల్లుండి వెళ్ళుదాం."

"అయితే నే నీరోజే చార్లీని కలుసుకోనా?"

"సామెత వుందిగా - రేపటిపని ఈరోజేచెయ్యి, ఈ రోజుపని ఇప్పుడేచెయ్యి."

కిటీ హృదయస్పందనం హెచ్చింది. ఆమెవ్యాకులంగా లేదు. కాని అదేమిటోగాని హృదయస్పందన హెచ్చింది. కొంచెం అవకాశం కావాలనుకుంది. ఆమె చార్లీని ఒప్పించాలి, ఆమెకు చార్లీయందు సంపూర్ణవిశ్వాసముంది. చార్లీ ఈ ప్రసక్తిని హృదయపూర్వకంగా అంగీకరించదనుకోవటం కూడా పాపమేనని కిటీ ఆలోచించుకుంది. ఆమె చాలా గంభీరంగా వాల్టరుతో అంది "ప్రేమని దేనినంటారో నీ కేమి

తెలుసు? మే మిరువురము ఒకరినొకరెంతగా ప్రేమించుకుం టున్నామో నీ వేమెరుగుదువు? మా ప్రేమలో ఏ బాధా కలుగనేరదు.''

వాల్టర్ కిటీ చెప్పిందాన్ని సమర్థించినట్లూరకున్నాడు. ఒక మాటా మాట్లాడలేదు. కిటీ వెళ్ళేప్పుడు అతడికళ్ళు కిటీని వెన్నంటే వున్నాయి.

# 24

''అత్యవసరమైన పనినిగురించి నిన్ను కలుసుకోవాలి'' అని ఒక చీటీ వ్రాసి కిటీ చార్లీ ఆఫీసుకు పంపింది. ఒకచైనా కుర్రవాడు కొంచెం ఆగవలసిందిగా కోరాడు; తరువాతవచ్చి మిష్టర్ టవున్సెండ్ అయిదు నిముషాల తరువాత కలుసుకో గలరని చెప్పాడు. కిటీ మనస్సు మనస్సులో లేదు. ఆమెచార్లీ గదిలోనికి వెళ్ళినప్పుడు అతడే ముందుకువచ్చి ఆమెను ఆహ్వా నించాడు. చైనాకుర్రవాడు గదినుంచి వెళ్ళిపోగానే వ్యవహార సంబంధం ముగిసింది.

''నీవు ఆఫీసులో కలుసుకోవద్దనే నేనుచెప్పేది, నాకు చాలాపని వుంటుంది. పైగా లోకంతో నవ్వించుకున్నందువల్ల వచ్చేలాభ మేముంటుంది?''

కిటీ మదహాసం చేయాలనుకుంది, కాని ఆమె పెద వులు అంటుకుపోయాయి. ఆమె తన సుందరనయనాలతో చార్లీని వీక్షించుచుండెను.

''అంత అత్యవసరమే కానిచో నేను వచ్చివుండేదానినే కాదు'' చార్లీనవ్వి ఆమెను తనబాహువుల్లోకి తీసుకున్నాడు.

"సరే, వచ్చావుగా, ఇక కూర్చో"

గది పొడవుగా ఇరుకుగావుంది పైకప్పు చాలాఎత్తుగా ఉంది. గోడలపై మట్టితో తయారైన విగ్రహాములవంటి చిత్ర కళ వుంది. గదిలో ఒక డ్రాయిరుంది, చార్లీ కూర్చునేందుకు తిరిగే కుర్చీ ఒకటుంది, ఎదురుగా కలుసుకోడాని కెవరైనా వస్తే కూర్చుంటానికి మరొక కుర్చీవుంది. కిటీ ఆ కుర్చీమీదే కూర్చుంది. చార్లీ కళ్ళజోడు ధరించటం కిటీ అంతకుముందెన్నడూ చూడలేదు, అతడు కళ్ళజోడు ధరిస్తాడనికూడా ఆమెకు తెలియదు. ఆమె అదేపనిగా ఆ కళ్ళజోడువైపే చూస్తూండటం గమనించి చార్లీ కళ్ళజోడు తీసేశాడు.

"నేను వ్రాసుకునేప్పుడు, చదువుకునేప్పుడే దీనిని ఉపయోగిస్తాను, కిటీ అంతలోనే ఏడ్వసాగింది, వెక్కి-వెక్కి ఏడుస్తుంది. ఎందుకో ఆమెకే తెలియదు.

కిటీ మోసంచేయాలనుకోటంలేదు, కాని ఆ ఏడ్పులో చార్లీలో సద్భావాన్ని మేల్కొల్పాలనే భావం తప్పక విహితమై వుంది; చార్లీ కిటీ వంక భ్రమాసుపడి చూస్తూన్నాడు.

కిటీ రుమాలుతో కన్నీటిని తుడుచుకుంది. చార్లీ బెల్ నొక్కాడు. నౌకరుకు ద్వారందగ్గిరకు ఎదురువెళ్ళి "ఎవరైనా అడిగితే నేను బయటకు వెళ్ళానని చెప్పు" అని ఆదేశించాడు.

"చిత్తం అలాగే బాబూ"

నౌకరు తలుపులుమూసి వెళ్ళిపోయాడు. చార్లీ కిటీ దగ్గరకు వచ్చి కూర్చున్నాడు. అతడు కిటీ భుజముపై చేయి వేసి "డియర్, చెప్పు, ఏం జరిగింది? అని అడిగాడు.

"వాల్టర్ విడాకులు కోరుతున్నాడు"అని కిటీ చెప్పింది.

ఈమాట వినగానే తన భుజంపైనవున్న చార్లీ చేయి పట్టుదప్పిపోవడం ఆమె గమనించింది. చార్లీ శరీరం నిక్కున నిలచింది. ఒక క్షణం మౌనం వహించాడు. తరువాత ఆమె వద్దనుండి లేచి వెళ్ళి తన కుర్చీమీద కూర్చున్నాడు.

"నీ అభిప్రాయ మేమిటి? అన్నా డతడు.

అతడి కంఠం తీవ్రంగా వుండటం అతడిముఖం జీవురించడమామె గమనించింది.

"నేను వాల్టరుతో మాట్లాడాను. నేను తిన్నగా ఇంటినుంచే వస్తున్నాను. అతడివద్ద నిదర్శనాలన్నీ వున్నాయి."

"కాని నీవు అంగీకరించలేదుగదా?"

కిటీ హృదయం క్రుంగిపోసాగింది. 'లేదు' అంది.

"నిజం చెప్తున్నావుగదూ?" అని తీక్షణంగా చూస్తూ అతడడిగాడు.

"నిజమే చెప్తున్నాను"అని ఆమె మరలఅబద్ధమాడింది.

చార్లీ తన కుర్చీలోని దిండుకు ఆనుకుపోయాడు. ఎదురుగా గోడపై చైనా దేశపటంవుంది. అతడిదృష్టి దానిపై నిలిచింది. కిటీ మనస్సును లగ్నంచేసి అతడివైపే పరీక్షగా చూస్తుంది. విషయాన్నివిని చార్లీలో వ్యక్తమైన భావానికి కిటీ హృదయం బాధపడింది. ఈవార్తవిని చార్లీ తనను గట్టిగా కౌగిలిలో బిగించి మంచిపనే జరిగింది. ఇక తా మిద్దరూ ఒక్కచోట వుండవచ్చునని అంటాడని భావించుకుంది. కాని పురుషు

డెంత నిలుకడలేని వాడు? తిరిగి ఆమె ఏడ్వసాగింది, ఇప్పు డతని సానుభూతిని పొందాలనికాదు, ఇక యిప్పుడు ఏడ్వడం మినహా మరేమీ మార్గంలేక నే ఏడ్చింది.

"మన మిప్పుడు చాలా ఇరకాటంలో పడ్డాం. మనస్సు పాడు చేసుకున్నందువలన లాభమేమీ లేదు. ఏడ్వడం వలన ఏమొస్తుంది?"

చార్లీ కంఠంలోని విసుగును కిటీ స్పష్టంగా గ్రహిం చింది. ఆమె తన కన్నీటిని తుడుచుకుంది.

"ఇందులో నా తప్పేముంది? నేనేం చేస్తాను?" అంది.

"అవును, రైటే. మన అదృష్టమే చెడ్డది. నీ దెంతో నాదీ అంతే అపరాధము. ఇక ముందెలాగనే మనం చూడాలి. నీకు విడాకులు అవసరం లేదనే నా అభిప్రాయం."

కిటీకి శ్వాస ఆగిపోయింది. ఆమె చార్లీ హృదయం నివసించాలనుకుంది. చార్లీకి తన విషయ మణుమాత్రంకూడా పట్టలేదనేది ఆమె స్పష్టంగా చూసింది.

"అతడు నిదర్శనా లెక్కడ ప్రోగుచేశాడా అనేదే నా కాశ్చర్యం కల్గిస్తుంది. మనిద్దరం ఒక గదిలో వున్నామని నిరూపించగలడని నేననుకోవటం లేదు. మనం మన పనులన్నీ చాలా జాగ్రత్తగా నెరవేర్చుకుంటున్నాం—క్యూరీ షాపులోని ఆ ముసలవాడేమీ మోసగించి వుండడు గదా?........."
అన్నాడు చార్లీ.

"ఆరోపించటం తేలికే, కాని దానిని నిజమని రుజూ పర్చడం చాలా అపాయకరమైన పని. మనం ప్రతి విషయాన్ని

అబద్ధమనేస్తాం. ఒకవేళ వాల్టరు బెదిరిస్తే ఏంచేస్తాడో చూద్దాం, మనమూ తగినట్లేచేద్దాం.'' అన్నాడు చార్లీ.

చార్లీ, నేను కోర్టుకు వెళ్ళలేను.''

''ఏం ఎందుకని? నీవు వెళ్ళాల్సే వుంటుంది. నిజం చెప్పాలంటే నాకు అల్లరంటే ఇష్టంలేదు, కాని మరి గత్యంతరం లేదు.''

''కాని, మనమెందుకు బయటబడ గూడదు?''

''భలే! ఏమి ప్రశ్న వేశావ్. ఏవొక్కదాని వేగాదు ఈ చిక్కులో చిక్కుకుంది, నేనుకూడా లాగబడ్డాను. కాని నీవేమీ భయపడకు. నీభద్రను నేను హెచ్చరిస్తాను. అయినా అంతా శాంతంగా చక్కబడాలనే నేనుకోరేది.''

అతడి మనస్సులో ఏదోమార్గం కనిపెట్టినట్లు కన్పించింది; అద్భుతమైన అతడిదరహాసం తిరిగి ప్రత్యక్షమైంది. ఒక క్షణంక్రితం ఆతడి కంఠంలో వున్న కాఠిన్యంపోయి, తిరిగి మాధుర్యంవచ్చింది.

''నీవు చాలా గాబరాపడ్డావు, తప్పాగదూ''అని చార్లీ చేతులుచాచి కిటీని తనచేతుల్లోకి తీసుకుని, 'ఈపేచీ లేవనే లేచింది, కాని మనం చాలా తేలికగా బయటపడతాం మనం తెలివితప్పి వుండకూడదు. అదే మనం చేయవల్సింది. నేను నిన్ను మోసం చేయను'' అన్నాడు.

''నేను భయపడటంలేదు, నాకేమీ విచారంలేదు, అతడేమైనా చేసుకోనీ''

చార్లీ దరహాసం చేస్తున్నాడు, కాని ఆదరహాసం కృత్రిమమైనది.

"ఒక వేళ అంత మించివస్తే నేను విషయాన్నంతా గవర్నరుకు తెలియజేస్తాను. ఆగ్రహపడతాడు, అయినా మనిషి చాలా సజ్జనుడు, వ్యవహారజ్ఞానం తెలిసినవాడు. ఆయనే అంతా సరిచేస్తాడు. ఒక వేళ అపకీర్తే వస్తే అప్పుడు వాల్టర్ కేమీ ప్రయోజనం కలుగదు."

"అతడేం చేస్తాడు?" కిటీ అడిగింది.

"ఆయన వాల్టర్‌ను వత్తిడిపెడ్తాడు. మామూలుగా చెప్పిన విననిచో ఆఫీసుద్వారా చేయిస్తాడు."

కిటీ త్రుళ్ళిపడింది. అసలు జరిగిన విషయాన్నంతా పూర్తిగా చార్లీకి చెప్పలేకపోయానని ఆలోచించింది. చార్లీ బడబడమాట్లాడటంతో ఆమెకు విసుగుజనించింది. తాను ఆఫీసుకెందుకొచ్చానాయని బాధపడుతూంది. అక్కడి వాతావరణం ఆమెకు భీతికలిగించింది. బయటతాను చార్లీ కౌగిలిలో ఉన్నప్పుడు తన చేతుల్ని ఆతడిమెడచుట్టూ పెనవేసి, ఈ విషయాన్నంతా అక్కడ చెప్పవలసిందని ఆమె ఆలోచించింది.

"నీవు వాల్టరును అర్థం చేసుకోవటంలేదు"అని అంది కిటీ.

"నాకు తెలుసు ప్రతిమనిషికీ తన వ్యక్తిత్వముంటుంది. కిటీ చార్లీని హృదయపూర్వకంగా ప్రేమిస్తుంది, కాని ఆతడి జవాబు లామెకు దుఃఖం కలిగిస్తున్నాయి. చార్లీ వంటిదక్షుడు ఇంత మూర్ఖంగా మాట్లాడుతాడని ఆమె ఆశించిఉండలేదు.

"వాళ్లరెంత క్రోధంగా వున్నాడో నీకు తెలియక పోవచ్చు. నీవతని జేగురించిన ముఖాన్ని, స్ఫులింగములను చూడలేదు"

చార్లీకి వెంటనే జవాబేమీ స్ఫురించలేదు. మంద హాసంచేస్తూ కిటీవంక చూస్తూ ఉండిపోయాడు. అతడాలోచనా నిమగ్నుడై వున్నాడని కిటీ భావిందింది. వాల్టర్ జీవ-శాస్త్రజ్ఞుడు, అయితే ఆతడిపదవి చార్లీకంటే తక్కువైనది. ఆతడెన్నడూ తనకంటే పెద్దఆఫీసర్లకు చిక్కులుకల్పించడు.

"చార్లీ! తనను తానే మోసగించుకున్నందు వలన లాభంలేదు. ఒకవేళ వాల్టర్ ఆలోచిస్తే నీవేకాదు ఎవరూ అతనిని ఆతడిమార్గంనుంచి మరలించలేరు."

చార్లీ ముఖం వాడిపోయింది.

"అతడు నన్ను ప్రతివాదనిచెప్తాడా?"

"అవును, అతడి అభిప్రాయ మదే, అ తరువాత నేనే అతనిని విడాకులకు అంగీకరింపజేశాను."

"అయితే అంత కష్టమైందేమీగాదు," అని చార్లీ ఒక సారి సంతోషంగా గాలిపీల్చుకున్నాడు. "అటువంటప్పుడు నేను తప్పుకోటం చాలా తేలిక. అదేమర్యాదస్తుడు చేస్తాడు."

"కాని వాల్టర్ ఒకషరతుపెట్టాడు."

చార్లీ ప్రశ్నార్థకంగా కిటీ వంకచూశాడు, "నేను శ్రీమంతుణ్ణిగాదు అయినా నా వలన కాదగినంతవరకు ఏ మాత్రం వెనుదీయను."

కిటీ మౌనంగావుంది. చార్లీని గురించి కిటీ ఎన్నడూ ఆలోచించివుండని విధంగా అతడు సంభాషిస్తున్నాడు. ఆ మాటల్ని వినే ఆమె కంఠంమూగవోయినట్లుంది. చార్లీ విశాలవృక్షముపై తన తప్తవదనా న్నానించి ఒక్క-గుక్క-లో విషయమంతా చెప్పేయాలనుకుంటుంది.

"అతను విడాకులివ్వడానికి సిద్ధమే కాని మీ భార్య కూడా మీకు విడాకులిస్తానని అతడికి వాగ్దానం చేయాలట."

"ఇంకా?"

కిటీకి మరేమీ స్ఫురించలేదు— "మరి-మరి చార్లీ అంటే నీవు విడాకులిచ్చుకున్న వారానికి నన్ను వివాహమాడాలి."

# 25

చార్లీ ఒక క్షణం మౌనం వహించాడు. తరువాత కిటీ చేతిని తనచేతిలోకి తీసుకుని, "డార్లింగ్, నేను డొరొథి నీ విషయంలోకి లాగదలచటంలేదు," అన్నాడు.

కిటీ కోలుపడునట్లు చార్లీ వంక చూస్తుంది.

"కాని వేరుగా వుంచేదెలా?"

మనం మనదే ఆలోచించగూడదు, మరికొన్ని ప్రాపంచక విషయాలున్నాయి, అవి కూడా అలోచించాలి. నిన్ను వివాహమాడటం నా అదృష్టంగానే భావిస్తాను. కాని వివాహం జరగడమనేది ఎలా? నేను డొరొథిని బాగా ఎరుగుదును. ఆమె ఏ పరిస్థితిలోనూ నన్ను వదలను."

కిటీ మాట్లాడేశక్తినే కోల్పోయింది. గొంతుతడియారి పోయింది. ఎక్కిళ్ళు రాసాగాయి. చార్లీ కిటీ కుర్చీదగ్గరకు వచ్చి ఆమె నడుం చుట్టూచేయివేశాడు.

"ఇంత ఆందోళన చెందకు' మనస్సు దిట్టపర్చుకో,"

"నీకు నా యందు ప్రేమవుందని నాకు నమ్మకముంటేది......"

"పూర్తిగావుంది! నాకు నీయందు ప్రేమవుంది. అందులో నీవు సందేహించనేగూడదు."

"డొరొథి నీకు విడాకులివ్వకపోతే వాల్టర్ నిన్ను ముద్దాయిగా చేస్తాడు."

ఏమి జవాబుచెప్పాలో చార్లీకి తోచలేదు. అతడి గొంతు ఎండిపోయింది.

"అలాగైతే నా భవిష్యత్తంతా నాశనమైపోతుంది. దానివలన నీకే ప్రయోజనం వుండదు. వ్యవహారమంత ముదిరితే డొరొథికి విషయమంతా స్పష్టంగా చెప్పేస్తాను. ఆమె నన్ను తప్పక క్షమిస్తుంది. ఆమెకు విషయమంతా తెలిస్తే వాల్టర్ దగ్గరకు వెళ్లి ఏమీచేయవద్దని అతన్ని ఒప్పిస్తుంది."

"అంటే దినికర్థం నీ వామెను విడాకు లివ్వగోరటం లేదనేగా?"

"నేను నా పిల్లలయందుకూడా శ్రద్ధచూపవలసిన అవసరం వుందిగదా. మరి డొరొథికి అసంతృప్తి కలిగించాలని కూడా నాకులేదు. మాఇద్దరి జీవితం సుఖంగానేవుంది. ఆమె ఆదర్శభార్యగా వుండివుందని నీకేతెలుసు."

"ఆమెను నేనేమీ పట్టించుకోనని మరి నీవు నాతో ఎందుకు చెప్పావ్?"

"అది నేనెప్పుడూ చెప్పలేదు. నేనామెను ప్రేమించటం లేదని చెప్పాను. మేము సంవత్సరంలో బహుశా రెండు మూడు పర్యాయాలే కలిసి నిద్రిస్తూవుంటాం. కాని ఆ స్త్రీ వీటన్నిటికీ పడిచావదు. మా యిద్దరిలో చాలా అన్యోన్యత వుంటూవచ్చింది. ఆమెను మినహా నేను మరెవ్వరి మీదా నమ్మకమేవుంచను. నిజం చెప్పాలంటే."

"నీవు నన్ను మొదటే ఒంటరిగా వదలేయాల్సింది," కిటీకి తనపై తనకే ఆశ్చర్యం కల్గింది. అంతక్రోధంలో కూడా ఆమె చాలా శాంతంగా మాట్లాడుతుంది.

"నీవంటి సౌందర్యరూపాన్ని, ఇటువంటి సౌందర్యాని నేనిన్ని సంవత్సరాలుగా చూసివుండలేదు. నేను నీ ప్రేమలో పిచ్చివాడినై పోయాను మరి ఏంచేయమంటావ్ నన్ను?"

"కాని ఇప్పుడేగా నన్ను మోసం చేయనని చెప్పావ్,"

"అయితే నేను నిన్నేంమోసం చేస్తున్నాను? మనం ఈ బాధలో చిక్కుకున్నాం. ఏదోవిధంగా దానినుంచి బయట పడాలి."

"సూటిగావున్న ఆ ఒక్క పద్ధతి ద్వారామాత్రం కాదు."

చార్లీ లేచి తిరిగి తన కుర్చీ దగ్గరకు వచ్చాడు.

"కిటీ! కొంచెం మనస్సుతో ఆలోచించు, చూడు, కొద్ది పరిశుభ్రత అవసరం. నీ అభిప్రాయాలను నొప్పించటం

నా అభిమతంగాదు. నిజం చెప్తున్నాను, నాకు నాభవిష్యత్తు చాలా ప్రియమైనది. నేనిక్కడి గవర్నర్‌ను కాకపోవడానికి ఏమీ కారణంలేదు, వలసరాజ్య గవర్నర్ కావడం ఏ మంత ఘనకార్యం? మనమీ విషయాన్ని పాతిపెట్టనంతకాలం నేను గవర్నర్ కావడం అసంభవమే అవుతుంది. ఒకవేళ ఉద్యోగం వదలవలసి రాకపోయినా, ఉద్యోగానికి ఒక మచ్చమాత్రం ఏర్పడుతుంది. ఉద్యోగం గనుక పోతే నేను ఇక వ్యాపారం చేయాలి, అప్పుడిక నేనిక్కడనుంచి వెళ్ళిపోవల్సివుంటుంది. ప్రతిపరిస్థితిలోనూ నాకు డొరొథి సహకారం అవసరం."

"అయితే అప్పుడు నన్ను తప్ప మరెవర్నీ ప్రేమించటం లేదని చెప్పాల్సిన అవసరంమేముంది?"

"కిటీ డార్లింగ్! మాట్లాడేప్రతిమాటకు శబ్దార్థాన్నే అంటిపెట్టుకువుండకు."

"అయితే నీవు చెప్పిన దానిలో సారమేమీలేదా?"

"ఆ క్షణంలో వుంది."

"వాల్టర్ నాకు విడాకులిస్తే నా పరిస్థితేం గావాలి?"

"కాపాడుకుంటానికి ఉపాయమే లేనప్పుడు ఎలా కాపాడుకో గలగటం? ఒకవేళ ఆవిధంగా జరిగినా దాన్ని చాటించుకోగూడదు. నేడు ప్రజలటువంటి ఉదాత్తులు మరి."

నేడు మొదటిసారిగా కిటీకి తనతల్లి స్ఫురణకొచ్చింది. ఆమె కంపిస్తూ చార్లీ వంక చూసింది. ఆమెఆవేదన బాధలో ఇప్పుడు ద్వేషంకూడా మిళితమైంది.

"నే ననుభవించే దాని ప్రభావమేమీ నీమీద పడదనే నా అభిప్రాయం."

"నిందార్థమైన మాటలతో మనం ఒక నిర్ణయానికి రాలేము" అని చార్లీ జవాబు చెప్పాడు.

నిరాశ చెంది కిటీ బొబ్బరించింది. విలక్షణసంఘటన! ఇంతగా ప్రేమించిన చార్లీ యందామె విరక్తి చెందింది. కిటీ అతడినెలా చూసుకునేదో చార్లీకేమి తెలుసు?

"చార్లీ నేను నిన్నెంతగా ప్రేమిస్తున్నానో నీకు తెలియదు"

"డియర్ కిటీ! నేనూ నిన్ను ప్రేమిస్తున్నాను. కాని మనం నివసించేది ఎడారుల్లోగాదు. మన పరిస్థితుల ననుస రించే నడుచుకోవాలి. నీవుకూడా ఆలోచించు"

"ఎలా ఆలోచించను? నీ ప్రేమే నాకు సర్వస్వంగా ఉండేది. అప్పుడు నా జీవితం నీవే. అదంతా నీకు ఒక కథ లాంటిదానికంటే మరేమీకాదని తెలిసినప్పుడు నాకెంత బాధకలిగింది."

"కథలాంటిదగాదు కిటీ! మరి నా భార్య! ఆమె లేకుండా నేను వుండలేను. ఆమెకు విడాకులివ్వమని, నిన్ను వివాహ మాడి నా భవిష్యత్తు పాడుచేసుకోమని చెప్తున్నావు. అదెంత వరకు సబబు"

కిటీ చార్లీని చూసీచూడనట్లూరుకుంది. ఆమె కేవిూ ఆలోచనే కలగటంలేదు. ఆమె కళ్ళనుంచి నిర్విరామంగా కన్నీరు ప్రవహిస్తుంది.

"ఓరీ నిర్దయుడా! నీవెంత నిర్దయుడవు"

"కిటీ నిన్ను నీవు నిగ్రహించుకో డియర్!"

"నేను నిన్నెంతగా ప్రేమించానో నీకేమి తెలుసు ?" అంది కిటీ — "నీవు లేకుండా నేనుండలేను. నాయందు దయ చూపు చార్లీ!" ఇంకేమీ మాటలు పెగల్లేదు ఏడ్పుమినహా

"చూడు! నేను కష్టపెట్టాలనుకోటం లేదు. ఆ పరమాత్మునికి తెలుసు. నీ భావాలకు నొప్పి గలిగించటం నాకెంతమాత్రం ఇష్టంలేదు. కాని నిజాన్ని చెప్పేయాలిగామరి."

"నా జీవితమంతా నాశనమైపోతుంది. నీవు నన్ను మొదటే ఎందుకు నాదారిన నన్నుండనీయలేదు? నేను నీకేం అపకారం చేశాను?"

"అపరాధమంతా నా నెత్తినరుద్ది నీవు సంతృప్తిపడితే అలాగేకానీ"

క్రోధంతో కిటీ కెంపెక్కుతుంది.

అయితే నేనే వెంటబడ్డాను. నేను నీ సుఖసంతోషాలను దోచుకున్నాను, నిన్ను నావలలో చిక్కించుకునేవరకూ నిద్రపోలేదు."

"అలాగని నేననటంలేదే. కాని నీ ఇష్టంలేకుండాను నేనేమీ చేయలేదుగా."

ఆమాట విని ఎందులోనన్నా పడి చావాల్సిందే. చార్లీమాటకూడా నిజమేనని కిటీకి తెలుసు. చార్లీ గంభీరంగా వున్నా ముఖం విచారంగావుంది. క్షణక్షణము నీరసించిన చూపుల్తో కిటీవంక చూస్తున్నాడు.

"ఆయితే వాల్టర్ నిన్నుమన్నించడా ?" కొంచెం ఆగి

చార్లీ అడిగాడు 'నీవు వెళ్ళి వాల్టర్నే మన్నించమని ఎందు కడగవు; అతడు నిన్నెందుకు క్షమించడు."

"అతనిని నీవర్థం చేసుకోగలిగితే ఎంతబాగుంటుంది"

# 26

కిటీ కన్నీరుతుడుచుకుని తననుతాను నిగ్రహించుకుంది "నీవు మోసం చేశావంటే నేను చచ్చిపోతాను చార్లీ."

విషయమంతా తాను చార్లీ బిగి కౌగిలిలోవుండిచెప్ప గలిగితే ఎంత బాగుంటుంది అనుకుంది కిటీ అప్పుడు చార్లీ నాకష్టాన్నర్థంచేసుకోగలిగేవాడు. అప్పుడు అతడిలోనిన్యాయ దృష్టి, ఉదాత్తము, పౌరుషము అన్నీ నాకుసహాయపడటానికి అతడిని ప్రేరేపించేవి, నేను ఉద్ధరించబడేదానిని.

"వాల్టర్ నన్ను తనవెంట మీ-వాన్-ఫూ తీసుకు వెళ్ళాలనుకుంటున్నాడు."

"అరే! అక్కడా కలరావ్యాపించివుంది. గత యాభై సంవత్సరాలుగా అక్కడ ఇటువంటి మహామారి వ్యాపించ లేదు. అది స్త్రీలుండదగిన చెంతమాత్రం కాదు. నీ వక్కడ కెలా వెళ్ళుతావు?"

"నీవు నన్ను మోసం చేస్తే నాకిక మార్గం మాత్రం ఏముంది?"

"అంటే? నాకర్థంకాలేదు."

"అక్కడ చనిపోయిన మిషనరీ డాక్టరుకు బదులు

వాల్టర్ వెళ్ళుతున్నాడు. అతడునన్నుకూడా వెంటతీసుకు పోవాలనుకుంటున్నాడు.”

“ఎప్పుడు?”

“వెంటనే! వెళ్ళటమే!”

చార్లీ తన కుర్చీని వెనక్కు జరిపాడు. అతడు సిగ్గుపడిన కళ్ళతో కిటీని చూస్తున్నాడు. ఆ సమస్య అతని కర్థంకాలేదు.

“నేను శుద్ధ మూర్ఖుణ్ణైకావచ్చు, కానీ నీమాటల తల తోక ఏమీ బోధపడటంలేదు. అతడు నిన్ను వెంటాతీసుకు వెళ్ళాలనుకుంటున్నాడు, విడాకులూ ఇవ్వాలనుకుంటు న్నాడు.........”

“రెండింటిలో ఒక మార్గాన్నెన్నుకోమని నాకు చెప్పాడు. నేనతని వెంట మీ-తాన్-ఫూ వెళ్ళాలి లేదా అతడి యిష్టంవచ్చినట్లు చేయనీయాలి.”

“ఇప్పుడు తెలిసింది,” చార్లీ కంఠం మారింది. “అది మరీ బాగుంటుంది. నీవేమాలోచిస్తున్నావ్?” అన్నాడు.

“బాగుంటుందా?”

“చూడు, అక్కడకు వెళ్ళడం ఎంతసబబు. నా విష యంలో ఏమీ సబబుకాకపోవచ్చు. అక్కడినుంచి తిరిగి వచ్చి నప్పుడు అతనికి ‘సి. ఎమ్. జి.’ లభిస్తుంది.”

“కాని మరినాస్థితేమిటి చార్లీ?” కిటీ నిస్సహాయంగా బొబ్బరించింది.

“ఈ పరిస్థితుల్లో నిన్ను వెంట తీసుకువెళ్ళదలచిన, నీవు వ్యతిరేకించగూడదు.”

"కాని అక్కడకు వెళ్ళడం మృత్యుదేవత కౌగిలిలోకి వెళ్ళడమే. అకాలమరణం పొందాలి."

"నీవూ హద్దుమీరి సంభాషిస్తున్నావు. వాల్టర్‌కు అంతభయమేవుంటే నిన్ను తీసుకువెళ్ళడు. నీకేమీవుండదు. వున్న అపాయమంతా ఆతడి ప్రాణానికే. నిజానికి ఇటువంటి భయానికి తావేలేదు. కాని కొద్దిజాగ్రత్త వహించాలి. నే నిక్కడే కలరావచ్చినప్పుడు వుండిపోయాను. నలుసంత నష్టం కలుగలేదు. ఉడికీ ఉడకని పదార్థాలు, పచ్చికాయలు, వగైరాలు తినకు, నీరు వేడిచేసిత్రాగు, ఇవన్నీ చేయగలగితే చాలు ఇంకేమీవుండదు," చార్లీకి ఉత్సాహంకలిగింది. ప్రవాహంగా మాట్లాడేస్తున్నాడు. ఆతడిలోని సంతాపచిహ్నాలు ఎగిరిపోయాయి. అతడు దృఢంగా కన్పిస్తున్నాడు. "ఇంతకూ ఉద్యోగం దోమలుగీమల విషయంలో పరిశోధించాలనే అభిరుచిగల మనిషి– అభివృద్ధికి అతడికున్న అవకాశం యిదే."

"కాని నాపరిస్థితేమిటిచార్లీ? నేనేమౌతాను?" ఈ సారి కిటీ కంఠంలో దయాయాచనలేదు.

"ఎవరైనా అర్థంచేసుకోవాలంటే మనంకూడా కొద్దికాలం అలాగే తయారుకావాలి. వాల్టర్‌దృష్టిలో నీవతని బాధకు కారణంగావున్నావు. అతడు నిన్ను సన్మార్గంలో పెట్టాలనుకుంటున్నాడు. అతడు నిన్నువదిలిపెట్టాడంటే నేనెంత మాత్రం నమ్మలేకపోయాను. అతడటువంటి మనిషికాడు. అతడు చాలా ఉదాత్తంగా నీకు మరోమంచి మార్గం చూపాడు. నీవు తిరస్కరించి అతనిని వ్యతిరేకం చేసుకుంటావు. నేను నిన్ను నిందించటంలేదు. నీవు మరో ఆలోచనే

లేకుండా అతడితో వెళ్ళమని మాత్రమే గట్టిగా నేనుచెప్పేది. అందుతోనే అందరికీమేలు కలుగుతుంది.”

“అక్కడ నా ప్రాణాలే పోతాయనేది నీ వెందుకు ఆలోచించవ్? అక్కడ నేను త్వరగా చనిపోవాలనే ఉద్దేశ్యం తోనే అతడు నన్నక్కడకు తీసుకువెళ్ళుతున్నాడనేది నీ వెందుకు అర్ధంచేసుకోవు. నీకు నామాటలెందుకర్ధమవుతాయి?” కిటీ లోపలబయట కూడా ఏదో తీరని బాధ ననుభవిస్తుంది. “నీవు తెలిసివుండే నన్ను మృత్యుముఖానికి పడద్రోస్తున్నావు. నీకు నాయందు ప్రేమలేకపోతే, నాయందు కనికరం కలగక పోవచ్చు, కాని మానవ సహజమైన సానుభూతిని కూడా కోల్పోతావా?”

“నన్నుగురించి ఆ విధంగా అనటం సబబుగాదు. నాకు తెలిసినంత వరకు నీ భర్త నీయందు చాలా మర్యాదగా వ్యవహరిస్తున్నాడు. నీవు అవకాశమిస్తే నిన్ను క్షమించాలనే కోరుకుంటున్నాడు; అతడు నిన్నిక్కడినుంచి మార్చాలను కుంటున్నాడు. కొన్ని నెలలవర కిదొక వేషం అనుకో; మీా-తాన్-ఫూ' లో ఆరోగ్యం బాగవుతుందని నేననను. అసలక్కడేదైనా చైనా పల్లె వుందో లేదోకూడా నాకు తెలియదు. కాని ఆపేరువిని భయపడాల్సిన అవసరమేమీాలేదు. గాబరాపడి కీడేతెచ్చుకుంటావు. జనం మహామారి వలన కంటే భయంతోనే ఎక్కువ మంది చనిపోతున్నారని నా అభిప్రాయం.”

“అయితే నేనూ భయపడ్డాను. వాల్టర్ అదంతా చెప్పినప్పుడు నా చేష్టలుడిగిపోయాయి.”

"మొదట వినగానే అదురుకలగటం సహజమే, కాని కొంచెం ఆలోచించిచూస్తే చాలా సాధారణవిషయమే, అక్కడకు వెళ్ళడం వలన ఒకగొప్ప సజీవ, సంపూర్ణానుభవం కలుగుతుంది......"

"నేననుకున్నానుగదా......నేననుకునేదానిని..."

ఆవేదనతో కిటీ ఉద్వేగం చెందింది. చార్లీ మౌనం వహించాడు. అతడిముఖం తిరిగి గంభీరరూపం దాల్చింది. చాలాసేపటివరకు కిటీ ఈ మార్పును గుర్తించలేకపోయింది. కిటీ ఇప్పుడు ఏడ్వడంలేదు. ఆమె కన్నులు నిర్మలంగానూ శాంతంగానూవున్నాయి. కంఠంలో నిగ్రహం వుంది:

"నన్ను వెళ్ళమనే నీవు కోరుతున్నావా?"

"అంతకంటే మరొక మంచిమార్గంవుండదు."

"మంచా?"

"ఒకవేళ నీ భర్త నీకు విడాకులిస్తే నేను నిన్ను వివాహమాడలేనని మొదటేనీకు చెప్పాల్సింది."

కిటీ చాలాసేపటివరకు మౌనంవహించింది. కిటీమౌనం అతనికొక యుగం గడచినట్లుంది. ఆమె లేచి నిలబడింది.

"కేసునడపాలని నాభర్త ఆలోచించివుంటాడనే విషయం నాకు గుర్తురావటంలేదు."

"అయితే మరి ఇంతవరకు నీవు నన్నెందుకు భయపెడ్తున్నావు?" కిటీ నిశ్చలంగా చార్లీవంక చూస్తూ, "నీవు నన్ను మోసగిస్తావని వాల్టర్‌కు మొదటే తెలుసు," అని తిరిగి మౌనం వహించింది.

మనమేదైనా విదేశీభాషలోని పుస్తకం చదవనారంభించినప్పుడు ప్రారంభంలో మనకేమీ అర్థంకాదు. తరువాత తరువాత మనకు అర్థం తెలిసిన ఒకశబ్దమో, వాక్యమో వస్తే. కొంచెం కొంచెం అర్థం చేసుకోనారంభిస్తాం. కిటీ పరిస్థితి కూడా సరిగ్గా అలాగేవుంది. ఆమె వాల్టర్‌ను ఈ విధంగానే అర్థచేసుకుంటుంది. కిటీకి వాల్టర్ దట్టంగా వ్యాపించి గాఢాంధకారంతో ఘనీభవించిన దృశ్యం వంటి వాడు, అందులో ఏదో వెలుగుకిరణం విద్యుత్ వలె తళుక్‌మని తిరిగి అంధకారంలో కలసిపోయేది. కిటీ ఆకస్మికంగా ఇది ఆలోచించి కంపించింది. తిరిగి ఆమె చెప్పనారంభించింది:

"నీవు తిరస్కరిస్తావని తెలుసుకుని మాత్రమే వాల్టర్ ఈ విషయం చెప్పాడు. ఎంత ఆశ్చర్యం! అతడు నిన్ను ఎంత బాగా అర్థంచేసుకున్నాడు! ఒక్క వాల్టరే నన్నీ ఎండమావి భ్రమనుంచి తప్పించగలడు."

చార్లీ క్రిందిచూపులు చూస్తున్నాడు. బల్లమీదవున్న అద్దుడు కాగితంవంక చూస్తున్నాడు. జవాబుకు ఎంత వెదికినా మాటలు దొరకడంలేదు.

"నీవు కపటివని, పిరికివాడవని, స్వార్థములో మునిగి తేలేమనిషివనే విషయం వాల్టర్‌కు తెలుసు, ఈవాస్తవాన్ని నేను నాకళ్ళారా చూసి తెలుసుకోవాలనే ఆతడుకోరింది.. నీవు అపాయం ఎదురైతే వెనుదిరిగి లేడివలే పారిపోతావని అతనికి తెలుసు. ఆతనికెంత వాస్తవం తెలుసో నేనంతమోసంలోవున్నాను. నీవు నన్ను ప్రేమిస్తున్నావనే భ్రమలోవున్నాను. అసలు నీవు ఎవరినీ ప్రేమించనేలేవనేది ఆతడికి తెలుసు. నీవు

నిన్ను మాత్రమే ప్రేమించుకుంటావు. అవసరమైతే నిన్ను నీవు కాపాడుకుంటానికి నీజీవితానుంచి నన్ను తేనెలోని ఈగ వలె తీసిపారేస్తావని వాల్టరుకు తెలుసు.”

“ఈ అసహ్యమైన మాటలు నినోదార్చగలిగితే నాకేమీ అభ్యంతరం లేదు, నేను చెప్పేదేమీలేదు. తెలిసిందా? స్త్రీ పురుషుణ్ణి కించపర్చటానికి ఏదోఒక పద్ధతి వెదికి అవలంభిస్తూనేవుంటుంది. కాని దానికి విరుద్ధంగాకూడా అనేక చెప్పవచ్చు.”

కిటీ చార్లీమాటలేమీ వినిపించుకోనట్లూరుకుంది.

“వాల్టర్ వలె నేనిప్పుడు అంతా తెలుసుకోగలిగాను. నీవెంత నిర్దయుడవో, నీకు హృదయమే లేదనేది చూడగలి నీవు పచ్చి స్వార్థపరుడవు, పిరికిపందవనేది కూడా గ్రహించాను. నీలో మచ్చుకుకూడా ధైర్యంలేదు. నీవబద్ధాలపుట్టవు నిన్ను ద్వేషించవచ్చు. “ఈ మాటలతో కిటీ ముఖంలో ఆవేదన ఆకారంపొంది ఆడసాగింది. “నేను నిన్ను హృదయపూర్వకంగా ప్రేమిస్తున్నాననే సత్యం ఎంత దుఃఖకరం?”

“॥ !”

కిటీ విషయుక్తమైన నవ్వు నవ్వింది. చార్లీ కూడా గంభీరంగా కిటీని సంభోదించాడు, కాని కిటీ అదేమీ పట్టించుకోలేదు.

“మూర్ఖుడా!” కిటీ జవాబుచెప్పింది,

చార్లీ కుర్చీకి అతుక్కుపోయాడు. ఇప్పుడున్న కిటీ ఆయన ఊహాలకందటంలేదు. కిటీ చార్లీవంక చూసింది. ఆమె కన్నులు అతనిని పరిహసిస్తున్నాయి.

"ఇక ఇప్పుడు నీవు నన్ను ద్వేషిస్తున్నావా? సరే, నన్ను ద్వేషించు నాకిప్పుడేమీ భేదంరాదు."

కిటీ తన గ్లోవుల్ని తొడుక్కుంది.

"ఇప్పుడు నీవేం చేస్తావ్?" చార్లీ అడిగాడు.

"నీవేమీ భయపడకు. నీకేమీ నష్టంకలుగదు."

"అటువంటి మాటలనకు కిటీ!" చార్లీ కంఠం బరువుగా వుంది. "నీ ప్రతివిషయంతో నాకు సంబంధముందని నీ వెందుకు భావించవు. నే నన్నీ తెలుసుకుంటానికి ఎంతఆరాట పడ్డాను? ఇంతకూ నీ భర్తకేటు జవాబు చెప్తావు?"

"నేనుకూడా మీ-తాన్-ఫూ వస్తానని చెప్తాను"

"నీవు రాజీపడితే ఇక గట్టిగా వత్తిడిచేయడు."

కిటీ విస్మయంగా చూసింది. ఆమె చూస్తూన్న దృష్టిని చార్లీ అర్థం చేసుకోలేకపోయాడు.

"ఇక యిప్పుడు నీవు భయపడటం లేదూ?"

"లేదు! నీవు నన్ను ఉత్సాహపర్చావు. కలరావంటి మహామారి వున్న ప్రదేశానికి వెళ్ళుతాను. అక్కడ నాకు సజీవ సంపూర్ణానుభవం కలుగుతుంది. నేను చస్తే చావనీ"

"నేను నీతో ఇంత నిర్దయగా సంభాషించలేదు"

కిటీ మరొకసారి చార్లీ వంక చూసింది. కళ్ళనుంచి కన్నీరు కారుతున్నాయి. ఒక్కసారి ఎగిరిదుమికి చార్లీ వక్షంలో ముఖాన్ని దాచేసుకోవాలని, తన పెదవులతో ఆతని పెదవులు నమిలివేయాలని కిటీ అనుకుంది—కాని దానివలనలాభంలేదు.

కిటీ జవాబు చెప్పింది — "తెలుసుకోవాలనుకుంటూంటే విను. నేను భయంకొరకు, మృత్యువుకొరకు వెళ్ళుతున్నాను. వాల్టర్ హృదయంలో ఏముందో నాకు తెలియదు. అతనిబుద్ధి వక్రమైనది. నాకు చాలా భయంగావుంది — బహుశా మృత్యువే ఇక నాకు విముక్తి కలిగించవచ్చు."

ఇక ఒక క్షణంలో తన ఆత్మనిగ్రహాన్ని కోల్పోవచ్చునని కిటీ గ్రహించుకుంది, ఆమె త్వరత్వరగా గదినుంచి బయటకు వెళ్ళిపోయింది. చార్లీ తన కుర్చీనుంచి లేచి ఆమెకు వీడ్కోలిస్తూ వుండిపోయాడు. చార్లీ తాఫీగా ఒకసారి గాలి పీల్చుకున్నాడు. కాస్త సోడా బ్రాందీ తాగాలనిపించింది.

## 27

కిటీ ఇంటికి చేరేసరికి వాల్టర్ కూడా ఇంటివద్ద నేవున్నాడు. కిటీ తిన్నగా తనగదికి వెళ్ళాలనుకుంది, కాని వాల్టర్ క్రిందనే ఉన్నాడు; పనివాళ్ళ కేదో ఆదేశిస్తున్నాడు. వెంటనే తన నిశ్చయాన్ని వాల్టరుకు చెప్పేయాలనుకున్నంతగా నిరాశలో ఉంది. ఆమె వాల్టరు కెదురుగా వెళ్ళి "నేను నీతోవస్తాను" అని చెప్పింది.

"చాలామంచిది"

"నే నెప్పటికి తయారవాలి?"

"రేపటి రాత్రి"

తనకంత ధైర్యమెలా వచ్చిందో కిటీకి బోధపడలేదు.

వాల్టర్ ముఖభావం ఆమెకు గడ్డపారపదునువలె కన్పించింది. కిటీకి తనమాటలపైనే విస్మయం కలుగుతుంది.

"వేసవిదుస్తులు తెచ్చుకుంటే చాలని నా వుద్దేశ్యం. మరింకేమైనా కావాలా?"

"నేను నీ దాసీకి అన్నీ చెప్పాను."

కిటీ తలాడించి వెళ్ళిపోయింది. అమె పూర్తిగా వివర్ణం చెందింది. కిటి, వాల్టర్‌లు ఇప్పుడిక తమ ప్రయాణం ముగింపులో వున్నారు. కుర్చీలమీద తీసుకుబోబడు తున్నారు. ధాన్యపుపొలాలగుండా చాలా రోజులు ప్రయాణం చేశారు. ఉదయమే బయలుదేరేవారు, మధ్యాహ్నం ఎండతీవ్రతరమయేంతవరకు ప్రయాణంచేసేవారు. ఎండ తీవ్రంగా వున్నంత వరకు ఎక్కడైనా విశ్రమించి చల్లబడగానే మరల బయలు దేరేవారు. చివరకు రాత్రికైనా పట్టణానికిచేరి అక్కడే రాత్రిగడపేవారు. ముందు కిటీ, వెనుక వాల్టర్, ఆ వెనుక లైనుగా అనేకమంది కూలీలు సామానంతా తెచ్చేవారు. కిటీ మార్గంలో ఏమీచూడకుండానే ప్రయాణం సాగిస్తుంది. ప్రయాణమంతా చాలా మౌనంగానే వుండేది. అప్పుడప్పుడు కూలీలమాటలేవైనా విన్పిస్తూవుండేవి. ఒకోక్కసారి పాటో, సంభాషణలోని కొన్నికొన్నిమాటలో విన్పించేవి. కిటీ ఆలోచనల్లో వుండివుండి చార్లీ ఆఫీసులోని సంభాషణాదృశ్యాలు మెదులుతూవుండేవి. తమసంబంధాలు పూర్తిగా వ్యాపారసంబంధంగా ఎలా మారిందా అనేది కిటీకి ఆశ్చర్యం కలిగిస్తుంది. తాను చెప్పదలచినదంతా ఆమె చెప్పిందెక్కడ? తన హృదయంలోని ప్రేమనంతటినీ, తన నిస్సహాయతను అతనిపై

గ్రుమ్మరించగలిగివుంటే ఎంతబాగుండేది. అప్పుడుగూడా చార్లీ ఇంత నిర్దయగా వ్యవహరించేవాడా! అందుకు తానీ రోజీ కష్టాల్ననుభవించవలసివచ్చింది. తనకు కిటీదేమీ పట్టదని చార్లి చెప్పినప్పుడు తనకు తన చెవులయందుగాని, చార్లీ మాటలయందుగాని నమ్మకమే కలుగలేదు. అప్పుడామె చేష్టలుడిగి చూస్తూవుండిపోయింది. ఎంత ఏడ్చింది. ఎంతో విలపించింది.

రాత్రులందు వారు సత్రాల్లో ప్రత్యేక అతిధుల గదుల్లో ఆగేవారు. వాల్టర్ కిటీకి కొంచెం దూరంగా తన మంచంపై పడుకుని నిద్రపోయేవాడు, కాని కిటీ రాత్రులందు ఏడ్చేది, వాల్టర్ తన ఏడ్పును వినకుండా వుండేందుకు తల గడను పళ్ళతో గట్టిగా కొరికేది. పగటియందు తన కుర్చీ మీద కూర్చుని బహిరంగంగాఏడ్చేసేది. తనలోవున్న మితి లేని ఆవేదనతో బొబ్బరించాలనుకునేది. ఇంకెవరికైనా ఇంత బాధ కలుగుతుందా అనేది ఆమె ఎన్నడూ ఆలోచించలేదు. ఇంతకూ తానీశిక్షననుభవించడానికి తాను చేసిన అపరాధ మేమిటని తననుతాను ప్రశ్నించుకునేది. చార్లీ తన నెందుకు ప్రేమించలేదో ఆమె గ్రహించుకోలేక పోయింది. అన్నిటికీ దోషం తనదేననుకునేది... కాని చార్లీని తనవాడుగా చేసు కుంటానికి తాను చేయనిదేముందు. తమ జీవితం ఎంతసుఖంగా వుండేది, వారు మిత్రులు, ప్రేమికులుకూడా– ఆమెహృదయం వ్రయ్యలై పోయిందని చెప్పలేకపోతుంది. ఆమె తనను తాను సంభోదించుకుని మాట్లాడుతుంది. తనకిప్పుడు చార్లీయందు ద్వేషమేర్పడింది. కాని చార్లీని చూడకుండా తానెలా జీవించ

గలుగుతుందో ఆమె కర్థం కావటంలేదు. వాల్టర్ తనకు శిక్ష విధించడానికే మీ-తాన్-పూ తీసుకొస్తూవుంటే, అది అతడి భ్రమే. ఇక నేనేమైనా నాకే విచారమూలేదు. కిటీ కిక జీవించ టాని కాధారమే లేకుండాపోయింది. ఇరువది ఏడు సంవత్స రాల వయస్సులోనే మరణం సంభవించడంకంటే దురదృష్టం మరేముంటుంది?

# 28

ఓడలో వాల్టర్ నిరంతరం అధ్యయనంలోనే మునిగి వుండేవాడు. అప్పుడప్పుడు భోజన సమయంలో ఏదైనా సంభాషించే ప్రయత్నంచేసేవాడు. ఎవరో అపరిచితలతో మాట్లాడినట్లే అతడు కిటీతో మాట్లాడేవాడు. మాట్లాడేది కూడా ఆ అపరిచితులు సహయాత్రికులనే భావంతోనే. వివిధ విషయాలపై మాట్లాడేవాడు. ఆతడి సౌజన్యాన్ని చూసి తామిద్దరిమధ్య ఎంత అగాధమైన అగడ్త ఏర్పడింది అని కిటీ ఆలోచించేది.

వాల్టర్ తనకు విడాకులివ్వ గోరుతున్నాడని కిటీయే చార్లీకి చెప్పింది లేక పోతే ఆ మహామారి వున్న ప్రదేశానికి తీసుకువెళ్ళతాడు. చార్లీ ఎంతస్వార్థపరుడో, పిరికివాడో, నీరసుడో తాను స్వయంగా గ్రహించాలనే వాల్టర్ కోరింది.

వాల్టరులోని పరిహాసదరహాసానికి, ఆతడి ఆలోచనకు ఎంత సామ్యంవుంది. అతడు వాస్తవమేచెప్పాడు. దీని పరిణా మంకూడా వాల్టరుకు ముందే తెలుసు, అందుకే తను తిరిగి రాకపూర్వమే దాసీతో సర్దవలసిన విషయాలన్నీ ఆదేశిం

చాడు. ఆతడి కన్నుల్లో తిరస్కృతి నిండివుండటం ఆమె గమనించింది. ఒకవేళ వాల్టర్ చార్లీ స్థానంలో వుండివుంటే తన కోసం అంతా మరచిపోయేవాడు, అంతా త్యజించేవాడని కిటీ ఆలోచించింది. ఈ సత్యంపై కిటీకి నమ్మకంకూడావుంది. తా నిప్పుడు కళ్ళు తెరచి చూచుకుంటే ఎంతో భయంకరమైన అడుగువేయమని తనతో వాల్టర్ చెప్పాడు. ప్రారంభంలో వాల్టర్ తనను పరిహసిస్తున్నాడనుకుంది. నదిదాటి కుర్చీలపై కూర్చునేవరకూ ఆమె అతడు తనను తీసుకువెళ్ళడనే అభిప్రాయంతోనే వుంది. వాల్టర్ పరిహాసం వదలి 'నీవురావలసిన అవసరం లేదు, తిరిగి వెళ్ళు' అంటాడనే భావించింది.

కిటీ వాల్టర్ ఆలోచనలను ఏమాత్రం గ్రహించలేకపోయింది — తనచావును వాల్టర్ కోరడనే ఆమెకు విశ్వాసముంది. అత డామె నెంత గాఢంగా ప్రేమించేవాడు. వాస్తవంగా ప్రేమంటే ఏమిటో ఆమె ఇప్పుడు తెలుసుకుంటూంది. ఆమెకు వాల్టరుయొక్క ప్రేమమాటలు ఒక్కొక్కటే గుర్తొస్తున్నాయి. కిటీ విచారమే ఆతడివిచారం, కిటీ సంతృప్తే ఆతడి సంతృప్తిగావుండేది. వాల్టర్ నన్నిప్పుడు ప్రేమించడం లేదనేది జరగనే జరగదు. ఉభయపక్షాలు ప్రేమికుని యెడ నిర్దయగా వ్యవహరించారు గనుక ఎవరైనా ఒకర్ని ప్రేమించటం వదులుకోగలుగుతారా? నన్ను చార్లీ బాధించినంతగా నేను వాల్టరును బాధించలేదు. నేటికైనా చార్లీ సైగచేసి పిలిస్తే చాలు ఆమె ప్రపంచాన్నంతా వదలి ఆతడి కౌగిలిలోకి వెళ్ళిపోతుంది. అతడు నన్ను లక్ష్యపెట్టకపోయినా, నిర్దయగా వున్నా, నన్ను వదలివేసినా నే నతన్ని కోరుతున్నాను, నే నతన్ని ప్రేమిస్తున్నాను ''

కాలం తన గాయాలను మాన్పుతుందని, వాల్టర్ తనను క్షమిస్తాడని ప్రారంభంలో కిటీ ఆలోచించింది. వాల్టర్ శాశ్వతంగా తన కెంతో దూరమైపోయాడని ఆమె ఆలోచించ నే లేకపోయింది. ప్రేమ ఏవిధంగానూ చల్లారదు. వాల్టర్ తన నింకా ప్రేమిస్తున్నాడనే ఆమె విశ్వసించేది. కాని ఇప్పుడామె విశ్వాసం ఊగిసలాడుతుంది. సాయంత్రం సత్రంలో కుర్చీపై కూర్చుని లాంతరు వెలుగులో వాల్టర్ 'స్టడీ'లో మునిగిపోయి వున్నప్పుడు కిటీ అతడి లలాటంపై రేఖలను చదువుతూంది. చీకటిగా వున్నచోట ఆమె ఒక బల్లపై పడుకుని వుండేది. ఆతడి ముఖమెంత గంభీరంగా వుంది అనుకునేది కిటీ. ఆ ఇద్దరి మధ్యా ఎప్పుడూ దరహాసపరిహాసాలు ఇచ్చిపుచ్చుకోవటమే లేదు. కిటీ తనకు ఎన్నో వేల మైళ్ళదూరాన వున్నట్లుచదవ టమే చదవటం! చదువుతూనే వుండేవాడు. వాల్టర్ పేజీత్రిప్ప డం, ఆతడికళ్ళు పరిశీలనగా ఒక్కొక్క పంక్తిపైనే పరుగెత్త డం కిటీ గమనిస్తూవుండేది. నిస్సందేహంగా అతడు తనను గురించి ఆలోచించటంలేదు. భోజనపుబల్ల వేసి, వడ్డనజరిగిన తరువాత పుస్తకం మడిచిపెట్టి ఒకసారి కిటీవంక చూసేవాడు. అప్పుడతడి కన్నుల్లో తిరస్కృతి స్పష్టంగా కిటీకి కన్పించేది. ఆమె ఆందోళన పడేది. అయితే ఆతడిప్రేమ నిజంగానే మాసి పోయిందా? అయితే అతడు నిజంగానే చావునుకోరుతున్నా డా? ఎంత మూర్ఖత్వం, పిచ్చివాళ్ళే ఇటువంటివిషయమాలో చిస్తారు. వాల్టర్ మనస్సుగురించి అలోచించినకొద్దీ ఆమె శరీరపుదడ హెచ్చేది.

# 29

ఆకస్మికంగా కూలీలకంఠం ఆమె మౌనాన్ని భగ్నం చేసింది. వారింతవరకు మౌనంగా నడుస్తూవున్నారు. ఒకకూలీ ఆమె దృష్టిని ఆకర్షించుటకు ఎదురుగా సైగచేశాడు. ఎదురుగా పర్వతంవుంది. కిటీ ఆదిక్కుకుచూసింది, పర్వతంపై ఒక సమాధి కన్పించింది. అది ఒక విద్వాంసుని స్మృతిచిహ్నమైనా అయివుంటుంది లేదా పవితంతుస్త్రీదైనా అయివుంటుంది. నదినీ దాటిన తరువాత కిటీ ఇటువంటి స్మారకచిహ్నాలనెన్నింటినో చూసింది. కాని వీటిలో ప్రత్యేక ఆకర్షణ ఏమీలేదు. దానిపై సాయం సమయపు సూర్యరశ్మిపడుతుంది. అది అన్నిటికంటే ఎంతో అందంగా కన్పించింది. కిటీకి కారణం తెలియలేదుగాని, దానిని చూడగానే వ్యాకులపడింది. అందులో ఏదో ప్రత్యేకభావంవుంది, కాని ఆమె దానిని మాటల ద్వారా వ్యక్తం చేయలేకపోతూంది. అయితే అదేమిటో, కిటీభయపడుతుంది, బహుశా అది తనను పరిహాసిస్తుంది. ఎదురుగా వంతెనపై వెదురుపొదలున్నాయి, అవి తమ మార్గానికి అడ్డంవస్తాయనిపించింది. సాయంత్ర సమయం, ఉక్కపెడుతుంది, గాలిలేదు; అయినా 'ఆకులు గరగరలాడుతున్నాయి. కిటీకి గగుర్పాటుగలిగింది, ఎవరో పొదల చాటున దాగివున్నట్లనిపించింది. ఎవరో నిలబడి కిటీని చూస్తున్నాడు, ఇక వాళ్ళు పర్వతాన్ని దాటారు, ధాన్యపు పొలాలు గడచిపోయాయి. కూలీలు వూగుతూ నడవనారంభించారు. పర్వతంమీద దగ్గరదగ్గరగా చిన్నచిన్న గడ్డిమొలిచివుంది. అది చూడటానికి సముద్రపు అలఒకటి వచ్చిపోయిన తరువాత

నాచుపేరుకున్నట్లుంది. కిటీ అటువంటి ప్రదేశాలనెన్నింటినో వెనుక దాటేవచ్చింది. జనం నిండుగావున్న పట్టణాలగుండా వెళ్ళేముందు ఇటువంటి ప్రదేశాలు కన్పిస్తాయి. కూలీలు తన దృష్టి నెందుకు ఆకర్షించార్లో కిటీ కిప్పుడర్థమైంది. వారు తమ ప్రయాణపు అంతిమ భాగంలో వున్నారు.

ఆ పర్వతపు కట్టనుదాటి ముందుకు వెళ్ళారు. కూలీలు ఆగి భుజాలు మార్చుకున్నారు. ఒకకూలీ తన మలిన వస్త్రంతో స్వేదం తుడుచు కున్నాడు. కట్ట అంతమయింది. రెండువైపుల చిన్నచిన్న ఇళ్ళు. నిశాదేవి తన నల్లని తెర లతో భూమిని కప్పేసింది. ఆకస్మికంగా కూలీలు కుదులు కుంటూ ఆగిపోయారు. ఒకేక్షణంలో నెమ్మదిగా మాట్లాడు కుంటూ నలుగురు రైతులు అటువచ్చారు, వారిభుజాలపై ఒకశవంవుంది. దానిపై తెల్లని గుడ్డకప్పబడివుంది. దట్టంగా వ్యాపిస్తున్న చీకటి, అందులో శవాన్నిచూసి కిటీ హృదయం భయంతో దడదడలాడింది. శవం దాటి పోయింది.- కూలీ లింకా నిలబడే వున్నారు. వారిలో ముందుకు నడచేశక్తి క్షీణించిపోయినట్లగుపిస్తుంది. కాని వెనుకనుంచి బిగ్గరగా ఒక కంఠం వినపడగానే అందరూ ముందుకుసాగారు. వారంద రిప్పుడు పూర్తిగా మౌనం వహించారు. మరికొంత సేపు నడచి వారొక పెద్దగేటుగుండా వెళ్ళారు. భుజాలనుంచి కుర్చీలుదింపారు. ఇంతలో కిటీకూడా చేరింది.

# 30

అది బంగళా. కిటీ హాలులోకి వెళ్ళింది. ఆమె అక్కడే కూర్చుంది, కూలీలు ఒక్కొక్క సామానే తెచ్చి లోనపెట్ట నారంభించారు. వాల్టరు బయట వరండాలో నిలబడి ఆదేశిస్తున్నాడు, ఏ వస్తువు ఎక్కడ పెట్టాలో చెప్తున్నాడు. కిటీ చాలా అలసిపోయింది. శరీరమంతా సజ్జుసజ్జయింది. ఎవరిదో అపరిచిత కంఠంవిని ఆమె త్రుళ్ళిపడింది.

"లోనికి రావచ్చునా?"

ఆమె పాలిపోయింది. ఆమె చాలా అలసటగావుంది, అందులో ఒక అపరిచితుణ్ణి ఎదురుగా చూసి గాబరాపడింది. ఎవరో పురుషుడు, బయట చీకట్లోనుంచి వచ్చాడు. గదిలో ఒక చిన్నదీపం వెలుగుతుంది. దానివెలుగు బయటకు కన్పించటం లేదు. ఆ పురుషుడు తనచేయి చాచాడు.

"నాపేరు వెడింగ్‌టన్. తమరిక్కడికి వచ్చారని నాకు తెలిసింది."

అతడు పెద్ద పొడగరిగాడు. మరీ కురుచగాడు, బోడి తల, బక్కపలచని మనిషి ముఖం చిన్నది, పొడవు కిటీకంటే ఎక్కువగాడు,

"నే నీ పర్వతం క్రింద వుంటున్నాను. వచ్చేటప్పుడు మీకు మా యిల్లు కన్పించివుండదు. భోజనం ఏర్పాట్లన్నీ చేయించాను, నన్ను నేనే ఆహ్వానించుకున్నాను కూడా, నాతో కలసి భోజనం చేస్తారని ఆశిస్తున్నాను."

"తెలుసుకొని నాకు చాలాసంతోషం కలిగింది"

"వంటవాడు భోజనం బాగానే తయారుచేస్తాడు. వాట్సన్ వద్ద పనిచేసిన నౌకర్లనే మీ కొరకూ ఏర్పాటు చేశాను."

"వాట్సన్! ఇంతకుముందు ఇక్కడున్న మిషనరీనా?"

"అవునవును, పాపం చాలా మంచిమనిషి. మీ కిష్టమైతే రేపు అతడి సమాధివద్దకు వెళ్ళుదాం."

"మీారెంత సజ్జనులు?" కిటీ మందహాసంతో జవాబిచ్చింది

ఇంతలో వాల్టర్ ఆగదిలోనికి వచ్చాడు. బెడింగ్టన్ బయటనే వాల్టరుకు తనను పరిచయం చేసుకొనివున్నాడు. "ఇప్పుడే మీ భార్యతో నే నీ రాత్రికి ఇక్కడే భోజనంచేస్తానని చెప్పుతున్నాను. వాట్సు చనిపోయినప్పటినుంచి మాటలకు ముఖంవాచిపోయాను. ఇక ఆ సన్యాసినులు మాత్రం ఉన్నారు మాట్లాడాలంటే, కాని అదికూడా కొద్ది విషయాలను గురించే సంభాషించవచ్చు" అన్నాడు బెడింగ్టన్ వాల్టరుతో.

"కొద్దిగా మద్యం తెమ్మని నౌకరుకు చెప్పాను," అన్నాడు వాల్టర్.

నౌకరు మద్యము, సోడా తెచ్చాడు. బెడింగ్టన్ అడగాలనే మర్యాదనుకూడా పాటించకుండా తానే మద్యము నింపుకోసాగాడు. ఇదిగమనించి ఇతడు గంభీరస్వభావం గలవాడు కాడని కిటీగ్రహించుకుంది.

"మహాభాగ్యం!" త్రాగుతూ బెడింగ్టన్ వాల్టర్తో

అన్నాడు, "ఇక్కడ మీపని చాలా కుటిలమైనదే. ప్రజలు ఈగలవలె చనిపోతున్నారు. ఇక్కడి మెజిస్ట్రేటు గాభరాపడి పోయారు. కర్నల్ 'యూ' ఇక్కడిసైన్యాలకు కమాండరు, ఆయన చాలా నేర్పుగా పనిచేస్తున్నాడు, దోపిడీలు హత్యలు జరగకుండా బందోబస్తుచేశాడు. కొంచెం కళ్ళు తెరచి పని చేయక పోయామంటే మనమందరం మనమంచాల మీదే చంపబడతాం. నేనా సన్యాసినులకు చాలా చెప్పాను, వారు అమర జీవులవాలను కుంటున్నారు. వారికి శుభం కలుగు గాక!"

బెడింగ్టన్ సహజమందహాసం నిండిన కంఠంతో మాట్లాడుతున్నాడు. ఆతడిముఖంలో దరహాసం అంతసేపూ అలాగేవుంది.

"మీరెందుకని వెళ్ళిపోలేదు?" అని వాల్టర్ ప్రశ్నించాడు.

"నా నౌకర్లు సగంమందికిపైగా ఇక్కడే చనిపోయారు, ఇక మిగిలివున్నవారు ఏక్షణంలోనైనా మృత్యుదేవతకాహారం కావచ్చు. ఎవరో ఒకరు ఇక్కడవుండి వ్యవహారాలన్నీ చక్కబరుచుకోవలసిందే గదా."

"మీరు టీకాలు వేయించుకున్నారా?"

"వేయించుకున్నాను. వాట్సన్ వేశాడు, తాను కూడా వేసుకున్నాడు, కాని దానివలన ఏంలాభం కలిగింది? పాపం చనిపోనేపోయాడు;" అని బెడింగ్టన్ కిటీవంక తిరిగాడు. "నా వుద్దేశ్యంలో ఇక్కడేమీ పెద్ద భయంలేదు. మీరు కొంచెం జాగ్రత్తగావుంటేచాలు: పాలుగాని నీరుగాని

వెచ్చబెట్టుకొని తాగాలి. పచ్చిదుంపలుగాని, పండ్లుగాని తిన కండి.- మీరేవైనా గ్రామఫోనురికార్డులు తెచ్చారా?"

"లేదు, ఏమీ తేలేదు," అంది కిటీ జవాబుగా.

"అయితేబాధే. మీరు తప్పక తెస్తారనే భావించాను. నావద్ద పాతవే వున్నాయి. వినివిని విసిగెత్తింది."

నౌకరు వచ్చి భోజనాలకు పిలిచాడు.

"మీరీరోజు డ్రస్సువేసుకోరుగా. మా నౌకరు క్రితం వారం చనిపోయాడు; క్రొత్తగావచ్చినవాడు వట్టి మూర్ఖుడు. నేను సాయంత్రం బట్టలు మార్చుకోనడమే మానేశాను," అన్నాడు వెడింగ్టన్.

"నేను వెళ్ళిటోపీ అవీ మార్చుకొస్తాను," అంది కిటీ.

కిటీగది ప్రక్కనేవుంది. దానిలో కొద్దిఫర్నిచర్ కూడా వుంది. వచ్చి లాంతరు దగ్గరపెట్టుకొని తన సామాను తీసి అలంకరించుకొనడంలో నిమగ్నమైంది.

# 31

భోజనాలగది చిన్నది. దానిలో చాలపెద్ద బల్లవుంది. గోడలపై బైబిలుచిత్రాలు చిత్రించబడి వున్నాయి.

వెడింగ్టన్ అన్నాడు: "మిషనరీలు తమ ఇళ్ళలో పెద్దపెద్ద భోజనపుబల్లలు వుంచుకొంటారు. ప్రతిసంవత్సరం వాళ్ళ బిడ్డలందరికీ మంచి బత్తెం లభిస్తుంది. దానితోనే ఇంతంత బల్లలు కొంటారు. సాధారణంగా వాళ్ళు వివాహాసమ

యాల్లోనే ఇటువంటిబల్లలు తయారుచేయించుకొంటారు; తరువాత పెరిగే కుటుంబానికికూడా చాలదనేబాధ వుండదు."

ఒక కిరసనాయిలు దీపం వ్రేళ్ళాడుతూవుంది. బెడింగ్టన్ ఎటువంటి మనిషో కిటీ స్పష్టంగా చూడగలుగుతుంది. మొదట్లో కిటీ బెడింగ్టన్ బట్టతలచూచి యువకుడు కాడని భావించింది; కాని తరువాత అతని వయస్సు నలభైకి తక్కువే వుంటుందని గ్రహించుకుంది. వెడల్పైన మూడు మొదలు చిన్నముఖం వరకు మధ్యవయస్సు లక్షణాలే లేవు. రంగు శుభ్రంగావుంది, కాని అన్నీకలసి ముఖం మర్కట ఆకారంగా వుంది, అయినా ఆ వికృతంలోకూడా ఒకఆకర్షణవుంది. అతడి ముఖంచూస్తే ఎవరికైనా నవ్వొస్తుంది. అతడి ఆకారము, ముక్కు, నోరు అన్నీ పూర్తిగా చిన్నపిల్లలకున్నట్లేవుంటాయి చిన్ని నీలినేత్రాలు, విస్తరించివున్న కనుబొమలు, అన్నీకలసి విచిత్రాకారం ఏర్పడుతుంది. అతడు తనే మద్యం పోసుకున్నాడు, భోజనం వడ్డించబడగానే చాలా వేగిరపడ్డాడు. మద్యం సేవించివున్నా అతడి సరసనవుండవచ్చు. అతడు సంతృప్తిగా, సంతోషంగా వుంటాడు.

బెడింగ్టన్ హాంకాంగ్ విషయాలు ప్రస్తావించాడు. తనకక్కడ గొప్ప స్నేహితులున్నారని చెప్పాడు. వాళ్ళక్షేమ సమాచారాలు వినటానికి చాలా ఆరాటపడ్డాడు. ఒకసంవత్సరం క్రితం రేసులకోసమని అక్కడకు వచ్చాననీ, ఆరేసుల్ని గురించి, ఆరేసుల గుర్రాలు, వాటి యజమానులనుగురించిన విషయాలు చెప్ప నారంభించాడు.

"చార్లీ టవున్సెండ్ ఎలావున్నారు? ఆతడు వలసమంత్రి ఎప్పుడౌతాడు?" అని అడిగాడు బెడింగ్‌టన్.

"కిటీ శ్వాస ఆగిపోయింది. వాల్టర్ ఆమెవైపు చూడ లేదు.

"ఎప్పుడైనా కావచ్చు." వాల్టర్ జవాబిచ్చాడు.

"ఆతడివంటి మనుషులు పెరిగిపోతున్నారు".

"ఆయన మీ కెలా పరిచయం?"అని వాల్టర్ అడిగాడు.

"నాకు బాగా పరిచయం మే మిద్దరం ఒకసారి కలసి ప్రయాణంచేశాం"

నదికావలితట్టునుంచి డోలువాయించే చప్పుడు, గన గన మండే మంటలధ్వని విన్పిస్తున్నాయి. వారికి కొద్దిదూరం లోనే పట్టణమంతా భీతి ఆవహించివుంది. మృత్యువు పట్టణపు బజార్ల నన్నింటినీ చాలా నిర్దయగా గడచిపోతుంది — కాని బెడింగ్‌టన్‌కు దానితో సంబంధం లేనట్లు అతడు లండనువిష యాలు మాట్లాడనారంభించాడు. అక్కడ థియేటర్లనుగురించి చెప్ప నారంభించాడు. అక్కడ ఏ యే మంచి చిత్రాలు నడు స్తుందీకూడా చెప్పాడు — క్రితంసారి తా నక్కడికివెళ్ళినప్పుడు ఏ యే చిత్రాలు చూసిందీ వగయిరాలన్నీను. అతనికి ఒక హాస్యనటుడు గుర్తువచ్చి బిగ్గరగానవ్వాడు, మరుక్షణమే ఒక అందాలతార స్మృతి ఆతడి నావహించింది. తన సంబంధీకు డొకడు ప్రసిద్ధ సినీతారను వివాహమాడినట్లు చాలాగర్వంగా చెప్పాడు. ఆ తారతో కూడా కలసి భోజనం చేసివున్నానని బెడింగ్‌టన్ చెప్పాడు. తార అతడికి ఒక ఫొటో నిచ్చిందట,

కిటీ వాల్టర్ను తన ఇంటికాహ్వానించినప్పుడు ఆ ఫోటోను చూపించగలనని బెడింగ్టన్ తెలియజేశాడు.

వాల్టర్ అంతసేపూ ప్రశాంతంగా, హాసదృష్టితో తన అతిథివైపు చూస్తూవున్నాడు. బెడింగ్టన్ మాటలు తనకేమీా సంతృప్తిగా లేవనే విషయాన్ని తెలియబరచే విధంగా అతడేమీా చేయలేదు. మర్యాదకోసం మాత్రమే అతడీమాటల్ని వింటున్నాడని కిటీకి తెలుసు. వాల్టర్ పెదవులపై కాంతిహీనమైన దరహాసముంది.

కాని కిటీ ఏదో దీర్ఘాలోచనలో మునిగిపోయింది. తమ రాకకు పూర్వమిక్కడొక మిషనరీ చనిపోయాడు, ఈ పట్టణంలో మృత్యుదేవత తాండవిస్తుంది. ఇటువంటి ఇక్కడ ఆ ఇంటితోనే, తాను ప్రపంచాన్నుంచి ఎంతో వేరైపోయినట్లనిపించింది కిటీకి. అందరూ పూర్తిగా ఒంటరివాళ్ళు, ఒకరికొకరు అందరూ అపరిచితులు.

భోజనం పూర్తవగానే ఆమె లేచి నిలబడింది.

"క్షమించండి. నేను నిద్రపోవాలనుకుంటున్నాను. నమస్కారం." అంది.

"నేనూ వెళ్ళుతాను. వాల్టర్గారుకూడా ఇక విశ్రమించాలనుకొంటారు. మనం రేపు ఉదయమే బయలుదేరాలి."

అతడు కిటీతో కరస్పర్శచేశాడు, అతడు నిటారుగా నిలబడివున్నాడు, ఆతడి కన్నుల్లో ఏదోవిచిత్రమైన తళుకువుంది.

బెడింగ్టన్ వాల్టర్‌నుద్దేశించి, "నేను తమర్ని తీసు కొని వెళ్ళడానికొస్తాను. ఆ తరువాత మెజస్ట్రీటు, కర్నల్ యూ, తో పరిచయం చేస్తాను. తరువాత కాన్వెంట్‌కు వెళ్ళదాం. మీ పని చాలా కఠినమని మాత్రమే నే నీరోజు చెప్పగలిగింది," అన్నాడు.

# 32

కిటీకి రాత్రంతా విచిత్రమైన స్వప్నాల్లో గడచి పోయింది ఆమె నిద్రేపోలేకపోయింది. ఒకప్పుడు కూలీలు తనను కుర్చీలో కూర్చోబెట్టుకొని తీసుకుపోతున్నట్లు, తాను ఊగుతున్నట్లు కనుపించేది. తాను పట్టణాల్లోగుండా వెళు తుంది, జనం గుంపులుబడి చూస్తున్నారు. ఇరుకైన బజార్లు, ఏవేవో వస్తువులున్న అంగళ్లున్నాయి. ఆమె అటునుంచి వెళ్ళుతూవుంటుంది, అప్పుడే జనం రాకపోకలాగిపోతుంది. అంగడివాళ్ళు, కొంటానికి వచ్చిన జనం అందరూ విస్మయంగా ఎక్కడివాళ్ళక్కడే స్తబ్ధుగా వుండిపోయారు. దాని తరువాత ధనువు ఆకారంగల పర్వతంమీదవున్న ఆ స్మారకచిహ్నం కనుపిస్తుంది' ఆమె అక్కడకు చేరేసరికి ఆ పర్వతం రాక్షసా కారం వహించి ప్రాణం వచ్చినట్లవుతుంది. ఆ పర్వతాని కిరు వైపులా ఏ దేవతవో దీర్ఘ బాహువులున్నట్లనిపించింది. ఆమె అక్కడ ఆగగానే పర్వతం క్రిందినుంచి రెట్టిస్తూన్న నవ్వు విన్పించింది. అంతలోనే చార్లీ టవున్సెండ్ వస్తాడు. తన కౌగి లిలో బంధించి వేస్తాడు. అతడు తనను కుర్చీనుంచి దించే స్తాడు. తనతప్పేయనీ, కిటీకి బాధకల్గించటం తన అభిమతం

గాదనీ చెప్తాడు. తాను కిటీని ప్రేమిస్తూవున్నాడు, కిటీ లేకుండా తాను జీవించలేడు. చార్లీ ముద్దులు కిటీపై వర్షించగానే కిటీ ఆనందోత్సాహంతో ఏడుస్తుంది. అప్పుడంత నిర్దయగా ఎందుకు వ్యవహరించావని ఆమె చార్లీని ప్రశ్నిస్తుంది. ఆమె అడగటానికైతే అలాఎందుకు చేశావని అడిగిందేగాని, ఆ విషయం వలన తమ సంబంధాల్లో విశేషమార్పేమీ లేదని ఆమెకు తెలుసు.— ఇంతలోనే ఆకస్మికంగా వారికొక పెద్దబొబ్బరింపు విన్పిస్తుంది; వారు విడిపోయారు. కొందరు కూలీలు ఒక శవాన్ని మోసుకుపోతూకన్పించారు. వాళ్ళందరు చినిగిన మలిన నీలిరంగు దుస్తులు ధరించి వున్నారు.

కిటీ త్రుళ్ళిపడి లేచి కూర్చుంది.

తమబంగళా పర్వతానికి దిగువ మధ్యగావుంది. ఆమె లేచివచ్చి కిటికీనుంచి తొంగిచూసింది. క్రింద సన్నని నది ప్రవహించటం కన్పించింది. రెండవ వైపున పట్టణంవుంది. అప్పుడే ఉషఃకాలమైంది. నదిపై పొగమంచు వ్యాపించివుంది, చుట్టూ వున్న పచ్చదనంపై కూడా క్రమ్ముకుపోయివుంది. పచ్చపచ్చని ప్రదేశాలనేకం వున్నాయి. చుట్టూ నిశ్శబ్దంగావుంది. ఆ మసక వెలుగులో సర్వమూ స్వప్నంగా కన్పిస్తున్నాయి. మాల అచేతనంగా నిద్రిస్తున్నాడనీ, వాతావరణమంతా నిద్రితమనే నమ్మకంలేదు, అయినా ఎవరో అపరిచితుడు నిర్దయగా అన్నిటినీ శాంతపరచి, నిద్రబుచ్చి ఇంత అచేతన నిద్రావస్థ అందుకే అన్నట్లు ఆమెకాదృశ్యం కన్పిస్తుంది.

వెలుతురు వచ్చినకొద్దీ, పొగమంచు విడిపోతుంది. నక్షత్రం మసకగా మాయమైనట్లు పొగమంచు అంతరిస్తుంది.

నదీతీరానవున్న పెద్దపెద్ద దట్టమైన వృక్షాలు పొగమంచునుంచి తమముఖాలను బయటకు తీసుకుంటున్నాయి. ఎదురుగా దృష్టిని వేరుపర్చలేనంత వెలుతురుంది. అప్పుడే ఎదురుగా పర్వత నిటలము కన్పిస్తుంది. సూర్యకిరణములు చేసిన ఇంద్ర జాలంతో ఆ భౌతిక దీర్ఘాకారం కల్గిన భాగానికి ప్రాణం వచ్చి నట్లనిపించింది. నది వక్షస్థలముపై ఏదో అనాగరికశక్తి ప్రాభ వలె అది దృశ్యమానమవుతుంది. పొగమంచు విడినకొద్దీ ఇంద్రజాలపుశక్తి కూడా తగ్గిపోసాగింది. ఇప్పుడిక చుట్టూ పచ్చదనము, ప్రాంగణోపరిభాగాలు కన్పిస్తున్నాయి. అంత వ్యాప్తంగావున్న దానిని చిత్రం గీయగలగటం కూడా చాలా కష్టం. అందులో ఒక క్రమమేమీలేదు. పోయినకొద్దీ ఘనీ భవిస్తుంది. అదేమీ దుర్గమూకాదు, దేవళమూగాదు. కాని ఆ భాగమంతా ఏదో అదృశ్యశక్తి భవనమనిపించేట్లు, దాని లోనికి భూలోకవాసులెవరూ ప్రవేశించలేనట్లుగా కనబడు తుంది. అంతా ఏదోవిరక్తి చెందినట్లుగావుంది. అప్పుడప్పుడు గాలి జోరుగావీస్తుంది_ అది పూర్తిగా సారహీనంగా కన్పి స్తుంది. దీనివల్లనే అక్కడ మానవనిర్మితమైనదేలేదని అని పిస్తుంది. అంతా ఒక స్వప్నంవలె వుంది.

కిటీ ఏడుస్తుంది. తెలివితెచ్చుకొని తనవంక చూసు కొన్నప్పుడు తన చేతులు హృదయాన్ని నొక్కిపట్టి అదిమి పట్టు కొని వుండటం గమనించింది. ఆమెకు ఊపిరిపీల్చుకోవటం కష్టమనిపించింది. ఇంతకుముందెన్నడూ తానింత తేలికగానూ, నీరసంగానూ వుండటం ఆమె చూడలేదు. ఆమె కిటీ ఆత్మ మాత్రమేనన్నట్లు, ఆమె శరీరం తన పాదాలపై పడివున్నట్లు

కన్పిస్తుంది.— బయట అంతా ఎంతందంగావుంది అనుకొంది. ఏకమనస్కుడైన భక్తునికికలిగినట్లే ఆమెకు తేలికగా నమ్మకం కల్గింది.

కిటీ ఒంటరిగా— ఒక రోజువుంది. వాల్టర్ వుదయమే వెళ్ళిపోయాడు. మధ్యాహ్నం వచ్చాడు' భోజనంచేశాడు, ఏమీ మాట్లాడకుండానే వెళ్ళిపోయి తిరిగి రాత్రికి వచ్చాడు. కొద్ది రోజులు ఆమె బంగళానుంచి వెలుపలకు వెళ్ళలేదు. వాతావరణం కూడా చాలా ఉష్ణంగావుంది. రోజంతా కుర్చీలో కూర్చుని ఏదైనా చదువుతూవుండేది. మధ్యాహ్నపు మండు టెండలో స్వప్నసదృశ్యమైన ఆ వాతావరణమంతా మాయమైపోయింది, అక్కడ అంతా శిధిలము, జీర్ణము; కాని కిటీ దానినంతటినీ ఉన్మాదస్థితిలో వీక్షించి వుండటంవలన ఆమెకా ప్రదేశమంతా సాధారణమైనదిగా గాక ఎక్కువ మహత్వపూర్ణంగా కన్పిస్తుంది. తరచు సాయంత్రావసానంలోనూ— లేక రాత్రులందో పోగొట్టుకుకొన్న ఆ స్వప్నాన్ని తిరిగి మరొకసారి చూడాలనుకొనేది. ఆమెకు మరింకేదీ కన్పించేది గాదు, ఆ దైత్యాకారపు గోడమాత్రం తప్పక కనుపించేది. అంతసేపూ తన దృష్టినక్కడే నిలిపివుంచేది. ఆ వెనుక పట్టణమంతా భయంకర మహామారి పంజాలో భీతితో — భీతావహంతో పడివుంది.

తన దాసీద్వారానో, వెడింగ్టన్ ద్వారానో ఆమెకు పట్టణ వార్తలు కొన్ని తెలిసేవి. వాల్టర్ ఆమెతో మాట్లాడేవాడేకాడు. కిటీయే అప్పుడప్పుడు అతడినేదైనా ప్రశ్నించేది, లేక సంభాషించేది, అతడుమాత్రం విచారంగా ఇష్టంలేనట్లు

జవాబు చెప్పేవాడు లేక సంభాషించేవాడు. అతడు మాట్లాడుతూ వున్నప్పుడు కిటీ శరీరమంతా కంపనంచెందేది. రోజుకు నూరు లెక్కగా అక్కడి జనసంఖ్య మరణిస్తూంది. మహామారి ఒకసారి తాకిందంటే ఇకకుదురు కొనటం అసంభవమైంది. ఎక్కడెక్కడి మరచిపోయిన దేవుళ్ళు దేవతల్ని తెచ్చి బజార్లలో ప్రతిష్ఠించారు. వాటికి పూజా పునస్కారాలు జరుగుతున్నాయి; అయినా మహామారికి దయ కలుగలేదు.

శవాల్ని పూడ్చిపెట్టటం కూడా కష్టమైపోయేంత త్వరత్వరగా జనం మరణిస్తున్నారు. కొన్ని కుటుంబాలకు కుటుంబాల్నే మహామారి పూర్తిగా భక్షించింది; తర్పణం వదలడానికికూడా మిగిలేవారుకారు. కర్నల్ యూ దక్షత, జాగ్రత్తగల ఆఫీసరు, అందుకనే ఇంతవరకూ పట్టణంలో దోపిడీలు వగైరాలేమీ జరుగలేదు. పైకుటుంబాల వారిని పూడ్చిపెట్టుటకు అతడు తన సైనికదళాలను నియమించేవాడు. ఒకసారి కర్నల్ యూ ఒక ఆఫీసర్ని కాల్చేశాడు. ఆ ఆఫీసరు ఎవరింటిలోనో అనధికారంగా ప్రవేశించ ప్రయత్నించినట్లు కర్నల్ యూకు సందేహం కల్గింది.

ఒక్కొక్కసారి కిటీకి దుర్భరమనిపించేది. విపరీతమైన భయం ముసరుకొనేది, నిలువెల్లా కంపించేది. కొంచెం జాగ్రత్త వహిస్తే మహామారి సోకదనేది నిజమే, కాని కిటీలో భయం గూడుకట్టుకొనివుంది, దానికి చికిత్సఏముంటుంది. ఆమె పారిపోవటానికి రకరకాల ప్రణాళికలు వేసుకొనేది. వెంట ఏమీ తీసుకుపోకుండానే వున్నదున్నట్లుగానే పారిపోయి ఏదైనా సురక్షితస్థానానికి చేరుకోవాలని యోచించేది. తన

మనస్సులోని తీరని వ్యధను బెడింగ్టన్ ముందు వెళ్ళగక్కి ఆతడి సహాయంతో హాంకాంగ్‌కు చేరుకోవాలని మరొకప్పుడు యోచించేది. తన భర్త పాదాలపై బడి తాను భయపడి పోయాననీ, విపరీతంగా భయపడుతున్నానని చెప్పుకోవాలని వేరొకసారి తలచేది. వాల్టర్ తనయందు విరక్తి చెంది ద్వేషించినా మానవత్వదృష్టితోనైనా తప్పక తనయెడ దయ దలుస్తాడని విశ్వసించేది.

—ఇదంతా ఆలోచించడం వ్యర్థం: ఒకవేళ ఆమె వెళ్ళినా ఎక్కడకు వెళ్ళుతుంది? తనతల్లికూడా వివాహంచేసి తననుంచి విడుదలపొందినట్లుంది. కిటీ చార్లీవద్దకు వెళ్ళాలనుకుంటుంది కాని చార్లీ ఆమెను ప్రేమించడంలేదు. తాను ఆకస్మికంగా వెళ్ళి చార్లీముందు నిలబడితే అతడిస్థితి ఎలావుంటుందో కిటీకి తెలుసు. అమె కన్నుల్లో చార్లీచిత్రం దృశ్యమానమైంది — ఆతడు తల వ్రేళ్ళాడేసుకొని కూర్చున్నాడు, ఆతడిలో కాఠిన్యంతొంగిచూస్తూంది. అందుకు సరైనమాటలే కరువవుతాయి. కిటీ పిడికిలి బిగించింది. చార్లీ తనకు కలిగించినంత బాధను అతడికికూడా కలిగించాలనుకొంది. అప్పుడప్పుడు ఆశలుడిగి 'వాల్టర్ తనకెందుకు విడాకులివ్వడా?' అని యోచించేది — ఆమె ఎలాగో నాశనమైపోతుంది, అయితే వాల్టరుకూడా నాశనమైపోగలడా? అప్పుడప్పుడు వాల్టర్ మాటలు గుర్తుకొచ్చినప్పుడు సిగ్గుతో ఆమెతల వాలిపోయేది.

# 33

కిటీ మొదటిసారి బెడింగ్‌టన్‌తో సంభాషించినప్పుడు మెలికలుబెట్టి చార్లీనిగురించి మాట్లాడనారంభించింది. కిటీ, వాల్టరులు వచ్చినరోజునే బెడింగ్‌టన్ చార్లీ ప్రసక్తి తెచ్చాడు. తాను చార్లీని తనభర్త మిత్రునిరూపంలోనే ఎరుగుదునని మాత్రమే అభినయించింది. "ఆమనిషి నాకేమీ నచ్చలేదు. అతడంటేనే నాకు విరక్తి కలుగుతుంది"అన్నాడు బెడింగ్‌టన్.

కిటీ కళ్ళను మెరిపిస్తూ "అయితే మిమ్మల్ని సంతృప్తి పరచడం మహాకష్టమన్నమాట. నా దృష్టిలో అతడు హాంకాంగ్‌లో గౌరవనీయుడు, గొప్పవారిలోనివాడున్నూ" అంది జవాబుగా.

"నాకు తెలుసు, అతనివంటిమనిషి గుణాలూ తెలుసు, గొప్ప అనే మంత్రం వుంది అతడివద్ద. అతడు ఎవరిని కలుసుకున్నా దానిని ప్రదర్శిస్తాడు. ఆ కలుసుకున్నవానికి ప్రపంచంలో తాను దప్ప ఆత్మీయులు లేరని వ్యక్తంచేస్తాడు. అతడెల్లవేళలా ప్రతివారి సహాయానికీ సిద్ధంగావుంటాడు. ఒకవేళ మీాకే అతనితో ఏదైనా పని గలిగి, అది జరగనప్పుడు ఆపని తన వల్లనే కాలేనప్పుడు ప్రపంచంలో మరెవ్వరివల్లా కాదనే ప్రదర్శించుకొంటాడు."

"అది చాలా ఆకర్షణీయమైనగుణమే."

"అవును, ఆకర్షణ ఒక్కటే వుండటంవలన అప్పుడప్పుడు అది భారమవుతుంది. నా వుద్దేశ్యంలో అతనికంటే, మరెవ్వరైనా నమ్మకస్తుణ్ణి— అతడెప్పుడూ నవ్వులు విరజిమ్మక

పోయినాసరే, కలుసుకోనటం చాలా వుత్తమం. నేనుచార్లీని చాలా సంవత్సరాలుగా ఎరుగుదును; రెండు మూడు పర్యాయములు ఆతడి అంతర్యాన్ని గమనించే అవసరంకూడా కల్గింది. నాకేమంత ఘనతలేదు, ఏదో సాధారణ కస్టమ్స్ ఆఫీసర్ని, అయినా అతడు స్వార్థపరుడనిమాత్రం ఘంటాపథంగా చెప్పగలను. అతనికి తనపై వున్నంతప్రేమ మరేవ్యక్తిపైనా వుండదు."

కిటీ విశ్రాంతిగా పడక కుర్చీలో కూర్చుని వెడింగ్‌టన్ మాటలు వింటుంది. ఆమెకన్నులు మందహాసం చేస్తున్నాయి. ఆమె తన వ్రేలికివున్న ఉంగరంతో ఆడుకుంటుంది.

వెడింగ్‌టన్ చెప్తూనేవున్నాడు. "అవును, అతడు వృద్ధికివస్తాడు. అధికారులందరితో ఆతడికి పరిచయం వుంది. అతడిని నేను 'యువర్‌ఎక్సిలెన్సీ' అనేరోజు వస్తుందనే నాకు నమ్మకంవుంది."

'అతడు యోగ్యుడు, దక్షుడనే చాలామంది అభిప్రాయం. అందుకే అతడు వృద్ధిచెందుచున్నాడనికూడా వారి అభిప్రాయం."

"యోగ్యత? వ్యర్థవిషయం. అతడు శుద్ధమూర్ఖుడు. తనపనిలో ఎంతో మెళుకువగానూ దక్షతగానూ వుంటానని ప్రదర్శించుకుంటాడు— అంతేగాని వాస్తవం అదిగాదు. అతడు సాధారణ గుమాస్తా చేసినంతశ్రమకూడా చేయలేదు."

"అయితే మరి ఇంతనేర్పుగలవాడని ఎందుకంటారు?"

"ప్రపంచంలో అజ్ఞానులకు వెలితిలేదు. ఎప్పుడైతే ఎవ

రైనా మంచిహోదాలోవుండి, మీకేదైనా వాగ్దానంచేసి నెరవేర్చకపోగా మీ వెనుకనే మిమ్మల్ని నిందించే మనుష్యులు సాధారణంగా నేర్పరులనిపించుకుంటారు.— పైగా అతడికి భార్యాకూడావుంది. ఆమె నిజంగా యోగ్యురాలైన మహిళే. ఆమె మాటలు అంగీకారయోగ్యంగా వుంటాయి. చార్లీ ఆమెమాటప్రకారం వున్నంతవరకే అతడు యోగ్యుడుగా వుంటాడు, ప్రభుత్వనౌకరీ లభించడానికిముందు అందమైన భార్యాలభించటం బంగారానికి పసిమితోడైనట్లే. ప్రభుత్వమెన్నడూ యోగ్యుల్ని, దక్షుల్ని కోరదు, ప్రభుత్వానికి రోజురోజుకూ క్రొత్తఆలోచనల అవసరమూ వుండదు; పైగా దానివలన ప్రభుత్వానికి అవరోధాలు కలుగుతాయి. కనుక ప్రభుత్వపు పనుల్లో ఆటంకాలు, తప్పులు జరగకుండా వుండాలంటే అందుకు భిన్నమైన వ్యక్తులు కావాలి, వాళ్ళు మనస్సుతో ఆలోచించి పనిచేయకూడదు; ఆకర్షణీయంగా వుండి, ఆడేబొమ్మలవంటి మనష్యులు కావాలి ప్రభుత్వానికి.''

''అతడంటే మీకేమాత్రం మక్కువలేకపోవటం నాకు చాలా ఆశ్చర్యంగావుంది.''

''నాకు అయిష్టమనే మాటలేదు.''

''కాని మీకు ఆయన భార్య ఎక్కువయిష్టమా?'' అని కిటీ దరహాసం చేసింది.

''నేను పాత ఆలోచనల మనిషిని. అందుకని నాకు నియమాలలో పెరిగిన స్త్రీనచ్చుతుంది.''

''ఆమె ఎంతబాగా పెరిగిందో అంతబాగా వస్త్రధారణకూడావుంటే ఎంతబాగుంటుంది?''

"ఎందుకని? ఆమె సరియైన దుస్తులుధరించదా? అది నేనెప్పుడు గమనించ లేదు."

"ఆ యిద్దరికి చాలా ప్రేమవుందనిమాత్రమే నేను విన్నాను," అని కిటీ క్రీగంటితో బెడింగ్‌టన్‌ను చూడ సాగింది.

"అవును, చార్లీ తనభార్యను ప్రేమిస్తున్నాడు. ఈ మాత్రం మేలుంది అతనిలో బహుశా అతనిలోవున్న ఒక మంచితనం ఇదేనని నా అభిప్రాయం."

"చచ్చుపోగడ్త"

"అతడు కొంతమంది పరాయిస్త్రీలనుకూడాకలుసుకుం టాడు — సంభాషిస్తాడు — కాని దానిలో గాంభీర్యమేమీ ఉండదు. అతడు చాలా చతురుడు. తనకు కష్టంకలిగేటంతగా అతడు ఏ స్త్రీకి చనువివ్వడు. గర్విష్ఠి, తన ఘనతనే చూపిం చాలనుకుంటాడు. ఇప్పుడతడు కొంచెంలావెక్కాడుకూడాను. వయస్సుకూడా దాదాపు నలభైవుంటుంది. శరీరాన్ని చక్కగా కాపాడుకొన్నాడు — చూపులకుకూడా అందగాడే. నేను మొదటిపర్యాయం హాంకాంగ్ వెళ్ళినప్పుడు ఆతడిభార్య అనేకసార్లు చార్లీ విజయానికి గర్వపడటం గమనించాను."

"ఆతడిభార్య చార్లీకి ఇతరస్త్రీలతో వున్న సంబం ధాన్ని గంభీరంగా యోచించదా?"

"ఏమీలేదు, అటువంటిసంబంధాలు ఎక్కువకాలం నిలవవని ఆమెకు తెలుసు. చార్లీ అంటే పడిచచ్చేస్త్రీలు తనకు కూడా చెలికత్తెలవాలని ఆమె అంటుంది; కాని ఇంతవరకు

అందరూ అందరే చాలా సాధారణంగా వుండిపోయారు. చార్లీని ప్రేమించే ఈ 'సెకండ్ రేట్' స్త్రీలయందు అతడి కే మాత్రం ఆకర్షణ లేదనే ఆమె చెప్తుంది."

బెడింగ్‌టన్ వెళ్ళినతరువాత కిటీ అతడి మాటల్ని గురించి ఆలోచించసాగింది. బెడింగ్‌టన్‌ద్వారా ఆమాటల్ని వినటం ఆమె కే మాత్రం యిష్టంలేకపోయినా ఏదో గత్యంతరం లేక అదంతా విన్నది. వింటూన్నప్పుడు బాధపడుతూనే వుంది...... నే నెప్పుడూ నిర్దాక్షిణ్యంగా బెడింగ్‌టన్ మాటల్ని విశ్వసించలేను. చార్లీ మూర్ఖుడనీ, గర్విష్ఠి - భట్రాజు, అనే విషయాలు నాకు తెలుసు. చార్లీ తన చాతుర్యాన్ని ప్రదర్శించుకొనుటకు ఎంత అందంగా తనకథల్ని చెప్పేవాడో కూడా నాకు గుర్తుంది. తన నేర్పుకు అతడు గర్వపడేవాడు. చార్లీ అందమైన కన్నుల్ని, అందమైన ఆకారాన్నిచూసి, ఆ నిరర్థకపురుషునికి తన హృదయాన్నెందు కర్పించానా అని కిటీ యోచించేది. నేను చార్లీని మరచిపోగోరుతున్నాను. ద్వేషంలోకూడా చార్లీయందు ప్రేమకలుగుతుంది గనుక మర్చిపోవాలనుకుంటున్నాను, నా కన్నులు తెరవడానికి ఆనాటిచార్లీ నడత చాలు...... వాల్టర్ ఎప్పుడు చార్లీని ద్వేషించేవాడు —ఏదోవిధంగా చార్లీని మరచిపోతే ఎంత బాగుంటుంది — చార్లీకి బదులుగా ఆతడిభార్యా చెలికత్తెనవగలిగినా ఎంత హాయిగా వుంటుంది. డొరొథి హృదయంలో నాయందు ప్రేమ జనిస్తే ఎంతబాగుండును— కాని డొరొథి నన్నెప్పుడూ హీనంగానే భావించింది. ఆకస్మికంగా కిటీ నవ్వేసింది. నేను హీనంగా చూడబడతాననేది నాతల్లికి తెలిస్తే ఆమె ఎంత బాధపడుతుంది.

కిటీ రాత్రి తిరిగి చార్లీని స్వప్నాల్లో చూసింది. చార్లీ తన బిగి కౌగిలిలో బంధించి ఎడతెగని ముద్దులవర్షం కురిపించాడు – చార్లీ శరీరం లావుగావుంది, నలభై సంవత్సరాలైతే మాత్రం ఏం? ఆమె స్వప్నంలో నవ్వుతుంది. చార్లీయందు ఆమె ప్రేమ యినుమడించింది. అతడు బాలకులవలె ప్రేమిస్తున్నాడు. కిటీ అతడికి పూర్తి సుఖాన్నివ్వాలనుకొంది. మేల్కొన్నప్పుడు కిటీ కన్నులవెంట కన్నీరు ధారగట్టింది.

నిద్రలో ఆ ఏడ్పులు ఎందుకో– ఎందుకంత భయంకరంగా కన్పించిందో ఆమె గ్రహించుకోలేకపోయింది.

# 34

బెడింగ్టన్ దాదాపుగా రోజూ కిటీని కలుసుకొనేవాడు. అతడు తన పనులు ముగించుకొని వాల్టర్ ఇంటి ప్రాంతంవరకు షికారుగా వచ్చేవాడు. ఈ విధంగా ఒకటి రెండు వారాల్లోనే కిటీ, బెడింగ్టన్ల కిద్దరికీ సామీప్యమేర్పడింది. అక్కడి వాతావరణంలో అటువంటి సామీప్య మేర్పడటానికి కనీసం సంవత్సరకాలమవుతుంది. అక్కడ బెడింగ్టన్ వుండి వుండకపోతే కిటీ ఎలా వుండగల్గుతుంది. ఒకసారి కిటీ ఈ మాటను అతడితో అందికూడా. అందుకు బెడింగ్టన్ నవ్వి, "విషయమేమంటే, ఇక్కడివాతావరణంలో ప్రశాంతంగానూ, నిశ్చింతగానూ తిరిగే వ్యక్తులం మీరూ నేనూ మాత్రమే. సన్యాసినులు ఇకవారు స్వర్గంలోనే విహరిస్తున్నారు, మీ భర్తగారు!– అంధకారంలో." అన్నాడు జవాబుగా.

జవాబువిని కిటీ నవ్వేందేకాని ఆమెకేమీ బోధపడ లేదు. బెడింగ్‌టన్‌కు కోర్కెలేకపోయినా అతడి మెరిసే నీలి నేత్రాలు కిటీని వీక్షిస్తున్నాయని ఆమె భావించుకుంది. అతడు చతురుడని కిటీకి తెలుసు. బెడింగ్‌టన్‌కు నొప్పికల్గించటం వలన ఆమెకు ఆనందంకలిగేది. కిటీకి అతడియందు స్నేహ మేర్పడింది. బెడింగ్‌టన్ గొప్ప తెలివిగలవాడుగానీ, చురుకైన వాడుగానీకాడు, అయినా అతడు సంభాషించే తీరు పూర్తిగా ఆమెను ఆకర్షించేది. అతడి బట్టతల, నవ్వుముఖం, అతడి మాటలు అన్నీకలిపితే బాగా నేవుండేవాడు. అతడు అనేక ఓడరేవుల్లో ఎన్నో సంవత్సరాలువుండి వున్నాడు, అక్కడ ఒక్కొక్కప్పుడు అతడికి తనదేశీయులెవరూ కన్పించేవారే గారు. అందుకే అతడికి అదేపనిగా వాగే స్వభావం కల్గింది. అతడు స్పష్టంగా మాట్లాడతాడు. అతనితో మాట్లాడితే ఎవ రైనా సంతసించగలరు. జీవితం యందు అతడిదృక్పథం హాస్యమే. అతడు హాంకాంగ్ వలసప్రభుత్వాన్ని హేళనచేసే వాడు. అతడికి బహుళా కటు వనుభవాలై వుంటాయి, అతడు 'మీ-తాన్-ఫూ' లోని చైనా అధికార్లనుకూడా హేళన చేసేవాడు. చివరకు కలరాకూడా అతడికి హాస్యవిషయమే. అతడు విషాదాంత కథలు చెప్పనేలేడు. ఎప్పుడైనా వీరత్వా నికి సంబంధించిన కథ చెప్పినా దానిలో హాస్యం మేళవించ కుండా చెప్పగలిగేవాడుగాడు. చైనాలో తన ఇరవై సంవత్స రాల గాథలన్నీ అతడికి గుర్తున్నాయి. అతడికథల్ని, గాథల్ని వింటే ప్రపంచమంతా చాలా నూతన ఆకర్షణగానూ, అందం గానూ వుందనే సారాంశం తేలుతుంది.

చైనాభాషను తాను నేర్చుకోలేదనీ, అయినా తాను సునాయసంగా మాట్లాడగలనని బెడింగ్‌టన్ అంటూవుండే వాడు. బెడింగ్‌టన్ గ్రంథాలనేమీ పఠించేవాడుగాడు, అయినా మాటలు వినీవినీ తగినంత మంచి విషయాలను సేకరించుకున్నాడు. ఆతడు తరచు కిటీకి చైనా నవలాకథల్ని చైనా చరిత్రగాథల్ని విన్పిస్తూవుండేవాడు. అతడు చెప్పే పద్ధతి స్వాభావికమైందిగానూ, ఆకర్షణీయంగానూ వుండేది. అతడికి తెలియకుండానే పాశ్చాత్య నాగరికతను అనాగరికమనుకుంటున్నాడని బెడింగ్‌టన్ మాటలద్వారా కిటీ గ్రహించుకొంది, అంతియేగాక ప్రపంచమంతటిలోనూ ఒక చైనాయే వాస్తవానికి పుట్టినిల్లనీ, ఇక్కడే జీవితం సార్థకం చెందగలుగుతుందనీ, ఇక్కడే మనో వికాసం కలగగలుగుతుందనీ ఆతడి అభిప్రాయం. కాని మరోవైపున కిటీ, 'చైనా పతనమైపోయిందనీ, అక్కడవర్ణించనలవిగానంత మురికితనం పేరుకుపోయిందనీ వింటూవచ్చింది. బెడింగ్‌టన్ మాటల వలన తెరను కొద్దిగా తొలగించి ఎన్నడూ స్వప్నంలోకూడా చూడనటువంటి లోని దేదీప్యమానమైన ప్రకాశాన్ని చూచినట్లనిపించింది.

బెడింగ్‌టన్ కిటీ యింటివద్దే కూర్చుని మాటలుచెప్తూ నవ్వుతూ నవ్విస్తూ వుండేవాడు.

"మీరు ఇంత ఎక్కువగా మద్యాన్నెందుకు సేవిస్తున్నారు?" అని కిటీ మాటలమధ్యలో అడ్డగించి ధైర్యంగా ప్రశ్నించింది.

"నా జీవితంలో నాకున్న పెద్దవ్యసనమిదే. అంతేగాక అధికంగా సేవించడం వలన కలరారాదు.

బెడింగ్ వెళ్ళు ముందు బాగా నిషాలో వున్నాడు. అయినా అతడిలో నిగ్రహించుకోగలిగిన శక్తికూడావుంది. మద్యాన్ని సేవించిన తరువాత అతడెక్కువ చురుకుగా కన్పించే వాడు. మైకం క్రమ్మటం ఆతడికి దూరంగానే వుండేది.

ఆరోజు సాయంత్రం వాల్టర్ రోజూకంటే త్వరగా వచ్చే శాడు. బెడింగ్టన్‌ను అక్కడే భోజనం చేయవలసిందిగా బల వంతంచేశాడు. భోజనాల సమయంలో కుతూహలం కలిగించే విషయం జరిగింది. పప్పుతో తిన్న తరువాత చేపకూరతిన్నారు, తరువాత వంటమనిషి కోడిపిల్లమాంసంతోపాటు తాజా ఆకు కూర కిటీకి ఇచ్చింది.

కిటీ ఆకుకూర తీసుకొనటం చూసి బెడింగ్టన్ బిగ్గ రగా, "అదేమిటి! మీరది తింటారా?" అన్నాడు.

"అవును, మేము రోజూతింటాం."

"నా భార్యకు చాలా ఇష్టం." అన్నాడు వాల్టర్.

ఆ ప్లేటును బెడింగ్టన్ ముందుకు త్రోశారు. అతడు తిరస్కరించాడు "నమస్కారం! నేనింకా ఆత్మహత్య చేసుకో వాలని నిర్ణయించుకోలేదు."

వాల్టర్ గంభీరంగా మందహాసం చేశాడు, తాను కూడా ఆకుకూర వడ్డించుకున్నాడు. తరువాత బెడింగ్టన్ ఏమీ మాట్లాడలేదు. నిజానికతడు చాలా విచారించాడు, భోజనం ముగియగానే వెళ్ళిపోయాడు.

వాల్టర్ దంపతులు నిజంగానే రోజూ రాత్రులందు ఆకుకూర తింటున్నారు. వారువచ్చిన తరువాత రెండురోజులకే వంటవాడు ఆకుకూర తయారుచేశాడు. కిటీ అనాలోచితంగానే దానిని తినేసింది. వాల్టర్ ఆ వెంటనే త్రుళ్ళిపడ్డాడు.

"నీవిది తినగూడదు. వంటవాడు పిచ్చివాడు."

"ఏం, ఏం జరిగింది?" అంది కిటీ వాల్టర్ ముఖంలోకి చూస్తూ.

"ఈ ఆహారం అపాయకరం. ఇదంతాపిచ్చిపని. చావాలని కోర్కెగావుందా?"

"బహుశా అదేకావచ్చు," అంది కిటీ.

ఆ తరువాత మరేమీ మాట్లాడకుండా కిటీ వీరత్వం కలిగినట్లు భోజనం చేయసాగింది. ఆమె పరిహాసంలో నిండిన కన్నులతో వాల్టర్ వైపుచూస్తుంది. వాల్టర్ వెల వెల బారటం కిటీ గమనించింది. కాని ఆకుకూర ఇచ్చినప్పుడు అతడుకూడా తీసుకున్నాడు. అతడు తిరస్కరించకపోవటం చూసి వంటవాడు రోజూ ఆకుకూర తయారు చేస్తున్నాడు.— ఇటువంటి అపాయంలో తలదూర్చడమెంత హాయిగావుంటుంది. మహామారి భయం గూడుకట్టుకున్న కిటీ దానిని నిర్భయంగా తినేది. తాను వాల్టర్‌కు ప్రతీకారం చేస్తున్నాననుకునే భావంతోనూ, కొంత తనలోని భయాన్నంతా పారద్రోలాలనే భావంతోనూ తినేది.

# 35

మూడవరోజు మూడవ జామున బెడింగ్‌టన్ వచ్చాడు. కొంచెం ఆగిన తరువాత బయటకు వెళ్ళి తిరిగివద్దామని కిటీతో ప్రస్తావించాడు. కిటీకూడా వచ్చినప్పటినుంచీ యింతవరకు బంగళా గోడలమధ్యేవుంది. ఆమె సంతోషంగా అంగీకరించింది.

"ఇక్కడ తిరగటానికి అనువగు ప్రదేశాలేలేవు, అయినా పదండి, పర్వతశిఖరం వరకు వెళ్ళొద్దాం!" అన్నాడు బెడింగ్‌టన్.

"అలాగే! ధనురాకారంగా వుంటుందే అక్కడ వరకు వెళ్ళుదాం. నేనప్పుడప్పుడు నా కిటికీలోనుంచి దానిని చూస్తూ వుంటాను."

నౌకరు తలుపులు తెరచాడు; ఇద్దరూ దుమ్ముతో నిండివున్న బజారుగుండా ముందుకు సాగారు. కొద్దిదూరం వెళ్ళారో లేదో కిటీ భయంతో అరుస్తూ బెడింగ్‌టన్ చేయిపట్టుకుంది.

"పైన చూడండి."

"ఏమిటి?"

బంగళాబయట ప్రహరీగోడపై ఎవరోవ్యక్తి కాళ్ళుచాచి తలపై చేతులుపెట్టుకొని పడివున్నాడు. అతడు చినిగిన నీలిరంగు దుస్తులు ధరించివున్నాడు. చైనా భిక్షుకునివలె కన్పిస్తున్నాడు.

"చనిపోయినట్లుందే..." అంది కిటీ రొప్పుతూ.

"అవును, చనిపోయాడు. మీరుమరోవైపు చూడండి. తిరిగిరాగానే ఈతడిని తీయించేస్తాను."

కాని కిటీ కంపించిపోతూనేవుంది. ఆమె నిల్చున్న చోటునుంచి కదలలేకపోయింది.

"నేనింతవరకు ఎప్పుడు చనిపోయినవారి నెవర్నీ చూడ లేదు"

"అయితే, మీరు త్వరగా వీళ్ళనుచూడటం అలవాటు చేసుకోండి. ఎందుకంటే మీరీ అందమైన ప్రదేశానికి చుట్టు పట్ల అన్నీ ఇటువంటి శవాలనే చూస్తారు."

బెడింగ్టన్ కిటీ చేయిపట్టుకుని ముందుకుసాగాడు.

"అతడు కలరాతో చనిపోయాడా?" అని కిటీ అడిగింది.

"నా వుద్దేశ్యమిదే."

ఇద్దరూ మరేమీ మాట్లాడకుండా ధనురాకారంగా వున్న వంతెనవరకు వెళ్ళారు. వంతెన చాలా అందంగా కట్ట బడివుంది. ఆ వాతావరణానికంతటికీ అదిమైలురాయివలెవుంది, దేన్నీ లెక్కచేయకుండా పరిహసిస్తూ అన్నిటికీ వేరుగావుంది. వారు ఒక దిమ్మపై కూర్చుని ఎదురుగావున్న విశాలమైన ఖాళీప్రదేశాన్ని చూస్తూ వున్నారు. ఆ పర్వతమంతా చని పోయినవారి సమాధులతో నిండివుంది. వాటిపై పాకుడు పట్టింది. ఆసమాధులకు ఒక వరుసఏమీలేదు, ఒకదాని కొకటి కొట్టుకోవుగదా అనిపిస్తుంది. ఇక్కడినుంచి పోయిన పొడ వైన సన్ననిమార్గం పొలాలలో మాయమవుతుంది. ఒక

బాలుడు నదిలో గేదెవీపుపై కూర్చుని ఈదించుకుంటూ ఇంటికి తోలుకుపోతున్నాడు. రెండవవైపున ముగ్గురు రైతులు పెద్దపెద్ద టోపీలుధరించి, భారమైన బరువుతో అణగిపోతూ నడుస్తున్నారు. పగలంతా వేసిన వెచ్చనిగాడ్పు తరువాత సాయంత్రపు చల్లని చిరుగాలి వీస్తూంది! ఎదురుగా విశాల ప్రదేశం. వీటన్నిటినీ చూస్తే ఏ దుఃఖిత హృదయానికైనా శాంతి లభించగలుగుతుంది.— కాని కిటీ ఏ విధంగానూ ఆ చని పోయిన భిక్షుకుని చిత్రాన్ని తనదృష్టి నుంచి తొలగించుకో లేక పోయింది.

"ప్రజలు ఇంతసంఖ్యలో మరణిస్తుంటే మీరే విధంగా మద్యం సేవించ గలుగుతున్నారు? నవ్వుతూ మాట్లాడు తున్నారు?" అని కిటీ ఆకస్మికంగా ప్రశ్నించింది. వెడింగ్ టన్ చాలా గంభీరంగా జవాబు చెప్పాడు. "చూడండి, ఇది ప్రస్తుతం స్త్రీలు నివసించే ప్రదేశంగాదు. మీరెందుకు వెళ్ళి పోరు?"

కిటీ దరహాసం నిండి నక్రీగంటితో అతడిని చూస్తూంది.

"నీవుద్దేశంలో ఇటువంటి విషమ పరిస్థితులందు భార్యా స్థానం భర్త సమీపమందేననీ."

"మీరు వాల్టరు వెంటవస్తున్నారని నాకు టెలిగ్రాం వచ్చినప్పుడు నాకు చాలా ఆశ్చర్యం కల్గింది. బహుశా మీరు నర్సేమోనని, మీకీ పనులన్నీ దిన చర్యగానే వుంటుందని తరువాత ఆలోచించాను. హాస్పటల్లో ఎవరికైనా జబ్బుచేసి నప్పుడు జీవితాన్ని కఠినంచేసివేసే స్త్రీలల్లో మీరు ఒకరని

భావించుకున్నాను. కాని మీరిక్కడకు వచ్చినప్పుడు చూస్తే ఎంతో బలహీనంగా, పాలిపోయినట్లు కన్పించారు,"

"అయితే తొమ్మిది రోజుల ప్రయాణం తరువాతకూడా చురుకుగాను, సంతోషంగానూ కన్పిస్తా ననుకున్నారా?"

"మీరిప్పుడుకూడా అలాగే వున్నారు.—నేను మరి కొంత స్పష్టంగా చెప్పాలంటే మీరు దుఃఖపడుతూ వున్నారు.

ఈ మాట కిటీ వినగానే కిటీ వాడిపోయింది; కాని దరహాసంచేసి ఆమాటను త్రోసేయాలను కుంది.

"మీకు నా ఆకారం నచ్చనందుకు చాలా విచారిస్తున్నాను. నేను పన్నెండేండ్ల వయస్సునుంచీ నా ముక్కు పొడవుగావుందని బాధ కలిగేది—అయినా ఆ భాధను తెలియకుండానే దాచుకుని వుంటున్నాను. ఇంక మీకేమి చెప్పగలను, ఈ విషయంలో నాఈడువాళ్ళెందరో ధైర్యంచెప్పారు."

బెడింగ్ టన్ మెరిసే నీలి నేత్రాలు కిటీని ఒకసారి పైనుంచి క్రింది వరకు పరీక్షగాచూశాయి. తన మాటయందు అతనికి నమ్మకం కలుగలేదనికూడా కిటీకి తెలుసు, అసలు విషయం బెడింగ్ టన్ కు తెలియనంతవరకు విచారించవలసిన అవసరం లేదనుకుంది.

"మీ వివాహం జరిగి ఎక్కువకాలం కాలేదని నాకు తెలుసు. మీరిద్దరూ ఒకరినొకరు గాఢంగా ప్రేమించుకునేవారనీ నాకు తెలుసు. ఆయన మిమ్మల్ని ఇక్కడకు రావాలని చెప్పి వుంటాడని నాకు నమ్మకం కలగటంలేదు. ఒక వేళ చెప్పివున్నా మీరు స్పష్టంగా వ్యతిరేకించాల్సింది."

"అవును, విషయం సబబుగానే కన్పిస్తుంది," అని కిటీ తేలికగా జవాబు చెప్పింది.

"అవునండి, సబబే, కాని ఇది నిజంకాదు."

కిటీ ఆ అయిష్టమూ, కష్టకరమైన మాటను అతన్నుండి ఒకసారి వినాలనుకొనేది. బెడింగ్‌టన్ చురుకైన బుద్ధిగల వాడని ఆమెకు తెలుసు. అతడు నిస్సంకోచంగా మాట్లాడే వ్యక్తనికూడా ఆమెకు తెలుసు. అయినప్పటికి ఆ దుఃఖ విషయాన్ని అతడిద్వారా వినాలనే ఆశను నిగ్రహించుకోలేక పోయింది.

"ఇప్పుడు మీకు మీ భర్తయందు ప్రేమవుందని నాకు నమ్మకమే కలగటంలేదు. ఆయనంటే అయిష్టం కలిగిందని నా అభిప్రాయం. బహుశా ద్వేషిస్తూకూడా వుండివుంటారు. అయినా ఆతడంటే మీరు భయపడుతున్నారనే దానిలో ఏమీ సందేహంలేదు."

కిటీ ఎదురుగా ఏదో చూస్తూవుంది. ఆతడి మాటలు తనపై పనిచేశాయనేది బెడింగ్‌టన్ కొంతమాత్రం తెలియనీయకూడదని ఆమెకోరుకుంది.

మధుర హాస్యంతో, "మీకు నా భర్త అంత ఎక్కువగా నచ్చలేదనుకుంటా?" అంది.

"నేనాయన్ను గౌరవిస్తున్నాను, ఆయనలో శీలము, జ్ఞానముకూడా వున్నాయి. శీలము, జ్ఞానము ఒకరిలోవుండ గలగటం దుర్లభమని మీరు తెలుసుకోవాలి. ఆయన యిక్కడ ఏమిచేస్తున్నారోకూడా మీకు తెలియదని నేను

భావిస్తున్నాను. ఎందుకనంటే ఆయన మీతో ఎక్కువగా మాట్లాడుతూవుండరు. ఒంటరిగా ఒకేవ్యక్తి ఈ మహామారిని తరుమగలవాళ్ళెవరైనావుంటే అటువంటి వ్యక్తి ఒక్కరే వున్నారు, ఆయన వాల్టరే. ఆయన రోగులకు మందులిస్తున్నాడు, పట్టణాన్ని శుభ్రపరుస్తున్నాడు, త్రాగేనీటిని శుభ్రపరుస్తున్నాడు. తాను ఎక్కడకు వెళ్ళుతున్నాడో ఏమిచేస్తున్నానో అనే ఆలోచనే ఆయనకులేదు. తన జీవితాన్నాయన అపాయంలో పడద్రోసుకున్నాడు. కర్నల్ యూ ఆయనకు దాసుడై పోయాడు. తన సైన్యాలన్నింటికీ వాల్టర్ ఆదేశాల్ని శిరసావహించాల్సిందిగా ఆజ్ఞాపించాడు. వాల్టర్ ఏమి మంత్రం వేశాడో ఏమో మెజస్ట్రిట్ కూడా పట్టుదలతో పనిచేస్తున్నాడు. ఇక కాన్వెంట్ సన్న్యాసినులు ఆయన నామాన్నే జపిస్తున్నారు, వాల్టర్ వాళ్ళకు నాయకుడైపోయాడు.

"మీరంగీకరించరా?"

"వాల్టర్ పని ఇదంతాకాదు. అతడు జీవ-శాస్త్రజ్ఞుడు గదూ? అతడినిక్కడకు పిలిపించలేదు. అతడిపనులన్నింటిని బట్టి చూస్తే కనీసం నాకు తెలిసేదేమంటే అతడు సానుభూతి వుండటం వలన ఇక్కడకురాలేదు. వాట్సన్ విషయమే వేరు, అతనికి మానవుడంటేనే ప్రేమ— ఆ మానవుడు కాకే షియన్ కావచ్చు, చైనావాలా కావచ్చు, బౌద్ధుడైనా, క్రైస్తవుడైనాసరే. కాని మీభర్త విషయంలోమాత్రమిది గాదు. వందలకొలదీ చైనీయులు మహామారి వలన చస్తే చావనీ. పోనీ శాస్త్రపరిశోధన ఆయన్నిక్కడకు లాక్కొచ్చిందా అంటేకాదు. అయితే అతడు మరెందుకిక్కడికివచ్చాడు?"

"ఆ విషయం వారినిడిగితేనే బాగుంటుంది."

"మీరిద్దరూ ఒకచోట కలిసివుండటంకూడా నాకు చాలా ఆకర్షణగావుంటుంది. మీరిద్దరూ ఏవిధంగా వ్యవహరిస్తూ వుంటారా అనేదే నా కప్పుడప్పుడు అర్థంకాదు. నా యెదుట మాత్రం మీరిద్దరూ నటిస్తున్నారు. అది కూడా చాలా ఘోరంగా. మీరేదైనా నాటకకంపెనీలో చేరి ఈ విధంగా నటిస్తే మీరు బ్రతకటమే దుర్భరమవుతుంది. జీవన భృతికికూడా కష్టపడతారు."

"మీమాట ఒక్కటీ నాకర్థం కావటంలేదు," అంది కిటీ మందహాసంచేస్తూ. ఆ మాటలవలన తనలో కలిగిన చలనాన్ని ఆమె ముఖంలో కన్పించనీయగూడదని ప్రయాసపడుతుంది.

"మీరు సౌందర్యవతులు. కాని మీభర్త మీవైపైనా చూడడు. ఎంతహాస్యాస్పదం! అతడు మీతో సంభాషించినప్పుడు, అది వాల్టర్ కంఠంగాగాక మరెవరి కంఠంనుంచో ఆ మాటలు వస్తున్నట్లుంటుంది.

చిరునవ్వును మరచిపోయి కిటీ గంభీరంగా అడిగింది, "ఆయన నన్ను ప్రేమించటం లేదని మీరు భావిస్తున్నారా?"

"నాకు తెలియదు. మీరు ఆతడిహృదయంలో మీయందు ద్వేషాన్ని కలిగించుకున్నారనిగానీ, లేక అతడే మిమ్మల్నధికంగా ప్రేమించి, ప్రేమలో తానే స్వయంగా దహించుపోతున్నాడో కూడా నాకర్థం కావటంలేదు. అందుకే మీతో మాట్లాడటంలేదని, తనప్రేమను ప్రదర్శించడం లేదనీ

కూడా నాకు తెలియదు. ఒకవేళ మీరిద్దరూ ఇక్కడను ఆత్మ హత్య చేసుకొనుటకు కాలేదుగదా అని ఆలోచిస్తాను అప్పు డప్పుడు.''

కిటీకి ఆరోజు ఆకుకూర విషయం గుర్తొచ్చింది. ఆరోజు బెడింగ్‌టన్ పరిశీలనగా తామిద్దరివంకా చూశాడు. "మీరు వ్యర్థవిషయాలకు చాలా ఘనతనిస్తున్నారు,'' అని కిటీ లేచి నిలబడింది. "ఇక యింటికి వెళ్ళుదాం. మీ కిప్పుడు మద్యం కావాలి.'' అంది.

"మీరేమీ వీరులుకారు. మీ కిక్కడ భయం కలుగు తుంది, మృత్యువు దృష్టిలోమెదులుతుంది. మరిమీకు తిరిగి వెళ్ళిపోవాలనేకోర్కె లేదని నిజంగా చెప్పగలరా?

"ఇంతకూ ఇదంతా తెలుసుకొని మీరేంచేస్తారు?''

"నేను మీకు సహాయం చేస్తాను.''

"మీరు నా దుఃఖ కారణాన్ని తెలుసుకోవాలను కుంటే చూడండి నా ముక్కు ఎంత పెద్దదో?''

బెడింగ్‌టన్ కిటీని పరిశీలించిచూశాడు. ఆతడికన్నుల్లో ద్వేషము, వ్యంగ్యము నిండివున్నాయి. ఆ దృష్టినిచూస్తే నది తీరానవున్న చెట్లనీడ దయాభావంతో నీటిలోపడి అలాగే వుండిపోయినట్లనిపిస్తుంది. కిటీ ఇదిచూసింది, ఆమె కన్నుల్లో కన్నీరునిండింది.

"అయితే మీరిక్కడ వుండగోరుతున్నారా?''

"అవునండి!''

వారిద్దరూ అర్థచంద్రాకారపు పర్వతభాగాన్ని దిగనా రంభించారు. బంగళా దగ్గరకు చేరుకున్నప్పుడు భిక్షుకునిశవం

కన్పించింది. బెడింగ్‌టన్ కిటీ చేయిపట్టుకున్నాడు. కిటీ చేయి వదలించుకుని మౌనంగా నిలబడింది.

"ఎంతభీభత్సం!"

"ఏమిటి? మృత్యువా?"

"అవునండి. మృత్యువు ప్రతివస్తువును ఎంతచిన్న చేస్తుంది. ఇతడు ఒకప్పుడు మనిషే, కాని ఇప్పుడావిధంగా అని పించదు. ఇతన్ని చూసి ఇతడు ఒకప్పుడు జీవించివుండేవాడని ఎవరంటారు. ఎన్నో సంవత్సరాలకు పూర్వం ఇతడూ చిన్న బాలుడని, అప్పుడీ పర్వతంపై పరుగులెత్తేవాడని, పరుగు లెత్తుతూ గాలిపటాల నెగురవేశాడనేది ఇప్పుడి తన్ని చూసి ఎవరాలోచిస్తారు." ఇక తరువాత కిటీగొంతు పూడిపోయింది.

# 36

కొద్దిరోజుల తరువాత ఒకసారి బెడింగ్‌టన్ కిటీ యింటి వద్ద కూర్చుని మద్యం సేవిస్తూవున్నాడు. అప్పుడే అతడు కిటీకి కాన్వెంట్ పరిస్థితి చెప్పాడు.

"సన్యాసినులు చాలా ఉత్తమస్త్రీలు. పెద్ద అమ్మ గారు ఏదో ఉన్నతకుటుంబానికి చెందిన ఫ్రాన్సు కన్యయని సన్యాసినులు నాతో చెప్పారు. కాని కుటుంబంపేరు చెప్ప లేదు. ఇటువంటి విషయాలు సంభాషించడానికి మదర్ అను మతించదని సన్యాసినులు చెప్తారు.

"అయితే మీరు వారినే ఎందుకడుగకూడదు?" కిటీ నవ్వి అంది.

"మీరు వారిని కలుసుకుంటే ఇటువంటి ప్రశ్నలడగటం అసంభవమని మీకే తెలుస్తుంది."

"అయితే వారు నిజంగానే చాలా మంచిస్త్రీలైవుంటారు. ఎందుకంటే వారు మిమ్మల్ని భయపెట్టేశారు.

"వారు నా ద్వారా మీకొక సందేశం పంపారు. మీరు మహామారి ప్రదేశానికి వెళ్ళలేకపోవచ్చు, కాని కనీసం కాన్వెంట్‌ను తప్పక చూడవలసిందిగా చెప్పారు."

"ఇది వారిదయ. నేనిక్కడవున్న విషయం వారికి తెలియక పోవచ్చునని నేను భావించాను."

"నేనే మీ విషయాన్ని ప్రస్తావించాను. వారానికి రెండుమూడు పర్యాయాలు నేనక్కడకు వెళ్ళుతాను, నేను చేయదగిన పనేదైనావుంటే చేద్దామనే మీ భర్తగారుకూడా అక్కడ మీ విషయం చెప్పేవుంటారని నా నమ్మకం. వాళ్లంటే అక్కడెంత గౌరవముందో మీరే స్వయంగా వెళ్ళి చూడండి."

"మీరు కేథలిక్‌లా?"

వెడింగ్‌టన్ చిన్నికన్నులు ఆకస్మికంగా తళుక్కున్నాయి. అతడు బిగ్గరగా నవ్వాడు.

"ఎందుకలాచూస్తారు?" అంది కిటీ.

"ఈ నిరర్థక విషయం వలన లాభమేమిటి? చెప్పాలంటే నేను కేథలిక్కునుగానూ, నన్ను గురించి చెప్పుకోవాలంటే నేను ఒక్క ఇంగ్లండు చర్చిని అంగీకరిస్తాను. ఏమీ

కష్టంలేకుండా చెప్పాలంటే నేను దేనినీ అంగీకరించనివాళ్ళలో నేను ఒకడననే నా మాటలఅర్థం......"

మొదట పది సంవత్సరాలకు పూర్వం మదర్ సన్న్యాసిని ఇక్కడకు వచ్చినప్పుడు ఆమె వెంట మరి ఏడుగురు సన్న్యాసినులు వున్నారు. వారిలో ముగ్గురు చనిపోయారు. మీ-తాన్-పూ ఆరోగ్య కేంద్రం కాదనే విషయం మీకు తెలుసు. వారుండేది పట్టణ మధ్య ప్రదేశంలో, అదంతా చాలా పేద ప్రదేశం. వారందరూ అంతులేని శ్రమ చేస్తారు. వారికి శలవు రోజే వుండదు."

"అయితే ఇక ఇప్పుడు మదర్, మరి ముగ్గురు సన్న్యాసినులేనా వుండేది?"

"కాదు కాదు! ఇప్పుడింకా అదనంగా వచ్చారు. మొత్తం ఆరుగురున్నారు. వారిలో మొదట ఒకరు కలరా కాటేసిన ఆహారం కాగానే, కాంటౌన్‌నుంచి మరిద్దరొచ్చారు."

కిటీ కంపించింది.

"ఎందుకు, మీరలా నిస్పందం చెందారెందుకు?"

"ఏమీలేదు. నా సమాధిపై ఎవరో నడుస్తున్నట్లనిపించింది."

"వాళ్ళు ఫ్రాన్సు వదలి వచ్చారంటే మరెప్పుడూ అక్కడకు తిరిగి వెళ్ళరనే అర్థం. వాళ్ళు ప్రొటెస్టెంట్ మిషనరీలవలే గాదు, సంవత్సరాల తరబడి శలవు లభించడానికి. మన ఇంగ్లీషు వాళ్ళకు మన మాతృభూమియందు ప్రత్యేక మమకారం వుండదు; మనం ప్రపంచంలో ఏమూలనైనా

సుఖంగా గడిపేస్తాం. కాని ఫ్రాన్సు వాళ్ళకు తమ దేశమంటే చాలా మమకారం వుంటుంది. ఫ్రాన్సు బయట మరెక్కడా వారి మనస్సుండబట్టదు."

"నేనీ స్త్రీల త్యాగంచూసి అప్పుడప్పుడు మారిపోతాను. ఒకవేళ కేతలిక్కునైతే బహుశా ఇదంతా స్వాభావికంగానే వుండవచ్చునని ఆలోచిస్తాను."

కిటీ మౌనంగా వుంది. ఆమె బెడింగ్టన్ భావయుక్తమైన మాటల అర్థాన్ని వెదకలేక పోతూంది — అతడు మద్యం అధికంగా సేవించాడు గనుకనే వాగేస్తున్నాడనుకుంది.

బెడింగ్టన్ నవ్వుతూ, "ఒక రోజు మీరే స్వయంగా అక్కడకు వెళ్ళి చూడండి. అక్కడకు వెళ్ళితే పచ్చి టమాటోలు తినే ప్రమాదం వుండదు," అన్నాడు.

"మీరు భయపడకపోతే నేను మాత్రం ఎందుకు భయపడ్డాను?"

"అక్కడ మీకు హాయిగా వుంటుందని నేననుకుంటున్నాను. ప్రాన్సులోని ఒక చిన్న భాగం వున్నట్లే అనిపిస్తుంది మీకది."

# 37

చిన్న దోనెలో వారిద్దరూ నదిని దాటారు. ఒడ్డునే కిటీ కొరకు ఒకడోలీ సిద్ధంగావుంది. ఆ డోలీలో కూర్చొని వారు బయలు దేరారు. వారు మంచినీటి గృహం వద్దకు వచ్చారు. కూలీలు నీళ్ళకొరకు అక్కడికేవస్తూ వుంటారు. వారు త్వరత్వరగా కావిళ్ళనిండా నీరునింపుకొని వెళ్తున్నారు. ఆ త్వర

త్వరగా వెళ్ళడంతో నీరు చిందుతూ ఇప్పుడే వర్షం కురిసిందా యనిపిస్తుంది. వారి డోలీల మనుషులు కావళ్ళు తెచ్చేవారిని తప్పుకోనమని హెచ్చరిస్తూ ముందుకుసాగుతున్నారు.

"ప్రస్తుతం ఇక్కడి పనులన్నీ స్తంభించిపోయాయి. సాధారణంగా ఇక్కడమనిషికి వెదకినా దారిదొరుకదు. ఈ ప్రదేశమంత కూలీలతో నిండివుంటుంది. పెద్ద పెద్ద బరువుల నెత్తుకొని నడచేవెళ్ళుతూవుంటారు." డోలీప్రక్కగా నడుస్తూ బెడింగ్టన్ చెప్పాడు.

బజారు ఇరుకుగానూ వంకర్లు తిరిగివుంది. కిటీకి దిక్కులు కూడా తెలియటం లేదు. షాపులన్నీ ఇంచుమించు మూసే వున్నాయి. చైనీయుల నివాసాలందు బజార్లు మురికితో నిండి వుంటాయి, ఈ విషయం కిటీకి తెలుసు. ఇక్కడ అనేక వారాలుగా పేరుకున్న మురికివుంది. దుర్గంధం భరించలేనంతగా వుంది, సుమాలు ముక్కుకడ్డం పెట్టుకుంది. మీ-తాన్-ఫూ ప్రయాణంలో తనను చూడటానికి జనం గుంపులుగూడేవారు, కాని ఇక్కడమాత్రం ఎవరైనా ఆకస్మికంగా కన్పించినప్పుడు అలా చూసి దృష్టిమరల్చుకునేవారు. జనం చెదురుగా అక్కడక్కడా వున్నారు. ఎప్పటివలె గుంపులుగూడిగాని, కోలాహలంగానీ లేదు. అప్పుడు మార్గంలో కన్పించిన వారందరూ మౌనంగానూ, విచారంగానూ వున్నారు. అప్పుడప్పుడు ఎక్కడైనా ఒక యింటినుంచి గందరగోళం విన్పించేది. దానినిబట్టే ఆ యింటిలో జబ్బుతో ఎవరోచనిపోయి వుంటారని తెలిసేది.

బెడింగ్టన్ ఒకచోట ఆగి, "మనం వచ్చేశాం," అన్నాడు.

డోలీని క్రిందికిదించారు. ఎదురుగా ఒక చిన్న ద్వారం వుంది, దానిపై 'క్రాస్' చిహ్నంవుంది. కిటీ డోలీనుంచి క్రిందికి దిగింది' బెడింగ్‌టన్ గంటమ్రోగించాడు.

"అతిథిసత్కారం అతిసాధారణంగా వుంటుంది. ఎక్కువ పొందాలని ఆలోచించకండి. పాపం! వీళ్ళు పూర్తిగా నిర్ధనులు."

ఒక చైనా బాలిక తలుపులు తెరచింది. బెడింగ్‌టన్‌తో కొద్దిగా మాట్లాడి ఆయిద్దర్ని లోనికి తీసుకువెళ్ళింది. గది చాలా చిన్నది, అది ఇంటిలోనికివెళ్ళే ఇరుకుదారి ప్రక్కనేవుంది. గదిలో ఒక పెద్ద బల్లవుంది. దానిమీద మైనపుగుడ్డ పరచ బడివుంది, గోడ వారగా కుర్చీలున్నాయి. గదిలో ఒకప్రక్క 'వర్జిన్ మేరీ' విగ్రహంవుంది. ఒకక్షణం తరువాత ఒక సన్యాసిని గదిలోనికి వచ్చింది. ఆమె పాలిపోయివుంది, కొద్దిపాటి విగ్రహం, ముఖంలో అభినందనభావం, కన్నుల్లో దరహాసం వున్నాయి. బెడింగ్‌టన్ కిటీని పరిచయం చేశాడు. సన్యాసిని పేరు సిస్టర్ జోజెఫ్.

"మీరు డక్టరుగారి భార్యా?" అని సన్యాసిని అడిగి మదర్ ఇప్పుడే వస్తారని చెప్పింది.

సిస్టర్ జోజెఫ్ ఇంగ్లీషు మాట్లాడలేదు. కిటీ ఫ్రెంచి భాష తేలికగా మాట్లాడలేదు. కాని బెడింగ్‌టన్ ఏకధాటిగా ఫ్రెంచి భాషలోనే మాట్లాడుతున్నాడు, ఏమీ జంకటం గానీ, ఆగటంగానీ లేదు, సిస్టర్‌లోని స్వచ్ఛమైన స్వేచ్ఛా దరహాసాన్ని చూసి కిటీకి ఎక్కువ విస్మయమేమీ కలుగలేదు.

ఈ మత సంబంధీకులు గంభీరంగా వుంటారని ఆమెకు తెలుసు. అయినా సిస్టర్ దరహాసం చాలా బాగున్నట్లని పించింది.

# 38

తలుపులు తెరుచుకున్నాయి. ఎవరో ప్రయత్నించి తెరిచినట్లుగాగాక అవే ఎవరిస్వాగతానికో తెరుచుకున్నాయి. మదర్ గదిలో అడుగుపెట్టింది. ఒకక్షణం ద్వారంలోనే నిల బడి నవ్వింది. సిస్టర్ జోజెఫ్‌ను బెడింగ్‌టన్ హాస్యవదనాన్ని చూసి ఆమె పెదవులపై కూడ ఒకమందహాసం పరుగెత్తింది. తరువాత ముందుకువచ్చి కిటీతో కరస్పర్శ చేసింది.

"మీారు శ్రీమతిఫేన్‌గదూ?" అని మదర్ ఇంగ్లీషులో అంది. అభినందించుటకు కొంచెం వంగింది. "వీరుడు, నిర్భయు డైన డాక్టరు భార్యను కలుసుకుని నాకు చాలా సంతోషం కల్గింది," అంది.

మదర్ నిష్కల్మష నేత్రాలు తననుచూస్తూ వుండటం కిటీ గ్రహించింది. అది కిటీకి చెడుగా కన్పించలేదు. మదర్ తనను పరీక్షిస్తున్నట్లనిపించింది. చాలా సాధుభావంతో మదర్ అతిథుల్ని కూర్చోవలసిందిగా కోరి తానూకూర్చుంది. సిస్టర్ జోజెఫ్ ముఖంలో వెనుకటి దరహాస మావిధంగానేవుంది. ఆమె మదర్‌కు కొంచెం వెనుకగా నిలబడివుంది.

"మీా ఇంగ్లీషువారికి టీ అంటే ఎక్కువయిష్టం. ఇప్పుడే తయారు చేయించాను. అదిచైనా పద్ధతిలో ఇవ్వబడినందుకు మాత్రం క్షమించండి. మిష్టర్ బెడింగ్‌టన్‌కు విస్కీ-చాలా

యిష్టమని నాకు తెలుసు, కాని నేనా పర్పు చేయలేను," అని మదర్ నవ్వింది, కాని ఆమె గంభీరాకృతిలో ఎంతో అర్థం నిహితమైవుంది.

"మదర్ మీరు చెప్పేది, నేనొక శుద్ధ త్రాగుబోతు నన్నట్లుగా మాట్లాడుతున్నారు."

"మీరు ఎప్పుడైనా ఒకనాటికి మద్యపానం చేయ టమేలేదని చెప్తారని కోరుతున్నాను."

"అయినా నేనెప్పుడూ అవసరాన్ని మించి సేవించను."

మదర్ నవ్వింది. వారు తనమాటను ఫ్రెంచిలోకి అను వదించి సిస్టర్ జోజెఫ్‌కు చెప్పారు. సిస్టర్ అమాయకంగా బెండింగ్‌టన్ వైపు చూపులు మరల్చింది.

"మేము మిస్టర్ బెడింగ్‌టన్‌ను గౌరవిస్తాం. రెండు మూడు పర్యాయములు అనాథ బాలుర భోజనానికి మా వద్ద ఏమీలేనప్పుడు వీరు మాకు చాలా సహాయం చేసివున్నారు," అంది మదర్.

వీరు వచ్చినప్పుడు ద్వారం వద్ద కనుపించిన సిస్టర్ ఇంతలో పింగాణీప్లేటులు కప్పులున్న ట్రే తెచ్చింది. అందులో కేక్సు, 'ఫ్రెంచిటోస్టు' వున్నాయి.

"మీరు 'ఫ్రెంచిటోస్టు' తప్పక తినాలి. సిస్టర్ జోజెఫ్ మీ కొరకు ప్రత్యేకంగా తయారు చేసింది."

వారు లోకాభిరామాయణంగా ఏవేవో సంభాషించు కుంటున్నారు. కిటీ హాంకాంగ్‌లో ఎంతకాలం వున్నదీ, అక్కడినుండి ఇక్కడకు వచ్చుటకు చాలా కష్టమేకలిగివుం

టుందని మదర్ కిటీ నడిగింది, ఎప్పుడైనా కిటీ ఫ్రాన్సు వెళ్ళిందా, అయితే అక్కడి కంటే హాంకాంగ్‌లో వుండే వేడి భరించలేకపోయి వుంటుందనీ కూడా అడిగింది. ఆ ఆశ్రమ ప్రశాంత వాతావరణంచూసి తామొక జనసమ్మర్ధమైన పట్టణంలో వున్నామనే నమ్మలేము. అది శాంతికినిలయం. వెలుపల మహామారి భయంకరక్రోధం. జనమంతా భీతాహంతో భీతిల్లి వున్నారు. కాన్వెంట్ రోగులతో నిండివుంది. జనం మరణాసన్నులై వున్నారు. సిస్టర్ల పోషణలోవున్న అనాథ శిశువులు ఒక వంతుమరణించారు.

కిటీ తేలికగా ఈ వాతావరణాని కాకర్షించబడింది. ఆమె మదర్‌వంక తదేకంగా చూస్తూంది. ఆమె స్వచ్ఛమైన తెల్లని దుస్తులు ధరించివుంది. అంతా తెలుపే, హృదయం స్పందన మాత్రం వెచ్చగా, ఎర్రగావుంది. మదర్ మధ్య వయస్కురాలు. వయస్సు నలభై యాభై కి మధ్యగావుంటుంది. ఆమె నునుపైన పసిమి ముఖంలో ముడుతలేవీలేవు, శరీరం దృఢంగా, చేతులు అందంగా, బలంగావున్నాయి; ఇవన్నీ చూస్తే ఆమె సరియైన వయస్సు తెలుసుకొనటం కష్టం. కోల ముఖం, అందంగా తగినట్లుండే పలువరుస, అందమైన ముక్కు సన్నగా వున్న నల్లని కనుబొమల క్రింద వున్న కన్నులు ఆమె శీలాన్ని వెల్లడిస్తున్నాయి. కన్నులుపెద్దవి, నల్లగావున్నాయి; వాటిల్లో నిరుత్సాహంలేదు, గాంభీర్యముంది. ఆమెను ఎవరైనా ఒక్కసారి చూసినా యౌవనంలోవున్నప్పుడు ఆమె అందమైనదిగా భావించబడే వుంటుందని చెప్పవచ్చు. ఈ సౌందర్యమే వయస్సు పెరిగినకొద్దీ ఉన్నత శీలానికే వృద్ధియనిపిస్తుంది.

ఆమె కంఠంలో తీయదనముంది. ఆమె ఇంగ్లీషు మాట్లాడినా ఫ్రెంచి మాట్లాడినా చాలానెమ్మదిగా మాట్లాడుతుంది; కాని ఆమె వ్యక్తిత్వంలో ఒక ప్రత్యేకతతో ఆమెలో గొప్పతనం వున్నట్లు కన్పిస్తూవుంటుంది. తాను చెప్పింది ఒప్పించటం ఆమె అలవాటు; అంతమాత్రంచేత అమెలో గర్వంలేదు. చర్చి నిబంధనలన్నీ ఆమెకు తుణ్ణంగా తెలుసు. ఇవన్నీ వున్నా ఆమెలో సహానశక్తి వుందని కిటీ గ్రహించింది. బెడింగ్టన్ మాట్లాడే తలాతోకాలేని మాటల్నికూడా ఆమె చాలా శాంతంగా, చిరునవ్వుతో వింటూవుంది. ఇవన్నీగాక కిటీ ఆమెలో ఇంకాకొంత కూడా చూడగలిగింది, దాన్ని వ్యక్తం చేయడానికామెకు మాటలు దొరకటంలేదు.

# 40

బెడింగ్టన్ మరొక 'కేక్' తీసుకుని తినసాగాడు. అతడు కొంటెతనం చిలకరించే కన్నులతో సిస్టర్ జోజెఫ్‌ను చూస్తూన్నాడు. మదర్‌కు జోజెఫ్‌కు ఏదోసంభాషణ జరిగింది గాని కిటీకి ఒక్కమాటా తెలియలేదు.

శ్రీమతిఫేన్ కాన్వెంట్ చూడగోరుతుంటే నేను సంతోషంగా అంగీకరిస్తున్నాను," అని మదర్ కిటీవైపు తిరిగి చిరునవ్వుతో "ప్రస్తుతం మీారిక్కడ చూసినా అంతా చెల్లా చెదరుగా వుంటుంది. పని చాలా ఎక్కువగావుంది, తేలికగా అదంతా పూర్తిచేయటానికి తగినంతమంది సిస్టర్లు ఇక్కడలేరు. అంగ వికలుల ఆశ్రయాన్ని ఖాళీచేసి గాయపడిన సైనికుల కివ్వవలసిందిగా కర్నల్ యూా వత్తిడి చేస్తున్నారు. ఇక

ఇప్పుడు మేము ఆశ్రమంలో మరొకచోట అనాథ శరణాలయాన్ని నిర్మించుకోవలసివచ్చింది."

మదర్ ద్వారంలో నిలబడి కిటీని లోనికి వెళ్ళవలసిందిగా సూచించింది. వారివెంట సిస్టర్ జోజెఫ్, బెడింగ్టన్ కూడా వచ్చాడు. చల్లగా, పరిశుభ్రంగావున్న వరండాలో నడుస్తున్నారు. ముందు వారొక పెద్దగదిలోనికి వెళ్ళారు. అక్కడ కొందరు చైనాబాలికలు కలంకారీపని చేస్తున్నారు. ఆగంతకుల్ని చూసి అందరూ పనులువదలి లేచినిలబడ్డారు. మదర్ వారి పనుల నమూనాలను కొన్నింటిని కిటీకి చూపించింది.

"మేమెప్పుడూ ఈపని చేస్తూనేవుంటాం. కనీసం పని చేసే సమయమందైనా మహామారి భయం మనస్సులో వుండదు."

వారు మరొకగదిలోనికి వెళ్ళారు. అక్కడ కొందరు బాలికలు మిషన్లపై సాధారణ కుట్టుపని చేస్తున్నారు. తరువాత అక్కడినుంచి మూడవగదికి వెళ్ళారు. అక్కడందరూ చిన్నపిల్లలే వున్నారు. ఒకచైనా క్రైస్తవస్త్రీ వారందర్నీ చూస్తూవుంటుంది. పిల్లలు అల్లరిచేస్తూ ఆటలాడుతున్నారు. మదర్ గదిలో ప్రవేశించగానే అందరూవచ్చి ఆమెను ముట్టడించారు. పిల్లలు చైనీయులు. అందరి కన్నులు, జుట్టునల్లగా వున్నాయి. పిల్లలు మదర్ చేతులుపట్టుకొని ఆమె ఒడిలో దాగిపోవాలనుకుంటున్నారు. మదర్ ముఖమాత్రమందు ఏదో అనిర్వచనీయమైన ఆనందందో ప్రకాశిస్తుంది. ఆమె కూడా వారితో ఆడుకోసాగింది. ఆమె పిల్లలకు చైనాభాషలో ఏదో

చెప్తుంది. చైనాభాష కిటీకి తెలియనప్పటికి మదర్ వారితో వాత్సల్యంగా ఏదో మాట్లాడుతుందని మాత్రం గ్రహించింది. ఆమె కొద్దిగా కంపనం చెందింది. పిల్లల వస్త్రధారణ చాలా విచిత్రంగావుంది– వారినేత్రాలు– వారి ఆకారాలుకూడా నచ్చలేదు. వీరందరూ మానవసంతానమేనని అతికష్టంమీద తెలుసుకుంది. వారిలో ఆమెకేమీ ఆకర్షణ కన్పించలేదు. కాని మదర్ వారందరిమధ్య దయాదేవత అవతరించినట్లు వదల కుండా వెంబడించారు. అందరూ ఆమెకు కరచుకుపోయారు మదర్ సన్యాసిని చిరునవ్వుతో కోపగించింది. మదర్‌ను చూసి భయపడాల్సిన కారణం పిల్లలకేమీ కన్పించలేదు.

మదర్ వరండాలో నడుస్తూ చెప్పింది. "ఆ పిల్లలు అనాథులెందుకయ్యారో మీకు తెలుసా? వారి తల్లిదండ్రులు వారి భారాన్ని వహించదలచటంలేదు. మేము ప్రతి తల్లిదం డ్రులు వారిభారాన్ని వహించదలచటంలేదు. మేము ప్రతి తల్లి–తండ్రికి బిడ్డల కొరకు కొద్దిగా డబ్బిస్తాం, లేక పోతే వారు పిల్లల్ని ఇక్కడకు తీసుకురాకుండా, వదలివేసేవాడై పోతారు." అని ఆమె సిష్టర్ జోజెఫ్ వైపుతిరిగి, "ఈరోజు పిల్లలెవరూ రాలేదుగదూ?" అని అడిగింది.

"నలుగురు."

"ఈ కలరావచ్చిన తరువాత స్త్రీలు పిల్లల్ని అసలే వదిలేస్తున్నారు."

అందరూ ఒక ద్వారం ముందు ఆగారు. అక్కడ "వికలాంగుల ఆశ్రమం" అని వ్రాయబడివుంది. అక్కడ మూల్గులు కేకలు విన్పిస్తున్నాయి, కిటీ వాటిని అంతకు ముందెప్పుడూ

విని వుండలేదు. "ప్రతివారూ దీనిని చూడాలనుకోరు," అంది మదర్ బాధను వ్యక్తపరచే కంఠంతో. తరువాత ఆకస్మిక ఆలోచన ఏదో కలిగి, "డాక్టర్ ఫేజ లోన లేరుగదూ?" అని అంది.

మదర్ సిస్టర్ జోజెఫ్‌వంక ప్రశ్నార్థకంగా చూసింది. సిస్టర్ చిరునవ్వుతో తలుపు తెరుచుకొని లోనికివెళ్ళింది. కిటీ తనలోనే ముకుళించుకుపోయింది. సిస్టర్ జోజెఫ్ తిరిగివచ్చి ఆయన లోనలేరనీ, చాలా సేపటివరకు తిరిగిరారనీ చెప్పింది.

"ఆరవనంబరు పరిస్థితి ఎలావుంది?"

"పోవరేగార్సన్ గదూ. అతడు పరలోకగతుడైయాడు."

మదర్ వక్షముపై చేతులుంచుకొని ప్రార్థించింది. వాళ్ళు వసారాలో నడచుచున్నప్పుడు ఎదురుగా రెండు ముసుగులు వేసిన పడకలుండటం కిటీ గమనించింది. మదర్ బెడింగ్‌టజ నుద్దేశించిఅంది, "మావద్ద మంచాలు చాలా తక్కువగా వున్నాయి. అప్పుడప్పుడు యిద్దరు రోగుల్ని ఒకే మంచంపై పడుకోబెట్టవలసివస్తుంది. ఎవరైనా చనిపోయారంటే వెంటనే బయట పెట్టేస్తున్నాం, ఆ వెంటనే మరొక రోగికి ఏర్పాట్లు చేయాల్సివుంటుంది." ఆమె కిటీవంక చూసి దరహాసం చేస్తూ, "ఇక మా ప్రార్థనా మందిరాన్ని చూపిస్తాం. అదంటే మాకు చాలా గర్వం. ఫ్రాన్సునుంచి ఒక మిత్రుడు మాకోరకు శుభప్రదమైన మేరీమాత నిలువెత్తు విగ్రహాన్ని పంపించారు."

# 41

ప్రార్థనమందిరం పొడవైనగది. గోడలకు వెల్లవేయబడి వుంది. గదినిండా బెంచీలున్నాయి. గదికి రెండవప్రక్క మందిరంవుంది; అక్కడ విగ్రహాలు ప్రతిష్ఠంపబడివున్నాయి. ఏసు శిలువ వేయబడిన చిత్రం ఒకటుంది, రెండు మేరీమాత చిత్రాలుకూడా వున్నాయి. మేరీమాతచిత్రాలు రెండింటిలో చాలా దుఃఖచిహ్నాలు కన్పిస్తాయి. చిత్రాలు చాలా అసహ్యంగా చిత్రించారు. రంగులు ఉపయోగించడమే తెలియనివారెవరో చిత్రాలను వ్రాసివుంటారు. గోడలపై 'క్రాస్' చిహ్నాలు చిత్రించబడివున్నాయి. ప్రార్థనమందిరంలో ఏమీ ఆకర్షణలేదు.

ఇద్దరు సన్యాసినులు ప్రార్థనాగృహానికి చేరగానే ప్రణమిల్లి ప్రార్థనచేశారు. ప్రార్థనానంతరం మదర్ కిటీ నుద్దేశించి "ఫ్రాన్సునుంచి పంపే వస్తువులన్నీ ఇక్కడకు చేరేసరికి విరిగి ముక్కలైపోతాయి,. కాని మా మిత్రుడు పంపిన ఈ విగ్రహం ఇక్కడకు జాగ్రత్తగా ఎలాచేరిందో ఏమో? ఇది ఇక్కడ వరకు జాగ్రత్తగా చేరటమే విచిత్రం." అంది.

వెడింగ్టన్ కొంటె కన్నుల్లో ఏదో కాంతివచ్చింది, కాని అతడు మౌనం వహించాడు.

"ఇక్కడిచిత్రాలన్నీ మాసిస్టరొకామె వ్రాసింది. ఆమె నిజంగా చిత్రగారిణే. దురదృష్టం, ఆమెకూడా ఈ మహామారి కావాతై పరలోకప్రాప్తిచెందింది. ఎంతమంచి చిత్రాలో చూశారుగా?" అంటూ మదర్ తనవక్షముపై క్రాస్‌చిహ్నం వేసుకొంది.

కిటీ అంగీకారంగా తలూపింది. ఎదురుగా పీఠంపై కాగితపు పుష్పములు, మైనపువత్తులు వున్నాయి; అవి ఒక క్రమంలో అలంకరించబడినట్లులేవు.

"ఇక్కడ మావద్ద "పవిత్రగ్రంథం" కూడా వుండటం మా అదృష్టం."

"మంచిది." అంది కిటీ.

"ఈ పవిత్రగ్రంథం కారణంగానే క్లేశములతో కూడిన వాతావరణంలో మా కెంతో ధైర్యం కలుగుతుంది."

ప్రార్థనాగృహంనుంచి బయలుదేరి మొదట తాము కూర్చున్న గదికి చేరుకున్నారు.

"మీరీ రోజు వచ్చిన పిల్లల్ని చూడాలనుకుంటున్నారా?"

"తప్పక;" కిటీ జవాబు చెప్పింది.

మదర్ వారందర్నీ ఒక చిన్నగదిలోనికి తీసుకువెళ్ళింది. అక్కడ ఒక్కదుప్పటిక్రింద ఏదో కదులుతూంది. సిస్టర్ ఆ దుప్పటిని తొలగించింది. ఎదురుగా నలుగురు పసిపాపలున్నారు. వారందరూ ఎర్రగావున్నారు, కాళ్ళు చేతులు గాలిలో ఆడిస్తున్నారు. వారు చైనాపిల్లలు, వారి ముఖాలు విచిత్రంగా వున్నాయి. వారు మానవసంతానమని తెలుసుకొనటం చాలా కష్టం, ఏదోవిచిత్రజంతు సంతానంవలె కన్పిస్తున్నారు. మదర్ చిరునవ్వుతో వారిని చూస్తూంది.

"ఎంత చురుకుగావున్నారు. ఒకొక్కప్పుడు ఇక్క-

డకు రాగానే మరణిస్తారు. మేమిక్కడకు వీరిని చేర్చుకోగానే మతాంతీకరణ జరిపిస్తాం.''

సిస్టర్ జోజెఫ్ అందుకొని, "డాక్టరు ఫేగారు ఈ పిల్లలతో ఒక గంటైనా వినోదిస్తారు. వీరు ఏడ్వారంటే వెంటనే ఆయన తన ఒడిలోనికి తీసుకుంటారు. ఆయన ఒడిలో వీరికెంత సౌఖ్యంగా వుంటుందో ఏమో ఆయన వద్దకు వెళ్ళగానే ఏడ్వడంమాని నవ్వుతారు,'' అంది.

కిటీ బెడింగ్టన్ లిద్దరూ ఇక వెళ్ళడానికి బయలుదేరారు. బయటద్వారం దగ్గరకు రాగానే కిటీ మదర్‌నుఎంతో అభినందించింది. మదర్ వాటిని స్వీకరించినట్లుగా కొంచెం వంగింది.

''మాకు చాలా సంతోషం కల్గింది. మీ భర్తగారు మాయందెంతదయ, శ్రద్ధ చూపిస్తున్నారో మీకు తెలియక పోవచ్చు. మాదృష్టిలో ఆయన స్వర్గంనుంచేవచ్చారు మీరు కూడా హాంకాంగ్ నుంచి ఇక్కడకు వచ్చారని తెలిసినప్పుడు ఎక్కువ సంతోషించలేదు. ఆయన ఎంతోఅలసి ఇంటికి వచ్చినప్పుడు మిమ్మల్నిచూసి అలసటను, విచారాన్ని పోగొట్టుకొంటూ వుంటారు. మీ ప్రేమ వారిని మరల ఉత్తేజితుల్ని చేస్తూ వుండివుంటుంది, మీరు వారియందు ఎక్కువశ్రద్ధ వుంచండి, ఎక్కువగా పనిచేయనీయకండి. కనీసం మామేలు కొరకైనా వారికి పూర్తిగా విశ్రాంతిని, సుఖాన్ని కల్గిస్తూ వుండండి.''

కిటీ సిగ్గుపడింది. ఆమె ఏమీ చెప్పలేక పోయింది. మదర్ మరొకసారి కిటీతో కరస్పర్శచేసింది. ఇద్దరి చేతులు

కలుసుకున్నంతసేపూ కిటీ మదరు కళ్ళల్లోకి చూస్తుంది. ఆమెకు మదర్ యోచనాపరురాలివలె కన్పించింది.

సిస్టరు సెయింట్ జోజెఫ్ తలుపులువేసింది. కిటీ వెళ్ళి డోలీలో కూర్చుంది. వారిప్పుడు మరల ఆ ఇరుకైన, మురికి వంకటింకర బజార్లగుండా వెళ్ళుతున్నారు. వెడింగ్టన్ అప్పు డప్పుడు ఏదైనా మాట్లాడేవాడు, కాని కిటీ జవాబీయలేదు. అతడు కిటీవంక చూసేవాడు, కాని డోలీ పర్దాలువేయబడి వున్నాయి. కిటీ అతనికి కన్పించటంలేదు, గనుక మౌనంగా నడవనారంభించాడు, వారు నదీతీరానికి చేరినప్పుడు క్రిందికి దిగగానే కిటీనిచూసి వెడింగ్టన్, విస్మయంతో స్థంభించి పోయాడు. కిటీ కళ్ళనుంచి కన్నీరు ధారగట్టింది.

"ఏమిటి, ఏం జరిగింది?" అని అతడు ఆశ్చర్యంగా అడిగాడు.

''ఏమీలేదు, అంతా నా మూర్ఖత్వం!'' అని కిటీ మందహాసం చేయటానికి ప్రయత్నిస్తూ అంది.

# 42

కిటీ తన బంగళాలో కిటికీకి ఎదురుగా ఒంటరిగా పడక కుర్చీపై కూర్చునివుంది. ఆమెదృష్టి నదికావలితీరాన వున్న మందిరంపైవుంది. చీకటి ముసురుకుంటుంది. కిటీ తన ఆలోచ నలను నిగ్రహించుకొనుటకు ప్రయత్నిస్తున్నది. కాన్వెంటుకు ఒక్కపర్యాయం వెళ్ళితేనే ఇంత కదలిక కలుగుతుందని ఆమె భావించివుండలేదు. అక్కడామెకేమీ పనిలేదు. చాలా

రోజులు ఆ నాలుగుగోడలమధ్య వుండి విరక్తి చెందినప్పుడు ఆ మురికి యిరుకు బజార్లగుండా వెళ్ళటాని కంగీకరించింది.

కాని కాన్వెంట్‌కు వెళ్ళినప్పుడు ఆమెకు మరో ప్రపం చంలోనికి వెళ్ళినట్లనిపించింది. ఆ సాధారణగదుల్ని, వరం డాను చూసి ఏదో అపరిచిత ఆత్మ అక్కడనివసిస్తున్నట్లు ఆమె కనిపించింది, ఆ చిన్నప్రార్థనా గృహం ఏ ఆకర్షణాలేక పోయినా ఆ రూపంలోనే తనవైపుకు ఆకర్షించుకుంటుంది. పెద్దపెద్ద చర్చిలలో లేనిదేదో అక్కడుంది; అక్కడ అలంకా రాలుంటాయి, పెద్దపెద్ద దీపస్తంభాలు, అద్దాలు, చిత్రాలు ఎన్నోవుంటాయి. కాని ఇదిమాత్రం సాదాగావుంది. అక్కడ వారు తనయందు కనబర్చిన విశ్వాసం, సిస్టర్లు తనయందు చూపిన ప్రేమవాటన్నిటివలన ఆ చిన్నగదిలో ఆత్మసౌందర్యం వ్యాపించింది. ఈ భయంకర సంకటావస్థలోకూడా అక్కడ కాన్వెంట్‌లో పనులు ఎంతో నియబద్ధంగానూ, జాగ్రత్త గానూ జరుగుతున్నాయి. అక్కడ ఎంతో శాంతివుంది. అపా యంలో శాంతి నివాసం ఆచరణయోగ్యతకు నిదర్శనం. అక్కడిశాంతి ఆ భయంకర సంకటాన్ని అపహాస్యం చేస్తున్న ట్లుగావుంది. అదంతా ఎంతశక్తివంతమైనది. కిటీ చెవుల్లో ఇంతవరకు ఆ రోగుల వూగించివేసే అరపులు ప్రతిధ్వనిస్తు న్నాయి.

వాల్టర్‌ను గురించి వారెన్ని ఆశాతీతమైన విషయాలు చెప్పారు. ముందు సిస్టర్ జోజెఫ్ చెప్పింది, తరువాత మదర్ కూడా తన నమ్రమైన భాషలో వాల్టర్‌ను ప్రశంశించింది. కోర్కెకు విరుద్ధంగా కిటీకి వాల్టర్‌పై గర్వించింది. బెడింగ్

టీ కూడా వాల్టరును గురించి సంభాషించాడు, కాని సిస్టర్ల మాటల్లో వున్నట్లు అతడిమాటల్లో ప్రశంశాభావం లేదు. హాంకాంగ్‌లో జనులు వాల్టరును దక్షతగలవాడనేవారు. వారుకూడా అతడి యోచనాశక్తిని, సహృదయతను ప్రశంశించేవారు. నిజంగానే అతడు గొప్ప సహృదయుడు, ఎవరైనా జబ్బుపడితే అతడిని చూడగానే బాగయేవారు. అతడి హస్త స్పర్శ వారికానందాన్నిచ్చేది, విశ్రాంతినిచ్చేది; వారి రోగం హరించుకుపోయేది. ఆయన ఎదుటవుంటేనే ఇంద్రజాలం జరిగినట్లుండేది. అతడు దగ్గరున్నంత మాత్రంచేతనే బాధ తగ్గిపోయేది. వాల్టరు కన్నుల్లో తనకు పరిచితమైన పాత స్నేహం తనకు లభించదని కిటీకి తెలుసు. వాల్టర్ హృదయంలో ఎంత ప్రేమ నిండివుందో ఇప్పుడామె తెలుసుకో గలుగుతుంది. అతడా ప్రేమ ఖజానాను ఆ గాయపడినవారికి, రోగులకు దోచి పెడుతున్నాడు. కిటీకి ఏమీ ఈర్ష్యగలుగలేదుగాని తనకే ఏదో వెలితి వెలితిగా కనుపించింది. ఒక భారమైన వస్తువు ఏదో ఆధారంపై నిలబడి వున్నట్లు, ఆ ఆధారం తొలగిపోగానే వస్తువు పడిపోతుందని తోచిందామెకు. 'ఆధారం' అనే విషయమే ఎన్నడూ ఆమె కర్థం కాలేదు.

నేడు కిటీ తనకు తానే ద్వేషించుకొంటుంది, బహుశా ఒకప్పుడు తాను వాల్టర్‌ను ద్వేషించినందుకే కావచ్చు. వాల్టర్‌కు తనభావం తప్పక తెలిసే వుంటుంది, అయినా అతడు ఎంత శాంతంగా, ఏమీ ఆగ్రహంలేకుండా దాన్నంతటినీ భరించాడు. తానే మూర్ఖురాలైంది, వాల్టర్ తనను ప్రేమించేవాడు. నేడామెకు వాల్టర్‌యందు ద్వేషంలేదు; అతడంటే

విరక్తి లేదు. నేడామెలో వాల్టరంటే భయమేర్పడింది. ఆమె చిక్కులో పడిపోయింది. కిటీకేమీ అర్థంకావడంలేదు, వాల్టరులో అసాధారణ గుణాలెన్నో నిండివున్నాయనే దొకటే ఆమె కర్థమవుతుంది. అప్పుడప్పుడు ఇంతకుముందు కూడా ఆమెకు ఆకర్షణలేని గొప్పతనమేదో కనుపించేది.

అప్పుడామె అతనిని ప్రేమించలేకపోయింది. నిరర్థకుడుగా నిరూపించబడిన వ్యక్తినే తాను ప్రేమించింది. అనేక రోజులుగా అవిరామంగా ఆలోచించి ఆమె చార్లీ టవున్సెండ్‌ను తెలుసుకోగలిగింది. అతడు సాధారణ మానవుడు. అతడి అలవాట్లుకూడా సాధారణమైనవే.—కిటీ తన హృదయాన్నుంచి చార్లీని విసరిపారేయ గలిగితే ఎంతబాగుంటుంది! ఇక చార్లీ విషయం ఆలోచించను! ఆలోచించను! అని ఆమె నిశ్చయం చేసుకుంది. బెడింగ్‌టన్ కూడా వాల్టర్‌ను గౌరవిస్తున్నాడు. తానొకర్తె మాత్రమే వాల్టర్‌ను సరిగా అర్థంచేసుకోలేక పోయింది. ఎందుకని? ఎందుకనంటే వాల్టర్ కిటీని ప్రేమిస్తున్నాడు, కాని తాను అతనిని ప్రేమించటంలేదు.— ఇంతకూ మానవ హృదయంలో వుండే ఆ వస్తువు ఏమిటి? తనను ప్రేమించేవారిని తిరస్కరిస్తుంది, దగ్గరకే చేరనీయదు.— కాని బెడింగ్‌టన్ తనకు వాల్టర్ మంచిగా కన్పించటం లేదనే విషయాన్ని అంగీకరించాడు. పురుషులతనిని కోరలేకపోవచ్చు.— కాని ఆ సిస్టర్‌సెయింట్లకు వాల్టర్ యందు ఎంత ప్రేమ, అనురాగాలున్నాయి? స్త్రీలయందు ఆతడి ప్రవర్తన వేరుగా వుంటుంది. ఆతడి సిగ్గుపడే స్వభావాన్ని చూసి వారు అతనిని దయాళువనుకొంటారు.

# 43

కిటీపై ఆ సిస్టర్ల ప్రభావం చాలాపడింది. నవ్వుముఖం, గులాబివంటి బుగ్గలుగల సిస్టరు జోజెప్! ఆమె మదర్ దళంలో తనదేశంనుంచి బయలుదేరి హాంకాంగ్ వచ్చింది, ఆ తరువాత ఇక్కడకు, ఆమెచెలికత్తెలు, జబ్బులు వగైరాలతో ఆమెను వదలి పరలోకప్రాప్తిపొందారు; అప్పటికీ ఆమె ముఖంలో ఆనందం ప్రకాశిస్తూనేవుంటుంది. ఇంతకూ ఆమెకా సరళమైన చూపులు, ఆ సుందరదరహాసము ఎక్కడినుంచి ఎలా లభించాయి?— మరి మదర్! కిటీకి ఆమె తనఎదుట నిలబడివున్నట్లే వుంది, ఆమె సిగ్గుపడింది. వారి సరళమైన పవిత్ర ఆచరణ చూసి ఆమెయందు పూర్తిగా పూజ్యభావం కలుగుతుంది. సిస్టరు జోజెప ప్రతిపనిలోనూ, ప్రతి జవాబులోనూ మదరుయందు వినయం చూపటం స్పష్టంగా కన్పిస్తుంది.— మరి బెడింగ్టన్! వ్యర్థప్రసంగం చేసేవాడు, ఉద్దాముడు! అతడి ప్రతి జవాబులోనూ అక్కడి సౌకర్యాల్లోని వెలితి తనను బాధిస్తున్నట్లు వ్యక్తంచేసేవాడని అనిపిస్తుంది. మదర్ కిటీతో వ్యర్థంగానే తాను ఒక ఫ్రెంచి ఉన్నతకుటుంబానికి చెందిన దానినని చెప్పింది. ప్రతికదలికలోనూ ఆమె ఉన్నత కుటుంబానికి చెందినదనేది ఎవరైనా తెలుసుకోగలుగుతారు, ఆమె ముఖంలో ప్రస్ఫుటమైయే భావాలనుచూస్తే, ఆమె ఆదేశాన్నెవరూ తిరస్కరించలేరనీ, ఇంతకుముందూ తన ఆజ్ఞనెవరూ ఉల్లంఘించలేదనీ చెప్తున్నట్లనిపిస్తుంది. గౌరవనీయకుటుంబానికి చెందిన విషయాలన్నీ ఆమెలో వున్నాయి, వాటితో పాటు సాధ్వివంటి సౌశీల్యము. ఆమె ముఖం పుష్టిగానూ, అందం

గానూ ఆకర్షవంతంగా వుంటుంది. ఆముఖంలో గాంభీర్యముద్ర అంకితమై వుంటుంది. ఇదంతా వున్నప్పటికీ, ఆమె వెంట తాను చిన్నపిల్లల గదికి వెళ్ళినప్పుడు పిల్లలు ఆమె ముందు వెనుకల అతుక్కుపోయారు. ఆ పసిపిల్లలను చూస్తున్నప్పుడు ఆమె కన్నుల్లో స్వచ్ఛమైన మందహాసం నిండివుంది. వారందరిలో ఎంత సౌమ్యభావం నిండివుంది? సిస్టరు జోజెఫ్ వాల్టరును ప్రశంశించినప్పుడు కిటీకి విచిత్రంగా కన్పించింది. కిటీకూడా తల్లి కావాలని వాల్టరు కోరేవాడని ఆమెకు తెలుసు. కాని వాల్టరు లోని నిగ్రహ ఆచరణను చూసి, అతడెప్పుడైనా ఏ పసిపాప యందైనా మమకారం చూపగలడనేది ఆమె భావించుకోలేక పోయింది. వాల్టరు ఎంత అద్భుతమైనవాడు అని కిటీ యోచించింది.

కాని ఈ సంతోషకరమైన అనుభవంతరువాతకూడా కిటీకి కాన్వెంటీలో ఏదోవస్తువు తనకు దూరంగావున్నట్లని పించింది. సిస్టర్ జోజెఫ్ సౌమ్యంగా ప్రవర్తించింది. అమె వినయవిధేయతలకు సలయమె ; మదర్ కూడా సాక్షాత్ దయాస్వరూపిణే, అయినప్పటికీ తనకు వారికి మధ్య ఏదో దూరం ఆమెను బాధిస్తూనేవుంది. తనకు భిన్నమైనది వారి భాషేగాదు, వారి హృదయంలోని ఆకాంక్షలుకూడా భిన్నమైనవే. అక్కడినుంచి వచ్చేముందు వారు తలుపులు మూసుకున్నప్పుడు వారందరూ వెంటనే తనను మరచిపోయారనీ, మరచిపోయి తిరిగి తమ పనుల్లో నిమగ్నమైపోయారనే భావం కలిగింది. అక్కడినుండి తాను వచ్చిన తరువాత సిస్టర్లందరూ అక్కడ తన ఉనికే ఏమీ లేనట్లు భావించారేమో అనే

యోచన గలిగింది. తాను కాన్వెంటునుంచి భౌతికంగానే బయటకుపంపివేయ బడలేదనీ, తా నిప్పుడు పరితపించిపో తున్న జీవితాన్నిచ్చే మనోహరమైన పుష్పోద్యానవనాన్నుంచి గెంటివేయబడినట్లుగా భావించింది—తాను పూర్తిగా ఒంటరి దానననేభావం ఆమె కాకస్మికంగా కలిగినట్లు భావించింది. ఆమెచుట్టూ అంతా శూన్యం. ఈ ఒంటరితనం, శూన్యంను గురించి ఆమె కెన్నడూ తెలియనేతెలియదు. అందుకే ఆమె ఏడ్చింది. ఇప్పుడామె కుర్చీలో నీరసంగా పడివుంది. "అయ్యో! నే నెంత నిర్జీవిని, ఎంత వ్యర్ధురాలను" అని యోచించుకొం టుంది.

# 44

ఆరోజు సాయంత్రం వాల్టరు రోజూకంటే త్వరగా బంగళాకు తిరిగివచ్చాడు. కిటీ పడకకుర్చీలో కిటికీకి ఎదురుగా పడుకొని వుంది. చీకటిగాఉంది.

"లాంతరు అవసరంలేదా?" అని వాల్టరు అడిగాడు.

"భోజనం తయారైనతరువాత నౌకరేతీసుకువస్తాడు."

వాల్టరు అప్పుడప్పుడు ఇదేవిధంగా కిటీతో ఏదోఒకటి మాట్లాడుతూవుండేవాడు. ఆ సంభాషణ వారిద్దరూ భార్యాభర్తలుగా గాక ఏదోపరిచయమున్న వ్యక్తులన్నట్లుండేది. ఆతడి హృదయంలో కిటీపై ద్వేషమున్నట్లు వాల్టరు ఆచరణ వలన ఎన్నడూ కన్పించలేదు. అతడెప్పుడూ కిటీ కన్నుల్లో చూపు నిలపలేదు; మరెన్నడూ ఆమెఎదుట చిరునవ్వుకూడా నవ్వలేదు. అవసరానికి మించి వినయంగావుండేవాడు.

"వాల్టరు! ఈ మహామ్మారి తరువాత నీ ఆలోచన ఏమిటి?" అని కిటీ అడిగింది.

వాల్టరు జవాబు చెప్పడానికిముందు ఒక క్షణం మౌనం వహించాడు. కిటీకి అతడిముఖం కన్పించటంలేదు.

"నే నింకా ఆ విషయాన్ని గురించి ఆలోచించలేదు." ఇంతకుముందు కిటీ వాల్టరుతో తన మనస్సుకేదితోస్తే అదే అనేసేది; మాట్లాడటానికిముందు ఆలోచించాల్సిన అవసరమే ఆమెకెన్నడూ కన్పించలేదు. కాని ఇప్పుడు! ఇప్పుడామె వాల్టరుకు భయపడుతుంది. ఆమె పెదవులు కంపిస్తున్నాయి—హృదయస్పందనం హెచ్చింది.

"నే నీరోజు మూడవజామున కాన్వెంటుకు వెళ్ళాను."

"అవును, నాకు తెలిసింది"

కిటీ ఎంతో ప్రయత్నించి మాట్లాడుతుంది. మాటలు దొరకటంలేదు.

"నీవు నిజంగా చంపటానికే నన్నిక్కడకు తీసుకు వచ్చావా?"

"కిటీ, నీ స్థానంలో నేనేవుంటే ఒంటరిగానే నిగ్రహించుకొనేవాడిని, కాని నా ఉద్దేశ్యం ఈ విషయాలు సంభాషించటం వ్యర్థమనే, మనం అదంతా మర్చిపోతేనేమంచిది"

"కాని నీవూ మర్చిపోలేకపోతున్నావు, నేనూ మర్చిపోలేకపోతున్నాను. ఇక్కడికి వచ్చినప్పటినుంచీ నే నిదే ఆలోచిస్తున్నాను. నేను చెప్పదలచుకున్నదైనా కనీసం వినలేవా?"

"తప్పక వింటాను."

"నేను నిన్ను చాలా దుఃఖపెట్టాను. నేను నీ నమ్మకానికి తీరని క్షతి కలిగించాను."

వాల్టరు విగ్రహంవలె నిశ్చలంగా నిలబడివున్నాడు. అతను నిశ్చలంగా వుండటం మరీ భయం కలిగిస్తుంది.

"నీవు నా మాటను అర్థంచేసుకుంటావో లేదోకూడా నాకు తెలియదు. అటువంటి విషయాలు సమాప్తిచెందగానే స్త్రీకి వాటి విలువేమీవుండదు. పురుషులపై దాని ప్రభావమెలా పనిచేస్తుందో నాకు తెలియదు." కిటీకిప్పుడు తనకంఠం అన్యమైనదిగా కన్పిస్తుంది." చార్లీ ఎటువంటిమనిషో నీకు తెలుసు. అతడేమిచేస్తాడోకూడా నీకు తెలుసు నీ ఆలోచన సరియైనదే. అతడు పూర్తిగా వ్యర్థుడు, నేనూ వ్యర్థురాలిని కానిచో అతని పంజాలో ఎందుకు చిక్కుకుంటాను? నేను నిన్ను క్షమార్పణ కోరటంలేదు, మొదటివలె ప్రేమించమనీ కోరటంలేదు; కాని మనిద్దరం మిత్రులవలెకూడా వుండలేమా? ఇక్కడ ఈ మహామారితో నలువైపులా మానవులు మరణిస్తున్నారు, కాన్వెంటులో ఆ సన్యాసినులు......"

వాల్టరు మాటకు అడ్డువచ్చాడు "వారికి వీటన్నిటితో సంబంధమేమిటి?"

"అవును! నాకు తెలియదు. నే నీరోజు అక్కడకు వెళ్ళినప్పుడు దీనితో వారికి సంబంధముందనే ఆలోచనే నన్నావరించింది. ఇక్కడదంతా ఎంత భయంకరంగావుంది, మరి ఇటువంటి వాతావరణంలో వారి త్యాగమెంత ఆదర్శనీయం.

నావంటి మూర్ఖురాలైన స్త్రీ నీకేమీ సహాకరించకపోగా నీకు చాలా దుఃఖం కలిగించాననే విషయంఆలోచించకుండా వుండలేకపోతున్నాను. నిజంగానే నేను వ్యర్థురాలను. నీవు నన్నుగురించి ఆలోచించదగినంత యోగ్యురాలనుకూడా గాదు."

వాల్టరు జవాబూచెప్పలేదు, వున్నచోటునుంచి ఏ మాత్రం చలించనూలేదు. కిటీ ఇంకా మాట్లాడాలని నిరీక్షిస్తు న్నట్లుంది.

"బెడింగ్టన్, ఆ సన్యాసినులు నిన్నెంతగానో ప్రశం శించారు. నీవంటే నేనెంతో గర్విస్తున్నాను వాల్టరు!" అంది కిటీ.

"కాని నీవావిధంగా ఆలోచించటంలేదు. నీవు నన్ను ద్వేషిస్తూనేవున్నావు. అయితే ఇప్పుడు ద్వేషించటంలేదా?"

"నీవంటే నేనెంత భయపడుతున్నానో నీకు తెలియదు."

మరల వాల్టరు మౌనంవహించాడు. తరువాత, "నేను నిన్ను అర్థం చేసుకొనగలగటంలేదు. ఇంతకూ నీవు కోరే దేమిటో నాకు బోధపడటంలేదు."

"ఏమీలేదు. నాకేమీ అవసరంలేదు. నీవిక ఏవిధం గానూ బాధపడవద్దనేదే నాకోర్కె."

వాల్టరు మరింత కాఠిన్యం వహించాడని కిటీతలచింది. జవాబు చెప్పినప్పుడు అతడికంఠం నీరసంగావుంది.— "నాకు దుఃఖంవుందని నీవనుకోవటం పొరబడ్డావు. నిన్ను గురించి ఆలోచించగలగటానికి కూడా అవకాశంలేనంత అధికంగా పనివుంది నాకిప్పుడు."

"కాన్వెంట్‌లో నేను పనిచేయటానికి సిస్టర్లంగీకరి స్తారో లేదో తెలియదు. వారికీ చాలా పని వున్నది. వారికి నేనేమైనా వుపయోగపడగలిగితే వారికెంతో కృతజ్ఞురాలనై వుంటాను."

"కాని ఆ పనిలో ఏమీ ఆకర్షణా, ఆసక్తులుండవు, అదంత తేలికాగాదు. ఎక్కువకాలం నీవది చేయగలుగుతా వనేది నాకు సందేహమే."

"వాల్టరు నిజంగా నేనంటే నీకింత ద్వేషమా?"

"లేదు. నాకు నాయందే ద్వేషం!" వాల్టరు కంఠం బరువుగావుంది.

# 45

భోజనానంతరం వాల్టరు నియమానుసారంగా కొద్ది కాలం చదువుకునేవాడు. కిటీ నిద్రపోగానే అతడు పుస్తకం మడచి తన పరిశోధనాలయం లోకి వెళ్ళేవాడు. రాత్రి చాలా ప్రొద్దుపోయేవరకు అక్కడే ఏదోఒకపని చేస్తూ వుండేవాడు. వాల్టరుచాలా తక్కువగా నిద్రించేవాడు. ఆ బంగళాలోనే ఒక గదిలో అతడు తన పరిశోధనాలయాన్ని ఏర్పాటు చేసుకు న్నాడు. ఇంతకూ అతడు తనపరిశోధనాలయంలో ఏమి పరిశో ధిస్తున్నాడో కిటీకెప్పుడూ బోధపడలేదు. అతడు తన పనిని గురించి ఎన్నడూ కిటీకి చెప్పనూలేదు. అతడు మాటలకలవా టున్నవాడుగాడు. కిటీ వాల్టరుమాటల్ని గురించి లోతుగా ఆలోచిస్తూవుంది. వారిద్దరి సంభాషణ వారినొక నిర్ణయానికి తీసుకురాలేదు. కిటీ వాల్టరును చాలా స్వల్పంగా అర్థం చేసు

కోగలుగుతుంది. ఇంతకుముందు వాల్టరు చెప్పిన మాటలు నిజమా కాదా అనేది ఆమె తేలికగా నమ్మలేకపోతూవుంది. ఇక తనకిప్పుడు సర్వస్వము వాల్టరే అయినప్పుడు, తాను వాల్టరును గురించి ఏమీ గ్రహించకపోవటంకూడా జరగగలుగుతుందా? తన మాటలు ఒకప్పుడు వాల్టరు కెంతనచ్చేవి, ఇప్పుడో తనమాటల్నే వినగోరుటలేదు, అనేది తన ఆలోచనలో కిటీకి గోచరించింది.

కిటీ రెప్పవేయకుండా వాల్టరువంక చూస్తుంది. లాందరు వెలుగులో ఆమె ఒకవైపు నుంచి వాల్టరుముఖాన్ని చూడగలుగుతుంది.— ఆ భంగిమనాణెములపై వుండె చిత్రం వలె వుంది. అతడిచిత్రాలన్నీ అందంగానే తయారయాయి,— కాని అవన్నీ కలిపి చాలా గంభీరంగావుంది. అతడు నిశ్చలంగా కూర్చొని చదువుతున్నాడు— పంక్తులవెంట మాత్రమే అతని కనిగ్రుడ్లు నడుస్తున్నాయి. వాల్టర్‌ను ఈ భంగిమలో చూసి అతడు సహృదయుడనికూడా, లేక ఆచరణలో నమ్రతగా వుంటాడని ఎవరుచెప్పగలరు అని ఆమె యోచిస్తుంది. ఆమెకు తెలుసు, మరి అందుకే ఈ భంగిమయందు ఆమె విరక్తిచెందింది. ఇటువంటి అందమైనవాడు, సచ్చరిత్రుడు, నమ్మకస్తుడు ఆధారభూతుడైన వాల్టర్‌ను ఇంతకూ తానెందుకు ప్రేమించలేకపోయిందో ఆమెకు ఆశ్చర్యం కల్గింది.

అతడు తనను ఆఫ్రీకాకు వెంట ఎందుకు తీసుకు వచ్చాడు ప్రాణాలు హరించడానికా అని ఆమె అడిగినప్పుడు వాల్టర్ ఎన్నడూజవాబుచెప్పలేదు. ఆరహస్యం కిటీని కొంచెం కొంచెం తినసాగింది. వాల్టర్‌లో చాలా దయవుందని, అతడి

కించ నీచాభిప్రాయం వుండదని ఆమె ఆలోచించింది. వాల్టర్ తనను చార్లీ నుంచి వేరుచేయాలని మాత్రమే కోరుతున్నాడు— ఆమెను భయపెట్టాలని మాత్రమే కోరుతున్నాడు.

మరొకటి, వాల్టర్ తనను ద్వేషించుకొంటున్నానని చెప్పాడు. ఇంతకూ దీనిలో అతని అర్థమేమిటి? తిరిగి కిటీ ఒక సారి వాల్టర్‌ను చూసింది. ఇప్పుడుకూడా అతడిముఖంలో అదే భావం నిశ్చలంగావుంది. వాల్టర్‌కు తాను గదిలోవున్నాననే సంగతికూడా దృష్టిలో వుండకపోవచ్చునని ఆమె అనుకుంది.

కిటీ సాయంత్రపు సంభాషణను తిరిగి ప్రారభిస్తూ, "నీవు నిన్నే ద్వేషించుకొంటున్నావా;" అని అతి కష్టంతో అడగగల్గింది.

వాల్టర్ పుస్తకం పెట్టేసి— కిటీ ముఖంలోవ్రాసిన ఏ భాషనో చదువుచున్నట్లుగా ఆమెవంక చూడసాగాడు. అత డేదో జారిపోయిన ఆలోచనల లింకును పట్టుకొంటానికి ప్రయ త్నిస్తున్నట్లనిపిస్తుంది.

"ఎందుకంటే నేను నిన్ను ప్రేమించివున్నాను."

కిటిసిగ్గుతో కెంపెక్కింది.—ఆమె ఎదురుగాచూస్తూంది. ఆమె వాల్టర్‌యొక్క తీక్షణము, నిరుత్సాహమైన చూపుల్ని భరించలేకపోతూంది. వాల్టర్ చెప్పిన అర్థం ఆమె తెలుసు కొంది. కొంచెం ఆగి అంది. "నీవునాకు అన్యాయం చేస్తు న్నావు. నేను దుష్టురాలను, మూర్ఖురాలనై నందుకు నాయందు ఆగ్రహం చూపటం వ్యర్థమేగా, నేనేంచేయను— నన్ను పెం చిందే ఆ విధంగా అయినప్పుడు, నాకు తెలిసిన బాలికలం

దరూ ఇటువంటివారే...... నీ ఆలోచనలకు ఈ సామెత చాలా బాగా అతుకుతుంది.” బత్తెముందు వీణవాయిస్తే– బత్తె నిలచి నెమరువేసింది. “నీవు నాలో పొందాలని ఆశించిన గుణాలు నాలోలేవు, అందుకు నాదోషమేముంది? నేను నిన్నెప్పుడూ మోసగించలేదు– నేనువున్న విధంగా మరొకటిగా అవటంకూడా నేనెప్పుడూ చేయలేదు. నేను కేవలం అందమైనదానిని, నవ్వుముఖం గలదానిని తిరునాళ్ళలోని చిన్న అంగటిలో నీకు అసలైన ముత్యాలహారం లభిస్తుందా? అక్కడ నీకు చిన్న చిన్న బొమ్మలు వగైరాలు మాత్రమే లభించగలుగుతాయి.”

“నేను నిన్ను నిందించటంలేదు.”

వాల్టర్ కంఠం అలసిపోయినట్లుంది, కిటీ మనస్సిప్పుడు విరక్తి చెందుతుంది. మన నలువైపుల మహామారి వ్యాపించి వుంది, మృత్యుదేవత తాండవనృత్యం చేస్తుంది.– సిస్టర్లు హృదయపూర్వకంగా అందులో నిమగ్నమైపోయారు– ఇటువంటి సమయంలో మనమిటువంటి అర్థరహితమైన మాటలు మాట్లాడటం ఉచితంగాదు, అని నేనర్థంచేసుకోగలిగిన ఈచిన్న విషయాన్ని వాల్టర్ ఎందుకని అర్థంచేసుకొనలేకపోతున్నాడాయని కిటీ ఆలోచించింది. ఒకవేళ ఒకస్త్రీ నైతిక పతనం చెందితే ఆమెభర్త ఆమెఎదుట ఇంతదుఃఖంతో ఎందుకుమునిగి పోతాడు. వాల్టర్వంటి నేర్పరి, తెలివిగలవ్యక్తి ఈ మాత్రపు విషయాన్ని ఎందుకర్థంచేసుకోలేక పోతున్నాడో ఆమెకాశ్చర్యం కల్గింది. వాల్టర్ తనను బంగారు విగ్రహంగా చేసి పూజించాలని కోరగా, వాస్తవం తెలిసినప్పుడు ఆ గుడ్డ

బొమ్మలోనుంచి రంపంపొట్టు రాలిందనే కారణంగానే అతడు దుఃఖంగావున్నాడా? ఈ కారణం మూలంగానే నా అతడు తననుగాని నన్నుగానీ క్షమించలేకపోయేది? అతడు వ్యర్ధంగా నమ్మికూర్చున్నాడు, కాని వాస్తవం తెలియగానే అంతా చిందరవందరైంది...... ఇదీనిజమే, అతడు తననుతానే క్షమించుకోలేనప్పుడు, నన్నుమాత్రమెలా క్షమించగలుగుతాడు.

వాల్టర్ దీర్ఘంగా నిట్టూర్చినట్లనిపించింది కిటీకి—ఆమె దృష్టి అయాచితంగా వాల్టరుపై నిలచింది, ఆమెశ్వాస ఆగిపోయింది. ఏదో తెలియని భావంతో కిటీ వణకిపోయింది. ఆమె శ్వాస ఆగిపోయింది. అతి ప్రయత్నంపై కెవ్వున అరవబోయే అరుపును ఆపుకుంది.

మనిషిలోని ఈ స్థితిలోనే దానిని 'లీనహృదయం' అంటారా? అని కిటీ ఆలోచించింది.

# 46

మరుర్రోజంతా కిటీ కాన్వెంట్‌ను గురించే ఆలోచిస్తూ వుంది. ఆ రెండవరోజు ఉదయం వాల్టర్ తనపనికి వెళ్ళిపోగానే కిటీ 'దాసీ' వెంట పల్లకీపై బయలుదేరింది. ఆమె నదిని దాటింది. పడవపై చుట్టూ ఆమె కొంతమంది చైనీయుల్ని చూసింది. వారిని చూసినప్పుడు, మృతజీవులు ఏదో ఛాయా దేశంలో జన్మించారన్నట్లుగా వుంది. రెండవగట్టుకు చేరినప్పుడు వారందరూ అక్కడే ఆగిపోయారు — వారెక్కడికి

వెళ్ళాలోకూడా తెలియనట్లున్నారు — తరువాత ఇద్దరేసి, ముగ్గురేసి చొప్పున పర్వతందిక్కుగా వెళ్ళిపోయారు.

ఆ సమయమందు పట్టణ బజార్లన్నీ నిశ్శబ్దంగా వున్నాయి. అది మృతజీవుల పట్టణమన్నట్లుగావుంది. అప్పు డప్పుడు ఒకటి, అర మనుష్యులు ఎదురుగుండా వెళ్ళుతుంటే వాళ్ళను చూస్తే చనిపోయినవారి ప్రేతాలేమోనన్నట్లుండేది. ఆకాశం నిర్మలంగావుంది. ఎండ చిటపటలాడుతోంది. ఉదయాన పట్టణమంతా మరణాసన్నమైనట్లుగా కన్పిస్తుంది — ఒక మనిషి ప్రాణం లాగుకొనపోబడుతుందన్నట్లుంది. యమధర్మ రాజుయొక్క నల్లని ఆకారాన్ని ధరించి ఎవరో ప్రాణాలు తీస్తూన్నట్లుంది, కాని యీ వెలుగులో చూస్తే ఆవిధంగా ఊహించటం కష్టం. ఉదయపు వెలుతురును చూసినప్పుడు, మరణించేవారికి, దుఃఖితమానవులకు ప్రకృతి అన్యాయం చేస్తుందాయనిపించేది. కిటీ పల్లకి కాన్వెంట్ ద్వారంముందాగింది. ఒక భిక్షుగాడు యాచిస్తూవుండటం కిటీ చూసింది. అతడు గుడ్డపీలికలు చుట్టుకొని వున్నాడు. ఆ చినిగిన గుడ్డ పీలికలలోనుండి ముకుళించుకుపోయిన అతడిశరీరం తొంగి చూస్తుంది — ఆతడి చర్మం నలుపెక్కింది. అతడికాళ్ళువంకరగా ఉన్నాయి — తలపై సంస్కారంలేని తెల్లనిజుట్టు, బుగ్గలు పీక్కుపోయాయి, కళ్ళు కాంతిహీనంగా వున్నాయి. కిటీ అకస్మాత్తుగా అతడినిచూసి దూరంగా తప్పుకుంది. బోయీలు భిక్షుగాడిని కసురుకొని వెళ్ళిపొమ్మని చెప్పారు. కాని అతడు కొంచెంకూడా కదలలేదు. కిటీ కంపిస్తూనే ఆ భిక్షుగానికి కొద్ది డబ్బిచ్చింది.

తలుపులు తెరచేవున్నాయి. దాసి ముందు వెళ్ళి కిటీ వచ్చినవిషయం మదర్‌కు తెలియజేయవలసిందిగా చెప్పింది. కిటీని అంతకుముందు వెళ్ళిన గదీలోనికే తీసుకువెళ్ళారు. కిటీ ఆ గదిని పరిశీలనగా చూసింది. చాలాకాలంగా గదికిటికీలు తెరవబడనట్లుగా కన్పించాయి. ఆమె అక్కడ కూర్చొని చాలా సమయం గడిచిపోయింది. తాను వచ్చినట్లు ఇంకా లోనికికబురందలేదేమో ననుకుంది కిటీ, ఆలస్యంగా మదర్ గదిలోనికి ప్రవేశించింది.

రాగానే మదర్ వినయ భావంతో, "ఇంతవరకూ మీరు ఒంటరిగా కూర్చొనవలసి వచ్చినందుకు క్షమించండి. మీరు వస్తారని నేనాశించలేదు, అంతేగాక ఈ రోజు నేను చాలా వ్యస్తముగా కూడావున్నాను." అంది.

"సమయంగాని సమయమందు వచ్చినందుకు నన్ను క్షమించాలి. నేను మీకు కష్టం కలిగించాను."

మదర్ చిరునవ్వుతో కిటీ మాటలు వింది. ఆమె కిటీని ప్రేమ పూర్వకంగా కూర్చోగోరింది. మదర్ కన్నులు ఉబ్బివుండటం కిటీ స్పష్టంగా గమనించింది. ఆమె విరామంగా ఏడుస్తూవుంది. మదర్‌ను భౌతిక కష్టాలు బాధించ జాలవని కిటీ విశ్వసించివుంది గనుక ఆమెకు చాలా ఆశ్చర్యం కల్గింది.

"ఏదో జరిగినట్లు నాకు కనిపిస్తుంది. తిరిగి వెళ్ళమని సెలవిస్తే వెళ్ళిపోతాను—మరొకప్పుడు దర్శనం చేసుకొంటాను."

జవాబులో మదర్ కంఠం గాద్గదికంగా వుంది." వద్దు వద్దు. మీకు నేనేమి మేలు చేయగలనో చెప్పండి. నా కేమీ

లేదు,—మాలో ఒక సిస్టర్ నిన్నరాత్రి పరలోక ప్రాప్తి పొందింది. నేను దుఃఖించకూడదు. ఆపవిత్రాత్మ స్వర్గయోగ్య మని నాకు తెలుసు. ఆ సిస్టర్ సాధ్వి,—తన బలహీనతను ఎల్లవేళలా ఎవరూ అణచిపెట్టుకొని వుండలేరు. నేనుకూడా ఎల్లప్పుడూ జ్ఞానం చెప్పిన దానిని అంగీకరించ లేక పోతు న్నాను. కోర్కెయొక్క ఆదేశం అప్పుడప్పుడు నాతోకూడా వ్యాపిస్తూ వుంటుంది.

"ఇది తెలుసుకొని నాకు చాలా దుఃఖం కల్గింది." అని కిటీ చాలా నెమ్మదిగా అంది. ఆమె కళ్ళనుంచి కన్నీరు ప్రవహించింది.

"ఆమె పది సంవత్సరాలకు పూర్వం ఫ్రాంసునుంచి నావెంట వచ్చింది. ఇప్పుడిక ఇక్కడ మాతో ముగ్గురు సిస్టర్లు న్నారు. నాకు బాగుగా గుర్తుంది, మేము ఫ్రాన్సునుండి ఓడలో బయలుదేరినప్పుడు మార్సెయ్ ఓడ రేవులోనుంచి వెలుపలకు రాగానే మాకు 'సెంట్ మేరీలాగ్రెస్' విగ్రహం కన్పించింది. మేమందరం కలిసి ప్రార్థనచేశాము. నేను మత సేవా వ్రతాన్ని వహించి నప్పటినుంచీ చైనాను చూడాలనే గాఢవాంచ నాలో వుండేది—కాని నాదేశం దూరమైన కొద్దీ నేనేడ్చాను. పైగా నేను వారందరిలో పెద్దదానను. నేనే అటు వంటి ఉదాహరణ కాకూడదను, సిస్టర్ ఫ్రాంసిస్ జేవియరు నిన్న రాత్రి పరలోకప్రాప్తి పొందింది—ఆమె నాచేయి పట్టు కుని ఏపరిస్థితిలోనూ దుఃఖించకూడదనీ, మనం ఎక్కడెక్క డకు వెళ్ళినా పరమాత్ముడుకూడా అక్కడే వుంటాడని, అదే మన ఫ్రాంసవుతుందని ఆమె చెప్పింది"

మదర్ యొక్క నిష్కపటమైన సాధుముఖంలో ముడు తలుబడ్డాయి — ప్రయత్నించినా ఆమె తనకన్నీటిని ఆపుకొన లేకపోతుంది. కిటీ దూరంగా ఎక్కడో చూస్తుంది. ఆ పరిస్థితిలో మదరుతో సంభాషించటం కిటీ ఉచితంగాదనుకుంది.

"నేనా సిస్టర్ తల్లిదండ్రులకు ఆమెను గురించి ఎప్పుడూ ఆమె సమాచారము తెలియజేస్తూవుండేదానిని. నావలె ఆమె కూడా ఏకైకపుత్రిక. ఈ సమాచారాన్ని విని వారికి భరించటమెంత బాధాకరంగావుంటుంది. ఈ మహామారినుంచి ఎలా విముక్తి కలుగుతుందో ఆ పరమాత్మునికే తెలియాలి. ఈరోజు ఉదయం మరిద్దరు బాలికలు జబ్బుపడ్డారు. వారు బ్రతకటం కూడా ఒక ఆశ్చర్యమే అవుతుంది. ఈ చైనీయులలో ఓర్పుకూడావుండదు. సిస్టర్ ఫ్రాంసిస్ లేనిలోటు ఎప్పుడూ తీరదు. పని ఎంతగాపెరిగి పోయిందో పనిచేసేవాళ్ళిప్పుడంత తక్కువమందివున్నారు. చైనాలో కొందరు సిస్టర్లు వున్నారు, వారిక్కడకు రావడానికి సిద్ధంగావున్నారు.— మేముపిలవడమే తడవు——కాని వారినిక్కడకు పిలవడమంటే సూటిగా మృత్యుముఖంలోకి నెట్టడమే అవుతుంది. ఈ సిస్టర్ల ద్వారా పని జరిగినంతకాలం నేను వారిని పిలవదలచటంలేదు; లేకపోతే వారు కూడా బలైపోతారు."

కిటీ ధైర్యంచేసి చెప్పింది— "మదర్! నేను వచ్చినప్పటి నుంచీ పూర్తిగా సమయంగాని సమయమందు వచ్చాననే ఆలోచిస్తున్నాను. మీరు చెప్పారుగదూ పని అధికంగావుంది, పనిచేసేవాళ్ళు తక్కువగావున్నారని; అయితే ఇక్కడ పని ...డానికి మీరు నాకు అనుమతి నివ్వగలరా? నేనిక్కడకు

వచ్చి మీకు సహాయపడతాను.— నేనేమిపనిచేయాలా అనే విచారం నాకేమీలేదు— నేనుకూడా సేవచేయాలనే కోరు తున్నాను. మీరిక్కడ గదులన్నీ శుభ్రపరచమనే పని చెప్పినా నేను మీకు కృతజ్ఞతతో స్వీకరిస్తాను.”

మదర్ సన్యాసిని సాదుమందహాసంతో కిటీనిచూసింది. ఆమె భావాల్లో ఇంతశీఘ్రంగా మార్పునుచూసి కిటీ విస్మయ పడింది.

“గదులు తుడిచేపని చేయనవసరంలేదు. ఆపని ఇక్కడి అనాథలు చేసేస్తారు.” అని మదర్ కొంచెం ఆగి సహృదయంగా అంది. “బిడ్డా! నీవు నీభర్తవెంట యిక్కడకువచ్చి గొప్పపనిచేశావు. ఎక్కువమంది భార్యలు ఇదిచేయరు. ఇక మిగిలింది పని విషయం. నీవు మిగిలిన సమయమందు అలసిపోయిన నీ భర్తకు సేవచెయ్యి, ఇదేమన్నాతక్కువా? వాల్టర్ యడ పూర్తిగా శ్రద్ధవుంచడం చాలా అవసరమనే విషయాన్ని నమ్ము.”

ఈమాటవిని కిటీ మదర్ వైపు చూడలేకపోయింది. మదర్ యొక్క దయ, మమతతోనిండిన చూపులు కిటీ పైనే నిలచివున్నాయి,

“ఉదయంనుంచి సాయంత్రం వరకు నేను చేయవలసిన పనేవుండదు. నేను సోమరికాకుండా వుండేంతగా పనివుండాలని నా కోర్కె. నేను నిరర్థకంగా కూర్చోదలచటంలేదు. నేను మీ దయను, మీ సమయాన్ని అపహరించ ప్రయత్నించటం లేదనేది నమ్మండి. మీ సేవలోనికి నన్ను తీసుకొనటమే మీరు నా యందుచూపే సాదుస్నేహంగా భావిస్తాను.

"కాని నీవు పుష్టిగాలేవుగా? మొన్న నీవువచ్చినప్పుడు పాలిపోయివున్నావు. నీవు తల్లివి కానున్నావని సిస్టర్ జోజెఫ్ అభిప్రాయం."

వినగానే కిటీకి గగుర్పాటు గలిగింది. "లేదు, లేదు." అంది బిగ్గరగా.

మదర్ తనసహజ దరహాసంతో, "ఇందులో సిగ్గుపడాల్సిందేముంది? ఇదేమీ జరగని విషయంకాదుగా. నీ వివాహమై ఎంతకాలమైంది?" అంది.

"నేను బలహీనంగా వున్నాను, నా శరీరమేఇంత. కాని నా శరీరంలో చాలా శక్తి వుంది. నేను పనంటే భయపడనని మీకు నమ్మకంగా చెప్తున్నాను.

మదర్ ఇప్పటికి తిరిగి తన సహజస్థితికి వచ్చింది. ఇప్పుడామె కిటీని పరిశీలిస్తుంది. కిటీ సునాయాసంగానే కంపించింది.

"నీవు చైనా భాషమాట్లాడగలవా?"

"లేదండి!" అని కిటీ జవాబు చెప్పింది.

"అలే, ఆ విషయమేలేకపోతే, నిన్ను పెద్దబాలికల కొరకు నియమించేదానిని."

"నేను ఇతర సిస్టర్లతోపాటు నర్సింగ్ పనిచేయలేనా? నాకు కలరాభయంలేదు. నాకు స్త్రీలకు'నర్సింగ్'పని ఇచ్చినా సరే లేక సైనికుల సేవా భారాన్నిచ్చినాసరే!"

మదర్ ఏదో ఆలోచిస్తూ తలవూపింది.

"కలరా ఎంత భయంకరమైన రోగమో నీకు తెలియదు.

పోతే అక్కడ రోగులపని చూడటానికి సైనికులున్నారు. సిస్టర్లు అజమాయిషీ మాత్రమే తీసుకుంటూవుంటారు.— ఇక స్త్రీలకు సంబంధించినంతవరకు......వద్దు వద్దు. ఆ పని మీ భర్తకు రుచించదు. ఎంత దుఃఖకరంగా వుంటుందదంతా!"

"నేను దానికి అలవాటు పడతాను."

"వద్దు వద్దు, నీకాపని పనికిరాదు. అది మేమేచేస్తాం. పైగా నీవదంతా చేయనలసిన అవసరమూలేదు. నీవు నీ భర్త అనుమతి పొందావా?"

"అవునండి!"

ఆమె హృదయ రహస్యాన్ని చదువుతున్నట్లుగా మదర్ కిటీనిచూసింది. కాని ఆమె కన్నుల్లో యాచనాభావాన్ని చూసి మందహాసం చేసింది.

"కాని మరినీవు ప్రొటెస్టెంటువుగదూ?"

"అవునండి!"

"అయితే అభ్యంతరమేముంది. డాక్టర్ వాట్సన్‌కూడా ప్రొటెస్టెంటే. అయినా దానివలన వారిమిషన్‌లో భేదం రాలేదు. మేము ఆయనకు చాలా కృతజ్ఞులం."

కిటీ ముఖంలో ఆనందం తొంగిచూస్తోంది. ఆమె మౌనంగా కూర్చొనివుంది. మదర్ ఏదో ఆలోచిస్తున్నట్లుంది. ఆమెలేచి నిలబడింది.

"మీ ఆలోచన చాలా మంచిది. నేను మీకు తప్పక ఏదోఒక పని ఇస్తాను. సిస్టర్ ఫ్రాంసిస్ లేనికారణంగా మేము పనిని సంభాళించుకోలేము. సరే, ఎప్పటినుండి ప్రారంభిస్తారు?"

"ఇప్పటినుండే!"

"భేష్! మీ జవాబు విని నాకు చాలా సంతోషం కల్గింది."

"నేను శక్తి వంచనలేకుండా పూర్తిగా శ్రమిస్తాను. నా కటువంటి అవకాశాన్ని ఇస్తే నేను మీకు కృతజ్ఞురాలుగా వుంటాను." అంది కిటీ.

మదర్ తలుపు తెరచుకుని వెళ్ళుతూ వెళ్ళుతూ ఆగింది. మరొకసారి ఆమె కిటీని పరిశీలనగా చూసింది. ఆమె కిటీవైపుకు చేయిచాస్తూ అంది, "బిడ్డా! గుర్తుంచుకో, పనిలో, ఆనందంలో ప్రపంచంలో, కాన్వెంట్‌లో ఎవరికీ శాంతిలభించదు. శాంతి హృదయంలో ప్రకాశిస్తూ వుంటుంది."

కిటీ కొంచెం త్రుళ్ళిపడింది— కాని అప్పటికే మదర్ వెళ్ళిపోయింది.

# 47

కాన్వెంట్‌లో పనిచేసే అనుమతి పొందటంతో కిటీ లోని ఉత్సాహం మేల్కొంది. ఆమె ప్రతిరోజు ఉదయమే కాన్వెంట్‌కు వెళ్ళేది, సాయంత్రం బయళ్ళు, పర్వతాలు, పశుల కాపర్లపై అస్తమించుచున్న సూర్యుని కెంజాయ కిరణాలు పడుతున్నప్పుడు ఆమె తిరిగి బంగళాకువచ్చేది. మదర్ చిన్న పిల్లల్ని కిటీకి ఒప్పగించింది. కుట్టుపని, అల్లిక లేక పిల్లల సంరక్షణ వంటిపనులు కిటీకి తన తల్లినుంచి పరంపరాగత రూపంలోలభించాయి. ఈ విషయాన్ని ఆమె అప్పుడప్పుడు

మాటలమధ్య వెల్లడిస్తూవుండేది. తనకు కుట్టు అల్లిక మొదలైనవికూడా తెలియునని మదర్‌కు చెప్పినప్పుడు ఆమె కిటీకి ఆపనికూడా ఒప్పగించింది. ఆ బాలికలకు కొంచెం ఫ్రెంచి భాష తెలుసు, ఇటు కిటీ రోజూ నాలుగైదు చైనామాటలు నేర్చుకొనేది. ఈ విధంగా ఆమె తనపని నెరవేర్చేది. అప్పుడప్పుడు చిన్నపిల్లల అజమాయిషీ తీసుకోవలసిందిగా ఆదేశించేవారు. ఆమె వాళ్ళ దుస్తుల్ని మార్చడం వగైరాలు చేయాల్సివచ్చేది, విశ్రాంతి సమయమప్పుడు వారిని నిద్రబుచ్చాల్సివచ్చేది, మేల్కొల్పాల్సిన సమయమప్పుడు మేల్కొల్పాలి. కాన్వెంట్‌లో చాలామంది పిల్లలు వుండేవారు; వారి సంరక్షణకు అనేకమంది దాదులు కూడా నియమింపబడ్డారు. కాని కిటీపని వారందరిపై అజమాయిషీ తీసుకొనడమే. కిటీకి ఇవ్వబడిన పనులేవీ అంతఎక్కువ ప్రాముఖ్యత కల్గినవిగా కన్పించలేదు. తనకేదైనా శ్రమచేసే పని లభించాలని ఆమె కోరుకొనేది. కాని మదర్ ఆమె కోర్కెను గమనించలేదు. కిటీకప్పుడప్పుడు మదర్‌నుచూసి ఆశ్చర్యం కలిగేది.

మొదట కొద్దిరోజులు కిటీ ఆ చిన్నబాలికలను ప్రేమించలేకపోయింది. వారామెకు ఇంపుగా కన్పించేవారుగారు, అయినా ఆమె వారిని కోరగలగటానికి యత్నించింది. బాలికలు మురికిదుస్తులు ధరించేవారు ; వారి జుట్టు బిరుసుగానూ, నల్లగానూ వుండేది; గుండ్రని పసుపురంగుముఖాలు, కన్నులు నల్లనివి, జిజ్ఞాసతో నిండి వుంటాయి. ఆకస్మికంగా కిటీకి తాను మొదటిరోజున కాన్వెంటుకు వెళ్ళినప్పుడు మురికిగా కనుపించే ఈ పిల్లలగదికి వెళ్ళినప్పుడు మదర్ కళ్ళల్లో

దయాభావం గోచరించటం గుర్తుకొచ్చాయి. అయినప్పటికీ ఆ భావాన్ని త్యజించాలని కిటీ ప్రయత్నించింది, వారిలో ఏడ్చే పిల్లల్ని ఒకరిద్దర్ని ఒకరితరువాత ఒకర్ని ఎత్తుకొంది. ఎత్తుకోనగానే ప్రేమతో కూడిన నాలుగైదు మాటలు వినగానే బిడ్డలు ఏడ్వడం మర్చిపోతారని కిటీ గ్రహించింది. అప్పటినుంచీ ఆమెవారికి ఇక అపరిచితంగా వుండలేదు.

చిన్న చిన్న పిల్లలు ఇప్పుడామెకు భయపడటంలేదు. తమ చిన్న చిన్న ఫిర్యాదుల్ని కిటీవద్దకు వచ్చి చెప్పేవారు, ఆమెవద్దే ఆనందంతో ఆడుకొనేవారు. పెద్దబాలికలదగ్గరకూడా ఇదే జరిగింది. కొందరికి ఆమె కుట్టుపని నేర్పింది. ఆమెకొద్దిగా ప్రశంశిస్తేచాలు ఆ బాలికల వదనాలు సంతోషంతో నిండిపోయేయి, వారి కన్నుల్లో కాంతిమెరిసేది. కిటీ కిదంతాచాలా ఆనందంగా వుండేది, ఆ పిల్లలు తనను కోరుతున్నారని కిటీ గ్రహించుకుంది. ఈ ఆలోచన రాగానే ఆ పిల్లలయందు ఆమెకు మరింత స్నేహం కలిగేది.

ఈ పిల్లలందరిలో ఆరు సంవత్సరాల వయస్సుగల ఒక బాలిక వుంది. మూర్ఖునివంటి వంకరగావుండేతల, బక్కపల్చనిశరీరము, గుంటలుబడ్డకళ్ళు, ఈగలుముసిరినట్లుండే కీసర గొంతు గల ఈ బాలికయందామె స్నేహం చూపలేక పోయింది. ఆమెనుచూస్తేనే కిటీలో ద్వేషం మేల్కొనేది. కాని ఆ బాలికలో కిటీయందు స్నేహాభావ మేర్పడింది. ఆమె కిటీనంటిపెట్టుకొనే తిరిగేది. ఆమె కిటీ కొంగుపట్టుకొని అందులో తనముఖం దాచుకొనేది; కిటీచేయి పట్టుకొనేది, మరి కిటీ? కిటీ ద్వేషంతో కంపించినట్లయేది. బిడ్డప్రేమ పొంద

టానికి పరితపిస్తుందని కిటీకి తెలుసు, కాని కిటీ కాపని అసంభవమైపోయినట్లయింది.

ఒకసారి కిటీ సిస్టర్ జోజెఫ్‌తో ఆపిల్ల జీవితంయందు తనకు చాలా దయగలుగుతుందని చెప్పింది. జవాబుగా సిస్టర్ జోజెఫ్ నవ్వింది, తరువాత చేతులుచాచి ఆ బిడ్డను ఒడిలోకి తీసుకొంది. బిడ్డరాగానే సిస్టర్ జోజెఫ్ బుగ్గలపై ప్రేమగా తన తలతో రుద్దింది.

"పాపం! ఇక్కడకు వచ్చినప్పుడు మరణాసన్నస్థితిలో వుంది. అదృష్టవశాత్తు నే నా సమయమందు బయటగదిలో వున్నాను. ఒక క్షణంకూడా ఆలస్యం చేయకుండా మతాంతీకరణ చేయించాను. మే మెన్ని ప్రయత్నాలుచేసి ఈమె ప్రాణాలు రక్షించామో మీకు నమ్మకం కలుగదు. రెండు మూడు పర్యాయాలు ఈమె బ్రతుకుతుందనే ఆశేలేకపోయింది."

కిటీ మౌనంగావుంది. సిస్టర్ జోజెఫ్ తన మధురస్వభావానానుసారంగా అన్యవిషయాలు ప్రారంభించింది. రెండవ రోజు ఆబిడ్డ కిటీవద్దకువచ్చినప్పుడు ఆమె గుండె రాయిచేసుకుని ఆబిడ్డను ఒడిలోకి తీసుకొంది. కిటీ మందహాసం చేయటానికి ప్రయత్నించింది, కాని ఆకస్మికంగా ఆబిడ్డ కిటీ ఒడి నుంచి దిగిపోయింది.

బిడ్డకు కిటీయందున్న ప్రేమంతా పోయినట్లనిపించింది. ఆతరువాత ఆబిడ్డ కిటీవద్దకెన్నడూ రాలేదు. ఇంతకూ ఆమె తనవద్దకు రాకపోవడ్డానికి తనవల్ల ఏమిజరిగిందో కిటీకి బోధ

పడలేదు. కిటీ బిడ్డను బుజ్జగించటానికి యత్నించినది, చిరునవ్వుతో ఆమెను పిలిచేది, కాని ఆబిడ్డ వాటన్నిటిని ఏమీ విననట్లు, తెలుసుకోనట్లు వుండేది.

# 48

రోజంతా సన్యాసినులు తమ తమ పనుల్లో మునిగి వుండేవారు. కిటీ వారిలో ఎవర్నీ కలుసుకోలేకపోయేది. ఒక్క ప్రార్థనాగృహంలోమాత్రం వారిని కలుసుకోగలిగేది. మొదటిరోజునే మదర్ కిటీని ప్రార్థనామందిరంలో చూసింది. ఆమె సిస్టర్ల వెనుకగా కూర్చునివుంది. "నీవు ప్రొటేస్టెంట్‌వు మీ పద్ధతులు, ఆచారాలు వేరు గనుక నీవిక్కడకు రావలసిన అవసరంలేదు" అని మదర్ ఆమెతో చెప్పింది.

"కాని మదర్, నా కిక్కడ శాంతి లభిస్తుంది"

మదర్ క్షణకాలం కిటీవంక ధ్యానంగాచూసి, "ఐతే సరే, నీ యిష్టంవచ్చినట్లు చెయ్యి. నీ విక్కడకు రావల్సిన అవసరం లేదని మాత్రమే నా ఉద్దేశ్యం" అంది.

అటు, సిస్టరు జోజెఫ్ కిటీకి పరిచితమేగాక స్నేహితురాలైంది, కాన్వెంట్ ఖర్చును చూడటం, ఇతరవస్తువుల్ని ఏర్పాటుచేయటం మొదలైన బాధ్యత సిస్టరుపైనే వుండేది. ఆమెకు రోజంతా అటుఇటు పరుగెత్తటంతోనే గడచిపోయేది. ప్రార్థనాగృహంలో వున్నంతవరకే తనకు విశ్రాంతిలభిస్తుందని ఆమె చెప్తూవుండేది. మూడవ జామునందు కిటీ బాలికలవద్ద ఉన్నప్పుడు సిస్టరుకూడా అలసిపోయినట్లు అక్కడకువచ్చేది,

ఇద్దరూ మాటల్లో మునిగి తేలేవారు. మదర్ లేనప్పుడు సిస్టరు జోజెఫ్ చాలా మాట్లాడేది. ఆమె నవ్వుముఖం, సంతోష స్వభావం గలది. పరిహాసమాడడంలోకూడా తగ్గేదికాదు. కిటీకి ఆమెఅంటే భయంలేదు. ఆమె తనతో హృదయంవిప్పి చాలా సంతోషంగా మాట్లాడేది. సిస్టరు జోజెఫ్ సహృదయురాలైన గృహిణి అనిపించేది కిటీకి. కిటీ ఆమెతో వచ్చీరాని ఫ్రెంచి పొడిమాటలు మాట్లాడేది, ఇద్దరూ నిండుగా నవ్వుకొనేవారు. సిస్టరు కిటీకి రోజూ చైనా భాషలోని నాలుగు మూడు వాడుకమాటల్ని నేర్పేది. ఆమె ఒకరైతు కుమార్తె, ఇప్పటికీ ఆమె హృదయంలో ఆసాధుభావమే నిండివుంది.

ఆమె అంటూవుండేది, "నేను నాచిన్నతనంలో జోన్ ఆఫ్ ఆర్క్ వలె ఆవులకు సేవచేసేదాన్ని. కాని నేను వాటి అజమాయిషీ తీసుకోలేకపోయేదానిని. అంతే నాలో ఈ చెడే వుండేది. నాన్నగారు కొడ్తారని ఆలోచించేదాన్ని, ఆయన చాలా మంచివారు. ఇప్పుడెప్పుడైనా అప్పటికొంటె తనాన్ని గురించి ఆలోచించుకొంటే నాకే సిగ్గేస్తుంది."

మధ్యవయస్కురాలు, సాధువైన ఆ మదర్కూడా చిన్నతనంలో కొంటెదై వుండివుంటుందనే ఆలోచన రాగానే కిటీ నవ్వింది. మధ్యవయస్కురాలైనా సిస్టర్ జోజెఫ్లో పసిబిడ్డలలోనివలె నైర్మల్యం నిలచివుంది. అందుకే ఆమె సునాయాసంగా సిస్టర్వైపుకు ఆకర్షించబడింది. వసంతంలో యాపిల్ పండ్లతో చెట్లునిండివుండలి, పైర్లు పచ్చపచ్చగా వుండాలి, కొన్ని పంటలు గాదెలనిండా నింపబడివుండాలి, అటువంటి పరిపూర్ణత్వమే కొంత సిస్టర్ జోజెఫ్లోవుంది. ఆమెలో

మదర్‌లో వలె గాంభీర్యంలేదు, లేక నిరాశగాని, దుఃఖభావం గాని ఆమెముఖంలో కన్పించదు—అందుకు పూర్తిగా భిన్నంగా సౌమ్యము— నైర్మల్యము— ఆనందంగా వుంటుంది.

“మీరెప్పుడైనా తిరిగి మీయింటికి వెళ్ళాలనుకుంటున్నారా?” అని కిటీ ప్రశ్నించింది.

“లేదు! అక్కడకు వెళ్ళి తిరిగిరావటం కష్టమవుతుంది. నా మనసిక్కడ కలసిపోయింది. ఈ అనాథులమధ్యనే నేను చాలా సుఖంగావున్నాను. ఉపకారాన్ని మరువని మీరెంత మంచివారు! సిస్టరు కావటం చాలామంచివిషయం, కాని ఈ వయస్సులోకూడా నేనూ ఒకప్పుడు నాతల్లిపాలు త్రాగాననేది ఎన్నడూ మర్చిపోను. నా తల్లి ఇప్పుడు వృద్ధురాలు. వారిని ఇక దర్శించలేనే అనేది ఆలోచించినప్పుడు బాధకలుగుతుంది. అమ్మకూడా తన కోడలుతో చాలా ఆనందంగానే వుంటుంది. నా సోదరుడుకూడా మాతల్లిని ఎప్పుడూ సంతోషపెడ్తూవుంటాడు. సోదరుని కుమారుడిప్పుడు పెద్దవాడైవుండి వుంటాడు. ఇక ఇప్పుడు పొలంలోపనిచేయడానికి మరొకప్రాణి సిద్ధంగావుందని అందరూ ఆనందిస్తారు. నేను ఫ్రాన్సునుండి వచ్చినప్పుడు అతడుచాలా పసివాడు— కుర్రవాడు తెలివైనవాడని అతడినిచూసి ఎవరైనా చెప్పవచ్చు.”

చుట్టూ కలరావ్యాపించివున్న ఈ ప్రశాంతమైనగదిలో ఎవరితోనైనా ఎక్కువ మాట్లాడటం అసంభవం, కాని సిస్టరు జోజెఫ్‌కు ఆ సమయమందేమీ విచారమే లేనట్లుండటం కిటీ స్పష్టంగా తెలుసుకొంటూనేవుంది.

సెయింట్ జోజెఫ్‌లో ప్రపంచాన్నిచూసి, అర్థచేసుకో

వాలనే సాదు జిజ్ఞాసవుంది. ఆమె లండన్‌ను గురించి, విదేశా లను గురించి కిటీనీ ఎన్నో ప్రశ్నలడిగింది. మధ్యాహ్న సమయ మందుకూడా మంచుపడుతూవుండటం వలన చేతులుకూడా కప్పించవట, అదెలావుంటుంది? అని అడిగింది. కిటీ ఎప్పుడైనా 'నాట్యగృహాని'కి వెళ్ళేదా? కిటీకి సహోదరులు, తోబుట్టువు లెంతమంది? ఇంకా ఏమేమో! తరువాత వాల్టరును గురించి అడిగేది. వాల్టరు అద్భుతమైన మనిషని మదరు చెప్తుందని, తామందరం ఆయనశుభాన్ని కాంక్షిస్తామనీ – ఆయనకొరకు ప్రార్థిస్తామనీ చెప్పేది. "కిటీ! మీరు చాలా సౌభాగ్యవతులు! ఇంతమంచివాడు, వీరుడు, ఇంత విజ్ఞాని భర్తగా లభించాడు," అని అంటూవుండేది.

# 49

అవిఇవి మాట్లాడినతరువాత సిస్టరు జోజెఫ్ మదరును తన మాటలకు కేంద్రంచేసుకొనేది. మదర్ వ్యక్తిత్వము కాన్వెంటులో రాజ్యంచేస్తుందని మొదటిరోజునే కిటీగ్రహిం చింది. కాన్వెంటులోని ప్రతిదీ, ప్రతివాళ్ళూ ఆమెను ప్రేమి స్తారు, ఆమెయందు పూజ్యభావముంచుతారు. అందరిలోనూ ఆమెయందు ఒక జిజ్ఞాసవుండేది, అయినా ఆమెనుచూసి ఎవరూ భయపడరు. కిటీకూడా ఆమెఎదుట తెలియకుండానే పూర్తిగా బంధించివేసినట్లయేది. మదరుకు కిటీయందు మమ కారముంది, కిటీ ఎన్నడూ ఆమెవుండగా సౌఖ్యంగా భావించ గలిగేదిగాదు. సిస్టరు జోజెఫ్ కిటీకి మదర్‌నుగురించికూడా చెప్పింది, మదర్ కుటుంబం చాలా సంపన్నమైంది, గొప్పది.

ఆమెపూర్వీకులు చరిత్ర ప్రసిద్ధిచెందినవారు. మదరు యూరోపులోని సగంమంది రాజులకుపైగా సోదరియవుతుంది. ఇంత వైభవాన్ని త్యాగం చేయటం నవ్వులాటగాదు. కిటీ చిరునగవుతో అన్నీ వినేది, కాని ఏ మాటకూ కదలిక పొందేదిగాదు.

"నీవు ఆమె ముఖాన్ని చూస్తేచాలు, ఆమె ఎంత ఉన్న కుటుంబపు స్త్రీయో తెలుసుకోగలుగుతావు" అనేది సిస్టరు.

"ఆమెచేతులవంటి అందమైన చేతుల్ని నే నింతకు ముందెన్నడూ చూడలేదు" అనేది కిటీ జవాబుగా.

"ఆమె ఆ చేతులతో ఎటువంటి ఎటువంటిపనులు చేసిందో నీవు తెలుసుకోగలిగితే ఎంత బాగుంటుంది. ఎటువంటిదైనా ఏపనినైనా చేయడాని కామెకు సందిగ్ధమే కలిగేదికాదు.

ఆమె మొదట ఇక్కడకు వచ్చినప్పుడు ఇక్కడ ఏమీ లేదు. కాన్వెంట్‌ను ఆమే తయారుచేసింది. మదరే అంచనా వేసింది— ప్లాను తయారుచేసింది, స్వయంగా పనులన్నిటిని అజమాయిషీ తీసుకుంది. ఇక్కడకు రాగానే ఆమె అనాథ పిల్లల్ని తీసుకొని వారికి పోషణచూడనారంభించింది. ఎంతో మంది నిర్దయుల చేతుల్నుంచి బిడ్డల్ని రక్షించి తీసుకొచ్చింది. ప్రారంభంలో పడకలుకూడాలేవు— కిటికీలు, తలుపులు ఏవీ లేవు. అప్పుడప్పుడు ఒక్క పైసాకూడావుండదు. కూలీలకు కూలీ ఇవ్వటం అటుంచి— చిన్నచిన్న ఖర్చులకే డబ్బుండేదిగాదు. అందరు రైతులవలె వుండేవారు. ఆ రోజులో వారు

తిన్న భోజనాన్ని గురించి, అటువంటి ఆహారాన్ని వారి తండ్రి గారి పొలంలో పనిచేసే కూలీలుకూడా పారవేశేవారని చెప్పింది._మదర్ తన చెలికత్తెలందరికొరకు ప్రార్థనలుచేసేది. ఏదో దివ్యమార్గాన ధనంలభించేది. అప్పుడప్పుడు మరురోజు టపాలోనే వేయ్యేసి ఫ్రాంకులవరకూ వచ్చేవి, ఒక్కొక్కపర్యాయం ఒక అపరిచితుడో_ ఇంగ్లీషువారు, ప్రొటెస్టెంట్, చైనీ ఎవరైనాగానీ వచ్చి ద్వారం తట్టి దానంచేశేవారు. అప్పుడప్పుడు ఇటువంటి సమయములందు సన్యాసినులు ప్రార్థన చేస్తూనే వుండేవారు; వారిప్రార్థన స్వీకృతిపొందేది. ఒకసారి ఇటువంటిలోటే జరిగినప్పుడు అందరూ ప్రార్థనచేయటంలో నిమగ్నమైవున్నారు_ విశ్వసించు కిటీ! ఈ హాస్యప్రియుడు బెడింగ్టన్‌గారు మరురోజు వచ్చారు, వందడాలరు ధర్మమిచ్చారు. అందరికీ కోరుకుంది లభించింది.

ఈ బెడింగ్టన్ మహాశయుడెటువంటి హాస్యప్రియుడు, బట్టతల, చురుకైన చిన్నకన్నులు, మరి దానితో హాస్యం! అతడు ఫ్రెంచిభాషను మాట్లాడనేలేడు._ మాట్లాడేటప్పుడు భాషను విరగ్గొట్టేస్తాడు. అయినా ఆయన మాటల్లో అభిరుచి గలుగుతుంది. అతడెప్పుడూ నవ్వడం, నవ్వించడం యత్నంలో వుంటూవుంటాడు. ఒకవంక మహామారి భయంకరరూపం ధరించివుంటే, రెండోవైపు బెడింగ్టన్ ఆనందంగా వుంటాడు; ఇక్కడకు శెలవులు గడుపుకుంటానికి వచ్చాననట్లుంటాడు. అతడిబుద్ధి ఫ్రెంచివాళ్ళకువలెనే చురుకైనది. అతనినిచూస్తే ఇంగ్లీషువాడని తెలియనే తెలియదు. అవసరమున్నా లేక పోయినా ఒక్కొక్కపర్యాయం అతడు బలవంతంగా హాస్యంగా

మాట్లాడాలని ప్రయత్నం చేస్తూ వుంటాడనిపించేది. సిస్టర్‌కు అప్పుడప్పుడూ అతడి ఆచరణ, శీలము ఎంతమాత్రం మంచివి కావు, అయినా అది ఆతడిస్వంతవ్యవహారం.— పైగా అతడు అవివాహితుడు— యువకుడు.”

“అతడి శీలంలో చెడేముంది?” అని కిటీ ప్రశ్నించింది.

“నీకు తెలియని విషయమేమీగాదు. నేను అవన్నీ చెప్పడమంటే అపరాధం చేయటమే. పైగా ఇటువంటి విషయాలతో నాకేమిసంబంధం?— అతడొక చైనా స్త్రీతో వుంటున్నాడు. చైనాకూడా కాదు బహుశా మంచూస్త్రీతో. ఆమె వేష భాషల్నిబట్టి చూస్తే రాజకుమార్తె అన్నట్లుంటుంది. ఆమె బెడింగ్‌టన్‌ను చాలా ప్రేమిస్తుంది.”

“ఇది అసంభవంగా కన్పిస్తుంది,” అంది కిటీ.

“కాదు, కాదు! నమ్మి. ఇదంతా నిజమే. అతడిది చేయగూడదు. నీవు గుర్తుదెచ్చుకో, అతను మొదట నీతో ఇక్కడకు వచ్చినప్పుడు అతడు నేను తయారుచేసిన ‘మెడాలిన్’ తినలేదు. మంచూ ఆహారం తినటంవలన ఆతడి కడుపు గడబిడగావుంటుందిలే అంది మదర్. మదర్ అన్నదానికి అర్థం ఇదే. అందుకు అతడుముఖం ఎలాముడుచుకున్నాడు అదిచాలా హృదయాకర్షణీయమైన కథ. ఒకప్పుడు అతడు హాంకావ్‌లో వుండేవాడు— అప్పుడే అక్కడ విప్లవంజరిగింది. ఆ విప్లవంలో చాలా మంది మంచూలు చంపబడ్డారు. కాని బెడింగ్‌టన్ ఒక మంచూ కుటుంబాన్ని కాపాడాడట. ఆ కుటుంబం అక్కడి రాజకుటుంబసంబంధీకులు. ఆ కుటుంబంలోని ఈ బాలికకు

బెడింగ్‌టన్ యందు ప్రేమకల్గింది.– ఆ తరువాతకథ నీవే ఆలోచించుకోవచ్చు.– హాకావ్రానుంచి బయలుదేరినప్పుడు ఆ బాలికకూడా వెంటవచ్చింది. ఇప్పుడిక అతడెక్కడకు వెళ్ళినా ఆమె వెంటేవుంటుంది. పాపం! బెడింగ్‌టన్ ఓటమి నంగీకరించి ఆమెకు ఆశ్రయం ఇవ్వాల్సివచ్చింది. బెడింగ్‌టన్ కూడా ఆమెను చాలా ప్రేమిస్తున్నాడు. కొందరు మంచూస్త్రీలు చాలా అందంగావుంటారు.– సరేచూడు, ఎక్కడనుంచి ఎక్కడిమాటల్లో కొచ్చాను. నేనింకా చేయాల్సిన పని ఎంతోవుంది, నేనేమో ఇక్కడకూర్చుని కబుర్లు చెప్తున్నాను. నేను పూర్తిగా వ్యర్థురాలనై పోయాను. నాపైనాకే సిగ్గువేస్తుంది."

# 50

ఇప్పుడు తాను వికాసం చెందుతున్నానని కిటీ యోచిస్తుంది. ఎప్పుడూ ఎడతెగని పనిలో నిమగ్నమై వుండటంవలన తన పాత్రనంతా మరచిపోయింది. ఆమెలో క్రొత్త వూహాలు ఉదయించాయి. ఇప్పుడామె ఎక్కువ మనిషిగా వుంటుంది. ఆమె ఇప్పుడు తనను దృఢంగా భావించుకొంటుంది. మిగిలిన జీవితమంతా ఏడ్వటమే తన నొసటి వ్రాలనుకొంది ఒకప్పుడు కాని ఇప్పుడామె ప్రతి క్షణము ఆనందంగా, నవ్వుతూ వున్నట్లుంది. భయంకర మహామారి మధ్యవుండటం ఆమెకు స్వాభావికంగా కనుపించింది. తనచుట్టూ జనం మహామారివలన చనిపోతున్నారని ఆమెకు తెలుసు, కాని ఇప్పుడామె కవన్నీ ఆలోచించే అవకాశమే లేదు. మదర్ తను 'వికలాంగుల

గృహం' లోనికి వెళ్ళటాన్ని నిషేధించింది. దాని తలుపు లెప్పుడూ మూసేవుంటాయి—కిటీలో జిజ్ఞాస రేకెత్తేది. లోనికి తొంగి చూద్దామనుకొనేది, కాని పట్టుపడతాననే భయం వుండేది. పట్టుబడినప్పుడు మదర్ తనకేమి శిక్షవిధిస్తుందో ఆమెకు అర్థంకాలేదు. తనను తిరిగి వెళ్ళి పొమ్మనిచెప్తే అప్పుడేమి జరుగుతుంది. ఆమె అక్కడి పిల్లలను ప్రేమించ నారంభించింది. తాను వెళ్ళిపోతే పిల్లలు తనను జ్ఞప్తి చేసుకొంటారని ఆమెకు తెలుసు. తాను లేక పోయినా పిల్లలు వుండగలరనేది ఆమె ఆలోచించటమే లేదు.

ఒకనాడామెకు ఆకస్మికంగా స్ఫురించింది— వారం రోజులుగా చార్లీ టవున్సెండ్‌ను తాను స్మరించనూలేదు, అతడు తనకు స్వప్నంలోనూరాలేదు. హృదయస్పందనం ఆగిపోయినట్లనిపించినా ఆమె తనను తాను నిగ్రహించుకొంది. ఇప్పుడామె చార్లీయందు విముఖత చెందింది. ఇప్పుడామె అతనిని ప్రేమించటంలేదు. ఈ బంధనంనుంచి విముక్తినిగురించిన ఆలోచనతోనే కిటీకి సౌఖ్యంలభించినట్లనిపించింది. తనగతం వైపు దృష్టిసారించినప్పుడామెకు ఆశ్చర్యం కల్గింది. ఆమె ఎ తగా ప్రేమించిందతనిని. చార్లీ సాంగత్యం లేకపోతే తాన చనిపోతాననుకొనేది— జీవితం దుఃఖసాగరమవుతుందనుకొంది. కాని నేడామెకు వాటన్నిటియందు నవ్వొచ్చింది. తానొక నిరర్థక జీవిననుకొనేది.— తానెంత మూర్ఖురాలు. ఇప్పుడామె చార్లీనిగురించిన ఆకాంక్ష లేకుండా ఆలోచించినప్పుడు ఆమె చార్లీవైపుకు ఎందుకు ఆకర్షించబడిందో కారణం గోచరించలేదు.

బెడింగ్‌టన్‌కు ఏమీ తెలియకపోవటమే మంచిదైందను కొంది; లేకపోతే ఆతడి అప్రియదృష్టిని, పరిహాససంభాషణను ఆమె వినగలిగేదిగాదు.—ఇప్పుడామె ఆ బంధనాలన్నింటినుంచి స్వాతంత్రం పొందింది,— చివరకు స్వాతంత్రురాలవనే అయింది. ఈ ఆలోచనకు కిటీ మౌనంగా వుండలేకపోయింది, కిల కిలా నవ్వేసింది.

రెండవవైపున పిల్లలాడుకొంటున్నారు. మందహాసం చేస్తూ వారు ఆడుకొంటూవుండగా చూడటం ఆమెకు అల వాటయింది. వారు ఎక్కువగా అల్లరిచేసినప్పుడు ఆపివేసేది. ఆటల్లో పొరబాటున ఏ బిడ్డకైనా దెబ్బలు తగులుతాయే మోనని ఆమె చాలా శ్రద్ధవహించేది. కాని నేడు! నేడు కిటీ ఏదో అజ్ఞాతానందంతో ప్రేరేపించబడి తననుకూడా బిడ్డగా భావించి వారి ఆటల్లో పాల్గొంది. చిన్నపిల్లలందరూ కేరింత లతో తమ చిన్ని చేతుల్తో చప్పట్లుచరుస్తూ ఆమెను ఆహ్వానిం చారు. ఆమె వెనుక పరుగెత్తుతూ గదంతా తిరగసాగారు— త్వరత్వరగా బిగ్గరగా కేకలువేస్తూ కేరింతలు కొడ్తున్నారు.

ఇంతలో గది తలుపులు తెరచుకొన్నాయి. మదర్ ఎదురుగా నిలబడివుంది. కిటీ హటాత్తుగా నిలబడి పిల్లలనుండి తనకొంగు విడిపించుకోసాగింది, కాని పిల్లలు అల్లరిచేస్తూనే వున్నారు.

మదర్ సస్నేహనేత్రాలతో, మందహాసం చేస్తూ, "పిల్లల్ని ఈ విధంగానేనా మౌనంగావుంచుతూ వుండేది?" అంది.

"మేమందరం ఆడుకొంటున్నాం మదర్! ఉత్సాహం పట్టలేక పిల్లలు అరవనారంభించారు. అందుకు దోషిని నేను."

మదర్ గదిలోనికి వచ్చింది. పిల్లలు సహజంగానే ఆమెను చుట్టవేయటం ఆరంభించారు. మదర్ వారి భుజాలపై చిన్నగా చరచి నవ్వుతూ వారి చిన్ని చెవులు పట్టుకొంది. అయినా మదర్ కిటీవంక సస్నేహదృష్టితో చూస్తూనేవుంది. కిటీ త్వరత్వరగా ఊపిరిపీల్చుకొంటుంది. ఆమె సిగ్గుపడినట్లు, తటాలున ఆగిపోయినట్లుగా నిలబడివుంది. ఆమె చంచలమైన కన్నులలో కాంతివుంది,— జుట్టు రేగిపోయింది. ఆమె ఈ రూపంలో చాలా అందంగా కన్పిస్తుంది.

"నిన్ను చూస్తే హృదయం వికసిస్తుంది. ఈ పిల్లలు నిన్ను చాలా ప్రేమిస్తున్నారు," అంది మదర్.

కిటీ సిగ్గుతో ఎఱ్ఱబారింది. ఆమెకు తెలియకుండానే కన్నీరుపొంగివచ్చింది. రెండుచేతులతోను ముఖం కప్పుకొని, "మదర్! మీరు నన్ను సిగ్గుపరుస్తున్నారు," అంది.

"మంచిదే, పిచ్చివారు కాకూడదు. సౌందర్యం భగవంతుని వరప్రసాదం. మరి ఇది అన్నిటికంటే విలువైన వస్తువు. మనం సౌందర్యవంతులమైతే ప్రభువును కీర్తించాలి, ఇతరులు సౌందర్యవంతులైతే భగవంతునికి నమస్కరించాలి. ఆయనయొక్క ఈ కళలో మనకు ఆనందం లభిస్తుంది.

మదర్ నవ్వింది. ఆమె ఎదు[illegible]కీ చిన్నపిల్ల అయినట్లుగా మదర్ ఆమెబుగ్గలపై చిఱుగా చప్పటించిం

# 51

కిటి కాన్వెంట్‌కు వెళ్ళనారంభించిన తరువాత బెడింగ్ టన్‌ను రెండు మూడు పర్యాయములు మాత్రమే కలుసుకొంది. అప్పుడప్పుడు కిటీ బంగళాకువచ్చి మద్యం సేవించేవాడు, లేక మరొకప్పుడు మార్గంలో కనుపిస్తే నదివరకు సాగనంపేవాడు; లేకపోతే పర్వతం వరకు తిరిగివచ్చేవారు. కిటీ, వాల్టర్ లిద్దరూ తనతో భోజనం చేయవలసిందిగా ఒకరోజున బెడింగ్‌టన్ ప్రస్తావించాడు. వారు ఢోలీలలో ఒక బుద్ధ విహారం వరకు వెళ్ళాలి. బుద్ధవిహారం పట్టణానికి దాదాపు పదిమైళ్ళదూరానవుంది. అది తీర్థస్థానంగా ఎంచబడేది. మదర్ కిటీకి వారానికి ఒకరోజు విశ్రాంతినిచ్చేది; దానినిబట్టి కిటీకి ఆదివారం శెలవుదినము. కాని వాల్టర్‌మాత్రం నిత్యం వలె ఆదివారంకూడా తనపనిలో మునిగేవుండేవాడు.

ఎండ తీక్షణం గాకముందే బుద్ధవిహారానికి చేరుకోవాలని బెడింగ్‌టన్, కిటీ లిద్దరూ ప్రాతఃకాలమందే బయలుదేరారు. వారి పల్లకీలు ధాన్యపు పొలాలగుండా వెళ్ళుతున్నాయి. మధ్యమధ్య అక్కడక్కడ వాసములతో తయారైన కుటీరాలు కన్పించేవి. కిటీకి ఈ విశ్రాంతి, నిష్కర్ష చాలా సౌఖ్యంగావుంది. ఇన్నిరోజులుగా బాగా జనసమ్మర్దంలో వుండటం వలన నేడామెకు పల్లెలవంటి వాతావరణం ఇంపుగావుంది. వారు విహారానికి చేరుకొన్నారు. విహారం నదీతీరాన నిర్మితమైవుంది. దానికి చుట్టుపట్ల దట్టమైన వృక్షాలున్నాయి. విహారంలో ప్రసన్నవదనం గల భిక్షువులున్నారు. విహారపు వరండాల్లో గంభీర మౌనం వ్యాప్తిచెందింది. ఎదు

రుగా బుద్ధభగవానుని విగ్రహముంది. విగ్రహాభంగిమలో, ముఖమందు దుఃఖము, క్షోభ, త్యాగము మిళితమైన భావ మున్నట్లు స్పష్టంగా కన్పిస్తుంది; అయినా ఆ విగ్రహపు పెద వులపై ఒక సౌమ్యమైన దరహాసం విరాజిల్లుతుంది. అటువంటి విహారంలో అన్నివైపులా విముఖత్వము వంటి వాతావరణం వుంది. అక్కడి ఐశ్వర్యము, ఆకర్షణ సమాప్తిచెందాయి. విగ్రహాలు ధూళితో ఆచ్ఛాదితమైవున్నాయి. ఏ నమ్మకము ఆధారంతో ఆ విగ్రహాలు దేవతలుగా సమ్మానించబడ్డాయో ఆ నమ్మకము అక్కడలేదు. శిథిలమైపోయింది. భిక్షులు అక్కడవుంటూ చాలా కష్టమయ జీవితాన్ననుభవించుచున్న ట్లున్నారు. విహారంవదలి వెళ్ళాలనే ఆదేశం ఎప్పుడు విన్పిస్తుందా అనే ప్రతి క్షణము నిరీక్షిస్తున్నట్లు కన్పిస్తారు. విగ్రహం పెద వులపైవున్న సౌమ్యమైన మందహాసం అక్కడ తీక్షణ పరి హాసం వలెవుంది. ఆ భిక్షువులు ఒకప్పటికి అక్కడినుండి వెళ్ళిపోయేట్లుంది, ఆ తరువాత ఒక పెద్ద తుపాను వచ్చి ఈ అవాంఛనీయమైన ప్రదేశాన్ని కప్పివేస్తుంది. అడవిజంతువులు, పురుగులు అక్కడ తమ నివాసాన్నేర్పరచుకొంటాయి,—ఆ విగ్రహాలు వాటి నిలయాలుగా మారతాయి. వరండాలో అడవిమొక్కలు మొలుస్తాయి.— అప్పుడు, అప్పుడక్కడ దేవతల నివాస కాలం సమాప్తమవుతుంది. ఆ స్థానంలో ప్రేతాత్మలు తమ ప్రభుత్వాన్ని స్థిరంచేసుకొంటాయి. ఆ వాతావరణాన్ని చూస్తే ఈ విధంగానే తోస్తుంది.

# 52

కిటీ, బెడింగ్‌టన్ లిద్దరు ఒక స్తంభమునుంచి దిగుడుగా వున్న మెట్లపై కూర్చున్నారు. వారి పాదాల దగ్గర నది ప్రవహిస్తుంది. నది నిరాటంకంగా, కాని నెమ్మదినడకతో ప్రవహిస్తూ, గర్వంగా మహామారిక్రోధానికి కంపించే పట్టణం వైపుకు పోతూవున్నట్లనిపిస్తుంది. పట్టణం వెలుపలవున్న గోడలు అక్కడినుంచి కన్పిస్తున్నాయి. ఎండ తీక్షణమైంది. నది నెమ్మదిగా ప్రవహిస్తుంది; కాని అప్పటికైనా దానిలో గమనంవుంది,— దానిలో జీవితంవుంది. దీనినిచూస్తే, ప్రతి వస్తువుయొక్క రూపం మారిపోతుందిగాని గమనం ఆగదు, జీవితం నిలిచేవుంటుందని అర్ధమవుతుంది. వస్తువులు నశించిపోతాయి, కాని తమ చిహ్నాల్ని వదలిపోతాయి. మానవ సముదాయం యావత్తూ నదీప్రవాహంలోని బుద్బుదసమానులనీ, నది తనతోపాటు ఆ బిందువుల్నికూడా తీసుకొని ప్రవహిస్తూపోతుందని కిటీ ఆలోచించింది. ప్రతిబిందువు మరొక బిందువుతో కలసి కట్టుబడి వుంటుంది, అయినా రెండింటికీ దూరంవుంది. బిందువులయొక్క నియమబద్ధమైన ఇంత వ్యాప్త స్వరూపాన్ని సముద్రం వైపుకు నది ప్రవహింప జేసుకపోతూంది. జీవితంయొక్క అర్ధమిదే అయినప్పుడు చిన్నచిన్న విషయాలకు వ్యర్ధమహత్తునిచ్చి తమ జీవితాలను దుఃఖ భాజనం చేసుకుంటున్నారని కూడా కిటీ యోచించింది.

"'హెరింగ్‌టన్ గార్డన్' ఎక్కడుందో మీకు తెలుసా?" అని కిటీ తన సుందరనయనాలతో బెడింగ్‌టన్‌నుచూసి, చిరునగవుతో అడిగింది.

"తెలియదు! ఎందుకు?"

"ఏమీలేదు. కాని అదిదూరం మాత్రం చాలావుంది. అక్కడే మా కుటుంబంవుంటుంది."

"మీరు యింటికి తిరిగి పోబోతున్నారా?"

"లేదు."

"ఇక మీరు కొద్దినెలలలోనే తిరిగి వెళ్ళిపోతారని నా వుద్దేశ్యం. రోగ తీవ్రత నెమ్మది నెమ్మదిగా తగ్గిపోతూంది; చలి కాలం ప్రారంభ మయేసరికి అదీ పోతుంది."

"నేనిక్కడినుంచి వెళ్ళగోరటంలేదు."

ఒక క్షణం కిటీ భవిష్యత్ ను గురించి విచారంలో మునిగిపోయింది. ఆమెకు వాల్టర్ ప్రోగ్రాము సంగతి తెలియదు. అతడు ఈ విషయాన్ని గురించి కిటీకేమీ చెప్ప లేదు, నిరుత్సాహంగానూ, సభ్యంగానూ, మౌనంగానూ అపరిచితునివలె వ్యవహారిస్తున్నాడు. నదిలో అజ్ఞాతంగా నిరం తరము ముందుకు సాగిపోయే రెండుబిందువులవలె ప్రయా ణిస్తున్నారు.— రెండు బిందువులకు వేరువేరు ఉనికి వుండే దనే ఇతరులుకూడా భావిస్తున్నారు, కాని జలరాశిలో సమ స్తమూ ఒక తుచ్ఛాంగము మాత్రమే అయివున్నది,

"చూడండి, ఈ సన్యాసినులు మీ మత పరివర్తన చేసేస్తారు జాగ్రత్త!" అన్నాడు వెడింగ్ టన్ కుటిలంగా.

"వారి కీవిషయాలకు అవకాశమేవుండదు. వారు తమ పనుల్లోనే పూర్తిగా మునిగిపోయివుంటారు. దానికి కారణ మేమిటో నాకు తెలియదు, వారికిమాత్రమే తెలిసి ఒక

రహస్యమేదో వారివద్దవుందనీ, నేను అది తెలుసుకొనగల యోగ్యురాలనే కాననీ నాకనిపిస్తూవుంటుంది.— ఇది నమ్మకముగాదు; అంతకుమించిన నిగూఢవిషయమేదోవుంది— అది పూర్తిగా భిన్నమైనవస్తువే. వారి ప్రపంచం మన ప్రపంచంకంటే భిన్నమైనది, ఎంతప్రయత్నంచేసినప్పటికీ అది ఎల్లప్పుడు మనకు అపరిచితంగానే వుంటుంది. నేను రోజూ కాన్వెంట్ నుంచి తిరిగి వచ్చేముందు, నా తరువాత కాన్వెంట్ లో నా ఉనికి పేరుగల వస్తువేదీ మిగిలివుండదనే అనిపిస్తూ వుంటుంది.

"మీ గర్వానికి దెబ్బతగిలిందనుకుంటున్నాను నేను," అని బెడింగ్టన్ కొంటెగా అన్నాడు.

"నా గర్వమా?"

కిటీ అలసభావంతో దరహాసం చేసింది.

"ఒక మంచూస్త్రీతో వుంటూన్నట్లు మీరింతవరకు నాకెందుకు చెప్పలేదు?" అని అడిగింది కిటీ.

"ఆ గప్పాలస్త్రీలు మీకింకా ఏమేమిచెప్పారు? ఎవరైనా నా గురించి చాటుమాటున ఇటువంటి విషయాలు సంభాషించటం పాపం."

"కాని మీరంతగా ఆగ్రహ పడతారెందుకు?"

బెడింగ్టన్ తప్పించుకో ప్రయత్నించసాగాడు,— తేలికగా చిరునవ్వునవ్వాడు. "అదేమీ ప్రచారం చేసుకోవలసిన విషయంగాదుగా, విషయం ప్రచారమైతే నా అభివృద్ధి ఆగిపోతుంది." అన్నాడు.

"మీరామెను ఎక్కువగా ప్రేమిస్తున్నారా?"

బెడింగ్టన్ పైకిచూశాడు. అప్పుడాతడిముఖం కిటికీ అల్లరిపిల్లవాని ముఖంవలె కన్పించింది.

"ఆమె నాకోసం తనయింటిని, కుటుంబాన్ని, గౌర వాన్ని అన్నింటిని త్యాగంచేసింది. ఆమె ఇవన్నీ వదిలేసుకొని చాలా సంవత్సరాలైంది. నే నామెను రెండు మూడు పర్యాయములు తిరిగి పంపించివేశాను కూడా— కాని ఆమె మరల తిరిగి వచ్చేది. నేనామెతో విడిపోయి బయటకుకూడా వెళ్ళి పోయాను, కాని ఆమె నావెంటమాత్రం వదలలేదు— మరి ప్పుడు ఆమెను వేరు చేయాలనే ఆలోచనేవదిలేశాను. మేమి ద్దరం కలిసేజీవితాన్ని గడుపుకోవాలని ఆలోచించాను."

"ఆ విధంగా అయితే ఆమె నిజంగా మిమ్మల్ని చాలా ప్రేమిస్తూవుంటుంది."

"ఇదికూడా ఒకవిచిత్రమైన సమస్య." బెడింగ్టన్ కొంచెం వ్యాకులభావాన్ని వ్యక్తంచేస్తూ అన్నాడు. "నేని ప్పుడు ఆమెను వదలివేయటంజరిగితే ఆమె ఆత్మహత్యే చేసు కుంటుందని నాకు నమ్మకం కలిగింది; నన్నేదోచిక్కుల్లో బెట్టాలని మాత్రంగాదు, ఆమె నేనులేకుండా జీవించివుండలేదు. ఇరువపుల్లో ఏ ఒకరికైనా ఈ విషయం తెలిసినప్పుడు విచిత్ర భావం ఉదయిస్తుంది. మరెవరూ ఈ భావం నుంచి తప్పుకొని పారిపోలేరు."

ప్రేమించుటయొక్క మహత్తు ప్రేమించబడటానికి మాత్రంకాదే! ఎక్కడా ఎవరూ తాను కోరబడటానికి కృత జ్ఞుడుకాడే. కొందర్ని ఎవరూ కోరకపోతే వాళ్ళు ఇతరులకు భారమే అవుతారు."

"నాకు బహువచనం అనుభవంలేదు. నాకు నా అనుభవం మాత్రమేవుంది." అన్నాడు వెడింగ్‌టన్.

"సరే, ఆమె నిజంగా రాజకుటుంబానికి చెందిన స్త్రీయా?"

"కాదు! ఇది ఆ సన్యాసినులు చిలవలు పలవలుచేసి చెప్పివుంటారు. కాని ఒక విషయం. ఆమె మంచూ జాతిలో ఒక గొప్పకుటుంబానికి చెందిన బాలికే. కానైతే విప్లవం రోజుల్లో అదంతా అప్పుడేపాడైపోయింది. కాని ఆమె చాలా అద్భుతమైన ...." అని వెడింగ్‌టన్ కొంచెం గర్వంగానే చెప్పాడు. కిటీకి తేలికగా నవ్వొచ్చింది.

"ఇక మీరిక్కడే జీవితమంతా గడుపుతారా?"

"చైనాలోనా? అవును, ఆమె మరొకచోటుకు వెళ్ళి ఏం చేస్తుంది? అవకాశం లభించగానే పెకింగ్ వెళ్ళి ఒక చిన్న యిల్లు తీసుకుంటాను. మేమిద్దరం అక్కడేవుంటాం."

"మీకు పిల్లలా?"

"లేరు."

కిటీ జిజ్ఞాసగా వెడింగ్‌టన్‌ను చూసింది. ఈ కోతి ఆకారపు మనిషికూడా ఒకస్త్రీని సంతోషపరచగలిగి, ఆమెలో తనయందు ఒకవిచిత్ర ప్రేమను కలిగించగలిగాడని ఆమె ఆలోచించింది. కిటీ కేమీ అర్థంకాలేదు. హాస పరిహాసాలతోనూ, మాటల నైపుణ్యంతోనూ అతడీ స్త్రీని జయించాడని కిటీ యోచించింది.

బెడింగ్టన్ గార్డన్ వరకు చేరడానికి పెద్దబాధేమీ వుండదు," అంది కిటీ నవ్వి.

"కాని మీరిదెందు కంటున్నారు?"

"నాకేమీ అర్థంకావటంలేదు. జీవితం విచిత్రమైన వస్తువు. నేను జీవితమంతా ఒకచిన్న తటాకంలో వుండివున్నా ననీ, తిరిగి ఆకస్మికంగా నాకెవరో సముద్రదర్శనం చేయించి నట్లుగానూ తోస్తుంది. అప్పుడప్పుడు నా హృదయం ఆగి పోయినట్లనిపిస్తుంది. నేను చనిపోవాలనుకోటంలేదు.— నేను జీవించగోరుచున్నాను. నాలో ధైర్యముందనేది నాకు తెలు స్తుంది. పాత నావికుడు అజ్ఞాతం వైపున కుటుంబాన్ని వదలి ఏదైనా నూత్న సాగరాన్వేషణకు బయలుదేరినట్లే నా ఆత్మ ఏదో అజ్ఞాతాన్ని అన్వేషిస్తూ వుంటుంది."

బెడింగ్టన్ కిటీవైపు చూశాడు. కిటీదృష్టి అస్థిర జల ప్రవాహంపై స్థిరంగావుంది. రెండు బిందువులు! రెండు బిందు వులు నిశ్శబ్దంగా ప్రవహిస్తున్నాయి.— నిశ్శబ్దంగా,— ప్రవ హిస్తున్నాయి అంధకార అగాధ సముద్రంవైపుగా.

"నేనొకరోజు మీ మంచూభార్యను కలుసుకోవచ్చా?" అని కిటీ ఆతడివైపు చూస్తూ ప్రశ్నించింది.

"ఆమె ఒక్క ఇంగ్లీషుమాట కూడా మాట్లాడలేదు."

"మీరు నాయందు ఎంతో దయచూపించారు. మీ సహృదయతకు బదులుగా నేను కనీసం నా నైపుణ్యాన్ని ఆమెఎదుట స్పష్టపరచాలనుకొంటున్నాను."

"ఏదో ఒకరోజు తప్పక మిమ్మల్ని తీసుకువెళ్ళుతాను. అక్కడ మీకు అతిథిసత్కారమూ జరుగుతుంది."

ఆ మంచూస్త్రీ కిటీకి బాహ్యరూపమైందనీ — తను ఆమెను తనకు తెలియకుండానే ప్రేమించ సాగిందనేది కిటీ బెడింగ్‌టనుకు చెప్పలేదు. ఆ మంచూస్త్రీ తనను ఏదో మరో దేశంవైపుగా — ఉత్సాహం వుండేచోటును — చూపిస్తుందని పించింది.

# 53

రెండు మూడు రోజులతరువాత కిటీకి ఒక అజ్ఞాతరహస్యంజాడ తెలిసింది.

రోజూవలె ఆమె ఆరోజుకూడా కాన్వెంట్‌కు వెళ్ళింది. కాన్వెంటుకు వెళ్ళగానే పిల్లలపరిశుభ్రానికి ఏర్పాట్లు చేయటం ఆమె మొదటిపని. రాత్రిగాలి హానికరమని సన్యాసినుల అభిప్రాయం. అందుకని వారు కిటికీలు, తలుపులు అన్నీ మూసివేశేవారు. కిటీ రాగానే కిటికీలు, తలుపులు అన్నీ తెరచేది. తలుపులు మూసివున్నగదిలో ఆమెకు శ్వాసఆడనట్లనిపించేది. తన ఆరోగ్యం ఒక్కసారిగా చెడిపోతూన్నట్లు ఆ రోజామెకు ఆకస్మికంగా తెలిసింది! తల తిరిగిపోతూంది. ఆమె లేచి ఒక కిటికీని ఊతగొని నిలబడింది. ఆ రోజు ఆమె. ఆరోగ్యంగావున్నట్లుగా అంతకుముందెన్నడూ లేదు! కడుపులో తిప్పసాగింది. తరువాత ఆమె వాంతిచేసుకొంది. ఆమె నోటినుండి భయంకరమైన బొబ్బరింపు వెలువడింది. పిల్లలందరూ భయపడ్డారు. పనిలో కిటీకి సహాయపడుతూ ఉండే ఒక పెద్దబాలిక ఆమె

సహాయానికి పరుగునవచ్చింది, కాని కిటీ కంపిస్తూవుండటం, ఆమె పాలిపోవటంచూసి ఆ బాలిక భయపడి అక్కడే నిలబడిపోయింది. అకస్మాత్తుగా ఆమె నోటినుంచి 'కలరా' అని వెలువడింది, ఈ మాట కిటీ చెవుల్లో పడగానే, తనపైమృత్యువునీడ తిరుగాడుతూ వున్నట్లు కన్పించిందామెకు. మృత్యుభయంతో ఆమె కంపించిపోతుంది. ఆమె ఆ మృత్యుఅంధకారాన్నుంచి తనను తానే విముక్తి చేసుకోయత్నిస్తుంది. తాను చాలా జబ్బుపడ్డాననిపించింది. ఆమెకన్నులముందు గాడాంధకారం వ్యాపించింది.

కిటీ కన్నులు తెరచిచూసినప్పుడు తానెక్కడుందో కూడా ఆమెకు తెలియలేదు. తాను క్రింద పడుకునివున్నట్లు తెలిసింది, నెమ్మదిగా తల పైకెత్తింది – తలక్రింద తలగడ ఉంది. ఆమె ఏమీ గుర్తుచేసుకోలేకపోయింది. మదర్ ఆమెపైకి వంగిఉంది. ఆమెకేదో వస్తువు వాసనచూపిస్తుంది. సిస్టర్ జోజెఫ్ అదేపనిగా కిటీవంక చూస్తుంది. కిటీకి కలరా దృష్టికొచ్చింది, సిస్టరముఖాల్లో గాంభీర్యముంది. సిస్టర్ జోజెఫ్ కిటీకి చాలా పొడవుగా కన్పిస్తుంది. తిరిగి ఆమెభయంతో కంపించిపోయింది.

"ఓ! మదర్! మదర్! నేను చనిపోతానా? నేను చనిపోదలచటంలేదు"? అంది ఏడుస్తూ కిటీ.

"నీవు చనిపోవమ్మా!" అంది మదర్. మదర్ముఖం పూర్తిగా శాంతంగావుంది. ఆమె ముఖంలో మందస్మితహాసరేఖ వుంది.

" -కాని ఇది కలరా. వాల్టర్ ఎక్కడున్నాడు?

అతడిని పిలువనంపారా? అబ్బా, మదర్! మదర్!!" కిటీ వెక్కి వెక్కి ఏడ్వసాగింది. మదర్ తన చేతుల్ని ఆసరగా ఇచ్చింది. కిటీ మదర్ చేతుల్ని వదిలితే వెంటనే ప్రాణం పోతుందేమో నన్నంత గట్టిగా పట్టుకొంది.

"బిడ్డా! ధైర్యం వహించు. మూర్ఛంచేయగూడదు. కలరా గిలరా ఏమీగాదు."

"వాల్టర్ ఎక్కడున్నాడు?"

"అతడు పనిలో మునిగివున్నాడు — అతనిని కష్టపెట్టి ఏం చేస్తావ్? అయిదు నిముషాల్లో బాగై పోతావు."

కిటీ మదర్‌ను రెప్ప వేయకుండా చూస్తూంది. వీరింత నిర్దయగా ఎందుకున్నారు? వారి జబ్బును ఆటగాచూస్తున్నా రెందుకు? అని ఆమె ఆలోచిస్తుంది.

"కొద్దిసేపు ఏమీ మాట్లాడకు. భయపడాల్సిన విష యం ఏమీలేదు" అంది మదర్.

కిటీ హృదయం వేగంగా కొట్టుకోసాగింది. కలరాను గురించి కిటీ ఎంతగా వినివున్నా తనకూ కలరా రాగలుగు తుందనే విషయాన్నే ఆమె మర్చిపోయింది.

నే నెంత మూర్ఖురాలను అనుకుంది. నేను చనిపోతా ననుకుంటున్నాను. నేనెంత భయపడిపోయాను, కొందరు పిల్లలు ఒక పడకకుర్చీ తెచ్చారు. దానిని కిటికీకి ఎదురుగా వేశారు,

"రా, మేము లేవతీస్తాం. పడకకుర్చీలో నీ కెక్కువ విశ్రాంతిగా వుంటుంది. నిలబడగలుగుతావా?" అంది మదర్.

మదర్ కిటికి చేతులందించింది, సిస్టర్ జోజెఫ్ కాళ్ళు పట్టుకుని ఆమెను లేపి పడకకుర్చీలో కూర్చోబెట్టింది. కిటీ అలసిపోయినట్లు నిర్జీవంగా కుర్చీలో పడిపోయింది.

"కిటికి మూసివేయటం మంచిదని నా అభిప్రాయం, ఉదయపు చల్లని గాని హానికరం కావచ్చు" అంది సిస్టర్ జోజెఫ్.

కిటీ వెంటనే మాటఅందుకొని "వద్దు వద్దు, దానిని తెరచే వుంచండి" అంది.

ఎదురుగా నీలాకాశాన్ని చూసేసరికి కిటీకి ప్రాణం కుదుటబడింది. పూర్తిగా నిర్జీవమైపోయినా, ఇప్పుడిక నెమ్మదిగా కుదురుకొంటుంది. ఇద్దరు సన్యాసినులు ఒకక్షణం మౌనముగా ఆమెవైపు చూశారు. సిస్టర్ జోజెఫ్ మదర్ కేదో చెప్పింది, కాని కిటీకేమీ బోధపడలేదు. మదర్ కుర్చీ చేతిపై కూర్చొని కిటీ చేతిని తనచేతిలోకి తీసుకొంది.

"చూడమ్మా!"

మదర్ కిటీని రెండు మూడు ప్రశ్నలడిగింది. ఆమె ప్రశ్నలకర్థం తెలియకుండానే కిటీ జవాబు చెప్పింది. ఆమె పెదవులింకా కంపిస్తూనేవున్నాయి, మాట్లాడటమే కష్టమనిపించిందామెకు.

"అందులో ఏమీ సందేహమేలేదు" అంది జోజెఫ్, "ఆ విలయంలో నేను పొరబాటుపడను" అని నవ్వింది ఆ నవ్వులో కిటీకి ఉత్సాహం కన్పించిందేగాని స్నేహంలేదు, మదర్ కిటీ చెయ్యిపట్టుకొని మృదువుగా నవ్వింది.

"సిస్టర్ జోజెఫ్‌కు ఈ విషయాల్లో నాకంటే ఎక్కువ అనుభవముంది బిడ్డా! ఆమె వెంటనే నీ బాధకు కారణాన్ని తెలుసుకొంది. ఆమె అనుమానం పూర్తిగా నిజమే"

"మీ ఉద్దేశ్యం తెలియటలేదు" అని కిటీ ఆత్రంగా అడిగింది.

"నా బిడ్డా! స్పష్టంగా తెలుస్తూనే వుంది, ఇది నీ కెప్పుడూ తెలియనేలేదా? నీవు తల్లివి కాబోతున్నావు"

కిటీ నిలువెల్లా అదరిపడింది, కాళ్ళు ఎగిరిపోతాయే మోనని ప్రయత్నంగా నేలపై ఆనించింది,

"విశ్రాంతిగా పడుకొని వుండు" అని మదర్ చెప్పింది.

కిటీ సిగ్గుతో కుంభించుకపోయింది. ఆమె తన రెండు చేతుల్లో వదనాన్నదుముకొంది.

"ఇది అసంభవం! ఇదిజరుగదు!"

సిస్టర్ జోజెఫ్ ఫ్రెంచిలో ఏదో చెప్పింది. కిటీకి తెలియలేదు. మదర్ ఇంగ్లీషులో అనువాదం చేసిచెప్పింది, సిస్టర్ జోజెఫ్ బుగ్గలు ఎఱ్ఱబడ్డాయి. ముఖంలో వెలుగువుంది.

"ఇందులో పొరబాటేవుండదు_ ఇది నా నిశ్చితం."

"నీ వివాహమై ఎంతకాలమైంది?" మదర్ అడిగింది. "నా ఆడబిడ్డ వివాహమైన ఇంతకాలానికే ఇద్దరు బిడ్డలతల్లయింది."

కుర్చీలో అతుక్కుపోయింది. ఆమె హృదయంపై

మృత్యుభయం వ్యాపిస్తుంది. "ఎంత సిగ్గయిన విషయం!" అని గొణిగింది.

"ఎందుకు? బిడ్డకలుగబోతున్నందుకా? ఇది స్వాభావికమైన విషయమే."

"డాక్టర్‌గారికెంత సంతోషం కలుగుతుంది?" అంది సిస్టర్ జోజెఫ్.

"అవును, ఆలోచించు. నీ భర్తకెంత ఆనందం కలుగుతుంది. ఆయనసలు సంతోషంతో ఉబ్బిపోతాడు. ఆయన పిల్లలతో ఆడుకొంటూ అంతామర్చిపోతారు. ఇక ఆయనకే బిడ్డలుంటే ఆనందానికి హద్దేవుండదు."

కిటీ మౌనంగావుంది. సన్యాసినులిద్దరూ ఆమెవైపే చూస్తున్నారు. మదర్ కిటీ చేతుల్ని నిమురసాగింది.

"ఇదికూడా తెలుసుకోలేకపోయాను, నేనెంత మూర్ఖురాలను. కలరా రాలేదు, నాకన్నిటికంటే సంతోషకరమైన విషయమదే. ఇప్పుడిక నేనుస్వస్థపడ్డాను. నాపనిలోనికి వెళ్తాను." అందికిటీ.

"ఈరోజువద్దు. నీఆరోగ్యం చెడిపోయిందమ్మా! ఇంటికి వెళ్ళి విశ్రాంతి తీసుకొంటే మంచిది."

"వద్దు,— నేనిక్కడేవుండి నాపనిచేస్తాను."

"వద్దు, నామాటవిను. డాక్టరుగారేమంటారు? నీకంతగా ఇష్టమైతే రేపురా. నేడుమాత్రం నీవు తప్పక విశ్రాంతి తీసుకో. నేనిప్పుడే డోలీ పిలిపిస్తాను. కావాలంటే ఎవరైనా వెంట పంపించనా?"

"వద్దు మదర్! నేను ఒక్కతెనే వెళ్తాను.

# 54

కిటీ తన బంగళాలో ఒకగదిలో తలుపులు వేసుకొని పడుకొనివుంది. మద్యాహ్నభోజనం తరువాత నౌకర్లుకూడా విశ్రాంతితీసుకొంటానికి వెళ్లారు. నేడు తనకు తెలిసిన రహస్యం విషయంలో ఆమెకు చాలా విచారం కల్గింది, బంగళాకు తిరిగి వచ్చినప్పటినుంచీ ఆమె ఈ విషయాన్ని ఆలోచిస్తూనేవుంది. కాని ఒక నిర్ణయానికి రాలేకపోతుంది, తన మనస్సులో ఏదో భయంవంటి దున్నట్లనిపించింది, ఆమె ఆలోచనలు ఒక క్రమ పద్ధతిలోలేవు, ఆలోచనలోవుండగానే ఆమెకు అడుగుల ధ్వని విన్పించింది, ఎవగో బూట్లు ధరించిన వ్యక్తి వస్తూవున్నాడు. ధ్వనినిబట్టి ఎవరైనా బాలుడుగానీ, లేక మరెవరోగాక తన భర్త వ్రాట్లరేననీ ఆమె తెలుసుకొంది, అతడు బయట గదిలో వున్నాడు. అతడు తనపేరుబెట్టి పిలవడంవింది, ఆమె ఏమీ జవాబు చెప్పలేదు, ఒకక్షణం మౌనంగా వున్నతరువాత కిటీ తనగదితలుపు తట్టడం విన్నది.

"ఆ!"

"నేను లోనికి రావచ్చునా?"

కిటీ మంచం మీదినుంచిలేచి గౌను వేసుకొని, "రావచ్చు" అని చెప్పింది.

అతడు గదిలోనికివచ్చాడు, మూసివున్నగదిలో అతడు తన ముఖాన్ని చూడలేదని గ్రహించి కిటీకి ధైర్యంకల్గింది.

"నేను నిన్ను లేపలేదుగదా? నేను చాలా నెమ్మదిగా తలుపుతట్టాను."

"నేను నిద్రపోవటంలేదు."

వాల్టర్ ఒక కిటికీ తెరచాడు. కిటికీ తెరవగానే గదిలోనికి వెలుగువచ్చింది.

"ఏమిటివిషయం? ఈరోజింత త్వరగావచ్చేవేం?" అని కిటీ అడిగింది.

"నీ ఆరోగ్యం సరిగాలేదని సిస్టర్లు చెప్పారు. వెళ్ళి కారణం తెలుసుకుందామనుకున్నాను."

కిటీకి ఆగ్రహం కల్గింది.

"నాకు కలరావస్తే నీవేమిచేసేవాడివి?"

"కలరానే వచ్చివుంటే నీవు కాన్వెంట్ నుంచి యింటికే రాగలిగేదానివిగాదు."

కిటీ లేచి అద్దంముందుకువెళ్లి చెదిరిన జుట్టు దువ్వుకోసాగింది. ఆమె కాలయాపనం చేయాలనుకొంది. తరువాత తిరిగివచ్చి కూర్చొని సిగరెట్ వెలిగించుకొంది.

"నా ఆరోగ్యం ఈరోజుఉదయం సరిగాలేదు. నేను ఇంటికివెళ్లి విశ్రాంతి తీసుకోవలసిందని మదర్ బలవంతం చేసింది. నేనిప్పుడు పూర్తి ఆరోగ్యంగా వున్నాను. రేపు నేను ఎప్పటివలె కాన్వెంట్‌కు వెళ్తాను."

"కాని అసలేం జరిగింది?"

"వారు నీకు చెప్పలేదా?"

"లేదు, ఇంటికివెళ్తే అంతా అదేతెలుస్తుందని మదర్ చెప్పింది."

నేడు వాల్టర్ ఎప్పుడూ అతిస్వల్పంగా చేస్తూవుండేపని చేశాడు_ అతడు దృష్టినంతటినీ కేంద్రీకరించి కిటీని చూశాడు. అతడి సహకార వ్యక్తిత్వం అతడిముఖంలో స్పష్టంగా కన్పిస్తుంది. కిటీ కొంచెం సంకోచించింది. తరువాత ధైర్యంచేసి వాల్టర్ కళ్ళల్లోకిచూసింది, "నేను తల్లిని కాబోతున్నాను," అని చెప్పింది.

ఏమాటకైనా వాల్టర్‌నుంచి జవాబు కోరినప్పుడు తరచుగా అతడు మౌనం వహిస్తూవుండేవాడు. కాని నేటివలె ఆమెకు ఆ మౌనం మరింతకు ముందెప్పుడూ బాధాకరంగా కనుపించలేదు. అతడేమీ మాట్లాడనూలేదు, అతడిలో మరే మార్పూ జరుగలేదు. మాటను విన్నాడు అనిమాత్రమే అతడి కన్నుల్లో కన్పించేది. కిటీ బిగ్గరగా అరవాలనుకొంది. భార్యాభర్తలమధ్య ప్రేమేవుంటే ఇటువంటి సమయాలందు భావావేశంలో ఇద్దరూ ఒకరికొకరు పెనవేసుకొనేవారు. కాని అతడు మౌనంగావున్నాడు! ఈ మౌనం కిటీకి చెడుగా కన్పించింది. ఆమే సంభాషణప్రారంభించింది. "నాకింతకుముందు ఇది తెలియనేతెలియదు. నేనెంత మూర్ఖురాలను, కాని... ఒకవస్తువుకు రెండవ వస్తువుతో ఏమి......?'

"నీవు గర్భవతివై ఎన్ని......ఎన్నిరోజులింకా...?"

మాట్లాడటానికి వాల్టర్‌కు చాలా కష్టంగావున్నట్లుంది. తనకు వలెనే వాల్టర్ గొంతుకూడా తడియారిపోతుందని కిటీ గ్రహించింది. మాట్లాడేటప్పుడు తన పెదవులు కంపించటం ఆమెకు బాధగానేవుంది. వాల్టర్ పాషాణం కాకపోతే అతనికి తప్పక దయకలుగుతుందని ఆమె భావించింది.

"నా వుద్దేశ్యంలో రెండు మూడు నెలలై వుంటుంది."

"నేనే తండ్రినా?"

కిటీ దీర్ఘంగా నిట్టూర్చింది. వాల్టర్ కంఠంలో కంపనం వుంది. వాల్టర్ యొక్క ఈ భావాన్ని ఖండించటం చాలా శోచనీయమైనస్థితే. హాంకాంగ్‌లో తాను ఒక యంత్రాన్ని చూసినట్లు ఆకస్మికంగా కిటీకి తలపుకొచ్చింది. దానిలోని ముల్లు చాలా కొద్దిగా కదిలితే ఎన్ని వేలమైళ్ళ దూరాన భూకంపం జరిగిందీ, ఎంతమంది జనం చనిపోయిందీ చెప్పేది. ఆమె వాల్టర్ వైపు చూసింది. బాగా వెలవెలబొరాడు, ఆ వెలవెలబొరడం అంతకుముందుకూడా రెండు మూడు పర్యాయాలు కిటీ అతడిముఖంలో చూసింది. వాల్టర్ కొంచెంగా తల ప్రక్కకు తిప్పి మరోదిక్కుకు చూస్తున్నాడు.

"అయితే......?"

కిటీ చేతులు కట్టుకు కూర్చుంది. తాను 'అవును' అని అంటేచాలు వాల్టర్‌కు ప్రపంచ సంపదేలభిస్తుందని ఆమెకు తెలుసు. అతడు తనను విశ్వసిస్తాడు. ఎందుకంటే అతడు తనను విశ్వసించగోరుతున్నాడు, తరువాత తనను క్షమించి వేస్తాడుకూడాను. వాల్టరులో కరుణనిండివుందని ఆమెకు తెలుసు. అతడు దానిని ఉపయోగిస్తాడు. అతడు మంకుపట్టుగల మనిషి గాడనికూడా ఆమెకు తెలుసు. ఆమె ఆ మాటను వాల్టర్ హృదయానికి తాకేటట్లుగా చెప్పగలిగితే అతడు తనను పూర్తిగా క్షమిస్తాడు. ఆ తరువాత మరెప్పుడూ గతాన్ని స్మరించడుకూడా. వాల్టర్ నిర్దయుడు కావచ్చు కాని తుచ్ఛుడు,

నీచుడు మాత్రం కాజాలడని ఆమె ఆలోచించింది. ఆమె 'అవును' అనేమాట అంటేచాలు వాల్టర్‌కు అన్నీలభిస్తాయి.

కిటీకికూడా సానుభూతి చాలాఅవసరం. విశ్వాసము పొందే ఆలోచనతో ఆమెలో నూత్నమైనఆశలు, ఆకాంక్షలు ఉదయించాయి. ఆమె తనను బలహీనంగా — భీతిజెందినట్లు, ఏకాకియైనట్లు భావించుకుంది. ఆరోజు ఉదయమే ఆమెకు తనతల్లియందు దృష్టిపోయింది, కాని తాను ఆమెవద్ద వుండ గలిగితే ఎంత బాగుంటుంది అనేది ఆమె ఇప్పుడు హృదయ పూర్వకంగా వాంఛిస్తుంది. ఆమె ఆధారాన్ని వెతుకొంటుంది. ధైర్యాన్నన్వేషిస్తుంది. తానతని నెన్నడు ప్రేమించ లేదనికూడా ఆమెకు తెలుసు — కాని ఆమెను వాల్టర్ తన కౌగిలిలోనికి తీసుకోవాలనీ, తనవక్షముపై ఆమెతలనుంచుకో నీయాలనీ కిటీ ఈ క్షణంలో కోరుకొంటూవుంది. ఒకసారి సంతోషంతో కిలకిలలాడాలనిపిస్తుంది. వాల్టర్ తన నొకపర్యా యం చుంబించాలనీ, తాను తనచేతుల్ని హాలంగా వాల్టర్ మెడచుట్టూ వేయాలని కోరుకొంటుంది.

కిటీ ఏడ్చింది. ఆమె అబద్ధమాడింది. తాను తేలికగా అబద్ధం ఆడగలుగుతుంది. ఒక అబద్ధంతో చెడినకార్యం చక్క బడగలిగితే అబద్ధమాడటానికి అభ్యంతర మేముంటుంది? అబద్ధం! అబద్ధం — అబద్ధం ఏమిటి? 'అవును' అని చెప్పటమే గా చేయాలి. వాల్టర్ కన్నులు ద్రవించాయని, అతడుతనవంక చేతులు చాస్తున్నాడనీ ఆమె భావించుకొంది. కాని ఆమె 'అవును' అని చెప్పలేకపోతుంది. ఎందుకు చెప్పలేకపోతూ వుందో ఆమెకు అర్థం కావటంలేదు. గడచిన వారాలలో

ఆమెకు చాలా కఠినానుభవాలు కలిగాయి. చార్లీ, అతడి. నిర్దయ, కలరా, దానివలన మానవమరణాలు, సన్యాసినులు, త్రాగుబోతు బెడింగ్‌టన్ ఇవన్నీ తనను పూర్తిగా మార్చే శాయి. ఆమె వీ టన్నిటితో కదలిపోయినట్లయింది. ఎవరో తన హృదయంలో కూర్చొని ఇవన్నీ ఆశ్చర్యంగా చూస్తూ న్నట్లనిపించింది. ఆమె నిజం చెప్పాలి. అబద్ధమాడటం సబబు గాదు. ఆమె ఆలోచనలలో సామ్యంలేదు. ఆమెకు ఆలోచ నలలో ప్రహరీగోడ ప్రక్కగా ఆ భిక్షుకుడు కనుపించాడు. ఆతడినిగురించి ఇంతకూ ఎందుకాలోచించింది? కపోలముల పైగా కన్నీరు దొర్లుతున్నాయి - చివరికామె ప్రశ్నకుజవాబు చెప్పింది. బిడ్డకు తండ్రి అతడేనా అని వాల్టర్ అడిగాడు.

"నాకు తెలియదు" అంది ఆమె.

వాల్టర్ పళ్లు పటపటలాడాయి. కిటీ గాబరాపడింది.

"ఇది అనుచితం గాదా?"

వాల్టర్ జవాబు ఆతడి వ్యక్తిత్వాని కనుకూలంగానే వుంది. కిటీకూడా ఆ జవాబుకే ఎదురుచూస్తోంది. అయినా వినగానే ఆమె హృదయం క్రుంగిపోయింది. నిజంచెప్పటానికి తనకెంత కష్టం కలిగిందో వాల్టర్ అర్థం చేసుకోగలిగితే ఎంత బాగుటుంది అని ఆమె ఆలోచిస్తూంది. ఆమె ప్రయత్నా న్నతడు ప్రశంశించగలిగితే ఎంత బాగుండును. తన జవాబు "నాకు తెలియదు, నాకు తెలియదు!" ఆమె మనస్సులో ప్రతిధ్వనిస్తూంది. ఇప్పుడిక జవాబును ఉపసంహరించుకో జాలదు. రుమాలు తీసుకొని కన్నీరు తుడుచుకొంది. ఇద్దరు మౌనంగా వున్నారు. మంచంవద్ద వున్న కూజానుంచి ఒక

గ్లాసు మంచినీళ్ళు తీసుకొని త్రాగింది. వాల్టర్ చేయి ఎంత సన్నగా వుందో ఆమె గమనించింది. వాల్టర్ చేతులు దృఢంగా వుండేవి — అందంగా — పొడవైన వ్రేళ్ళు — కాని ఇప్పుడు ఎముకలుగూడుగా తయారయాయి. అతడు కొంచెంగా కంపించాడు. వాల్టర్ తన ముఖంలోనికి ప్రతీకారభావం రానివ్వ లేదుగాని, చేతులు మోసంచేశాయి.

"నా ఏడ్పును గురించేమీ విచారించకు. ఇందులో ఏమీలేదు. నేను కన్నీరుకార్చకుండా వుండలేను" అంది కిటీ.

కిటీ మంచినీళ్ళు త్రాగినతరువాత వాల్టర్ గ్లాసుఅందుకొని అక్కడ పెట్టేశాడు. అతడొక కుర్చీమీద కూర్చొని సిగరెట్ వెలిగించాడు. ఒకసారి నిట్టూర్చినట్లనిపించింది. కిటీ మొదటకూడా వాల్టర్ మూలగటం వినివుంది ఇప్పుడతని నిట్టూర్పుతో ఆమె హృదయం క్రుంగిపోతూంది. వాల్టర్ కిటికీనుంచి బయట శూన్యంలోనికి రెప్పవేయకుండా చూస్తున్నాడు, కిటీ వాల్టర్‌ను చూస్తూంది. వాల్టరెంత బలహీనమైపోయాడో ఆమె గమనించింది. ఆమె ఇంతవరకూ ఈవిషయాన్నెన్నడూ గమనించలేదు. వాల్టర్ ముఖం పీక్కుపోయివుంది. ఆతడి దుస్తులుకూడా, తనకంటే పెద్దవారి దుస్తుల్ని ధరించాడా అన్నట్లు వదులైపోయాయి. ముఖం ఎండదెబ్బతిన్నట్లు కన్పిస్తున్నాడు. అతడెల్లవేళలా పనిలో మునిగివుండేవాడు, నిద్ర చాలా తక్కువ — ఆహారం చాలాతక్కువ. తనబాధలో కూడా కిటీకి అతనియందు దయగలిగింది. తానెప్పుడూవాల్టర్ యందు శ్రద్ధవహించనందుకు కిటీకి చాలా దుఃఖంకలిగింది.

తలనొప్పిగా వున్నట్లు వాల్టర్ తనచేతితో నుదురును అదుము కొన్నాడు. వాల్టర్ మనస్సులోకూడా తనమాట "నాకు తెలియదు, నాకు తెలియదు!" అనేది ప్రతిధ్వనిస్తూ వుండివుంటుందని కిటీ ఆలోచించింది. వాల్టర్‌వంటి నిరుత్సాహి సిగ్గరిలోకూడా పిల్లలయందు ఎంతమమకారంవుంది అనేది ఆమెకు చాలా ఆశ్చర్యం కల్గించింది— చాలామంది పురుషులకు తమ బిడ్డలునచ్చరు, కాని వాల్టర్ విషయంలో సిస్టర్లు చెప్తూవున్నారు. వాల్టర్‌లో ఆ చైనా పిల్లలయందే అంత స్నేహముంటే తన బిడ్డయందెంత వాత్సల్య ముంటుంది?

వాల్టర్ తన గడియారంవంక చూశాడు.

"నాకు చేయవలసినపని చాలావుంది. ఇక వెళ్తాను. ఇప్పుడిక నీవు కులాసాగా వుంటావుగదూ?"

"ఆఁ ఆఁ! నన్ను గురించి విచారించకు."

"నీవు సాయంత్రం నాకొరకు ఎదురుచూడవద్దు, నేను ఆలస్యంగా వస్తాను. కర్నల్ యూ గారింటివద్ద భోజనం చేసాను."

"సరే!"

వాల్టర్ లేచినిలబడి, "నేను నీపరిస్థితిలోవుంటే నేడేమీ చేసేవాడినిగాను. నీవుకూడా దీనినిగురించి ఏమీచింతించకు, నేను వెళ్ళకముందు ఏమైనా కావాలంటేచెప్పు.

"వద్దు, నేను పూర్తిగా బాగవుతాను."

వాల్టర్ ఏదో అనిశ్చితంగావున్నట్లు ఒకక్షణం ఆగి తిరిగి వెంటనే కిటీవంక చూడకుండానే త్వరగా గదినుంచి

వెళ్ళిపోయాడు. కిటీకి అతడు వెళ్ళిన ధ్వని విన్పించింది. కిటీ పూర్తిగా ఏకాకినైనట్లు భావించుకొంది. తనను తానిక నిగ్రహించుకొనలేక వెక్కి-వెక్కి ఏడ్వనారంభించింది.

# 57

రాత్రి చాలా నీరసంగానూ, వేడిగానూవుంది. కిటీ ఒక గది కిటికీ కెదురుగా కూర్చుని ఒక చైనా దేవళపు గోపురం వంక చూస్తూంది, అది చాలా విచిత్రంగా నిర్మించబడివుంది. మినుకు మినుకుమనే నక్షత్రకాంతిలో మరీ హాసజనకంగా వుంది. చివరకు వాల్టర్ వచ్చాడు. ఏడ్చి ఏడ్చి కిటీ కన్నులు ఉబ్బిపోయాయి; ఆరోగ్యం మాత్రమిప్పుడు పూర్తిగా బాగు పడింది. అలసట, అవరోధాలన్నింటి తరువాత ఇప్పుడు ప్రశాంతంగా వున్నట్లు ఆమెకు గోచరించింది.

"నీవు నిద్రపోయి వుంటావనే అనుకున్నాను," అంటూ వాల్టర్ లోనప్రవేశించాడు.

"నాకు నిద్రరాలేదు. ఇక్కడ కూర్చోవడమే చాలా హాయి అనిపించింది. నీవు భోజనం చేశావాలేదా?"

"చేశాను."

వాల్టర్ గదిలో పెద్ద పెద్ద అంగలువేస్తూ తిరుగుతున్నాడు. వాల్టర్ చాలా పెద్ద సమస్యలో నిమగ్నమైవున్నాడని కిటీ అనుకుంటుంది. ప్రత్యేకాభిరుచి ఏమీలేకుండానే ఆమె వాల్టర్ మాటల కెదురుచూస్తోంది. ఇంతలో వాల్టర్ మాట్లాడనూ మాట్లాడాడు_ "నీవు మధ్యాహ్నం

చెప్పిన విషయాన్ని గురించి నేను ఆలోచిస్తూనేవున్నాను. నీవు తిరిగి వెళ్ళిపోతే చాలామంచిదని నా అభిప్రాయం నేను కర్నల్ యూ తో మాట్లాడాను, ఆయన నిన్ను పంపివస్తారు. దాసీని కూడా వెంటతీసుకువెళ్లు— నీకేవిధమైన కష్టమూ కలుగదు.''

''కాని నేను వెళ్లేది ఎక్కడికి?''

''మీతల్లిగారి దగ్గరకు వెళ్ళవచ్చు.

''నేను వెళ్ళటం ఆమె సంతోషిస్తుందనే నీ అభిప్రాయమా?''

ఆ మాటకు అర్థం తెలుసుకుంటానికన్నట్లు వాల్టర్ క్షణకాలం మౌనంవహించాడు.

''అయితే నీవు హాంకాంగ్ వెళ్ళవచ్చు.''

''అక్కడ నేనేమి చేయను?''

''నీకు విశ్రాంతి,, సంరక్షణ చాలా అవసరం. నీవిక్కడ వుండటం మంచిదిగాదనే నా వుద్దేశ్యం.''

కిటీ నవ్వకుండా వుండలేకపోయింది. ఆమె దూరంగా ఎక్కడికో ఆఅంధకారంలో చూస్తూంది. ఆకాశంలో అంతటా నక్షత్రాలున్నాయి. మేఘాలనేవి ఎక్కడా మచ్చుకుకూడా లేవు. అతడు అక్కడే నిలబడి, ''నీలాంటి స్థితిలోవున్న స్త్రీకి ఇది అనువైనప్రదేశంగాదు,'' అన్నాడు.

కిటీ వాల్టర్ వైపుచూసింది. ఆ బక్కపల్చని మనిషి భావాల్లో కాఠిన్యము, చెడు ఆలోచనలు పూర్తిగా నిండి వున్నాయి, అయినా కిటీ అప్పుడు భయపడలేదు. ''నీవు

నన్నిక్కడికి తీసుకువచ్చినప్పుడు నన్ను చంపివేయాలనే అభి ప్రాయంతోనే తీసుకొచ్చావా?'' అని కిటీ ఆకస్మికంగా ప్రశ్నించింది.

వాల్టర్ చాలాసేపటివరకు జవాబు చెప్పలేదు. అతడు తన మాట వినలేదని కిటీ భావించింది.

"మొదట అదే అభిప్రాయం వుండేది."

కిటీ కంపించింది. వాల్టర్ మొదటిసారిగా తన ఆలోచ నను స్వీకరించాడు. కిటీకి వాల్టర్ జవాబు చెడుగాతోచలేదు. ఎందుకు చెడుగనిపించలేదోననే కిటీకికూడా ఆశ్చర్యంకలిగింది. కిటీకి వాల్టర్ జవాబు కొంచెం మంచిగానే కన్పించింది. ఆమెకు నవ్వుకూడావచ్చింది. ఆమెకు తలవనితలంపుగా చార్లీ ఆలోచన కల్గింది, కాని ఇప్పుడామె వుద్దేశ్యంలో అతడు శుద్ధ మూర్ఖవ్యక్తి.

''నీవెంత భయంకర అపాయాన్ని కొనితెచ్చుకుంటు న్నావు. నీవెంత సాధుస్వభావం గలవాడవో, ఆ దృష్టితో ఆ పరిస్థితిలో నీవు నిన్ను ఏమాత్రం క్షమించుకోలేవు.''

"కాని నీవు మరణించలేదు— నీవు జీవించేవున్నావు."

"మరెప్పుడు లేనంతగా ఇప్పుడు నాకు నాజీవితంపై ప్రేమవుంది."

వాల్టర్ మందహాసానికి అర్పితమైపోవాలనుకుంది. చివ రకు కాఠిన్య భీభత్సాలమధ్య తా మిద్దరేగా కలిసివుంది. రైతు చేనిలో బంగాళాదుంపలు ఏరినట్లుగా మృత్యువు మనుషుల్ని ఏరుతూన్న వాతావరణంలో తనశరీరంతో ఎవరైనా ఆటాడితే

మాత్రమేం జరుగుతుంది. చార్లీ తన కిప్పుడొక అనామకుడనీ తన భావములలో తా నిప్పుడు చార్లీని గుర్తించటమేలేదనీ, తన హృదయాన్నుంచీ పెకలించిపారవేశాననీ వాల్టరుకు తెలియజెప్పగలిగితే ఎంత బాగుండును. ఇప్పుడామెకు చార్లీతో ఏమీ సంబంధంలేదు గనుక ఆమెకు అతడితో వున్న పాత సంబంధాలన్నీ విలువలేనివిగా కన్పించాయి. ఆమె తనహృదయాన్ని నిగ్రహించుకుంది, ఇక ఒకవేళ తనశరీరంపై అవాంఛనీయమైనదేదైనా జరిగినా దానినిగురించి ఆమెకువిచారంలేదు. ఆమె వాల్టరుతో చెప్పాలనుకుంది "చూడు వాల్టర్! మనమిప్పటికే చాలా మూర్ఖంగా ప్రవర్తించేశాం. మనిద్దరం పిల్లలవలె మూతి ముణగబెట్టుకున్నాం, మన మికనైనా ప్రేమగానూ, మిత్రులగాను ఎందుకు వుండలేము. మనం ప్రేయసి ప్రియులం కాలేకపోయినా మిత్రులమైనా కాలేమా?"

వాల్టర్ నిశ్చలంగా నిలబడివున్నాడు. లాంతరు వెలుగులో అతడి ముఖాన్ని చూసి కిటీ త్రుళ్ళిపడింది. కిటీ కతడిపై నమ్మకంలేదు. ఒకవేళ ఆమె తప్పేచెప్తే వాల్టర్ వెంటనే కాఠిన్యంగా జవాబుచెప్తాడు. వాల్టరుయొక్క సాధుస్వభావపు చివరిమెట్టు ఆమెకు తెలుసు. దానిని దాచడానికే అతడు మంచువలె మౌనం వహిస్తున్నాడు. హృదయానికి దెబ్బతగిలినా అతడెంత నేర్పుగా తనభావాన్ని దాచుకోగలడు. కిటీకి ఒక క్షణకాలం వాల్టర్ మూర్ఖత్వానికి కోపంవచ్చింది. వాల్టర్ అధికారానికంటే అహానికి ఎక్కువ దెబ్బతగిలిందని కిటీకి తెలుసు.

అహంలో తగిలిన గాయం మానదని కిటీ యోచించింది. పురుషులు తమ భార్యల సత్ప్రవర్తనకు ఇంత విలువ యివ్వడం ఎటువంటి వ్యంగ్యం. మొట్టమొనట తాను చార్లీ వద్దకు వెళ్ళినప్పుడు తనలో వేరొకభావముండేది — తనను తాను మారిపోయినట్లు భావించేది— కాని ఆమె తనను బాగా అర్థం చేసుకునేది. ఆమెకు తన జీవితంలో ఉత్సాహము, ఆనందము లభించాయి. వాల్టర్ బిడ్డేనని చెప్పాలని ఆలోచించింది కిటీ. చిన్న అబద్ధం ఆడటంవలన తనకుపోయేదేముంది, కాని వాల్టరుకు ఆ చిన్ని అబద్ధం ఎంతో సంతోషదాయకమవుతుంది —నే నీ విధంగా చెప్పటం తప్పుగాదని కూడా ఆమె ఆలోచించింది. ఎవరికి తెలుసు? కాని కిటీహృదయం ఈ సందేహపుష్టికి ఆదేశమివ్వలేదు. పురుషుడెంత మూర్ఖుడుగావుంటాడు. జననవిషయంలో ఆతడివంతు ఎంతోతక్కువ. అది స్త్రీయే బిడ్డను తన గర్భంలో దాచుకుని — అసౌఖ్యాన్ని, కష్టాన్ని భరిస్తుంది. అయినా పురుషుడు తన క్షణిక ఆవేశానికింత విలువ యిస్తాడు. బిడ్డయెడ వాల్టరుకు ఆలోచనాభేదమెందుకు? కిటీ ఆలోచనలన్నీ తనకు కలుగబోయే బిడ్డచుట్టూ తిరుగసాగాయి. కిటీలో బిడ్డయందు కోమలమైన భావమేదీ ఆసమయములో లేదు — మాతృత్వభావమూ లేదు — ఆమెలో సాధువైన జిజ్ఞాసమాత్రమే వుంది.

వాల్టర్ మౌనభంగంచేస్తూ "నీ వీ విషయంలో శ్రద్ధగా ఆలోచించిన మంచిదని నా అభిప్రాయం" అన్నాడు.

"ఎందుకు ఆలోచించాలి?"

తన కీ జవాబుకు ఆశ్చర్యం గలిగిందన్నట్లుగా వాల్టర్ కిటీవంక తిరిగాడు.

"నీ వెప్పుడు వెళ్ళాలా అనేవిషయం"

"కాని నేను వెళ్ళదలచటం లేదు"

"ఎందుకు వెళ్ళదలచటం లేదు?"

నా కిక్కడ కాన్వెంటులో పని చాలాయిష్టం నన్ను నే నిప్పుడు ఉపయోగకరంగా తయారుచేసుకోగలుగు తున్నాను, నీ విక్కడవున్నంతవరకు నేనూ ఇక్కడేవుంటాను"

"ఇక్కడి వాతావరణంలో నీకు మహామారి సోకే భయం వుందని నేను స్పష్టంగా చెప్పదలచాను"

పరిహాస దరహాసంతో "నీవు చెప్పేపద్ధతి నాకు చాలా బాగుంది" అని కిటీ అంది.

"నీవు నా మూలకంగా ఇక్కడ ఆగటంలేదుగదా?"

"లేదు, నీవు నన్ను కోరటంలేదు. నేను నీకు భార స్వరూపమనికూడా అప్పుడప్పుడు ఆలోచిస్తాను. నీ వా సన్యాసినులకొరకు, ఆ చైనాపురుగులకొరకు నీ ప్రాణాను స్వయంగా దహించి వేసుకుంటావని నేను తెలుసుకోలేదు. నీభావాలు ఉచితంగానప్పుడు ఆ దోషాన్ని నా పై ఎందుకు రుద్దుతావు? నీవు మూర్ఖంచేసివుంటే అందులో నా దోషమేముంది ?" కిటీ పెదవులు చిరునవ్వుతో విప్పారాయి.

"కిటీ ! ఇటువంటి మాటలనడం నీకు అందంగాకన్పి స్తే మాట్లాడు"

"చాలావిచారం, నేను నీ కెక్కువగా అర్థంచేసుకునే అవకాశం ఇవ్వలేకపోతున్నాను" తా నింతకంటే ఎక్కువ గాంభీర్యం వహించలేనని కిటీ కనిపించింది. "నీవు సరిగ్గానే చెప్తున్నావు, నేనా అనాథులికొరకు ఇక్కడ వుండటంలేదు — నేను వెళ్ళటానికి ప్రపంచంలో నాకు మరెవ్వరూ లేరనేవిషయం నీకు తెలుసు. ఎవరివద్దకు వెళ్ళినా వారికి బాధేకలిగిస్తాను. నా చావు-బ్రతుకుల విచారమెవ్వరికీ లేదు"

వాల్టర్ క్రోధంగా గర్జించాడు—కాని గర్జనలో క్రోధం లేదు. "మనం ఆటనంతా సాగుచేశాం."

"నీ వింకా నాకు విడాకు లివ్వాలనుకుంటున్నావు—కాని నాకిప్పుడే విచారమూ లేదు."

"నేనిక్కడకు తీసుకువచ్చి నిన్ను క్షమించివేశానన్నది నీవు బాగుగా తెలుసుకో."

"అయితే నాకు తెలియదే, పైగా నేనేమీ భావములను గ్రహించే వ్యక్తిని గాదు. ఇక్కడినుంచి వెళ్ళిన తరువాత మన కార్య క్రమమేమిటి? మనం కలసే వుంటామా?"

"దీనిని గురించి విచారమెందుకు? భవిష్యత్తును దాని ఆట దానినాడ నివ్వు."

వాల్టర్ కంఠంలో మరణాసన్నపు అలసటవంటిదివుంది.

రెండుమూడు రోజుల తరువాత బెడింగ్‌టన్ కాన్వెంటు నుంచి కిటీని తనయింటికి తీసుకువెళ్ళాడు. మంచూ స్త్రీ చేతిలో టీ త్రాగిస్తానని అతడు వాగ్దానం చేసివున్నాడు. కిటీ అంతకు ముందు రెండుమూడు పర్యాయములు బెడింగ్‌టన్‌తో కలసి

భోజనం చేసేవుంది. బెడింగ్‌టన్ గృహం నాలుగు పలకలుగా విశాలమైనదిగానూ, తెల్లగానూవుంది. దానినిచూస్తే ఏదో ప్రభుత్వభవనమనిపిస్తుంది. పూర్తిగా ఆ విధంగానే వుండే భవనాలను కిటీ చైనాలో కస్టమ్ అధికారులకుండడం చూసింది— ఆ భవనాలలోని భోజనగృహాలు,— అతిథుల గదులు, దృఢమైన గట్టి ఫర్నీచరు వాటిల్లో అమర్చబడివుండటం ఆమెకు గుర్తువచ్చాయి. ఆ భవనాలు చూడటానికి సగం ఆఫీసులుగాను, సగం హాస్పటళ్ళుగానూ కన్పిస్తాయి. ఆ భవనాలు గట్టిఇళ్ళవలె కన్పించవు. అవి తాత్కాలికంగా వుండేవారి కొరకు కట్టబడినట్లు కన్పించేవి. ఆ భవనాలనుచూస్తే వాటిపైఅంతస్థులందు ప్రణయమెప్పుడైనా జరిగి వుంటుందనే ఆలోచనే గలుగదు. కిటీ, బెడింగ్‌టన్ మెట్లెక్కారు. బెడింగ్‌టన్ ముందుకువచ్చి తలుపు తెరచాడు. అదొక విశాలమైనగది, గోడలు తెల్లగా వెల్లవేయబడి వున్నాయి, వాటిపై చిత్రాలు వ్రాయబడ్డాయి. గదిలోవున్న నలుచదరం గల ఒక నగిషీల బల్ల ముందున్న కుర్చీలో మంచూస్త్రీ కూర్చునివుంది. ఆమె కిటీ, బెడింగ్‌టన్‌లు గదిలోనికి రాగానే లేచి నిలబడిందేగాని ముందుకు రాలేదు.

"ఇదిగోవీరు," అన్నాడు బెడింగ్‌టన్, చైనాభాషలో కూడా మరేమో చెప్పాడతడు.

కిటీ ఆ మంచూస్త్రీతో కరస్పర్శచేసింది. ఆమె పొడవుగా, తెరచివున్న గౌను ధరించింది. చురుకైన బక్కపల్చని శరీరము. కిటీకంటే పొడగరి. దక్షిణవాసులవలెనే వుంది. మంచూ లేత ఆకుపచ్చనిచీర, బారుచేతులజాకెట్టు ధరించింది.

ఆమె తన నల్లనిజుత్తును చాలా ఆసక్తితో వదిలేసి మంచూ ఆచారప్రకారంగా ముసుగువేసుకుంది.

ముఖాన పౌడరుఅద్దుకుంది, కళ్ళనుంచి నోటివరకు— కపోలములపై ఎరుపువేసుకుంది. ఆమె కనుబొమలు తీర్చిదిద్దినట్లు— కనుబొమల స్థానంలో ఒక రేఖామాత్రంగావుంది; పెదవులు గులాబీవర్ణంగా వున్నాయి. ఆ ముఖంలో రెండు కన్నులూ, రెండు సరస్సుల్లో మెరుస్తున్న ఏదో ద్రవం వలె ప్రకాశిస్తున్నాయి. అన్నీ కలిపి ఆమె స్త్రీకి బదులుగా విగ్రహంవలె కన్పించింది. ఆమె చేష్టలన్నీ ముక్తసరిగా తూచినట్లుంటాయి. మంచూస్త్రీ సహజంగా జిజ్ఞాసువు, లజ్జాశీలియని కిటీ భావించింది, బెడింగ్‌టన్ ఆమెతో కిటీని గురించి మాట్లాడినప్పుడు ఆమె రెండుమూడు పర్యాయాలు తలూపింది. కిటీ దృష్టి మంచూస్త్రీ చేతులపై పడింది— ఆమె చేతులు సాధారణంగా కంటే పొడవుగా వున్నాయి— బలహీనంగా ఏనుగు దంతాలవలె తెల్లగా ఉన్నాయి; గోళ్ళకు ఎర్రరంగు వేయబడి ఉంది. తాను మొదటిసారిగా ఇంత అందమైనచేతుల్ని చూశానని కిటీ భావించింది. మంచూ కుటుంబం అనేక తరాలుగా నాగరిక మైందేనని ఆ చేతుల్ని చూచినప్పుడు తెలుస్తుంది.

మంచూ ఎక్కువగా మాట్లాడదు, మాట్లాడినప్పుడు ఏదో తోటలో ఒకపక్షి మాట్లాడినట్లేవుంటుంది. బెడింగ్‌టన్ ఆమె మాటల్ని అనువాదం చేసి కిటీకి చెప్తున్నాడు. కిటీని కలుసుకుని ఆమె చాలా సంతసించిందని అతడు చెప్పాడు. కిటీ వయస్సెంత? పిల్లలెందరు— మొదలైనవన్నీ వారు ముగ్గురూ ఆ డ్రాయిరుముందున్న కుర్చీలలో కూర్చొని

వున్నారు, ఇంతలో ఒక నౌకరు తేనీరు కప్పులు తెచ్చాడు, వాటినుంచి 'మాలతిపుష్పాల' సువాసనవస్తుంది. మంచూ కిటీకి త్రీ కాజిల్స్ సిగరెట్ టిన్ను అందించింది. గదిలో ఆ డ్రాయిరు కుర్చీలు మినహా, చాలా తక్కువ ఫర్నీచరువుంది. అక్కడ నగిషీలు చెక్కబడ్డ ఒక పెద్ద మంచమువుంది. మరి రెండు చందన కర్రతో చేయబడిన బీరువాలున్నాయి.

"ఈమె రోజంతా ఏమిచేస్తూవుంటుంది," అని కిటీ ప్రశ్నించింది.

"కొద్దిగొప్ప 'పెయింటింగ్' చేస్తుంది, లేక గేయాలు వ్రాస్తుంది. ఎక్కువగా ఖాళీగానేవుంటుంది. నల్లమందు వ్యాపారాన్ని ఆపేద్యూటీనాకుంది గనుక ఈమె సిగరెట్లు త్రాగుతూంది."

"మీరు కూడా సిగరెట్లుత్రాగుతారా?" కిటీ ప్రశ్నించింది.

"చాలా తక్కువ. నాకు విస్కీమాత్రమే ఎక్కువ యిష్టం.'"

గదిలో ఒక విచిత్రమైన సువాసన వ్యాపించివుంది, అది సుఖంగాలేదుగాని మత్తుగా వున్నట్లుంది.

"ఆమె భాషలో మాట్లాడ జాలనందుకు చాలా బాధ పడుతున్నానని ఆమెతో చెప్పండి. అయినా మనం చాలా సంభాషించవచ్చు."

వెడింగ్‌టన్ కిటీ మాటల్ని అనువదించి ఆమెకు చెప్పాడు. విని ఆమె వాడిగా కిటీవంక చూసింది, అయినా

ఆ చూపులో మందహాసం తొంగిచూస్తుంది. మంచూ తిన్నగా కూర్చునివుంది. ఆమె వ్యక్తిత్వంలో ఆకర్షణవుంది. షేప్ చేసుకున్న ఆమె ముఖాన్ని, కళ్ళనుబట్టి ఆమె ఆత్మనిగ్రహం గల స్త్రీయని అనిపిస్తుంది. ఆమె చిత్రంవలె వున్నప్పటికీ కిటీని ఆకర్షించింది. ఎక్కడ ఏదిచూచినా కిటీ చైనాలో శ్రద్ధగా దేనినీ గమనించివుండలేదు— దేనిని చూసినా ద్వేషంగానే చూసేది. అక్కడ తనకేదో విషయం దూరమైపోయినట్లామె ఇప్పుడు ఆలోచిస్తుంది. —ఏదో రహస్యం ఆమెకు మిగిలి వుండినట్లనిపించింది. ఆమెఇక్కడ తూర్పు వెలుగునుచూసింది. ఆ మంచూను చూడగానే ఆమెకు పాశ్చాత్యనమ్మకాలు, ఆదర్శాలు వికృతంగా కన్పించసాగాయి. ఇక్కడి జీవితమే భిన్నమైనది. ఇక్కడి ఆలోచనా క్రమమే భిన్నమైనది. విగ్రహం వంటి ఆ స్త్రీని చూసినతరువాత కిటీకి తన బయటి ప్రపంచంలోని బాధలు, దుఃఖాలు ఆమెకు అజ్ఞాన భాండాగారముగా కన్పించాయి. ఆ మేకప్‌కు వెనుక కిటీకి తీక్షణానుభవం యొక్క రహస్యం దాగివున్నట్లు కన్పించింది.

కిటీకి మంచూస్త్రీ అందమైన చేతివ్రేళ్ళలో సమస్యల చిక్కుల తాళంచెవి—సమాధానం కన్పించింది.

"రోజంతా ఈమె ఏమాలోచిస్తూవుంటారు?" అని కిటీ అడిగింది.

"ఏమీలేదు," మందహాసంచేసి వెడింగ్‌టన్ జవాబు చెప్పాడు.

"ఆమె చాలా సౌందర్యవతియని ఆమెతో చెప్పండి. ఈమె చేతులు వంటివి నేనింతకుముందెన్నడూ చూడలేదు.

ఈమె మీలో ఏమిచూడగలిగారో నాకు చాలా ఆశ్చర్యంగా వుంది.''

చిరునగవుతో బెడింగ్‌టన్ దాని సనువదించాడు.

''నేను మంచి వాడనని ఆమె అంటుంది.''

కిటీ పరిహాసంగా, స్త్రీ పురుషుని మంచిల్నే ప్రేమించినట్లుగానన్న మాట,'' అంది.

మంచూ ఒకసారిమాత్రం నవ్వింది. కిటీ ఆమెగాజుల్ని చూచి ప్రశంశించినప్పుడు మాత్రమే ఆమె నవ్వింది. మంచూ గాజుల్ని తీసి కిటీ కిచ్చింది. కిటీ చేతులు నాజూకుగా వున్నాయి—చిన్న వే—మృదువుగానే వున్నాయి, అయినప్పటికి గాజులు ఎక్కలేదు. అప్పుడు మంచూ పిల్లలవలె కిలకిలానవ్వింది. ఆమె బెడింగ్‌టన్ కేదోచెప్పి ఆయాను పిలచింది. 'ఆయా'కు ఏదో ఆదేశమిచ్చింది; మరుక్షణంలో 'ఆయా' ఒక మంచూ—చెప్పుల జత తీసుకువచ్చింది.

"ఈమె మీకీ పాదరక్షల్ని బహూకరిస్తుంది—మీరు వీటిని ధరిస్తే బాగుంటుంది. ఇవి చాలా ప్రశస్తమైన "బెడ్‌రూమ్‌స్లిప్పర్లు,"

కిటీ సంతృప్తిచెందిన భావంతో, ''నాకివి సరిగ్గాసరిపోయాయి," అంది.

బెడింగ్‌టన్ పెదవులపై పిశాచపు దరహాసం వంటిది వుండటం కిటీ గమనించింది.

కిటీ వెంటనే అడిగింది, ''ఇవివారికి చాలా పెద్దవయాయా?''

"మైళ్ళకొలదీ."

ఈ జవాబుకు కిటీ నవ్వింది. బెడింగ్‌టన్ చైనా భాష లోనికి అనువదించినప్పుడు మంచూ, ఆయా ఇద్దరూకూడా నవ్వారు.

కొంచెంసేపటి తరువాత కిటీ, బెడింగ్‌టన్ లిద్దరూ పర్వతం వైపుకు వెళ్తూ వున్నప్పుడు కిటీ దరహాసం నిండిన దృష్టితో బెడింగ్‌టన్ వైపు చూసింది.

"మీరింతగా ఆమెను ప్రేమిస్తున్నారని మీరింతకు ముందెప్పుడూ చెప్పేలేదే?"

"నేనింతగా ప్రేమిస్తున్నానని మీకెలా తెలిసింది?"

"మీకన్నులు స్పష్టంగా చెప్తున్నాయి. ఆశ్చర్యంగా వుంది— ఎవర్నో ఒకదేవకన్యనో, లేక స్వప్నాన్నో ప్రేమిస్తూ వున్నట్లనిపిస్తుంది. ఈ పురుషుల్ని అర్థంచేసుకోవటం కూడా కష్టం. మీరుకూడా అన్యపురుషులవంటివారే ననుకునేదానిని, కాని నేను మిమ్మల్ని ఏమాత్రం అర్థంచేసుకోలేక పోయా నని ఇప్పుడు తెలుస్తూంది."

ఇద్దరూ బంగళాకు చేరినప్పుడు బెడింగ్‌టన్ ఆకస్మి కంగా," మీరు ఆమెనెందుకు కలుసుకో గోరారు?" అని ప్రశ్నించాడు.

కిటీ జవాబు చెప్పటానికిముందు కొంచెం సందేహిం చింది.

"నేనేదో అన్వేషిస్తున్నాను. ఏమి వెదుకు తున్నానో నాకే తెలియటంలేదు. కాని నేను వెదుకుతూవున్న దానిని

పొందటం చాలా అవసరం అనిమాత్రం తెలుసుకుంటున్నాను. నేను తెలుసుకో గలిగితే అంతా సులభమౌతుంది. బహుశా, సన్యాసినులు ఆ అజ్ఞాతాన్ని ఎరుగుదురు. వారివెంటవుంటూ వున్నప్పుడు వారేదో నానుంచి రహస్యాన్ని దాస్తున్నటనిపిస్తూ వుంటుంది నాకు—ఆరహస్యాన్ని నాతో చెప్పగోరటంలేదన్నట్లు. నేను మంచూ స్త్రీనికలుసుకుంటే నా అన్వేషణకు ఏదైనా వెలుగు కిరణం కన్పించవచ్చునసేది నాకే తెలియదు. బహుశా ఆమే నాకేదైనా చెప్పగలగవచ్చు."

"ఆమెకీ విషయం తెలుసునని మీరెలా భావించారు?"

బెడింగ్టన్ వంక కిటీ మిరిమిరి చూసిందేగాని జవాబేమీ చెప్పలేదు. "మీకా రహస్యం తెలుసా?" అని కిటీ మరొక ప్రశ్న అడిగింది.

బెడింగ్టన్ మందహాసం చేశాడు.

తిరిగి కిటీయే అంది, "చూడండి, ఆరహస్యం నల్లమందు మత్తులో నిహితమై వుందని మనలో కొందరు భావిస్తున్నారు—అధ్యాత్మ మార్గంలో దానిని కనుగొన వచ్చునని కొందరాలోచిస్తున్నారు—అది మద్యంలో లభిస్తుందని ఒకరి అభిప్రాయమైతే, మరి కొందరు ప్రేమలో దానిని అన్వేషిస్తున్నారు. కాని వీటన్నిటి వలనా ఏమీ లభించటం లేదు."

# 59

కిటీ తిరిగి కాన్వెంట్‌కు వెళ్తూనే వుంది. ఆ రోజు ఉదయం ఆమె స్థితి బాగాలేదనే చెప్పవచ్చు, అయినా ఆమె అతి ప్రయత్నంతో తన అనారోగ్యాన్ని నిరోధించుకుంటుంది. సన్యాసినులకు తనయందున్న ఆసక్తి గురించి ఆలోచించినప్పుడు ఆమెకు చాలా ఆశ్చర్యం కల్గింది. కిటీతో ఎక్కువ సంబంధాలు లేని ఆ సన్యాసినులు, అప్పుడప్పుడు ఎదురైతే నమస్కారాల సంబంధం మాత్రమే వుండేది, ఆ రోజున ఆసన్యాసినులందరూ కిటీ క్షేమాన్ని అడగవచ్చారు, ఆమెతో మాట్లాడారు. కిటీ తల్లి కానున్నదని సిస్టర్ జోజెఫ్ అమెకనేక పర్యాయాలు చెప్పేవుంది—కాని ఆ రోజు తెలివిదప్పి పడిపోయినప్పుడు సిస్టర్ జోజెఫ్‌కు మరే సందేహమూ లేకుండా పోయింది. ఆమె చెప్పనూ చెప్పింది, "ఇక ఇప్పుడు కిటీ బిడ్డ తల్లి కాబోతుందనేదాని కేమాత్రం సందేహం లేదు." అని సిస్టర్ జోజెఫ్ ఇదేస్థితిలో తన వదినవున్న రోజుల్ని గురించి కూడా చెప్పింది. కాని కిటీ వాటన్నిటికీ ఏమీ భయపడలేదు. సిస్టర్ జోజెఫ్‌లో తన కుటుంబంలోని సంస్కారాలు, ధర్మం యందు మోహముంది, ఆకర్షణీయమైన సమన్వయముండేది. ఒకనాడామె కిటీతో బైబిలును గురించి చర్చిస్తూ, "నేనెందు కేమస్తానో నాకే తెలియదు, కాని చదివే సమయమందు ఒక విచిత్రంవంటి భావం కలుగుతుంది," అని చెప్పింది తరువాత ఫ్రెంచిలో ఏదో చెప్పేది, అది కిటీకి అర్థమయేదేగాదు. మరల తిరిగి బైబిలులోని ఆభాగాన్ని చదివేది," తరువాత మరల దేవకన్యక ఆమె వద్దకు వచ్చింది, "ఓ మేరీ! ప్రభువు నీకు

-తోడుగా వున్నాడు. నీవు ప్రపంచ స్త్రీలందరిలో సర్వోత్తమ మైన దానివి,” అంది

కిటీ గర్భవతి కావటం కాన్వెంట్‌లో సంతోష, ఆనందా లకు కారణమైంది. అక్కడి వాతావరణాన్ని చూసినప్పుడు, కోమలమైన పుష్పములతో తీయని మంద వాయువులు ఆట లాడుతున్నట్లని పిస్తుంది. కిటీ గర్భవతి అనే అభిప్రాయమే అక్కడి సిస్టర్లలో ఉత్సాహాన్ని మేల్కొల్పింది.

ఒకప్పుడు కిటీ అంటే భయపడేవారు, మరొకప్పుడు వారికామె ఆకర్షణీయంగా కన్పించేది. వారందరూ కిటీ ఆరో గ్యాన్ని చూసేవారు. ఆ సిస్టర్లందరూ రైతుకుటుంబాలకు చెందినవారే, కాని వారి సరళహృదయాలలో ఎక్కడో ఆశ్చర్యంవుంది. వారందరికి కిటీ కష్టాన్నిచూసి బాధపడేవారు, అయినా వారు తెలియకుండానే సంతోషించేవారు. సిస్టర్లం దరూ కిటీ కొరకు ప్రార్థనలు చేస్తున్నారని సిస్టర్ జోజెఫ్ కిటీకి చెప్పింది. కిటీ కాథలిక్ అయితే ఎంతబాగుండును అని సిస్టర్ మార్టిన్‌అంది. దీనికి మదర్ సిస్టర్ మార్టిన్ మాటను ఖండించింది. ప్రొటెస్టెంట్ అయినా స్త్రీ మంచిదేఅవుతుంది, ప్రభువు అంతా మేలేచేస్తారు, అంది మదర్.

తనయందింత స్నేహాన్నిచూసి కిటీకి గిలిగిలి కల్గింది. తన పనుల్లో చాలా నిగ్రహంగా వుండే మదర్ కళ్ళల్లో తన యందు స్నేహాన్నిచూసి కిటీకి ఆశ్చర్యం కల్గింది. మదర్ మొదటినుంచీ కిటీయందు స్నేహాన్నిచూపించేది, కాని అది అతకనట్లుండేది, కాని ఇప్పుడు మదర్ స్నేహంలో వాత్సల్యం నిండి వున్నట్లు కన్పిస్తుంది. కిటీ కిప్పుడామె కంఠం చాలా

మాధుర్యంగా కన్పిస్తుంది. మదర్ ఆమెవైపు చూసినప్పుడు ఆమె ముగ్ధురాలైనట్లుగా వుండేది. ఈ విషయాల ప్రభావం కిటీపై పనిచేసింది. ఆమె హృదయం ప్రశాంత సాగరంవలె వుంది—అది స్థాల్య భావంతో ప్రశాంతముగా తన ఉనికిని స్థిరంగా వుంచుకుంటుంది, కాని ఇప్పుడా స్థానంలో ఒక సూర్యకిరణం కల్లోలాన్ని కలిగించినట్లు, దానితో అలలు లేవటం ప్రారంభమైనట్లు కన్పిస్తుంది. మదర్ తరచు సాయంత్ర మందు కిటీ దగ్గరకువచ్చి కూర్చునేది. "నేను నీ విషయంలో పూర్తిగా అజమాయిషీ తీసుకుంటాను. అధికంగా అలసిపోయేట్లు పనులు చేయటంలేదు గదాయని చూస్తాను," అని చెప్పేది. తరువాత తన మీాదే దానిదోషాన్ని మధురంగా ఆరోపించుకునేది—"డాక్టర్ ఫేన్ నన్నెప్పుడూ క్షమించరు. ఆయనలో ఎంతో ఆత్మనిగ్రహముంది. చూడడానికైతే చాలా సంతోషంగానే కన్పిస్తారు; కాని ఆయనతో ఈ విషయం ప్రస్తావిస్తే వెంటనే వివర్ణమైపోతారు." అని మదర్ అంది.

మదర్ కిటీ చేతుల్ని తనచేతులతో నిమిరేది.

"ఆయన నిన్ను పంపివేయాలనుకుంటున్నారనీ, కాని నీవు మమ్మల్ని వదలివెళ్ళగోరటంలేదని డాక్టర్‌గారు చెప్పారు. నీయీా ఆలోచన ఎంతో అందమైనది! బిడ్డా! నీవు మాకు చేసిన సహాయాన్ని మేము చెప్పలేము నీవు డాక్టర్ ఫేన్‌ను ఒంటరిగా వదలి వెళ్ళగోరటంలేదని కూడా నా అభిప్రాయం. ఇది సరియైనదికూడా — ఎందుకనగా నీ స్థానం డాక్టరుదగ్గరే, పైగా ఆయనకూ నీ అవసరం చాలావుంది. డాక్టరుగారే లేక పోతే మాస్థితి ఏమయ్యేదోకూడా ఆలోచనకందని విషయం."

"ఆయన మీకు కొద్దిగా సేవచేయగ్గలగటం చూసి నప్పుడు నాకు చాలా సంతోషం కలుగుతుంది," అని కిటీ జవాబు చెప్పింది.

"బిడ్డా! నీవు హృదయపూర్వకంగా డాక్టరుగారిని ప్రేమించు. ఆయన సాధుపురుషులు."

కిటీ దరహాసంచేసింది, కాని ఆమె హృదయమెక్రీడో చీత్కారం చేసింది. వాల్టర్ తనను క్షమించాలనేది ఆమెకు అర్థం కావటంలేదు. క్షమించటం ఆమె కొరకుగాదు— తన కోసమే, అని ఆమె కోరుతుంది. క్షమార్పణ తరువాతనే ఆతనికి మానసిక శాంతి లభించగలదని ఆమెకు తెలుసు. వాల్టర్‌ను క్షమాయాచన చేయటం వ్యర్థమనే కిటీ వుద్దేశ్యం. ఒకవేళ వాల్టర్ ఏదైనా సందేహాన్ని పెంచుకుంటూ వుండి వుంటే అది అతడి కోర్కెపైనే పెరుగుతూవుంది — అందులో కిటీ దోషమేమీలేదు. ఆసందేహం వున్నంతకాలం వాల్టర్‌లో అభిమానం వాల్టర్‌ను క్షమించనీయలేదు. ఇప్పుడిక కిటీకి వాల్టర్ అభిమానం యందు ద్వేషం కలగటంలేదు, పైగా ఆతడి ప్రవర్తన న్యాయోచితంగానూ, స్వాభావికంగానూ ఆమెకు కన్పించేది. ఆమెకు వాల్టర్‌యందు దయకలిగేది. అకస్మాత్తుగా జరిగే ఏదైనా ఒక ఘటనమాత్రమే ఆతడి హృదయాన్నుంచి ఆ సందేహాన్ని తొలగించగలుగుతుంది. ఒకవేళ వాల్టర్ భావాలు మరికొంచెం తీవ్రం చెందితే భయంకర స్వప్నంవలె ఆతడిపై వ్యాపించివున్న సందేహం, దుఃఖం తొలగి పోగలుగుతాయని ఆమె అభిప్రాయం. కాని వాల్టర్ కూడా ఒకవేళ ఈ విషయం తెలుసుకుంటే— తన భావాలు

తనతో యుద్ధంచేసి తన దుఃఖాన్ని తొలగించాలనుకుంటున్నా యనేదే గ్రహిస్తే అతడు వాటితో కూడా యుద్ధానికి తలపడ తాడు.

దుఃఖము బాధలతో నిండివున్న ఈ ప్రపంచంలో పురుషుడు ఇంత వ్యర్థ విషయాల్లో, సందేహాల్లో మునిగి తనను తాను ప్రాణాంతక కష్టాన్ని కల్గించుకోవటం ఎంతహాస్యాస్పదం అని కిటీ ఆలోచించేది.

# 60

మదర్ కిటీతో నాలుగైదు పర్యాయాలకంటే ఎక్కువ మాట్లాడి వుండదు, ఒకటి రెండు పర్యాయాలు మాత్రమే పది నిమిషాలు సంభాషించి వుంటుంది, అయినప్పటికీ ఇంత అల్ప వ్యవధిలోనే తన ప్రవర్తనవలన ఆమె కిటీయందు తన పూర్తి ప్రభావాన్ని ప్రసరింపజేసింది—ఎవరైనా ఒక దేశం లోనికి వెళ్ళినప్పుడు అది మిరుమిట్లుగొలుపుతూ వుంటుంది, కానివిస్సారంగా కనిపిస్తుందికూడా, అప్పుడే లోనికివెళ్లి చూస్తే అందులో కిలకిల వికసించే గ్రామాలు, పెద్ద పెద్ద పర్వతాలు పుష్పములు, పండ్లతో నిండివున్న వృక్షాలు కన్పిస్తాయి—గల గలా రావాలతో ప్రవహించే నదులు కన్పిస్తాయి—పచ్చ పచ్చని పచ్చిక బయళ్లు కన్పిస్తాయి. ఇంత ఆకర్షణీయంగా వున్నప్పటికీ అక్కడెవరూ వుండలేకపోయినట్లు, ఆదేశంలో ఎక్కడో ఒక దానిని గాలిఎగనెత్తుకు పోయినట్లుగా కన్పిస్తుంది—ఇదే మదర్ జీవితాన్ని చూసినప్పుడు మనకుకన్పించేది. ఆమెతో సంపూర్ణంగా కలసిపోవటం అసంభవం. ఇతర సిస్ట

రలోకూడా కిటీ గమనించిన ఒక 'వేరు భావం' ఆమెలో వుంది. మరింకా మరి—బాబూజీ, సిస్టర్ జోజెఫ్‌లోకూడా 'వేరు తనం' అనేభావం స్పష్టంగావుంది. ఆమె పనులన్నీ ఆశ్చర్యం కలిగించేవి, కిటీ నడచే భూమిపై నే ఆమె నడుస్తుంది—అటువంటి పనులే చేస్తుంది, అయినప్పటికీ అభిన్నమైన అంతస్థు చేరటం కిటీకి ఎప్పటికీ కఠినమైనదే. ఒక పర్యాయం సిస్టర్ జోజెఫ్ కిటీతో అంది. "ఎల్ల వేళలా ఏసు ప్రభువును ప్రార్థించటమే ధర్మమవనేరదు. తానే సాకార ప్రార్థన కావాలి." సిస్టర్ జోజెఫ్ మాట పూర్తిగా ధార్మిక భావాలతో నిండి వున్నప్పటికీ సిస్టర్ జోజెఫ్ తన ఆలోచనలతో ఆచరణలో సామ్యం కుదురుస్తుందని కిటీ భావించింది. మదర్ హృదయం దానశీలమే—విశాలమైనదే, కాని ఆమెను ఈస్థితిలో వదలి నిశ్చింతగావుండి పోయిందని ఆలోచించినప్పుడు కిటీకి ఆశ్చర్యం కలిగేది. ఇది ఆమె దుర్వ్యవహారమని కిటీ తలచేది.

ఒక రోజు సాయంత్రం వారిద్దరూ ఒక చోట కూర్చుని వున్నారు. పగటి సమయం తగ్గిపోతున్న రోజులు—సంధ్యా కాలపు ప్రకాశము చాలా మనోహరంగావుంది. మదర్ కొద్దిగ అలసిపోయినట్లు కన్పిస్తుంది. ఆమెముఖం వాడిపోయినట్లుంది, చాలా విచారంగావుంది— ఆమె అందమైన కన్నుల లోని వెలుగు ఎక్కడికో ఎగిరిపోయినట్లుంది. ఆమె అలసటే ఆమెకు కిటీని విశ్వాసపాత్రంగా చేసుకుంటానికి ప్రోత్సాహపరచి వుండవచ్చు.

దీర్ఘమౌనం తరువాత ఆమె కిటీతో చెప్పింది. "బిడ్డా! నేటిదినం ఎల్లప్పుడూ గుర్తుంటుంది. ఎందుకంటే నేనీరోజుననే

మత సేవావ్రత దీక్ష వహించాను. రెండు సంవత్సరాల వరకు నేనాలోచించాను,— ప్రాపంచిక గుద్దులాటలో చిక్కుకుంటా నేమో అని భయం కలుగుతూవుండేది. కాని నేటి రోజునే ఉదయం నా నిశ్చయాన్ని మా తల్లికి చెప్పాను. నేను సేవా వ్రతదీక్షకై కొన్నప్పుడు నాకు మానసిక శాంతిని ప్రసాదించ వలసిందిగా ప్రభువును ప్రార్థించాను. నా ప్రార్థనకు జవాబుగా నాకు విన్పించింది. "దానిని కోరడం త్యజించినప్పుడే నీకు శాంతి లభిస్తుంది.''

మదర్ తన గతస్మృతిలో మునిగిపోయింది.

"ఆరోజున మా కుటుంబంలోని ఒక మిత్రురాలు ఎవరి తోనూ ఏమీ చెప్పకుండా ఎక్కడికో వెళ్ళిపోయింది. తన కుటుంబం తన కోర్కెకు విరుద్ధంగావుందని ఆమెకు తెలుసు— కాని ఆమె వితంతువే గనుక ఆమె తనయిష్టం వచ్చినట్లు చేయగల్గిన అధికారం వుందనే ఆమెనమ్మకం. మా బంధువు లోని ఒక సోదరుడు ఆమెను పంపుటకు వెళ్ళి అతడూ ఆ రోజు సాయంత్రానికి తిరిగిరాలేదు. అమ్మ చాలా దుఃఖంగా వుంది.— నా ఆలోచనలు మదర్‌కు చెప్పడానికి భయంకల్గింది. నేనామెకు చెప్పలేదు. కాని నేను నా సేవావ్రత విషయాన్ని గురించి తప్పక చెప్పాలనుకుంటున్నాను. నేను మదర్ ఎదుటే నా సోదరుణ్ణి అన్ని ప్రశ్నలూ అడిగాను. అమ్మ ఏదోపనిలో మునిగివుంది— ఆమె ఏమీ మాట్లాడలేదు. నేడే చెప్పాలని, అందుకిక మరొక క్షణంకూడా ఆలస్యంచేయటం మంచిదిగాదని యోచించాను.

నాకింతవరకు ఆదృశ్యం బాగుగాగుర్తుంది. మేమందరం

ఒక బల్ల ముందుకూర్చున్నాము. గుండ్రనిబల్ల— దానిపై ఎర్రని వస్త్రం పరచబడివుంది. మేము లాంతరు వెలుగులో కొద్దిగా పనిచేస్తున్నాం. మా జ్ఞాతిసోదరులిద్దరూ కూడా అక్కడే వున్నారు. మేమందరం కలసి అతిథులహాలులోని కుర్చీలకు దిళ్లు తయారు చేస్తున్నాం.

14 వ లుయీ కాలంనుంచి వాటిని మరమ్మత్తుచేయలే దంటే కొంచెం ఆలోచించిచూడు. వాటి స్థితిఎంతగా మారి పోయిందంటే వాటినిచూస్తేనే సిగ్గువేస్తుందని మదర్ అంటూ వుండేది.

నేను మాట్లాడటానికెంతో ప్రయత్నించాను, కాని నోటిని ఎవరో కుట్టివేసినట్లనిపించింది. అప్పుడే కొద్దిక్షణా లాగి మదర్ నాతో అంది, "నీ స్నేహితురాలిపని నాకర్థం కాలేదు. ఈవిధంగా ఎవరితో ఏమీ చెప్పాపెట్టకుండా వెళ్ళి పోవటం నాకేమాత్రం యిష్టంలేదు. ఎంతో ద్వేషం కలిగే పనిచేసిందామె. మంచి కుటుంబపు స్త్రీ లెవరైనా ఇటువంటి పనిచేస్తారా, లోకం నవ్వేపనులు. చూడు ఒకవేళ నీ వెప్పు డైనా వెళ్లాల్సివస్తే ఈ విధంగా ఏదో అపరాధంచేసి పారి పోయినట్లుగా మాత్రం వెళ్ళకు."

అప్పుడే నేను మాట్లాడాల్సింది— కాని నా బలహీనత ఏమని చెప్పను? "మదర్, నీవు చింతించవద్దు— నాకంత ధైర్యమేలేదు," అని మాత్రమే అనగలిగాను."

"మదర్ జవాబేమీ చెప్పలేదు. నేను నా అభిప్రా యాన్నైనా వ్యక్తంచేయలేకపోయినందుకు పశ్చాత్తాపపడు తున్నాను. నాకు ఏసుప్రభువుమాటలు— ఆయన పీటర్‌తో

చెప్పినట్లుగా విన్పించాయి. "పీటర్, నీవునన్ను కోరు తున్నావా?" నేనెంత బలహీనురాలను. నాకు నాజీవితం బాగుంటుంది— నా సుఖాలు ప్రియంగావుండేవి—నాకుటుంబం యందు ప్రేమవుండేది— నాపనులయందు ప్రేమవుండేది. నేనీ కటుభావాల్లోనే మునిగిపోయివున్నాను. కొంచెం సేపటికి మాట యింకా పూర్తి కానట్లుగా మదర్ అంది— "బిడ్డా! నీవు పేరు ప్రతిష్ఠలు సంపాదించకుండా నీ జీవితాన్ని గడుపుకోవని నాకు తెలుసు."

నేనింకా నా ఆలోచనల్లో మునిగివున్నాను, నా సోద రులు ఆ విధంగానే నిరాటంకంగా తమపనితాముచేస్తున్నారు. నా హృదయ గమన మెంత తీవ్రంగావుందో వారికే తెలుసు, నాతల్లి తనచేతిలోని పనిని వదలి సన్నుద్దేశించి, "అమ్మా, నీవు మతసేవచేస్తావని నాకు కన్పిస్తుంది," అంది.

"అమ్మా! నీవు చెప్పేది నిజమేనా? నీవు నా హృద యంలోని విషయాన్నే చెప్తున్నావు." అన్నాను నేను.

వెంటనే నా సోదరులిద్దరూ అందుకొని ఈమె గత రెండు సంవత్సరాలనుంచీ ఇదే ఆలోచిస్తుందని చెప్పారు. కాని ఈమెకు అనుమతినీయవద్దు— మీరేమాత్రం ఈమెనుప్రోత్సా హపరచవద్దని కూడా చెప్పారు.

"నన్ను ఆటంకపర్చడానికేమి అధికారంవుంది? అదే భగవంతుని కోర్కె అయితే, అలాగేజరుగుతుంది," అని నేను జవాబిచ్చాను.

"నా సోదరులు ఈవిషయాన్ని హాస్యంగాత్రోసిపారే యాలనుకున్నారు. కాని కొద్ది క్షణాల తరువాతనే మేమంతా

ఏడుస్తూవున్నాం, ఇంతలో మా తండ్రిగారి పాదధ్వని విన్పించింది.''

మదర్ ఒకక్షణకాలం మౌనంవహించి, దీర్ఘంగా నిట్టూర్చింది.

''మాతండ్రిగారి కీ సమాచారం తీవ్రాఘాతమే. నేను వారికి ఒక్క_ర్తెనే కూమార్తెను. పురుషులు సాధారణంగా కుమారులకంటే కుమార్తెల నెక్కువగా ప్రేమిస్తారు.''

''హృదయం వుండటంకూడా దురదృష్టమే. కాని ఈ హృదయాన్ని ఏసుప్రభువు కల్పించటం ఎంత అదృష్టం,'' అంది కిటీ.

అదే సమయానికి ఒకచిన్న బాలిక పరుగెత్తుకుంటూ వారివద్దకువచ్చి మదర్‌కు తనకెక్కడో దొరికిన గుడ్డబొమ్మను చూపించింది. మదర్ ఆబిడ్డభుజంపై తనమెత్తని చేయివేసింది. బిడ్డ ఆమెకు పెనవేసుకుంది. మదర్ కన్నుల్లో ఎంతో వాత్సల్యముండటం కిటీ గమనించింది, కాని ఆమె తనకు తానుగా దానికెంతో దూరంగా వుంది.

''మదర్! ఈ పిల్లలు మిమ్మల్నెంతకోరతారు. ఒకవేళ నే నీ పిల్లలలో ఇంత ప్రేమను నాయందు మేల్కొల్పగలిగితే నేను సంతోషమే పట్టలేను'' అంది కిటీ.

మదర్ తన స్వాభావిక మందహాసాన్ని విరజిమ్మింది. ''హృదయాన్ని జయించాలంటే ఒకే ఒక మార్గముంది, జయించాల్సిన వారివలె నీవూ తయారవటమే ఆ మార్గం''

# 61

ఆ రోజు సాయంత్రం వాల్టర్ భోజనానికి రాలేదు. కిటీ ఆతడికొరకు నిరీక్షిస్తుంది. వాల్టర్ పనివలన ఆగిపోవలసి వచ్చినప్పుడెప్పుడూ కిటీకి కబురుపంపుతూ వుండేవాడు. చివరకు కిటీ విసుగుచెంది భోజనానికి కూర్చుంది. వాళ్ళ చైనా వంటవాడు అనేక పదార్థాలు తయారుచేశాడు, కాని కిటీ ఏదో తిన్నాననిపించుకుంది, భోజనానంతరం ఆమెగది కిటికీ కెదురుగా వున్న పడకకుర్చీలో కూర్చుని ఆకాశంలోని నక్షత్రాలను చూడటంలో లీనమైపోయింది. ప్రశాంతవాతావరణంలో ఆమెకు సుఖం లభిస్తూవుంది.

ఆమె చదవగోరటంలేదు. చిన్న సెలయేటిపై మేఘాలు క్రమ్ముకువచ్చినట్లు ఆమె మనస్సులో ఆలోచనల వరుస ఏర్పడింది. ఒక్క ఆలోచనకుకూడా పట్టుకోలేనంతగా ఆమె అలసిపోయివుంది. మదర్ సన్యాసిసాన్నిధ్యంలో తనపైబడిన ప్రభావమేమిటా అని ఒక అస్పష్టమైన విషయాన్నామె ఆలోచిస్తుంచి. మదర్ సన్యాసిని జీవిత కార్యప్రభావం ఆమెపై పూర్తిగా వుంది. కాని ఆమె నమ్మకాలవిషయంలోమాత్రం కిటీ చాలా దూరంగానే వుండిపోయింది. ఆ ప్రభావమేమీ తనపైలేదు. ఆమెవంటి నమ్మకం తనపైకూడా ప్రసరిస్తుందనే విషయాన్నే కిటీ ఆలోచించలేకపోతుంది. ఆమె ఒకసారి దీర్ఘంగా నిట్టూర్చింది – బహుశా ఆ నమ్మకపు కిరణం తన ఆత్మను ప్రకాశవంతం చేయవచ్చు. ఒకటిరెండు పర్యాయాలు ఆమె తన జీవిత దుఃఖగాధను మదరుకు చెప్పాలనుకుంది — కాని ధైర్యం చాల్లేదు. ఆ పవిత్రాత్మ తనయందు చెడుభావం

ఏర్పరచుకోగూడదనే ఆమెకోర్కె మదరుకు ఆమెపనులూ పాపమయంగానే కన్పిస్తాయి. కిటీ తానుచేసింది తప్పుగా భావించటంలేదు, కాని అదంతా మూర్ఖంగానూ, వికృతంగానూ మాత్రం ఆమెకు తప్పకుండా కన్పించేది.

ఆమెకు చార్లీ సంబంధాన్ని గురించి దుఃఖం కలిగేది, అనుతాపానికి బదులు ఆమె అదంతా మర్చిపోవాలనుకొనేది. చార్లీ ఆలోచనరాగానే ఆమె నిలువెల్లా కంపించింది. ఆమెకు అందంగా నిట్టనిలువుగావుండే చార్లీ శరీరము, ఉబెత్తుగావుండే వక్షము కన్పించాయి. ఆమెకు దట్టమైన చార్లీ కనుబొమలు చాలాయిష్టం— కాని ఇప్పుడామెకు చార్లీ ఒకపశువుకంటే మరేమీగాదు; అతడంటేనే ఆమెకు ద్వేషం కలుగుతుంది.

మరి భవిష్యత్తు? అతడెంత నిర్దయగా కిటీని వదలివేశాడు. ఆమె ఏమీ తెలుసుకోలేక పోయింది. బిడ్డపుట్టిన తరువాత తాను చనిపోవచ్చు. ఆమెచెల్లెలు డోరిస్ తనకంటే ఎంతో బలంగలస్త్రీ, ప్రసవసమయంలో మరణించినంత పని జరిగింది. భవిష్యత్తింత అస్పష్టమైనప్పుడు తానాత్మణ్ణిచూడలేక పోవచ్చునని ఆమె ఆలోచించింది. వాల్టర్ బిడ్డపోషణ తన తల్లికి వప్పగించవచ్చు— బిడ్డజీవించివుంటే. బిడ్డ తండ్రికావటంలో వాల్టర్‌కు ఎంత సందేహామున్నా అతడు తప్పక బిడ్డను ప్రేమిస్తాడని కిటీకి విశ్వాసముంది. ప్రతిపరిస్థితిలోనూ వాల్టర్ ఆచరణ మధురంగానేవుండేది. అతడిలో గుణాలు లున్నాయి— నిస్వార్థపరుడు— అతడికి గౌరవముంది, అతడు యోగ్యుడు— తెలివిగలవాడు, అయినప్పటికి అతడు ప్రేమించబడలేక పోతున్నందుకు దయగలిగేది. ఇప్పుడిక కిటీకి వాల్టర్‌ను

చూసి భయంలేదు, దుఃఖంకలిగేది. కాని కిటీ వాల్టర్‌ను అగ్రాహ్యంగానే తలచేది. వాల్టర్‌తో తనను తాను క్షమించు కోగలిగేటట్లు చేయగలుగుదుననే భావం ఆతడి గంభీరాలో చనలు ఆమెలో మేల్కొల్పాయి. ఆమె తానుగా అతడికి కల్గించిన కష్టాల్ని, దుఃఖాల్నుంచికూడా ఈ విధంగానే వాల్టర్‌ను విముక్తం చేయగలనని ఆమె ఆలోచిస్తూవుండేది. వాల్టర్‌లో హాసపరిహాసాల శక్తిలేనట్లుగావుండేది. కిటీ తన ఆలోచనలలో వాల్టర్‌తోపాటు తానుకూడా నవ్వించుకోలేక పోయేది.

కిటీ అలసిపోయి వుంది. ఆమె లాంతరును తన గది లోకి తీసుకు వెళ్ళింది. మంచంపై మేను వాల్చగానే ఆమె నిద్రలో మునిగి పోయింది.

# 62

ద్వారం గబగబా బాదుతున్న ధ్వనికి ఆ రాత్రి ఆమె మేల్కొంది. కిటీ స్వప్నం చూస్తూవుండటం వలన ఆధ్వనిని నిజమని భావించలేక పోయింది—కాని తలుపుల్ని ఇంకా బాదుతూనే వున్నారు—కాని కాంపౌండు గేటు నెవరో బాదుతున్నట్లామె కొద్ది సేపటికే గ్రహించింది. గాఢాంధకా రంగా వుంది. ఆమె గడియారం చీకట్లో మెరుస్తుంది. సమయం చూసింది రెండున్నర అయింది. వాల్టర్ వచ్చి వుంటాడను కుంది—ఎంత ఆలస్యంగా వచ్చాడు. నౌకర్ని లేపలేక పోయాడా, తలుపుల్నింకా బాదుతూనేవున్నారు. ఆ బాదటం ఆగగానే భారంగా తలుపులు తెరుచుకోవటం విన్పించింది.

ఇంత రాత్రి వేళ వాల్టర్ ఎప్పుడూ తిరిగిరాడు. పాపం! అలసిపోయి వుంటాడు. వాల్టర్ ఇప్పుడిక తన ప్రయోగశాలకు వెళ్ళకుండా తిన్నగా గదికి వెళ్తాడని ఆ మాత్రం తెలివి తేటలున్నాయని ఆలోచించింది.

బయట చాలామంది మాట్లాడుతున్నట్లు విన్పించింది. చాలా ఆశ్చర్యంగా వుంది. వాల్టర్ ఎప్పుడు ఆలస్యంగా వచ్చినా కిటీకేమీ బాధ కలుగకుండునట్లే శ్రద్ధ వహించేవాడు. ఇద్దరు ముగ్గురు త్వర త్వరగా కర్రమెట్లు ఎక్కి-రావడం విన్పించింది; రెండవ గదివరకుకూడా వచ్చారు. కిటీకి భయం కల్గింది. ఆమె కెప్పుడూ దెబ్బలాట జరుగుతుందనే భయంగావుండేది. ఎక్కడైనా ఏమన్నా జరిగిందా? గుండె వేగంగా కొట్టుకో సాగింది. తన అభిప్రాయాన్ని ధృఢపర్చుకొన గలిగే లోపునే ఎవరో ఆమె గది ముందుకు వచ్చి తలుపు తట్టారు.

"శ్రీమతి ఫేన్!"

కిటీ బెడింగ్‌టన్ కంఠాన్ని గుర్తించింది.

"ఆఁ— ఏమిటి?"

"మీరు త్వరగా లేవాలి. మీతో ఒకవిషయంచెప్పాలి."

కిటీ లేచి గౌనువేసుకుంది, తలుపు తెరచింది. బెడింగ్‌టన్ చైనాపాంటువేసుకుని, ఒకకోటు ధరించివుండటం ఆమె చూసింది. నౌకరు లాంతరుపట్టుకొని వున్నాడు— మరికొంత దూరంలో ముగ్గురు చైనా సైనికులు కాకీదుస్తుల్లో నిలబడి వున్నారు. ఆమె బెడింగ్‌టన్ ముఖంలో విచారాన్ని చూసింది—

ఆమె త్రుళ్ళిపడింది. అతడు నిద్రనుంచిలేచి తిన్నగా ఇక్కడకు వచ్చినట్లు ముఖమంతా లావెక్కివుంది.

"విషయమేమిటి?"

"మీరు శాంతంగా వుండాలి. సమయాన్ని వృథాచేయకుండా మీరు వెంటనే ప్రయాణమై మా వెంటరావాలి."

"కాని విషయమేమిటి? పట్టణంలో ఏమైనా జరిగిందా?" సైనికుల్ని చూసి ఆమె పట్టణంలో దెబ్బలాట జరిగినట్లు, తనరక్షణకు వీళ్లు పంపబడినట్టే భావించింది.

"మీభర్తకు జబ్బుగావుంది— మీరుత్వరగా రావాలి."

"వాల్టర్!" అని ఆమె చీత్కారంచేసింది.

"అధైర్యపడకండి— ఏమిజరిగిందో నాకు సరిగ్గా తెలియదు. కర్నల్ యూ త్వరగా మిమ్మల్ని తీసుకురావల్సిందిగా చెప్పి యీ ఆఫీసర్ని నా వద్దకు పంపారు."

కిటీ ఒకక్షణకాలం బెడింగ్టన్ వంకచూస్తూ వుండిపోయింది. ఆమెహృదయం జారిపోయినట్లనిపించింది—

"రెండునిముషాలవుతుంది," అంది ఆమె.

"నేను నిద్రపోతున్నాను— ఎలావున్నవాడినలా లేచి వచ్చేశాను— కోటువేసుకున్నాను, చెప్పులువేసుకుని వచ్చేశాను,"

కిటీ ఏమీవినలేదు. నక్షత్రాల వెలుగులో కన్పించిందేదో ధరించింది— గాబరాతో ఆమెచేతివ్రేళ్లు తికమకపడున్నాయి— గుండీలు పెట్టుకోవటానికి చాలా ఆలస్యం జరిగినట్లనిపించింది. ఆమె భుజంపై శాలువా వేసుకుంది.

"నేను టోపీ పెట్టుకోలేదు- అంత అవసరం కూడా లేదు- లేక పెట్టుకోనా?"

"వద్దు."

నౌకరు లాంతరుతో ముందునడుస్తున్నాడు, వెనుక అందరూ బంగళానుంచి బయటకు బయలుదేరారు.

"జాగ్రత్తగా నడవండి, పడిపోతారు. కావాలంటే నా చేయి పట్టుకోండి."

సైనికులు బెడింగ్‌టన్ వెనుకనే నడుస్తున్నారు.

"కర్నల్ యీ పల్లకీలుపంపాడు. అవి నదివద్ద వున్నాయి."

వారు త్వరత్వరగా పర్వతం దిగుతున్నారు. కిటీ పెదవులపై ఏదో ప్రశ్నవుంది, కాని అడగలేకపోయింది. జవాబుకు ఆమె భయపడుతుంది— ఏమిజరుగుతుందో ఏమో!

నదీతీరానికి చేరగానే పడవ తమకోసం నిరీక్షిస్తూ వుండటం కన్పించింది.

"కలరా తగిలిందా?" అని అడిగింది కిటీ.

"నాకదే అనిపిస్తుంది."

కిటీ చిన్నగా అరచి నిలబడిపోయింది.

"మీరు సాధ్యమైనంత త్వరగా చేరుకుంటానికి ప్రయత్నించాలి."

బెడింగ్‌టన్ చేయూతగా కిటీకి తనచేయి చాచాడు. నది నిశ్చలంగావుంది— ఒక స్త్రీ బిడ్డను నడుముకు కట్టుకుని పడవను నడుపుతుంది.

"వాల్టర్ ఈరోజు మూడవజామున జబ్బుపడ్డాడు–అంటే నిన్న మూడవ జామున," అన్నాడు బెడింగ్‌టన్.

"అయితే నన్ను పిలిపించలేదెందువలన?"

కారణం ఏమీ లేకపోయినా యిద్దరూ చాలా నెమ్మదిగా మాట్లాడుతున్నారు. బెడింగ్‌టన్ చాలా చింతిస్తున్నాడని మాత్రమే ఆ అంధకారంలో కిటీ గ్రహించగల్గింది.

"కర్నల్ యూ పిలిపించాలనే అనుకున్నాడు, గాని వాల్టరు నివారించాడు. కర్నల్ అప్పటినుంచీ ఆయనవద్దనే వున్నాడు"

"అయినా నన్ను పిలిపించాల్సిందే. ఎంత నిర్దయ"

"మీరు కలరారోగి నెవర్నీ చూడలేదని మీ భర్తకు తెలుసు. చాలా భీభత్సంగా వుంటుంది. అదంతా మీరు చూడటం ఆయన కిష్టంలేదు"

"అయినప్పటికీ ఆయన నా భర్త!" అని తడియారిన గొంతుతో కిటీ అంది.

బెడింగ్‌టన్ జవాబేమీ చెప్పలేదు.

"నన్నిప్పుడెందుకు పిలిపించారు?"

బెడింగ్‌టన్ తన చేతిని కిటీ చేతిపై వేసి, "మీరు ధైర్యం కోల్పోగూడదు. మీరు ఎటువంటి పరిస్థితినైనా ఎదుర్కొనటానికి సిద్ధమవాలి" అన్నాడు.

కిటీ ముఖంలో దుఃఖం ఆవరించింది. సైనికులు తననే చూస్తూ వుండటం ఆమె గమనించింది. ఆమె తన ముఖాన్ని

మరోవైపుకు త్రిప్పుకుంది. కిటీ వారి కన్నుల్లోని విచారాన్ని చదువు కుంది.

"వారి పరిస్థితి ఇప్పుడప్పుడుగా వుందా?"

"ఈ సైనికునిద్వారా కర్నల్ యూ పంపిన ఆదేశం మాత్రమే నాకు తెలుసు. పరిస్థితి విషమంగా వుండి వుంటుం దనే నా వుద్దేశ్యం."

"బ్రతకటాని కేమీ ఆశ లేదా?"

"నాకు చాలా విచారంగా వుంది. మనం త్వరగా అక్కడికి చేరకపోతే ఆయన్ను ప్రాణాలతో చూడలేక పోవచ్చు."

కిటీ కంపించి పోయింది, ఏడ్వసాగింది.

"ఆయనెంత అధికంగా పనిచేసేవాడు. సహించే ఓపికకూడా ఆయనలో లేకుండా పోయింది."

బెడింగ్‌టన్ చేతినుంచి ఆమె తన చేతిని వదలించు కుంది. బెడింగ్‌టన్ ఇంత నెమ్మదిగా మాట్లాడటం ఆమెకు చెడుగా కన్పించింది.

వారు నది కావలిగట్టుకు చేరారు. వారి సహాయార్థం అక్కడ ఇద్దరు చైనా కూలీలు నిలబడివున్నారు. పల్లకీలు అక్కడ పెట్టబడి వున్నాయి. కిటీ తనను తాను నిగ్రహించు కుంది. "మీరు నిగ్రహించుకోవాలి. మిమ్మల్ని మీరు నిగ్ర హించుకోవటం చాలా అవసరం," అన్నాడు బెడింగ్‌టన్ ఆమెతో.

"త్వరగా వెళ్లాలని పల్లకీ వాళ్ళతో చెప్పండి."

''సాధ్యమైనంత త్వరగా చేర్చాలనే వారికాదేశింపబడి వుంది.

పల్లకీలో కూర్చున్న సైనిక ఆఫీసరు బయలుదేర వల సిందిగా ఆదేశించాడు. బోయీలు పల్లకీలు భుజాలపై పెట్టు కుని త్వరత్వరగా నడవసాగారు. బెడింగ్‌టన్ కిటీ పల్లకీ వెను కనే వున్నాడు. పర్వతపు మలుపుతిరిగారు. ప్రతిపల్లకీ వెంట ఒకలైటువుంది. ద్వారంచెంత పహరావాళ్లు తమటార్చిలను వెలిగించేవుంచారు. సైనికాధికారి కుర్చీనుంచే ఆదేశించాడు, ద్వారం తెరచుకుంది. ఆఫీసరు బోయీలతో ఏదో చెప్పాడు. వాళ్లు ఆయనకు జవాబుచెప్పారు. రాత్రినిశ్శబ్దంలో ఆ ధ్వనులు త్రుళ్లిపడేట్లు చేస్తున్నాయి. వారు తడిసిపోయిన మార్గం వెంట నడుస్తున్నారు, సైనికాధికారి బోయీలలో ఒకనికాలుజారింది. అధికారిక్రోధ గర్జన కిటీవిన్నది. దానికి జవాబుగా బోయి వాని ధ్వనివింది. పల్లకీలు తిరిగి వేగంగా నడుస్తున్నాయి. ఇరుకైన సందులు. పట్టణంలో అంధకారం మరింత గాఢంగాకన్పించింది. బోయీలు పెద్దపెద్ద అంగలు వేస్తూ త్వరగా నడుస్తున్నారు. అందరూమౌనంగా వున్నారు. వారిలో ఒకడు మురికిగావున్న తువాలుతీసి స్వేదం తుడుచు కున్నాడు.

దుకాణాల అరుగులపై అక్కడక్కడా ఎవరైనా పడు కుని వుండటం కన్పిస్తుంది. వారు ఉదయంలేచి కూర్చోడానికే నిద్రపోయారో లేక శాశ్వతంగానే నిద్రపోయారో ఎవరికి తెలుసు? ఇరుకైనబజార్లు అవమానంలో మరింత భయంకరంగా కన్పిస్తున్నాయి. అప్పుడే ఎక్కడో కుక్క మొరిగింది, కిటీ

త్రుళ్ళిపడింది. వారందరూ ఎక్కడకు వెళ్తున్నారో కిటీ కేమీ తెలియదు. ఆ మార్గానికి సమాప్తి అంటూ లేనట్లుంది. కూలీలింకా త్వరగా నడవలేరా? మరింత త్వరగా?? మరికొంచెం త్వరగా??? సమయం గడచిపోతుంది, ఏక్షణంలోనైనా చాలా ఆలస్యం కావచ్చు.

# 63

వెళ్లి వెళ్లి వారందరు ఒకద్వారం ముందుఆగారు. ద్వారంలో అనేకమంది కాపలావుండటానికి దిమ్మలు నిర్మించబడి వున్నాయి. బోయీలు పల్లకీలుదించారు. బెడింగ్‌టన్ త్వరగా కిటీ వద్దకువచ్చాడు, అప్పటికే కిటీ పల్లకీదిగి నిలబడి వుంది. సైనికాధికారి గట్టిగా ద్వారాని తట్టాడు. బిగ్గరగా కేక వేశాడు. ఒక చిన్న ద్వారం తెరుచుకుంది— అందరూ దాని గుండా లోనికి ప్రవేశించారు. లోన చుట్టూ గోడలున్న వరండాలో అనేకమంది సైనికులు కంబళ్లు కప్పుకొని పడుకొని వున్నారు. అందరూ ఎక్కడివారక్కడ నిలచిపోయారు. ఆఫీసరు ఎవరితోనో మాట్లాడాడు. బహుశా అతడు డ్యూటీలో వున్న సార్జెంట్ కావచ్చు. తరువాత సైనికాధికారి బెడింగ్‌టన్‌తో సంభాషించాడు.

"వాల్టర్ ఇంకా జీవించేవున్నాడు; మీరు నిగ్రహంతో పదండి," అని బెడింగ్‌టన్ ఆమెతో చెప్పాడు.

నౌకరు లైటు పట్టుకుని ముందు నడుస్తూ యింకా మార్గాని చూయిస్తూనే వున్నాడు. ముందున్న ఒక పెద్ద ద్వారాన్ని దాటి ఒకఆవరణలోకి చేరుకున్నారు. ఆవరణలో ఒక

వైపున ఒక పెద్ద భవనంవుంది, పగటివలె ప్రకాశిస్తూ వుంది. లాంతరు పట్టుకున్న నౌకరు వీరందర్నీ ఒక గదివద్దకు తీసుకు వెళ్లాడు. ద్వారం ముందుకు వెళ్ళగానే సైనికాధికారి తలుపు తట్టాడు; తలుపులు వెంటనే తెరవబడ్డాయి. ఆఫీసరు కిటీకి సైగచేసి వెనుకకు తొలిగాడు.

"మీరు లోనికి వెళ్ళండి," అన్నాడు బెడింగ్‌టన్."

కిటీ త్వరగా లోనికి వెళ్ళింది. వాల్టర్ కళ్లు మూసుకుని పడుకుని వుండటం కన్పించింది. గది వెలుగులో ఆతడి ముఖంలో మృత్యువు నర్తించటం కిటీ చూసింది. అతడు పూర్తిగా చైతన్య రహితంగా వున్నాడు.

నెమ్మదిగా భీతిజెందిన కంఠంతో "వాల్టర్! వాల్టర్!!" అని కిటీ పిలిపించింది.

వాల్టర్ శరీరం కొద్దిగా కదలిందో, లేక కదిలినట్లు కన్పించటమో జరిగింది. నిస్పందమైన ఒక గాలి విసురు తగిలినప్పుడు తెలుస్తుంది, కాని వ్యక్తం చేయలేము, అలాగే వుంది. ఆ గాలి ప్రశాంత జలాన్ని కొంచెంగా ఏదో కదులాడించగలుగుతుంది.

"వాల్టర్! వాల్టర్! నాతో మాట్లాడు."

వాల్టర్ కన్నులు చాలా నెమ్మదిగా తెరచుకున్నాయి. రెప్పలు అతిభారమవటం వలన, వాటిని తెరవటం చాలా కష్టంగా వున్నట్లనిపిస్తుంది. కాని వాల్టర్ చూడలేదు. ఆతడి దృష్టి ఎదురుగావున్న గోడమీద వుంది. అతడు మాట్లాడాడు అంది కంఠం బలహీనంగా, చాలా నెమ్మదిగా వుంది, "చేప చాలా అందంగా వుంది," అన్నాడు.

కిటీ ఊపిరి లోనిదిలోనే బయటిది బయటే ఆగిపోయింది. ఆ తరువాత అతడేమీ మాట్లాడలేదు—మాట్లాడే సూచనాలేదు – తెల్లగా వెల్లవేసిన గోడ మాత్రంగా వుంది. కిటీ చేతుల బలంపై లేచి నిలబడింది. ఆమె బెదరిపోయిన దృష్టితో ఎదురుగా నిలబడివున్న వ్యక్తిని చూసింది.

"ఏదో ఒకటి చేయవచ్చు—మీరిక్కడ అనవసరంగా ఎందుకు నిలబడి వున్నారు.

కిటీ చేతులు కట్టుకుంది. బెడింగ్‌టన్ మంచం సమీపంలోవున్న ఆఫీసరుతో మాట్లాడాడు.

"చేయ గలిగినంత వరకు చేశేశారు. మిలటరీ సర్జన్ ఈయనకు చికిత్స చేస్తున్నారు. మీ భర్తగారే వీరికి తర్ఫీదు నిచ్చారు. ఈ పరిస్థితుల్లో మీ భర్తగారు చేసే చికిత్సనంతా వీరు చేశారు."

"సర్జన్ వారేనా?"

కాదు,—వారు కర్నల్‌యూ వారు వాల్టర్ దగ్గరనుంచి కదలనే లేదు."

కిటీ కర్నల్‌యూ వంక ఆత్మీయంగా చూసింది. ఆయన పొడగరి, బలిష్ఠుడు; కాకీ దుస్తులు ధరించి వున్నాడు. అతడు వాల్టర్ వైపే చూస్తూవున్నాడు. కర్నల్‌యూ కన్నుల్లో కన్నీరు ధారగట్టటం కిటీ గమనించింది. ఈ మనిషి కన్నుల్లో ఇంత ఎక్కువ కన్నీ రెందుకు వుందాయని కిటీ ఆలోచించింది.

"కాలుమీద కాలు వేసుకు కూర్చుంటే లాభమేమీ వుండదుగా?" అని అంది.

"ఇప్పుడు వాల్టర్‌కు బాధేమీలేదు," అన్నాడు బెడింగ్‌టన్.

కిటీ తరువాత వాల్టర్ ముఖంమీదికి వంగింది. అతడి భయంకర నేత్రాలింకా ఎదుటకు చూస్తూనే వున్నాయి. వాల్టర్ ఏదైనా చూడగలుగుతున్నాడో లేదో కూడా కిటీ గ్రహించలేక పోయింది. ఆమె తనపెదవుల్ని ఆతడి చెవికి దగ్గరగా పెట్టింది.

"వాల్టర్,— ఇక ఇప్పుడు మేమేమీ చేయలేమా?"

వాల్టర్‌కు ఇవ్వదగినది ఏదో ఒక ఔషధం వుండి వుంటుందని కిటీ యోచించింది. వాల్టర్ ముఖమిప్పుడు ఒకవైపుకు వాలిపోవటం ఆమె గమనించింది. అమె చాలా కష్టంగా ఆతడిని గుర్తించగలుగుతుంది. కొద్ది గంటలలో వాల్టర్— వాల్టర్‌గా వుండక మరొకరు కన్పిస్తారనేదే ఆలోచించటం అసంభవంగావుంది. అతడిప్పుడు మానవమాత్రుడిగా కన్పించటంలేదు. అది నిలువెల్లా పూర్తిగా మృత్యువే.

అతడు మాట్లాడటానికి ప్రయత్నిస్తున్నాడని కిటీ తలచింది. ఆమె తన చెవిని ఆతడి నోటిదగ్గరగా పెట్టింది.

"విచారించకు పరిస్థితి చాలా చెడిపోయింది,— కాని ఇప్పుడు నేను పూర్తిగా బాగున్నాను."

కిటీ ఇంకా వినాలనే నిరీక్షిస్తుంది.— కాని వాల్టరిప్పుడు శాంతంగా వున్నాడు. వాల్టర్ పూర్తిగా నిస్పందంగా పడి వుండటం కిటీకి భయంకలిగించింది. సర్జనో, కాంపౌడరో ముందుకు వచ్చి కిటీని కొంచెం తొలగవలసిందిగా సూచించారు. అతడు

మరణాసన్నమైన్న ఆ వ్యక్తి తడియారిన పెదవులపై ఒక మలిన వస్త్రమును తడిపి తుడుస్తున్నారు. కిటీ నిరాశతో వాల్టర్ సంక తిరిగింది.

"ఇంకేమీ ఆశలేదా?" అని అడిగింది.

బెడింగ్టన్ తలూపాడు.

"మరింకెంతవరకు జీవించివుండగలడు?"

"ఎలాచెప్పగలం— ఒకగంట ఇంకావుండవచ్చు."

కిటీ గదినలువైపులా పరికించింది. ఆమెచూపులు కర్నల్ యూపై నిలచిపోయాయి.

"నేను కొంచెం ఏకాంతంగా వీరివద్ద వుండవచ్చా? కొద్దినిముషాలు మాత్రమే."

"తప్పక— తప్పకుండాను."

బెడింగ్టన్ కర్నల్ వద్దకువెళ్ళి ఏదో చెప్పాడు. కర్నల్ తలవంచి, తరువాత ఆదేశించాడు.

"మేము ఇక్కడే వెలుపలేవుంటాం— మీరు పిలిస్తే చాలు," అని బెడింగ్టన్ చెప్పాడు.

ఇప్పుడు కిటీకి చైతన్యం తిరిగి వచ్చింది. వాల్టర్ను వేధిస్తూ వచ్చిన విషాన్ని తొలగించాలనీ, దాని వలన ఆతడి మరణం ఎక్కువ కష్టం కాదనీ కిటీ ఆలోచించింది. ఒక వేళ వాల్టర్ కిటీ ఎదుట శాంతంగా చనిపోగలిగితే వాల్టర్ స్వయంగా శాంతంగా ప్రాణాల్ని వదలాడని ఆమె భావిస్తుంది.

ఆమెకా సమయంలో తన ధ్యాసే లేదు, ఆమె ఆలోచనలన్నీ వాల్టరుపై కేంద్రీకృతమై వున్నాయి.

వాల్టర్,—నేను క్షమార్పణ కోరుతున్నాను—నన్ను క్షమించు, "కిటీ వాల్టరుపైకి వంగింది. వాల్టర్ తన బరువును మోయలేడనే భయంతో అతనిని తాక లేదు. "నేను చాలా దుఃఖిస్తున్నాను—నేను నీకు చాలా దుఃఖం కల్గించాను."

అతడేమీ మాట్లాడ లేదు. కిటీ తిరిగి ఆదే చెప్పాలనుకుంది. వాల్టర్ ఆత్మ ఒక పక్షి. దానిరెక్కలు ద్వేషంతో నిండిపోయి వున్నట్లనిపించింది కిటీకి.

"డార్లింగ్!"

ఉబ్బుగావున్న వాల్టర్ ముఖంలో ఏదో నీడగా కన్పించింది. దానిని ప్రయత్నమని అనలేము. కిటీ ఈ మాటనెన్నడూ అతని ననలేదు. బహుశా ఆరిపోయే మనస్సులో ఈ మాట జొరబడి వుండవచ్చు, కిటీ ఈశబ్దాన్ని ప్రతి చోటా ప్రయోగించటం అతడు వినేవున్నాడు. కుక్కల్ని—పిల్లల్ని—టాక్సీలను ఈ విధంగానే సంభోదించేది. అందుకే కొంచెం ఆశించనిది జరిగింది. కిటీ రెండు చేతులూ కట్టుకుని—అతి ప్రయత్నంతో తనను తాను నిగ్రహించుకుంది. వాల్టర్ కన్నులనుంచి రెండు కన్నీటి బిందువులు దొర్లటం ఆమె గమనించింది.

"ఓ నా రత్నమా,— నీవు నన్నెప్పుడైనా ప్రేమించి వుంటే— నీవు నన్ను ప్రేమించానని నాకు తెలుసు, నేను ద్వేషించతగిన దానివిగానే వుండిపోయాను— అయితే నన్ను

క్షమించు. నా అనుతాపాన్ని వ్యక్తంచేయటానికి నాకవకాశ మెక్కడ లభించింది. నాయందు దయచూయించు - నేను ప్రార్థిస్తున్నాను, నన్ను క్షమించు.”

ఆమె ఆగిపోయింది. ఆమెకు జవాబు వినాలనేకాంక్ష గాఢంగావుంది. వాల్టర్ మాట్లాడగోరుచున్నాట్లామె గమనించింది. కిటీ హృదయం కంపించింది. వాల్టర్ తనను క్షమిస్తే ఆ కాఠిన్యం శాంతిస్తుందని కిటీ ఆలోచించింది. వాల్టర్ పెదవులు కదలాయి. అతడు కిటీని చూడలేదు. ఆతడి కన్నులు నిరంతరం ఆ తెల్లని గోడలపై నేవున్నాయి. కిటీ వినటానికి అతడిపై కివంగింది. వాల్టర్ స్పష్టంగా మాట్లాడాడు.

“కుక్కచనిపోయింది.”

కిటీ శిలవలె అయిపోయింది. ఆమెకేమీ అర్థంకాలేదు. భయంతో అతనిని చూస్తూ వుండిపోయింది. దానికేమీ అర్థం లేదు. వాల్టర్ ఆమె చెప్పినమాట ఒకటీ తెలుసుకోలేదు.

జీవించివుండి ఇంత నిశ్చలంగా వుండటం అసంభవం కిటీ అతనివైపే చూస్తూవుంది. వాల్టర్‌కు శ్వాస ఆడుతుందో లేదోకూడా ఆమె తెలుసుకోలేకపోతుంది. కిటీని భయం ఆవహించింది.

“వాల్టర్! వాల్టర్!” ఆమె చాలా నెమ్మదిగా పిలిచింది. తరువాత లేచినిలబడింది. చాలాభయపడి ద్వారం చెంతకువెళ్ళి పిలిచింది. “మీరులోనికిరావచ్చు, వాల్టర్...”

అందరూ లోనికి వచ్చారు. పొట్టి చైనా సర్జన్ వెంటనే మంచం దగ్గరకువచ్చాడు. అతని చేతిలో టార్చివుంది.

అతడు టార్చి వెలుగులో వాల్టర్ కన్నులుచూసి వెంటనే అతని కన్నుల్ని మూసివేశాడు. అతడు చైనాభాషలో ఏదో చెప్పాడు. బెడింగ్‌టన్ కిటీకి సహాయంగా తన చేతి నందించాడు.

'పరలోక ప్రాప్తి చెందారు.''

దీర్ఘంగా నిట్టూర్చింది. ఆమె కన్నులనుండి కొద్ది కన్నీటి బిందువులురాలాయి ఆమె చుట్టూ అంతా తిరిగి పోయినట్లనిపించింది. చైనీయులు మంచం చుట్టూ ఏమిచేయాలో తెలుసుకోలేనట్లు శాంతంగా నిలబడి వున్నారు. బెడింగ్‌టన్ మౌనంగా వున్నాడు. కొద్ది క్షణాల తరువాత చైనీయులు నెమ్మదిగా తమ భాషలో మాట్లాడుకో నారంభించారు.

''వెళ్దాం! మీ బంగళావరకు పంపిస్తాను. తరువాత శవం అక్కడకు తీసుకురాబడుతుంది,'' అన్నాడు బెడింగ్‌టన్.

అలసిపోయినట్లున్న చేతిని కిటీ తలపై నిమురుకుంది. మంచంవద్దకు వెళ్ళి వంగింది. ఆమె వాల్టర్ పెదవుల్ని ముద్దు పెట్టుకుంది.ఇప్పుడామె ఏడ్వటం లేదు.

''మీకింత కష్టం కలిగినందుకు నాకు చాలా దుఃఖంగా వుంది.''

కిటీ వెళ్ళేముందు ఆఫీసర్లు వందనం చేశారు. ఆమె తల వంచి జవాబిచ్చింది. వారందరూ ఆవరణనుంచి బయటకు వచ్చి తమ తమ పల్లకీలనెక్కారు, బెడింగ్‌టన్ సిగరెట్ వెలిగించటం కిటీ గమనించింది. తేలికైనపొగ గాలిలో కలిసిపోయింది— ఒకమనిషి జీవితం ఎగిరిగాలిలో లీనమైనట్లే.

# 64

ప్రభాతసమయం. అక్కడక్కడా చైనా వ్యాపారస్థులు కొందరు తమ అంగళ్లు తెరుస్తున్నారు. కొన్నిచోట్ల పంపుల వద్ద ఒకోక్క స్త్రీ ముఖప్రక్షాళనము చేసుకుంటుంది. రోడ్డు వారగావున్న ఫలహార-శాలలో కొందరు ఫలహారం చేస్తున్నారు. ఉదయిస్తున్న సూర్యకాంతి చోరుడేదైనా భవనంలో జొరబడినట్లు నెమ్మదినెమ్మదిగా హెచ్చుతుంది. నదిపై పల్చని తెరలాంటి మంచు వ్యాపించివుంది. ఆ పొగమంచు కారణంగా నదీతీర వృక్షాలు ఒక సైన్యంవలె కన్పిస్తున్నాయి. సూదుల వలె పొడుస్తున్న చలికాలం, కిటీ తన శాలువా కప్పుకుని నడుస్తూవుంది. వారు పర్వతంఎక్కి వచ్చారు, మంచు వారివెనుకనే వుండిపోయింది ఆకాశం నిర్మలంగావుంది. ఆరోజు కూడా అన్నిరోజులవలెనే వున్నట్లుంది, ఏమీ పరివర్తన జరగనట్లే వుంది.

బంగళాకు చేరగానే బెడింగ్టన్ కిటీతో, "మీరు కొంచెం విశ్రాంతి తీసుకుంటే మంచిది." అన్నాడు.

"వద్దు, నేనీ కిటికీవద్ద కూర్చుంటాను."

కిటీ ఇంతకుముందనేక పర్యాయాలు కిటికీ కెదురుగా కూర్చుంది. ఎదురుగా విశాలమైన ప్రాచీన దేవళమొకటుంది. కిటీ దానివైపుచూసినప్పుడు శాంతిలభిస్తూవుండేది. ఆ దేవళం చాలా అవాస్తవికంగావుండేది, అందుకే మండుటెండలో మధ్యాహ్నసమయమందు కిటీ దృష్టిని వాస్తవ జీవితంనుంచి మరల్చి ఆకర్షించగలిగేది.

"నేను నౌకరును పిలిచి మీకొరకు టీ తయారు చేయ వలసిందిగా చెప్తాను.— వాల్టర్‌ను ఈరోజే సమాధిచేయాలి. నేను ఏర్పాట్లన్నీ చేయిస్తాను."

"ధన్యవాదాలు."

# 65

మూడుగంటల తరువాత వాల్టర్‌ను సమాధిచేశారు. వాల్టర్‌ను సమాధిచేసేముందు శవంపైన చైనా వస్త్రము కప్పారు. ఈ అపరిచితవస్త్రంలో శవం శాంతంగా ఎలా వుండ గలుగుతుంది అని ఆలోచించింది కిటీ. సిస్టర్లకు పట్టణంలోని ప్రతివిషయం తెలుస్తూవుంటుంది; ఆవిధంగానే వాల్టర్ మరణ సమాచారంకూడా తెలిసింది. వారు శవంపై వుంచడానికి ఒక 'క్రాస్'ను పంపారు; శవంపై పెట్టబడిన 'క్రాస్' చాలా అందంగా కన్పిస్తుంది; ఆశవం 'క్రాస్'కు తగిన చోటుగాదనేది కూడా తెలుస్తుంది. సమాధి చేయు ఏర్పాట్లన్నీ ముగించి అందరూ కర్నల్ యూ కొరకు నిరీక్షిస్తున్నారు. సమాధి చేయునప్పుడు తానక్కడ వుండగోరుతున్నానని కర్నల్ కబురు చేశాడు. అతడు తన అంగరక్షకునివెంట వచ్చాడు. వారందరూ పర్వతమెక్కారు, కొందరు కూలీలు శవాన్ని మోసుకు వచ్చి పాతమిషనరీ సమాధివద్ద ఒకచోట శవాన్నుంచారు. వాల్టర్ ఆ మిషనరీ తరువాతనే అతడిస్థానంలో పనిచేయుటానికి వచ్చాడు. వెడింగ్‌టన్‌కు ఆ మిషనరీ సామానుల్లో ఒక ఇంగ్లీషు ప్రార్ధన పుస్తకం లభించింది. దానినుంచే అతడు ప్రార్ధన ప్రారంభించాడు. ఆ కఠినశబ్దాలను ఉచ్చరించేటప్పుడు ఒక వేళ

తాను మరణిస్తే అక్కడ ప్రార్థన చేయటానికికూడా ఎవరూ వుండరని అతడు ఆలోచించాడు. ఆ తరువాత శవాన్ని గోతిలో వుంచి సమాధిచేయ నారంభించారు.

కర్నల్ యూ తనటోపీని అప్పటివరకు తీసివుంచాడు, తిరిగి దానిని ధరించి కిటీకి వందనంచేసి వెళ్ళిపోయాడు; ఆతడి అంగరక్షకుడు కూడా వెళ్ళిపోయాడు.

ఆ కూలీలు ఇక ఇంగ్లీషువానిని సమాధిచేయటం అదే మొదటిసారిగా చూస్తున్నారు, కొంచెం ఆగి వెళ్ళిపోయారు. కిటీ, బెడింగ్‌టన్ లిద్దరు మాత్రమే అక్కడ మిగిలివున్నారు. వారి ఎదుటనే సమాధి తయారవుతుంది, ఆమె ఏడ్వలేదు— మొదటిసారి మట్టిపడినప్పుడు ఆమె హృదయం పగిలిపోయి నట్లనిపించింది.

బెడింగ్‌టన్ ఆమె రాకకోసం ఎదురుచూస్తూవుండటం గమనించింది. "మీకు త్వరగావుందా? నేనువెంటనే తిరిగి బంగళాకు వెళ్ళగోరటంలేదు," అంది.

"లేదు, నాకేమీపనిలేదు, నేనుమీతోనేవుంటాను."

# 66

బెడింగ్‌టన్, కిటీ లిద్దరూ నడుస్తూవెళుతున్నారు. రోడ్డు దాటి పర్వతంపైన సమాధి వున్నచోటుకు చేరారు. అది ఒక వితంతువు స్మారకచిహ్నం. అది కిటీ మనస్సులో హత్తు కుంది—ఆ సమాధి ఏవస్తువుకు చిహ్నమో ఆమెకే తెలి యదు—అందులో ఆమె కెందుకో పరిహాసమున్నట్లు కన్పిస్తుంది.

"ఇక్కడ కొంచెంసేపు కూర్చుందాం. మన మిక్కడికి ఎన్నో యుగాలకు పూర్వం వచ్చినట్లుగా వుంది. "అంది ఆమె పర్వతం ఎదుట విశాలమైన బయలు—అన్ని వైపులా ప్రశాంతంగా వుంది. "కొద్ది వారాల క్రితమే మన మిక్కడకు వచ్చాము, కాని పూర్తిగా ఒక యుగం గడచిపోయిన తరువాత నేడు తిరిగి వచ్చినట్లనిపిస్తుంది."

బెడింగ్‌టన్ జవాబేమీ చెప్పలేదు. కిటీ మనస్సులో రకరకాల ఆలోచనలు లేస్తున్నాయి. ఆమె ఒకసారి దీర్ఘంగా నిట్టూర్చింది.

"ఆత్మ శాశ్వతమని మీరంగీకరిస్తారా?" బెడింగ్‌టన్‌కు ఈ ప్రశ్నవిని ఆశ్చర్య మేమీ కలుగ లేదు. "నాకీ విషయంలో ఏమీ తెలియదు."

"ఇంతకు ముందు వాల్టర్ శవాన్ని స్నానంచేయించి నప్పుడు నేనటేచూస్తూ వుండిపోయాను. అతడు పూర్తిగా యువకునివలె కన్పిస్తున్నాడు. మనం మొదటి పర్యాయం షికారుకు బయలుదేరి నప్పుడు చనిపోయిన ఒక భిక్షుకుని చూశాము గుర్తుందా? నేనప్పుడు భయపడ్డాను—శవాన్ని చూశానని మాత్రంగాదు, మరెందుకంటే అతనినిచూసినప్పుడు అతడెప్పుడూ మనిషికాడనే అనిపించింది. అతడు చనిపోయిన జంతు మాత్రంగా కన్పించాడు—మరి వాల్టర్‌ను చూసినప్పుడు ఏదో యంత్రం ఆగిపోయి నట్లనిపించింది. అందుకే నాకు భయం కల్గింది. మరి ఒకవేళ ఈశరీరం యంత్రం మాత్రమే అయితే అప్పుడీ బాధ, నొప్పి, ఆవేదన, హృదయము అన్నీ నిరర్థక విషయాలే."

బెడింగ్టన్ మౌనంగా వున్నాడు. అతడు తన ఎదురుగావున్న విశాలమైదానం వంక చూస్తూవున్నాడు. బంగారు రంగు కిరణాలతో నిండివున్న ఆ ఉదయకాలం చాలా మనోహరంగా వుంది. పంటలతో నిండిన పచ్చని పొలాలు ఎంతో దూరం వరకూ వ్యాపించివున్నాయి. వాటిల్లో అక్కడక్కడా రైతులు పని చేస్తూవున్నారు. అంతాకలిపి చాలా సుఖకరము, ప్రశాంతమైన వాతావరణం. కిటీ మౌన భంగం చేసింది.

"కాన్వెంట్ జీవితం నాలో ఎంతగా హత్తుకుపోయిందో నేను మీకు చెప్పలేను. వారందరూ ప్రశంశాపాత్రులే. సిస్టర్ల జీవితంముందు నాజీవితం చాలా నిష్ప్రయోజనంగా కన్పిస్తుంది. వారు సర్వస్వము త్యాగం చేశారు,—తమ యిల్లు, తమదేశం, ప్రేమ, సంతానం స్వతంత్రం, మరింకెన్నో వస్తువుల్ని త్యాగం చేశారు. నేనిప్పటికీ ఎప్పుడైనా ఆలోచించిచూస్తే అంత గొప్ప త్యాగం చాలా కష్టమనే భావం కలుగుతుంది. ఇంటిలోని సుఖం, అక్కడి వుద్యానవనాల షికార్లు—చదువు, సంగీతం, విశ్రాంతి ప్రతి వస్తువునూ త్యాగం. వారి జీవితమే త్యాగమయం. వారిలో వినయ భావముంది, మరి అన్నిటిని మించి అధికంగా పనిచేయాల్సి వస్తుంది, దానితో వారు చూర్ణమైపోతూవుంటారు. ఇదంతా కాగా ఇంకా ప్రార్థన. వారందరికి ప్రపంచమంటే నిర్వాసిత కాలాన్నిగడుపుకునే చోటు మాత్రమనే. జీవితం ఒక పరీక్ష, దానిలో వారు వుత్తీర్ణులు కావాలి. వారి హృదయంలో ఒకే విశ్వాసం వుంది, ఒకే పట్టుదల వుంది—

ఒకే దృష్టి—ఒకనాటికి తామక్కడికి చేరుకుంటారు, అక్కడే తమకు శాశ్వత జీవితం లభిస్తుంది.''

కిటీ చేతులు కట్టుకొని బెడింగ్‌టన్ వైపు చూసింది.

''ఈ ప్రపంచం తరువాత మరో జీవితంలేదని కొంచెం సేపు అనుకోండి—అప్పుడు మృత్యువు ప్రతి వస్తువును నిర్మూలించటంలేదా? అప్పుడు ఆసన్యాసినులు అనవసరంగా త్యాగం చేయటం లేదా? వారు మోసపోలేదా?''

బెడింగ్‌టన్ విభ్రాంతితో కిటీవంక చూస్తూ వుండిపోయాడు.

''వారు తమ ధ్యేయాన్ని స్వప్నసంబంధమైనదిగా ఎంచారని నే ననుకోవటంలేదు. వారి జీవితం వారికి చాలా ఆసక్తిగలదే. మానవుడు అప్పుడప్పుడు జీవితంలో ఆతడిమనస్సు లీనమైవుండేటటువంటి ఒక అందాన్ని చేసి చూయిస్తాడు, లేనిచో ప్రపంచంలో మనస్సును కేంద్రీకరించేదేమీ వుండనే ఉండదనేది నే నంగీకరిస్తాను. మానవుడు ఒకప్పుడు చిత్రాలు గీస్తాడు— మరొకప్పుడు సంగీతంకూరుస్తాడు, వేరొకప్పుడు సాహిత్యాన్ని సృష్టిస్తాడు, ఈ విధంగా జీవితాన్ని గడుపుకుంటాడు. వీటన్నిటికంటే అందమైనది, సౌఖ్యమైనదేదంటే అందమైన జీవితాన్నిగడుపుకొనటమే. అదేకళయొక్క సర్వోత్కృష్టమైన కానుక.''

కిటీ నిట్టూర్చింది. బెడింగ్‌టన్ చెప్పినది ఎంత సత్యం, ఆమె యింకా వినాలనుకుంటూవుంది.

''మీరెప్పుడైనా సంగీతసభలకు వెళ్లారా?'' అని బెడింగ్‌టన్ ప్రశ్నించాడు.

"అవును, నాకు సంగీతమేమీ తెలియదు. కాని నాకు దానియందుచాలా ఆసక్తివుంది.

"చూడండి, వాద్యబృందంలోని ప్రతిమేళకర్త తన తన వాద్యాన్ని వాయిస్తాడు. ప్రతి వాద్యకర్తకు తన వాద్యంపైనే దృష్టివుంటుంది— దానంతటిఫలితం అందంగావుంటుందని అతడికి తెలుసు— అక్కడ ఆ ఒక్క వాద్యాన్నిఎవరూ వినకపోయినప్పటికీ— అది అందంగావుంటుంది, వాద్యకర్త తనవంతు నెరవేర్చి తృప్తిచెందుతాడు.

"మీరు ఆరోజు మరొకవిషయం చెప్పారు, మీకు గుర్తుందిగదూ! అదేమరొక పర్యాయం చెప్పండి," అందికిటీ.

బెడింగ్‌టన్ కిటీవంక చూశాడు— ఒక క్షణం సందేహించాడు, తరువాత నిస్సారంగా మందహాసం చేసి చెప్పనారంభించాడు.

"ఏమీలేదు! మార్గము, ప్రయాణికునివిషయం. ప్రతిజీవి ఆ మార్గంలోనే నడుస్తూవుంది, కాని ఆ మార్గాన్ని ఏ జీవీ ఏర్పరచలేదనేదే. మార్గం దానంతటదే ఏర్పడింది. అదే సర్వమూ, ఏమీకాదుకూడా— దానినుంచే అందరు ఉద్భవించటం— దానిలోనే అందరూ తిరిగి లీనమై పోతారు. అది కోణాలులేని ప్రేమువంటిది— అది ఒకధ్వని, దానిని చెవులు వినలేవు— అదొక విగ్రహం, కాని దానికేమీ ఆకారంలేదు. అదిఒక వల— కాని దాని ఒక్కొక్క కన్ను ఒక్కొక్క సాగరమంత పెద్దది. ప్రతిఒక్కరికి విశ్రాంతిలభించే అదొక విశ్రాంతిస్థలం. అదిఎక్కడాలేదు— అయినా దానిని మీరు చూడగలుగుతారు. మీరుకోరినా కోరకపోయినా జరగవల

సిన ప్రతిదీ జరుగుతూనే వుంటుంది. పాలించిన వారికి మేలు కలుగుతుంది— వంచబడినది, తిన్నచేయబడుతుంది. అసఫలత సఫలతకు ఆధారం. మరి సఫలతలోనే అసఫలత నిహితమై వుంటుంది. రోడ్డుమలుపు ఎటుపోతుందో ఎవరికితెలుసు? ఆక్రమణకు విజయంలభిస్తుంది; కాని తప్పించుకునే వారికి సఫలత లభిస్తుంది. తనను తాను జయించుకున్నవాడే నిజంగాశక్తిశాలి.''

''దీనంతటికీ ఏదైనా అర్థంకూడావుందా?''

"అప్పుడప్పుడు, నేను మద్యం మత్తులోవున్నప్పుడు ఆకాశంలోని నక్షత్రాలను చూసినప్పుడు దీనికి అర్థం వుందని తెలుసుకుంటాను.''

ఇద్దరూ మౌనంవహించారు తిరిగి కిటీయే మౌనభంగం చేసింది.

''ఈవిషయం చెప్పండి. కుక్క-చనిపోయింది, ఇదేమైనా సామెతా?''

బెడింగ్‌టన్ పెదవులపై మందహాసం కదిలింది. అతడు జవాబు చెప్పనేబోతున్నాడు— కిటీ ఆతడివైపేచూస్తుంది— ఆమె ముఖలక్షణాలుచూసి బెడింగ్‌టన్ జవాబీయకపోవడమే మంచిదని భావించాడు.

''ఒకవేళ సామెతవుంటే నాకు తెలియదు. కాని— ఎందుకు?''

"ఏమీలేదు, ఏదో అడిగాను;'' ఇద్దరూ తిరిగిమౌనం వహించారు.

"మీరు మీభర్త దగ్గర వంటరిగా వున్నప్పుడు నేను బయట సర్జన్‌ను ఒకవిషయమడిగాను," అన్నాడు బెడింగ్‌టన్

"ఏమిటది?"

"సర్జన్ చెప్పినదంతా నాకు బోధపడలేదు. కాని ఏదో పరిశోధించటంలో ఆయనకు ఏదో అంటుకుందని మాత్రమే నా అభిప్రాయం."

"ఆయనెప్పుడూ పరిశోధిస్తూ నేవుండేవాడు. అతను డాక్టరా కాదు— అతడు జీవవిజ్ఞానశాస్త్రజ్ఞుడు, అందుకే అతడికక్కడకువచ్చుట కంత ఉత్సాహపడింది."

"సర్జన్ మాటల్నిబట్టి అకస్మాత్తుగా ఆయనపై పరిశోధనాప్రభావం పడిందని నేను తలచడంలేదు, ఆయన తనపై నే ఏదో పరిశోధన చేసుకుంటుండేవాడు."

కిటీ రంగుమారిపోయింది. ఈ మాటతో ఆమె కంపించింది. బెడింగ్‌టన్ ఆమె చేయిపట్టుకుని అన్నాడు.

"ఈ విషయాన్ని గురించి మాట్లాడినందుకు నన్ను క్షమించండి. ఈవిషయం మీ దుఃఖాన్నేమైనా తగ్గించగలదని నేనుభావించాను. ఇటువంటిపరిస్థితిలో ఈ మాటలు మాట్లాడదని తెలుసుకుంటున్నాను, దీనివలన లాభమేమీవుండదు. వాల్టర్ తన కర్తవ్యం కోసం, తనశాస్త్రంకోసం అమరజీవైయాడని మీరుతెలుసుకోవాలనే నా అభిప్రాయం."

కిటీనేదో సందేహం ఆవహించివుంది, "వాల్టర్ హృదయం విరిగిపోయింది, ఆకారణంగానే అతడు మరణించాడు." అంది ఆమె.

బెడింగ్‌టన్ జవాబుచెప్పలేదు. కిటీ బెడింగ్‌టన్ వంక చూసింది _కిటీముఖం కళావిహీనంగావుంది.

కిటీఅడిగింది, వాల్టర్ చనిపోయింది కుక్క-అని ఇంతకూ ఎందుకన్నట్లు- అదేమిటి?

# 67

మరునాడుదయం కిటీ కాన్వెంటుకు వెళ్ళింది. వెళ్ళి తలుపు తెరచిన బాలిక కిటీనక్కడచూసి చాలా వ్యాకుల పడింది. కిటీ వెళ్ళి తనపనిలో మునిగిపోయింది. కొంచెం సేప టికి మదర్ ఆమెవద్దకు వచ్చింది. ఆమె రాగానే కిటీ చేతుల్ని తనచేతుల్లోకి తీసుకుంది.

"బిడ్డా! నీవిక్కడకురావటం మంచిదేఅయింది. పర్వతం వంటి ఇంత ఆపదతరువాత కూడా నీవిక్కడకు వచ్చి నీ ధైర్యాన్ని ప్రదర్శించావు- ఇది నీ విజ్ఞానమే. కొంచెం పని నీ దుఃఖాన్ని తగ్గిస్తుంది."

కిటీ కనురెప్పలు వాలిపోయాయి. ఆమెముఖం ఎర్ర నైంది. తనహృదయంలోని కల్లోలాన్ని మదర్ తెలుసుకోవటం ఆమె కిష్టంలేదు.

"మా అందరికి నీ ఆపదకు దుఃఖం కల్గిందని నేను చెప్పగోరటంలేదు."

"మీ సహృదయత!" అని కిటీ జవాబుచెప్పింది,

"మేమందరం నీ కొరకు, నీనుంచి వెళ్ళిపోయిన ఆత్మ శాంతికోసం ప్రార్థనలు చేస్తాం."

కిటీ మౌనంగావుంది. మదర్ కిటీచేతుల్ని వదలిపెట్టింది. ఆమె కిటీకి ఏదోకొంచెం పని ఒప్పగించింది. అక్కడువున్న ఇద్దరు ముగ్గురు చిన్నపిల్లల్ని ముద్దాడి, తన అవసర కార్య నిర్వహణకు వెళ్లిపోయింది.

# 68

ఒక వారం గడచిపోయింది. ఒకనాడు కిటీ కూర్చుని కుట్టుపని చేస్తూంది. అదే సమయమందు మదర్ గదిలోనికి ప్రవేశించింది. కిటీని పరిశీలించినట్లుగా ఆమె సమీపంలో కూర్చుంది.

"కిటీ, నీవు కుట్టుపని చాలా బాగాచేస్తున్నావు, ఇంత చక్కగా కుట్టుపని చేసేపిల్లలు ఈకాలపువాళ్ళలో ఎక్కడో ఒకరుంటారు."

"ఇదినేను మాతల్లి వద్దనేర్చుకున్నాను."

"మీతల్లి మీవంటి కూతుర్ని పొంది చాలా సంతసించి వుంటుంది."

కిటీ మదర్‌వైపుచూసింది. మదర్ అన్న ఈమాట ఆమె కదోవిధంగా కన్పించింది, ఆమె దీనిని అర్థరహితంగా ఎంచలేకపోయింది,

"నీభర్త మరణానంతరం నిన్నికక్కడ పనిచేయనిచ్చాను; పనిలో నిమగ్నమై వుండటం వలన మనస్సు ఊరట చెందుతుం దనే అభిప్రాయంతో మాత్రమే చేయనిచ్చాను. నీ వప్పుడు హాంకాంగ్ వెళ్ళటానికి అనుకూలంగాలేవనే నా అభిప్రాయం.

పైగా నిన్ను ఇంటికి పంపటం వలన అక్కడ నీవు వంటరిగా కూర్చుని ఈ దుఃఖాన్ని పర్వతంగా భావించి బాధపడనీయటం నాకిష్టంలేదు,—కాని ఇప్పుడు ఎనిమిదిరోజులు గడచిపోయాయి—ఇప్పుడు నీవు తిరిగి వెళ్ళిపోవాలి."

"మదర్, నేను వెళ్ళదలచటం లేదు. నేనిక్కడే వుంటాను."

"ఇక్కడే వుండటానికి నీకింకా ఇక్కడ ఏముంది? నీవు నీ భర్త వెంటవచ్చావు—ఇప్పుడు భర్తలేడు, రెండవది నీవు ఒంటరిగా వుండగలిగిన స్థితిలోనూ లేవు. నిన్ను గురించి శ్రద్ధ వహించటం, సంరక్షణచూడటం చాలా అవసరం. బిడ్డా! ప్రభువు నీ కొరకు మరొక నూత్న ప్రాణిని పంపుతున్నాడు—ఆ బిడ్డ సంరక్షణలో నీవు ఏమాత్రం పొరబాటు చేయగూడదు."

కిటీ కళ్ళు వాల్చుకుంది. ఆమె మౌనం వహించింది." నేనిక్కడ ఏదైనా పనికి ఉపయోగ పడతానని యోచించాను. ఇక్కడ పనిచేసి నేను పనిచేయగలనని గ్రహించాను. మహామారి పోనంతవరకూ మీరు నన్నిక్కడ పనిచేయనిస్తారని భావించాను." అంది కిటీ.

కొంచెం మందహాసంచేస్తూ మదర్ జవాబు చెప్పింది, "మేమందరం నీ కెంతో కృతజ్ఞులం—ఇక ఇప్పుడు మహామారి కూడా తగ్గి పోయినట్లే, అంత పెద్ద అపాయమేమీ లేదు. నేను కాంటన్ నుంచి మరిద్దరు సిస్టర్లను పిలిపిస్తున్నాను. నాలుగైదు రోజులలో వస్తున్నారు—ఆ తరువాత కాన్వెంట్‌లో చేయతగిన పని ఏమీ వుండదు."

కిటీ హృదయం జారిపోయింది. మదర్ ముఖలక్షణా లనుబట్టి ఆమె జవాబుకోరటం లేదన్నట్లు స్పష్టమవుతుంది. మదర్‌ను అనవసరంగా వత్తిడి చేయటం మంచిదిగాదని కిటీకి తెలుసు.

బెడింగ్‌టన్ తన సలహా తీసుకున్నట్లు మదర్ చెప్పింది.

"బెడింగ్‌టన్ తన పనుల్లో తాను ఆసక్తిగావుంటే చాలా మంచిది."

"ఒక వేళ ఆయన వచ్చివుండకపోతే నేనే కబురుపంపి అన్నీ చెప్పేదానిని. ఈ పరిస్థితిలో నీ చోటు ఇక్కడ గాక మీ తల్లిగారివద్ద. బెడింగ్‌టన్ కర్నల్‌యూతో చెప్పి నీరక్షణకు అన్ని ఏర్పాట్లుచేశాడు. కూలీలు వగైరా ఏర్పాట్లు కూడా చేశాడు. నీవెంట ఒకపని మనిషికూడా వస్తుంది. ప్రయాణంలో నీకు అన్ని సౌకర్యాలు సమకూడే ఏర్పాట్లన్నీ చేయ బడ్డాయి."

కిటీ పెదవులు కుట్టివేసి నట్లయి పోయాయి. ఈయేర్పాట్లన్నీ చేసింది తన కోసమే కాని తన అభిప్రాయాన్నే మాత్రం తెలుసుకో లేదు అని యోచించింది. తన నోటి నుంచి కటువైన జవాబురాకుండా నిగ్రహించుకుంది.

"నేను వెళ్ళవలసింది ఎప్పుడు?"

మదర్ మొదటివలెనే మృదువుగానే మాట్లాడింది, నీవెంత త్వరగా హాంకాంగ్ చేరుకుని ఇంగ్లండుకు ప్రయాణమైతే అంత మంచిది. నీవు ఎల్లుండి ఉదయమే బయలు దేరాలని నేను కోరుతున్నాను.

"ఇంత త్వరగానా?"

నిజంగానే తనకిక ఇక్కడ చోటు లేదు అని ఆలోచించింది.

"మీారందరూ వీలైనంత త్ర   నానుంచి విముక్తి పొందాలనుకుంటున్నారను కుంటాను," అని విచారమైన కంఠంతో కిటీ అంది.

"అమ్మా!—నీ వాస్తవ స్థితిని నేను తెలుసుకోవటం లేదని మాత్రం భావించకు."

కిటీ మదర్‌ను రెప్పవేయకుండా చూస్తూంది. తనకు మరెక్కడా స్థానంలేదు గనుక ఆమె అక్కడే వుండిపోగోరుతుంది, తన చావు బ్రతుకుల్ని గురించి విచారించే వారు ప్రపంచములో ఎవ్వరూ లేరనికూడా ఆమెకు తెలుసు.

"నీవు ఇంటికి వెళ్ళటానికి సందేహిస్తావెందుకమ్మా? ఇక్కడి జనమంతా బయటివాళ్ళు, నిన్ను గురించి రకరకాలుగా సంభాషిస్తూ వుంటారు," అని మదర్ నచ్చ జెప్పటానికి ప్రయత్నించింది.

"మదర్, మీారుమాత్రం అనుకోరుగదా?"

"మా విషయమే వేరు బిడ్డా! మేమిక్కడికి వచ్చినప్పుడే మా యింటిని శాశ్వతంగా వదిలేశామని భావించుకున్నాం."

తన ఈ అసహాయస్థితిలో కూడా కిటీ సన్యాసినుల విశ్వాసాన్ని పరీక్షించాలనుకుంది. దేనికారణంగా వీరు స్వభావసిద్ధమైన సహజ భావాలనుకూడా తమదరికి చేరనీయరు.

మానవుని సహజసిద్ధమైన బలహీనతలనుగురించి ఆమె మదర్‌ను పరీక్షించాలనుకుంది.

"మీరు ఏసంబంధీకుల, ఆత్మీయుల మధ్య పెరిగి పెద్ద వారైరో వారినివదిలేస్తారు, వారినిక కలుసుకొనటంవుండదు— ఈ ఆలోచనే ఎంతబాధాకరంగా వుండివుంటుంది."

మదర్ ఒకక్షణం సందేహించింది; కాని ఆమె గంభీర మైన అందంగావున్న ముఖంలో ఎటువంటి భావపరివర్తనా కిటీకి కన్పించలేదు.

"నాతల్లిగారు, ఇప్పుడు వృద్ధురాలైపోయింది, ఆమెకు మాత్రం చాలా బాధగా వుంటుంది. తన మరణానికిముందు ఆమె నన్ను తప్పక చూడాలని కోరుకుంటూ వుంటుంది. ఆమెకా ఆనందాన్ని ఇవ్వగల్గిన ఎంతబాగుండును అని ఆలోచిస్తాను. కాని ఇదిసంభవమేగాదు. ఇక మేము తల్లికుమార్తెలం స్వర్గంలోనే కలుసుకుంటాం."

"అయినప్పటికీ అప్పుడప్పుడు, తమప్రియబంధు పరివారాన్ని వదులుకొని మంచిచేశామనో, చెడుచేశామనో సందేహం కలుగుతూనే వుండివుంటుంది.

"నేనా విధంగా చేసి పశ్చాత్తాపం చెందానాలేదా యని నన్నడుగుతున్నావా?" మదర్ ముఖం ప్రకాశించసాగింది. "లేదు— అదెన్నడూలేదు— నేను నిరర్థక వ్యర్థ జీవితాన్ని త్యాగమయమైన సాధకజీవితముగా చేసుకున్నాను."

కొద్దిక్షణాలు మౌనంవహించి మదర్ మధుర మంద హాసంచేస్తూ చెప్పనారంభించింది. "నేను నీకు ఒకచిన్న

పార్సిలు ఇస్తాను, దానిని మార్సెయ్ వెళ్ళి ఇవ్వు. నేను దానిని చైనా పోష్టాఫీసు ద్వారా పంపగోరటంలేదు. నేనిప్పుడే తెచ్చి, స్తాను,"

"రేపు ఇవ్వండి."

"రేపు నీకు తీరికేవుండదు— ఇక్కడకు రాలేకపోవచ్చు. నేడే మేము వీడ్కోలిస్తాము."

మదర్ గదినుంచి బయటకు వెళ్ళిపోయింది. అప్పుడే సిస్టర్ జోజెఫ్ వచ్చింది ఆమె కిటీకి వీడ్కోలు చెప్పడానికి వచ్చింది. ఆమె కిటీ ప్రయాణం సౌఖ్యంగా సాగాలనికోరింది. కర్నల్ యీ ప్రయాణానికి తగిన ఏర్పాట్లన్నీ చేయించాడని చెప్పింది. ఆమె సముద్రప్రయాణానుభవం ఏమిటని సిస్టర్ అడిగింది. హిందూమహాసముద్రములో తాను ప్రయాణం చేస్తున్నప్పుడు తుఫాను వచ్చిందనీ, తాను చాలా భయపడి పోయానని సిస్టర్ తన అనుభవాన్ని చెప్పింది. కిటీతల్లి కిటీని చూసి ఎంతసంతోషిస్తుంది, కిటీ తనయందు చాలా శ్రద్ధ వహించుకోవాలి, ప్రభువు తనకొక ప్రాణి పోషణభారాన్ని వప్పగించనున్నాడు. ఆ ప్రాణిలో డాక్టర్ వాల్టర్ ఆత్మవుంటుంది. సిస్టర్ ఆచరణ చాలా స్నేహంగావుంది, కాని అది అశరీరమైనదిగా కిటీకి కన్పించింది. ఆమె సిస్టర్ జోజెఫ్ దృఢమైన భుజాలను పట్టుకుని కుదిపేయాలనిపించింది, బిగ్గరగా అరవాలనుకుంది - "నేనూ మానలినే చూడటంలేదూ— అభాగ్యురాలను పూర్తిగా ఒంటరిదానను— నాకు కొంత విశ్రాంతి, ఉత్సాహము, సానుభూతి అవసరం. అబ్బా! మీరొక క్షణకాలం ప్రభువునుంచి దృష్టిమరల్చినాకు శాంతిని సానుభూతినీ

ఇవ్వలేరా?" అని చెప్పాలనుకుంది. ఈ ఆలోచనరాగానే కిటీ పెదవులపై నవ్వు మెరిసింది. తానిది చెప్తే సిస్టర్ జోజెఫ్ ఆశ్చర్యంతో చూస్తూవుండిపోతుందని ఆమె ఆలోచించింది. ఇప్పుడు సందేహంగానేవుందిగాని అప్పుడిక ఇంగ్లీషువారు పిచ్చివారనేది విశ్వాసం కల్గుతుంది.

"నాకు సముద్రప్రయాణం చాలాబాగుంటుంది. నేనెప్పుడూ ఆ ప్రయాణంలో జబ్బుపడలేదు," అంది కిటీ.

ఇంతలో మదర్ ఒక చిన్న పార్సెలు పట్టుకుని ప్రవేశించింది.

"ఇవి రుమాళ్లు. మా తల్లిగారికొరకు నేను తయారు చేయించాను వీటిపై ఇక్కడిపిల్లలు పేర్లు అల్లారు."

కిటీకి చూపవలసిందిగా సిస్టర్ జోజెఫ్ మదర్‌కు చెప్పింది. ఇష్టంలేకుండానే, మదర్ పార్సెలువిప్పి కిటీకి చూపించింది. రుమాలులు చాలా అందంగా వున్నాయి. కిటీ చాలా ప్రశంశించింది. మదర్ తిరిగి పార్సెలు కట్టి కిటీకి ఒప్పగించింది. సిస్టర్ జోజెఫ్ శుభాకాంక్షలు చెప్పి వెళ్ళిపోయింది. ఇకమదర్ నద్దకూడా శలవు తీసుకోవాలని కిటీయోచించింది. ఆమెమదర్ సహృదయతకు ధన్యవాదాలర్పించింది. వారిద్దరూ వరండాగుండా బయటకు నడచారు.

"మార్సెయ్‌లో వీటిని రిజిష్టరుచేసి పంపటానికి పెద్ద కష్టమేమీ వుండదుగదూ?" అని మదర్ అడిగింది.

"నాకు చాలా సంతోషంగావుంటుంది."

కిటీ చిరునామా చదివింది. పేరు చాలాఆకర్షణీయంగా

వుంది. కాని ప్రదేశంపేరు చదవగానే కిటీ, "ఈ ప్రదేశానికి నేను వెళ్లివచ్చాను," అంది.

"కావచ్చు, విదేశీయులకు వారంలో రెండురోజులు అక్కడికి వెళ్లుటకు అనుజ్ఞ ఇస్తారు."

"నేను ఆ అందమైన ప్రదేశంలో వుంటూవుండివుంటే, దానిని వదలగలిగే దానినేగాదు."

"అవును, అదిచరిత్రాత్మస్థలం— కాని నాకా విచార మేమీలేదు. అప్పుడప్పుడు నా చిన్నతనం గడిపిన ఆ ప్రదేశం గుర్తుకొస్తూవుంటుంది. నేను సముద్రతీరాన జన్మించాను. ప్రారంభంలోనే నేను సాగర గర్జాఘోష విన్నాను."

మదర్ తన విషయం చెప్తూకూడా దానిని హేళన చేస్తున్నట్లుగానే కిటీ భావించింది. ఇంతలోనే వారిద్దరూ కాన్వెంటు బయటిద్వారం వద్దకు వచ్చారు. మదర్ తనను కౌగలించుకొని తనముఖంపై స్నేహచిహ్నలను అంకితం చేసి నప్పుడు కిటీకి చాలా ఆశ్చర్యం కల్గింది. రెండు బుగ్గలపైనా ఆమె ముద్దుపెట్టుకుంది, అప్పుడు కిటీ కిలకిలలాడుతూ సంతోషంతో గంతులు వేయాలనుకుంది.

తన కౌగిలిలో బిగించుకునే మదర్ కిటీతో, "వెళ్లు— భగవంతుడు నీకు శాంతినిచ్చుగాక! కర్తవ్య నిర్వహణకంటే మించిన గొప్ప కార్యమేదీలేదని మాత్రం గుర్తుంచుకో, ఎప్పుడైనా ఏదైనాఅపరాధం జరిగితే వెంటనే క్షమార్పణకోరుకో. ఒకే ఒకవిషయానికి గొప్పతనం వుంది— కర్తవ్యంయందు నిష్ఠ వుండాలి. కర్తవ్యము, ప్రేమకలసి ఒకే ఆకారం పొందినప్పుడే సుఖం లభిస్తుంది.— అతీతమైనసుఖం!"

కిటీకి కాన్వెంట్ ద్వారం శాశ్వతంగా మూసుకుంది.

బెడింగ్టన్ కిటీవెంట పర్వతం వరకు వెళ్లాడు. అక్కడి నుంచి వారిద్దరూ సమాధివైపుకు బయలుదేరారు. స్మృతి చిహ్నమైన సమాధివద్దకు వెళ్ళి బెడింగ్టన్ కిటీకి వీడ్కోలిచ్చాడు. వాల్టర్ సమాధిచూసి అవి తనను పరిహాసం చేస్తున్నదని ఆమెకు కనిపించింది—కాని కిటీ ఆ పరిహాసానికి జవాబు చెప్పగలుగుతుంది. కిటీ తన పల్లకీలో కూర్చుంది.

ఒకటి తరువాత ఒకటిగా రోజులు గడచిపోయాయి. మార్గంలోని దృశ్యాలు ఆమె ఆలోచనలపైనే వున్నాయి. ఆ దృశ్యములు తనకు కార్బన్ కాపీ అన్నట్లనిపించిందామెకు. ఆ కన్పించే వస్తువుల్నే కొన్నివారాల కితం అటువెళ్తూచూసే వుంది. రక్షణకు వెంటవస్తున్న సైనికులుకూడా అన్యమనస్కంగా నడుస్తున్నారు. ప్రతిరోజు పాతికమైళ్ళ ప్రయాణం సాగుతోంది. ఆమెవెంట వస్తున్న దాసీ పల్లకీని ఇద్దరుమోస్తున్నారు, కాని తనపల్లకీకి నలుగురు మనుషులున్నారు, ఆమె బరువుగా వున్నందుకుగాదు, ఆమె యజమానురాలైనందుకు అప్పుడప్పుడు కూలీలు మౌనంగా లైనులో నడచేవారు— ఒకప్పుడు బండిలోకూర్చున్న ఎవరో చైనాఆఫీసరు ఒక ఇంగ్లీషు స్త్రీని చూస్తూ వెళ్లిపోయేవాడు. నీలిదుస్తులు ధరించిన రైతులు పనిచేస్తున్న పొలాలుదాటి పోతున్నారు. మధ్యమధ్య ఎక్కడైనా ఒకస్త్రీ కన్పించేది. చిన్నచిన్న పర్వతాలను దాటుతూ ఆ యాత్రాదళం ముందుకు సాగుతుంది. ఆ పర్వతలోయల్లో పంటపొలాలున్నాయి— రైతుల ఇండ్లున్నాయి. ఆ యాత్రాదళం మధ్య మధ్య హీనదశలోవున్న పల్లెల్ని,—

క్రిక్కిరిసిన జనసంఖ్యగల పట్టణాలగుండా ప్రయాణంచేస్తూంది. ఆకురాలుకాలం, సూర్యోదయపు తొలికిరణాలు చాలా ఆనందం కలిగిస్తున్నాయి. ఆ ఉదయకాలపు సూర్యకిరణాలు పొలాలపై బడినప్పుడు, పొలాలనుండి ఏదో మనోహరమైన కథ విన్పిస్తున్నట్లుగావుంది.

ఇటువంటివే దూరదూరంగా వ్యాపించివున్న రంగురంగుల దృశ్యములు కిటీకి అపరిచితంగా కన్పిస్తున్నాయి, అవన్నీ ఛాయా చిత్రములవలె ఆమెకు గోచరిస్తున్నాయి, అదంతా ఆమెకు అవాస్తవికంగా కన్పిస్తూంది.

స్టేజిపై ఏదైనా నగదృశ్యమును చూపవలసి వచ్చినప్పుడు ఆ విధంగా చిత్రించబడిన తెరలు కడ్తారు, కిటీ దృష్టికి మి-తాన్-పూ అలాగే వుంది. మదర్ సన్యాసిని, బెడింగ్టన్, మంచూ స్త్రీ ముసుగులోని జీవితములవలె కన్పిస్తున్నాయి. వారందరిలో ఏదో కొంత ప్రత్యేకత వున్నప్పటికీ కిటీ దానిని తెలుసుకో లేక పోయింది. వారందరు ఏదో పెద్ద ఉత్సవ సందర్భములో నాట్యం చేస్తున్నట్లనిపించిదామెకు— ఆ నాట్యంకూడా ఆదిమకాలపు నాట్యంవలె వుంది. వారి జీవితాలలో కొంత తథ్యముందని, అది తెలుసుకోదగినంత ప్రాముఖ్యతగలదని—కాని దానిని తెలుసుకు నేందుకు ఆరంభించుటకు ఎక్కడా ప్రారంభ చిహ్నమే దొరకదని, ఎవరైనా చెప్పగలరు.

ఇంతకూ తను, వాల్టర్ ఆ అవాస్తవిక నృత్యంలో ఎందుకు పాల్గొన్నారో—అంతే గాక తామిద్దరూ చాలా ప్రాముఖ్యంగా ఎందుకు నటించారో కిటీకి అర్థం కాలేదు.

అక్కడ తానుకూడా మరణించేదే—వాల్టరు ఎలాగో చనిపోయాడు. అదంతా పరిహాసమా? బహుశా అదంతా ఒక భయంకర స్వప్నం కావచ్చు; దానినుంచి కన్నులు తెరచినట్లుగాను, సంతోషంగా వూపిరి పీల్చుకున్నట్లుగానూ వుంది. అక్కడి ఆతీతమంతా ఆమెకు చాలా పాతదిగా కన్పించింది. కిటీ ఎదుట ఇప్పుడు వాస్తవిక జీవిత ముంది—దీని ఎదుట అక్కడి పాత్రలన్నీ చలన చిత్రపు పాత్రలవలె మాత్రమే వున్నాయి. ఇప్పుడామెకు అక్కడి జీవితం కేవలం ఒకగాథగానే కన్పిస్తుంది. దానంతటితో ఆమెకెంత తక్కువ సంబంధముండేది. ఆమెకు చాలా దగ్గరగా వుంటూ వచ్చిన బెడింగ్టన్ ముఖంకూడా ఆమెస్మృతిపథంలో స్పష్టంగా లేదు.

ఆ రోజు సాయంత్రానికి వారు పడమటి నదీతీరానికి చేరాలి. అక్కడినుంచే కాంటన్ వెళ్లే స్టీమరు అందుకోవాలి. అక్కడనుంచే హాంకాంగ్ వెళ్ళటానికి ఒక రాత్రి ప్రయాణం.

# 70

కిటీ వాల్టర్ మరణానికి ఏడ్వలేదు—ఆమెకు మనోవ్యధవుంది. కాని చైనా కర్నల్‌యూ ఎందుకేడ్చాడు? ఆమె తన భర్త మరణానికి స్తంభించి పోయింది. అతడు తిరిగి ఇక బంగళాకు రాడని, అతడెప్పుడో జీవించివుండి, ఇప్పుడిప్పుడే చనిపోయాడనేది ఆమెకు విశ్వాసమే కలుగలేదు. సిస్టర్లు ఆమె అదుఃఖాన్ని నిగ్రహించుకున్నందుకు ప్రశంశించారు; బెడింగ్టన్ చాలా నేర్పరి—అతడు కిటీకి సానుభూతి

చూయించినా తన మనస్సులోని విషయాన్ని మాత్రం చెప్ప లేదు. వాల్టర్ మరణంవలన కిటీకి నిజంగా చాలా పెద్దదెబ్బ తగిలింది. ఆమె అతడి మరణాన్ని కోరటం లేదు—కాని ఆమె అతనిని ప్రేమించటంకూడా లేదు—అంతకుముందూ ఆమె కోరి వుండలేదు. మౌనంగా ఈ దుఃఖాన్ని వహించటంలోనే మేలుందని ఆమె యోచించింది. తన మనస్సులోని విషయా న్నెవరూ గ్రహించటం ఆమెకిష్టంలేదు. కాని ఆమె తనను తానే చాలామోసగించుకుంది. అప్పుడప్పుడు ఇతర్లతో అబద్ధ మాడటం వలన మేలుకలుగుతుందనీ, తనను తానెప్పుడూ మోసగించుకోరాదనీ గత కొద్ది వారాలలో తాను నేర్చు కున్నానని ఆమెయోచించింది. ఆమెకు వాల్టర్ మరణానికి దుఃఖం కలుగుతుంది, కాని అది మానవత్వదృష్టితోనే—ఆమెకు మరే పరిచితుని మరణం వలనైనా ఇదే దుఃఖం కలుగుతుంది. వాల్టర్‌లో ప్రశంశా యోగ్యమైన గుణాలున్నాయని ఆమె తలచేది— తానుమాత్రమే అతనిని కోరలేకపోయింది— పైగా వాల్టర్ ఆమెకెప్పుడూ దుఃఖకారణంగానే వుండేవాడు.

కిటీకి వాల్టర్ మరణం వలన సుఖమేమీ కలుగలేదు. తన ఒక్కమాటతో వాల్టర్ జీవితం తిరిగిరాగల్గితే ఆమె వెంటనే చెప్తుంది, అనిఅనుకుంది; వాల్టర్ మరణం తరువాత ఆమె జీవితం కొంచెం తేలికపడిందనే ఆలోచనకూడా ఆమెకు వెంటనే కల్గింది. వారిద్దరూ ఎప్పుడూ సుఖంగా వుండగలిగే వారుకారు, కాని విడిపోవడంకూడా తక్కువ బాధాకరమేమీ గాదు. తన ఆలోచనకు తానేత్రుళ్ళిపడింది కిటీ— ఒకవేళ తన ఆలోచన ఎవరికైనా తెలిస్తే నిర్దయురాలనుకుంటారు— కాని

ఎవరికైనా ఎలా తెలుస్తుంది? అని ఆలోచించింది. అందరి మనస్సుల్లోనూ ఇటువంటివి కొన్నిరహస్యాలుంటాయి, ప్రతివాళ్లు దానిని ఇతరులకు తెలియకుండా దాచిపెట్టుకోగోరతారనీ ఆమె ఆలోచించింది.

కిటి తన భవిష్యత్తును గురించి ఆలోచించనేలేదు— కనీసం ఊహించుకోలేదు కూడాను. ఇప్పుడిక తను సాధ్యమైనంత తక్కువకాలమే హాంకాంగ్‌లో వుండగోరుతుంది. హాంకాంగ్ చేరటమనే ఆలోచన మాత్రంతోనే ఆమె కంపించింది. ఏదో చలనచిత్రంలోని పాత్రవలె ఒక్కొక్కరాత్రి ఒక్కొక్క ప్రదేశంలో గడపవలసి వస్తుందనిపించింది, కాని ఇంత సమీపంలోవున్న భవిష్యత్తును ఎదుర్కోవాల్సిందే. హాంకాంగ్‌లో తానేదైనా హోటలులో ఆగాలని ఆమె నిర్ణయించుకుంది. అక్కడవుండే తనఇల్లు, ఫర్నీచరు అమ్మేఏర్పాట్లు చేసుకోవాలనుకుంది. తాను చార్లీని కలుసుకోవాల్సిన అవసరమే లేదు.— కాని కనీసం ఒకపర్యాయం అతని నెలాగో కల్సుకుంటుంది, కల్సుకుని అతనిని తానెంత నీచంగా భావిస్తుందో కూడా చెప్తుంది.

కాని చార్లీతో ఇప్పుడు తనకేమిపని?

చార్లీ ఆలోచనరాగానే తన హృదయతంత్రులనెవరో మీటినట్లనిపించింది, దానినుండి అత్యంత మధుర సంగీతం విన్పించినట్లుంది. ఈ యోచన కలగగానే వాడిపోయిన ఆమె అధరములపై దరహాసం పరుగులెత్తింది. మహామారితో దహించుకు పోయిన ఆ పట్టణం ఆమెకు బందిఖానాకంటే తక్కువేం గాదనిపించింది. ఇకతానిప్పుడు ఆక్షైదునుంచి పారి

పోయివచ్చింది—నేటికి ముందెప్పుడూ ఆమెకు నీలాకాశం అందంగా కన్పించలేదు—ఆమెకు వెదురు పొదలుకూడా ఆకర్షవంతంగా కన్పిస్తున్నాయి. స్వతంత్రం, ఈ ఆలోచన ఆమె ప్రతి శ్వాసను సంగీతమయం చేసింది. ఈ ఆలోచనముందు ఆమెకు భవిష్యత్తు విచారమే లేక పోయింది. స్వతంత్రం, ఒక బంధంనుంచేగాదు—తనను ఎప్పుడూ దుఃఖపెడ్తూవచ్చిన ఒక మనిషినుంచిగాదు—స్వతంత్రం ఆ మృత్యు సామ్రాజ్యం నుంచేగాక తలవంచవలసివచ్చిన ఆ ప్రేమనుంచికూడాను.—ప్రతి ఆధ్యాత్మిక బంధనంనుంచి ఆమెకు ముక్తి లభించింది. ఇప్పుడామె సర్వస్వతంత్రురాలు స్వతంత్రంగావుండే తనపై జరిగేవన్నీ సహిస్తుంది.

# 71

స్టీమర్ హాంకాంగ్ చేరగానే కిటీ డెక్‌పైనిలబడి సముద్రంలోని రాకపోకల వత్తిడిని చూస్తూంది. స్టీమర్ ఆగగానే ఆమె దాసీమనిషి సామాన్లేమైనా వదలిందేమోనని తనకేబిన్ లోకి వెళ్లి చూసింది. అద్దంలో ముఖం చూసుకుంది. మదర్ ఇచ్చిన నల్లనిదుస్తులు ధరించివుంది; అన్నిటికంటేముందు ఈ దుస్తుఃల్నుంచి విముక్తి పొందాలనుకుంది. అంతలో ఆమె కేబిన్ ద్వారంవద్ద ఎవరోపిల్చారు, దాసీ తలుపు తెరిచింది.

"శ్రీమతి ఫేన్!"

కిటీ తిరిగిచూసిన క్షణంలో ఆగంతకురాలిని గుర్తించ లేకపోయింది; తరువాత హృదయగమనం ఆగినంతపని జరిగింది, అమె ఎర్రబడింది. ఆగంతకురాలు డొరొథీటవున్సెండ్.

కిటీ కొరకు ఆమె అక్కడకురావటం వూహించని విషయం, నోటికి తాళంవేసినట్లైంది. డొరొథిగదిలో ప్రవేశించగానే స్నేహపూర్వకంగా కిటీ చేతుల్ని తనచేతుల్లోకి తీసుకుంది.

"కిటీ! నాకునిజంగా చాలాదుఃఖంగావుంది."

డొరొథి కిటీనిముద్దుపెట్టుకుంది. కిటీ డొరొథీనిఎప్పుడూ ఇంతకుభిన్నంగానే అర్ధంచేసుకుంది. ఆమెకు నేటి డొరొథి ఆచరణనుచూసి ఆశ్చర్యం కలుగుతూంది.

"మీరు చాలా దయచూయించారు." అందికిటీ

"మనం డెక్పైకి వెళ్దాం. ఇక్కడిపనులన్నీ దాసీ చూస్తుంది. నావెంట పిల్లలుకూడా వచ్చారు."

డొరొధి కిటీచేయిపట్టుకొని బయటకు తీసుకువెళ్ళింది. డొరొథి ముఖంలోనిజంగానే సానుభూతివుండటం గమనించింది.

"నీ స్టీమరు చాలా ముందుగానే వచ్చింది మరికొద్దిగా ఆలస్యమైతే నిన్ను కలుసుకోలేకపోయేదానిని."

"మీరునన్ను తీసుకువెళ్ళటానికి వచ్చారా?" అని కిటీ ఆశ్చర్యంగా అడిగింది.

"అవునవును, అందుకే."

"కాని, నేనువచ్చుచున్నట్లు మీకెలా తెలిసింది?"

"వెడింగ్టన్ వైరిచ్చాడు."

కిటీ ద్రవించింది. ఆమె కంఠం అవరుద్ధమైంది. ఆమె తన ముఖాన్ని రెండవవేపుకు తిప్పుకుంది. ఆమె ఏడ్వగోరటం లేదు. ఆమెకోరేది డొరొథి వెళ్ళిపోవాలనే. కాని డొరొథి

కిటీ చేయిపట్టుకునివుంది. కిటీ ఆ లజ్జాశీలమైన స్త్రీ యొక్క ఈ నటనతో సందిగ్ధంలోపడిపోయింది.

"నీవు హాంకాంగ్‌లో వున్నంతవరకు మాయింటిదగ్గర వుండాలనే నేనుకోరుతున్నాను."

కిటీ తనచేయి వదలించుకుంది.

" అది మీదయ, కాని నేనక్కడ వుండలేను."

"కాని నీవు మాదగ్గరేవుండాలి_అంత పెద్ద యింటిలో నీవు ఒంటరిగా ఎలావుండగలుగుతావు? నీవెంతకష్టపడతావు. నీవు మా ఇంటివద్ద వుండటానికి ఏర్పాట్లన్నీ చేశాను. నీకు ప్రత్యేకంగా ఒక గది వేరే వుంటుంది. నీ కిష్టమైతే మాతోనే భోజనం చేయవచ్చు, లేదా వేరే ఏర్పాట్లు చేయించవచ్చు నీవు మాతోవుండాలనే మా యిద్దరికీ చాలా కోర్కెగావుంది.

"నేను మా యింటివద్ద వుండదలచటం లేదు. నేను హాంకాంగ్ హోటలులో వుండ నిశ్చయించుకున్నాను. నేను మీకు బాధ కల్గించదలచటం లేదు."

కిటీ డొరొథి అభిప్రాయాన్ని విని అదరిపడినట్లయింది. చార్లీ కి ఏమాత్రం సభ్యత తెలిసినా తన భార్యాద్వారా తన యింటివద్ద వుండమని చెప్పించదని యోచించింది. ఆమె ఆయి ద్దరికి కృతజ్ఞురాలుగా వుండదలచటం లేదు.

"నేను నిన్ను హోటలులో వుండనివ్వను. నీవు హోట ల్లోకి వెళ్ళగానే అదంటేనే ముఖం మొత్తుతుంది. అక్కడ రక రకాల మనుష్యులుంటారు. రోజంతా అలసిపోయేంత సంగీతం వుంటుంది. నాతో వుంటానని చెప్పవూ. నేను గాని, చార్లీ

గానీ నీ కెటువంటి కష్టం కలుగనీయమని ఇదిగో మాటిస్తు న్నాను."

"ఇది మీ సహృదయత." కిటీ వెళ్ళదలచటం లేదు, కాని స్పష్టంకాదనీ అనలేక పోతుంది—ఆమె తప్పించుకొనే ఉపాయాన్నాలోచిస్తూ వుంది." ఈ స్థితిలో నేను అపరిచితు లతో కలసి వుండలేను," అంది.

"కాని మేము నీకు అపరిచితులం కాదుగా. మేము నీకు మిత్రులం కిటీ!" డొరొథి కంఠంలో కంపనం వుంది, కళ్ళల్లో కన్నీరు. "నీవు మావద్దనే వుండాలని నేను కోరేది. నేను పొరబాట్లను దిద్దుకో గోరుతున్నాను."

కిటీకి ఏమీ అర్థంకాలేదు. డొరొథి దిద్దుకోవలసిన పొర బాట్లేమి చేసిందాయని కిటీ ఆలోచిస్తూంది.

"నీవు మొదట నాకు బాగుండేదానివి గాదు;—నేను నిన్ను మంచి స్త్రీగానూ భావించలేదు—కాని నేను పాత కాలపు అభిప్రాయాలుగల స్త్రీని—పైగా మూర్ఖురాలను."

కిటీ పైపై దృష్టితో డొరిథని చూసింది, డొరొథి తనను మొదట అశ్లీలము, అపరి శుభ్రంగా ఎంచేదన్నమాట కాని కిటీ తన భావపరివర్తనను వ్యక్తం కానీయలేదు. లోలోపల ఆమె డొరొథినిచూసి నవ్వుకుంటుంది.

"కాని నీవు నీభర్తవెంట మృత్యుముఖంలోకి వెళ్లావని విన్నప్పుడు— ఆశ్చర్యంతో నోటివెంటమాటేరాలేదు. నా అభి ప్రాయాలపై నాకే కోపంవచ్చింది.— నాకు కల్గిన దుఃఖానికి అంతేలేదు. నీవు ప్రశంశాపాత్రురాలవు— వీరవనితవు. నీముందు

మావంటి స్త్రీలకు విలువేవుండదు.'' డొరొథి కళ్ళనిండా నీరునిండాయి. "నీయందు నాహృదయంలో ఎంతపూజ్యభావముందో వ్యక్తంచేయలేను. నీ ఆపదలో నేను నీకేమీ సహాయపడలేకపోయానుగాని నిజంగా నీ దుఃఖంలో నేనూచాలా దుఃఖిస్తున్నాను. నీకు సేవచేయడానికి నాకు కొద్దిఅవకాశం ఇచ్చినా నేను కృతజ్ఞురాలనై వుంటాను; నామూఢాభిప్రాయాలకు కోపగించుకోకు. కిటీ, నీవు పూజ్యురాలవు, మరినీముందు నేను ఒక అజ్ఞానురాలను,"

కిటీ డెక్ క్రిందికిచూస్తూంది. ఆమె తెల్లబోయింది, డొరొథినుంచి ఇంతపెద్ద అభిప్రాయాన్ని వింటానని తలచివుండలేదు. ఆమెపై డొరొథిమాటలప్రభావం పనిచేసింది—కాని ఇప్పటికీ డొరొథి మూఢాభిప్రాయాలనే కలిగివుందని కిటీ ఆలోచించింది.

"మీరింతగా మీతోవుండాలని వత్తిడి చేస్తున్నారు గనుక మీయింటివద్దనే వుంటాను.''

# 72

పట్టణంలో ఒక ఎత్తైనప్రదేశంలో చార్లీ నివాసస్థానం వుంది. అక్కడినుంచి సముద్రదృశ్యాన్ని చూడవచ్చు చార్లీ సాధారణంగా మధ్యాహ్నభోజనానికి ఇంటికిరాడు, కాని వచ్చినరోజున, ఒకవేళ కిటీ అతనిని కలుసుకొనదలచిన అతడు ఇంటికి రాగలడని డొరొథిచెప్పింది. ఒకపర్యాయం తానే లాగో చార్లీని కలుసుకొనవలసిందే కనుక వెంటనే ఎందుకు కలుసుకొనగూడదు అని కిటీ ఆలోచించింది. ఆమె ఎదుట

చార్లీ ఒకవిచిత్రమైన సందిగ్ధంలో పడతాడని ఆలోచించి ఆమె సంతోషించింది. చార్లీ ఏదైనాపని చేయవలసివస్తే చాలా అందంగా చేస్తాడనే విషయం కిటీకి తెలుసు. తాను ఇక్కడ వుండే విషయాన్ని గురించికూడా ఆమె ఈ విధంగానే ఆలోచించింది. తాను చార్లీని కలుసుకున్న ఆఖరుపర్యాయం చార్లీ మనస్సులో ఒకగాయమై వుంటుందని, దాని కతడేమీ చికిత్స చేసుకొనగలిగి వుండడని ఆమె ఆలోచిస్తూంది. చార్లీనిగురించి తానెంత బాధపడిందో, అతనికికూడా తానంతబాధ కలిగించింది. ఇప్పుడిక చార్లీ తనను ద్వేషిస్తూవుంటాడని యోచించింది. తానుగానే అతనిని ద్వేషించనందుకు ఆమెకు సంతోషం కల్గింది. ఆఖరురోజున తాను చార్లీ ఆఫీసునుంచి వచ్చివేసినప్పుడు ఇకచార్లీ ఎన్నడూ తనవంక కన్నెత్తిచూడడని భావించింది.

కిటీ, డొరొథీతో కూర్చుని చార్లీరాకకు నిరీక్షిస్తూ వుంది. అలంకృతమైన అతిథులగదిలో కూర్చుని చార్లీకై నిరీక్షించటం ఆమెకు బాగావుంది. గదిలో పుష్పాలలంకరించబడి వున్నాయి– గోడలపై అందమైన చిత్రాలున్నాయి– గది తగినంతచల్లగావుంది– ఆమెకక్కడ అపరిచితంగా కన్పించటం లేదు. ఆమెకు మీ–తాన్–ఫూలోని మిషనరీయొక్క ఖాళీ బంగళాగుర్తుకొచ్చింది. అక్కడి కుర్చీలు విరిగిపోయినవీ, పాతవిన్నీ. అక్కడిభోజనం వాసనవేసేది– ద్వారాలకు ఎర్రని మురికితెరలుండేవి. ఎంతకష్టంగా వుండేదక్కడ! డొరొథీ అక్కడివిషయాన్నే వూహించుకోలేదు.

ఇద్దరూ బంగళాలోకి వస్తూవున్న కారుధ్వనివిన్నారు. అప్పుడే చార్లీ గదిలోప్రవేశించాడు.

"నేను ఆలస్యం చేయలేదుగదా? నా కారణంగా ఎక్కువ నిరీక్షించాల్సిరాలేదుగదా. గవర్నరును కల్సుకోవలసి వచ్చినందున నేను త్వరగా రాలేకపోయాను."

అతడు కిటీవద్దకువెళ్లి ఆమె రెండు చేతుల్ని తనచేతుల్లోకి తీసుకున్నాడు.

"మీరిక్కడకు రావటం నేను చాలాసంతసించాను. డొరొథి మీకు చెప్పివుంటుందనే నా అభిప్రాయం— మీరు హాంకాంగ్‌లో వున్నంతకాలం ఇక్కడేవుండాలి, ఇది మీ యిల్లుగానే భావించండి. ఇదే నేనూ మీతో చెప్పగోరేది. నేను మీకేమైనా సేవచేయగలిగితే నా అదృష్టంగా భావిస్తాను." చార్లీ కన్నుల్లో నిజాయితీ తొంగిచూస్తూంది. తన కన్నుల్లోని పరిహాసాన్ని చార్లీ గ్రహించలేదుగదాయని ఆలోచించింది. "నాకెక్కువ సంభాషించటంరాదు, అజ్ఞానుల వలె మాట్లాడేదీలేదు; కాని ఒక్కవిషయం మాత్రం తప్పక చెప్ప దలచాను. మీ భర్త మరణానికి నాకు చాలా దుఃఖంకల్గింది. ఆయన చాలా సజ్జనుడు— ఇక్కడ ఆయనలేని వెలితి బాధిస్తూనే వుంటుంది."

"చార్లీ అదంతా చెప్పవద్దు— కిటీకి అంతా తెలుసు. ......ఇదిగో, మద్యం వచ్చింది."

చైనాలో విదేశీ ఆఫీసర్ల ఆచారంప్రకారం ఇద్దరు సేవకులు మద్యాన్ని తీసుకొని గదిలోకివచ్చారు. కిటీ నిరాకరించింది.

చార్లీ తన సహజ చాతుర్యభావంతో అన్నాడు—"ఒకటి, తప్పక త్రాగవల్సిందే. ఇది లాభమే కల్గిస్తుంది; ఇటువంటి మద్యం మీరు హాంకాంగ్ వదలిన తరువాత ఎక్కడా లభించగలుగుతుంది. నా ఉద్దేశ్యంలో మీకు మీ-తాన్-ఫూలో ఐస్ దొరకటంకూడా దుర్లభమై వుంటుంది."

"మీ అభిప్రాయం తప్పుగాదు," అంది కిటీ.

ఒక క్షణం ఆమెదృష్టిలో ఆ భిక్షుకుని శవం కదిలింది. —చినిగిన పాత పీలికల్లోనుంచి ముడుతలు దీరిన ఆతడి శరీరం తొంగిచూడటం, ద్వారంలో కన్పించిన దృశ్యమంతాను.

అందరూ భోజనం ప్రారంభించారు. చార్లీ బల్ల మొదట్లో కూర్చున్నాడు. అతడే సంభాషణ ప్రారంభించాడు. సానుభూతి క్షణాలు గడచిపోయాయి; కిటీ షాంగై నుంచి ఎపెండిసైటిస్ ఆపరేషన్ చేయించుకుని ఇక్కడ ఆరోగ్యం బాగుచేసుకుంటానికి వచ్చిందేగాని మరేమీ నష్టం లేదనిపించినట్లుంది చార్లీకి కిటీ రాక. ఆమెకు ఉత్సాహం కొంత అవసరం, ఆబాధ్యత చార్లీ స్వయంగా వహించాడు. ఈ స్థలం అపరిచితం కాదనే భావం కిటీకి కలిగించాలంటే ఇం[illegible]ని మనుష్యులవలెనే వ్యవహరించటం చాలా అవసరం. చార్లీ రేసుల్ని గురించి, పోలో ఆటను గురించి చర్చనారంభించాడు. నేను నాబరువు తగ్గించుకోకపోతే పోలో ఆడటమే మానెయ్యాల్సి వస్తుందని చెప్పాడు. అతడారోజు ఉదయం గవర్నరును కలుసుకుంటానికి వెళ్ళినప్పుడు ఒక శాలికాధ్యక్షుని ఓడమీద విందులో పాల్గొన్నాడు. చార్లీ మాటలు బాగానే పని చేశాయి, తాను ఒక వారం రోజులు మాత్రమే ఎక్క—

డికో వెళ్ళి తిరిగివచ్చినట్లనిపించింది కిటీకి రెండవ ప్రక్క ఆరు వందల మైళ్ళదూరాన స్త్రీలు-పురుషులు బిడ్డలు కీటకముల వలె చని పోతున్నారు. కిటీ హాంకాంగ్‌లోని తన పరిచయస్తులను గురించి అడగ నారంభించింది చార్లీ జవాబుగా నవ్వుతూ పరిహాసాలాడేవాడు, కిటీ ఎంతో సంతోషపడేది. డొరొథి గృహ యజమానురాలివలె మౌనంగా కూర్చొని వింటూ వుంది. కిటీ చైతన్యం పొందుతూన్నట్లుగా వుంది.

"చూడు, కిటీ మొదటి కంటే ఇప్పుడు బాగైంది. భోజనానికి ముందు ఎంత వెలవెలబోతూంది, అది చూసే నేను చాలా వ్యాకుల పడ్డాను." అని చార్లీ తన భార్యతో అన్నాడు.

కిటీ చార్లీతో మాట్లాడుతూన్నప్పుడు అతనిని దృష్టి వుంచి గమనిస్తూనేవుంది. మీ-తాన్-ఫూలో ఆమె క్రోధంలో చార్లీని తనవూహాల్లో వేరొకవిధంగా చిత్రించుకుంది- అతడి జుట్టుపొడవు, వుంగరాలు తిరిగివుంటుంది. తననెరసిన వెంట్రుకలను దాచుకుంటానని కతడు ఎక్కువ నూనెరాసుకుంటాడు, చాలా జాగ్రత్తగా బ్రెష్ చేస్తాడు. అతడిముఖం ఎర్రగావుంటుంది, ముఖంలోని నరాలు ఉబ్బుగావుంటాయి- దవడలు పెద్దవి- తలవంగివుంటుంది, అప్పుడు రెండుగడ్డాలుకన్పిస్తాయి; అతడి ప్రవర్తన చాలా వికృతంగావుంటుంది- ఎప్పుడూ తన భోజనం పై ఎక్కువ శ్రద్ధచూయిస్తాడు, వ్యాయామంకూడా చేస్తాడు. కీళ్ళపైన మాంసం మందంగావుంటుంది- మధ్యవయస్కుడు. తనవయస్సు తక్కువని చూయించుకోడానికి మంచి

మంచి దుస్తులు వేస్తాడు. అతడి కనుబొమలు దట్టంగావుండటం వలన కోతివలెవుంటాడు.

కాని చార్లీ గదిలోనికి ప్రవేశించినప్పుడు కిటీ తనవ్యూహాలకు విరుద్ధంగా చార్లీ కన్పించాడు. ఆమె వ్యూహాకు దెబ్బతగిలింది. అందుకే అప్పుడామె ముఖంలో కళలేకుండాపోయింది. ఆమె వ్యూహ ఆమెనుమోసగించింది. చార్లీ ఆమెవ్యూహాకు పూర్తి విరుద్ధంగావున్నాడు. కిటీకి తనమీాద తనకేన వ్వొచ్చింది. చార్లీ జుత్తు తెల్లగాలేదు; కాని కణతలపై రెండు మూాడు వెంట్రుకలు నెరసినా అవి చాలా అందంగానేవున్నాయి. అతడిముఖం ఎఱ్ఱగాలేదు, తలచాలా అందంగావుంది. అతడు లావుగానూలేడు, మధ్యవయస్కుడుగా కన్పించడు. నిజానికతడు సరిపడిన శరీరంగలమనిషి. అంతాకలసి అతడి శరీరం చాలా ఆకర్షణగా వుంటుంది. తన శరీరనిర్మాణానికి చార్లీకి గర్వంవుంటే అదిఅతని దోష మేముంది? దుస్తులేవిధమైనవి ధరించాలో అతనికితెలుసు— అతడు పరిశుభ్రంగా వుంటాడు. ఇంతకూ తాను ఇంతవిరుద్ధంగా ఎందుకు ఆలోచించిందో కిటీకి బోధపడలేదు. చార్లీ అందమైన పురుషుడు, చార్లీలోని నిజాయితీ అదృష్టవశాత్తు ఆమెకు తెలుసు. చార్లీ కంఠంలో ఇతరుల్ని ఆకర్షించేశక్తి వుందని ఆమెకు తెలుసు. అతడి సంభాషణలో నిజాయితీ వుండదని ఆమెగ్రహించింది; కాని తాను అతని వలలో ఎందుకు చిక్కుకుందో ఆమెకు అర్థంకాలేదు. చార్లీ కన్నులు అందంగావుంటాయి. వాటిల్లోనే అతడి వ్యక్తిత్వమంతటి ఆకర్షణనిహితమై వున్నట్లుంటుంది. ఆ కన్నుల్లో లేతనీలిరంగుఛాయవుంటుంది, అది స్పష్టంగా మెరు

స్తుంది. అతడు మాట్లాడితే ఆమాటలకు ఆకర్షింపబడకుండా వుండలేరు.

చివరకు కాఫీ వచ్చింది. చార్లీ తన చుట్ట వెలిగించు కున్నాడు, తరువాత వాచీచూచుకొని లేచినిలబడ్డాడు.

"ఇక మీ స్నేహితులిద్దరూ మాట్లాడుకొండి— నేను ఆఫీసుకు వెళ్ళవలసిన సమయమైంది." అని అతడు ఒకక్షణ మాగి కిటీవంక స్నిగ్ధదృష్టితో చూస్తూ— "నేనిక రెండుమూడు రోజులవరకు మీకు ఆందోళనకలిగించను, మీ రప్పటివరకు విశ్రాంతితీసుకొనండి; ఆ తరువాత నేను మీతో ఒక అవసర విషయాన్ని గురించి కొద్దిగా మాట్లాడాలి." అన్నాడు.

"నాతోనా?"

"అవును, మీఇల్లు, పర్నీచరు అవన్నీ చూడాలి."

"అదా, కాని ఆవిషయంలో నేనేవకీలువద్దకైనా వెళ్ళ వచ్చు— మీ కెందుకా శ్రమ."

"ఈ కోర్టు వ్యవహారాలన్నింటికి మిమ్మల్ని తిరగనిస్తా నని అనుకోవద్దు. ఆ ఏర్పాట్లన్నీ నేనేచూస్తాను. మీకు పెన్షన్ పొందే హక్కు వుందని మీకు తెలుసా? ఈవిషయంలో నేను గవర్నరుతో కూడా మాట్లాడుతాను— ఏదైనా వ్యవ హారం జరిపితే మీకు వేరుగా డబ్బు లభించగలుగుతుందో లేదో తెలుసుకుంటాను. మీరవన్నీ నాపై వదిలేయండి. వీట న్నిటికోసం ఇప్పుడే వెంటనే ఆందోళన అనవసరం. అన్నిటి కంటేముందు మీ ఆరోగ్యం బాగుపడాలనే మాకోర్కె. ఏం డొరొథీ! నేను చెప్పింది బాగుందికదూ?"

"అంతా బాగుంది."

చార్లీ కిటీ ముందు తలవంచి అభివందనం తెలియపర్చాడు, తన భార్యాముందునుంచి వస్తూ కిటీచేతిని ముద్దుపెట్టుకున్నాడు. స్త్రీలచేతుల్ని ముద్దు పెట్టుకోవటంకూడా చాతరాని అజ్ఞానులు ఇంగ్లీషువారిలో చాలామంది వున్నారు; కాని చార్లీ మాత్రం చాలా నేర్పుతో చక్కగా నెరవేర్చాడా పనిని.

# 73

ఇంకా కిటీ టవున్సెండ్ ఇంటివద్ద నిలదొక్కుకోనైనా లేదు. అప్పుడే అలసిపోయినట్లుగా వుండేది. ఇక్కడి సుఖసౌకర్యాలు ఇప్పటి వరకు వున్న తన జీవితంనుంచి సంబంధం విడగొట్టాయనిపిస్తుంది, ఆమె సుఖజీవితాన్ని మర్చిపోయింది—అందమైన వాతావరణం కొరకు ఆమె పరితపించింది—ఇక్కడ ఆమె ప్రతి చిన్న విషయంలోనూ శ్రద్ధచూపబడుతూంది. తాను ప్రస్తుతం సానుభూతి పొందదగివున్నదనే అభిప్రాయం ఆమెకు చెడుగా కన్పించ లేదు. ఆమె భర్త చనిపోయి చాలా స్వల్పకాలమేకావటం వలన ఆమె ఇంకా వినోదించ లేక పోతుంది—అయినా వలసలోని ఉన్నత కుటుంబాల స్త్రీలు—గవర్నరుగారి భార్య, నావిక సైన్యాధ్యక్షుడు, చీఫ్ జస్టిస్ మొదలైన వారి భార్యలు ఆమె దగ్గరకు వచ్చేవారు. గవర్నరు ఆమెను కలుసుకోవాలని చాలా వాంఛిస్తున్నారని వారి భార్య కిటీతో చెప్పింది—ఏదో ఒక రోజు మధ్యాహ్న భోజనానికి రావల్సిందిగా ఆహ్వానించే వెళ్ళింది. ఆమె ఒక

విలువైన పింగాణీ బొమ్మల్నట్లుగా ఆస్త్రీలందరూ కిటీయందు ఎంతో శ్రద్ధ కనబరచేవారు. ఆగంతకీ స్త్రీలు తననొక నాయి కగా ఎంచుతున్నట్లు కిటీ భావించింది. తానుకూడా ఎంత అందంగా, నమ్రతగా అభినయిస్తుంది. ఒక వేళ ఇక్కడ బెడింగ్‌టన్ వుండివుంటే ఆ నేర్పరికూడా ఇదంతా గమనించే వాడు, అప్పుడు ఇద్దరూ ఎంతో నవ్వేవాళ్ళం అని ఆలోచిం చేది. డొరొాధికి బెడింగ్‌టన్ నుంచి ఉత్తరం వచ్చింది; అందులో అతడు కాన్వెంటులో కిటీ దృఢ చిత్తంతో పనిచే సిన విషయాన్ని వివరించాడు. కిటీ ధైర్యాన్ని, ఆత్మనిగ్ర హాన్ని ఎంతో ప్రశంశించాడు. అతడు నిగ్రహించి నిగ్రహించి అందరిని మూర్ఖుల్ని చేస్తూవున్నాడు—మురికి కుక్క.

# 74

ఇంత వరకు చార్లీ పరిస్థితులవలన తనను ఏకాంతంగా కలుసుకొనడము లేదో లేక తెలిసే కలుసుకొనటం లేదో ఎంత ప్రయత్నించినా ఆమె కర్థం కావటం లేదు. అతడి ప్రతి పని విలక్షణంగానే వుంది. ఆతడి ప్రవర్తన పెద్దమనిషి తరహా గానూ, సానుభూతి పూర్వకంగానూ, ఆకర్షణంగానూ వుంది. అతడి ఆచరణనుచూసి, కిటీకి అతనికి పరిచయం మినహా మరే దైనా ఇతర సంబంధముందనేది చెప్పనే లేరు. ఒక రోజు మూడవ జామున ఆమె గది బయటవున్న సోఫాలో పడుకుని ఏదోపుస్తకం చదువుకుంటూవున్న సమయంలో చార్లీ అటు నుంచి వెళ్తూ వెళ్తూ అక్కడ ఆగిపోయాడు.

"ఏమి చదువు తున్నావ్?" అని చార్లీ అడిగాడు.

"పుస్తకం."

కిటీ కన్నుల్లో పరిహాసముంది. చార్లీ దరహాసంచేశాడు.

"డొరొథి గవర్నమెంటు హౌసులో విందుకు వెళ్ళింది."

"నాకు తెలుసు, నీవెందుకు వెళ్ళలేదు?"

"నాకక్కడకు వెళ్ళటం మంచిదనిపించలేదు– ఇక్కడ వుండి నీకేమైనా కాలక్షేపం కలిగిద్దామనుకున్నాను. కారు నిలబడివుంది– నీకిష్టమైతే షికారుకు వెళ్ళాం."

"ధన్యవాదాలు! వద్దు."

చార్లీ ఆ సోఫాలోనే కూర్చున్నాడు.

"నీవిక్కడకు వచ్చినప్పటినుంచి నీతో మాట్లాడటానికి అవకాశమే లభించలేదు."

బేధించినట్లుగా కిటీ ఆతడికన్నుల్లోకి చూస్తూంది.

"ఇంకామనం మాట్లాడాల్సింది మిగిలివుందా?"

"పుస్తకాలు నిండేంతగా వుంది."

అతనికి తగుల్తుందేమోనని కిటీ కాళ్లు ముడుచుకుంది.

"నీవింకా నామీద కోపంగానే వున్నావా?" చిరునవ్వుతో చార్లీ అడిగాడు.

"లేదే?" అని కిటీ నవ్వేసింది.

"నీకు కోపం లేకపోతే ఈవిధంగా నవ్వవు."

"ఇది నీపొరబాటు. నీకునీవిచారమేలేదు, కోపంవరకూ వెళ్లావు."

చార్లీ చలించలేదు.

"ఇది నీ నిర్ణయే, ఒకసారిగతంలోకి తిరిగిచూడు, నేను చేసింది ఉచితంగాదా?"

"అవును నీదృష్టితో."

"ఇప్పుడు నీవు డొరొథిని పరిశీలించావు. ఇక చెప్పు, ఆమె మంచిదిగాదా?

"అవును, ఆమె సహృదయతకు నేనెప్పుడూ కృతజ్ఞురాలనై వుంటాను."

"ఆమెవేలల్లోఒకతె. మేమిద్దరమే విడిపోయివుంటే జీవితం దుర్భరమైవుండేది, సారహీనమైపోయేది. పైగా ఆమె వద్ద ఎత్తులువేయటంకూడా సబబెగాదు. ఇంతేగాక నాకు నాబిడ్డలయందుకూడా దృష్టివుంది. వారెంత కష్టపడతారు,"

క్షణకాలం కిటీ స్తంభించిపోయినట్లు చార్లీ వంకచూస్తూ వుండిపోయింది. ఇప్పుడు తనను తాను నిగ్రహించుకుంది.

"నేను ఈవారంనుంచి నీ ఆచరణగమనించాను. నీవు డొరొథిని కోరుతున్నావనే నేనర్థంచేసుకుంటున్నాను."

"ఆమెను కోరుతున్నానని నీతో నేనుకూడాచెప్పే వున్నాను. నేనామెకు ఏవిధమైన అసౌకర్యము కలిగించదలచటంలేదు, ఆమె చాలా మంచిభార్య."

"నీవామె విశ్వాసాన్ని పోగొట్టుకోగూడదనికూడా నీవెప్పుడైనా ఆలోచించావా?"

"సాధారణంగా కన్నుచూడని వస్తువును హృదయం కూడా చూడదు," అని చార్లీనవ్వాడు.

"నీకు అమర్యాద జరగాలి."

"నేను మనిషిని. నీవెందుకు నన్ను చెడుఅంటున్నావో నాకు తెలియటంలేదు. నేను హృదయపూర్వకంగా నిన్ను కోరుతున్నాను."

ఈ మాటకు కిటీ పులకించింది. వాద్యకర్త వాయించు టకు ముందు దాని తంత్రుల్ని బిగించినట్లనిపించిందామెకు.

"అవును, నేను నీ వేటవస్తువునుగదూ?" అని కటువు గానే అంది.

"మనకిన్ని చిక్కులు తటస్థపడతాయని నేనెలా ఆలో చిస్తాను?"

"ఒకవేళ అనుభవించాల్సి వచ్చినా అది నీవుకాదనే నీ విశ్వాసం."

"నీవు అవసరాన్ని మించి కాఠిన్యం వహిస్తున్నావు. నేను ఇద్దరి మేలు కలిగే పనిచేశాను. నీవప్పుడు ఓర్పునే కోల్పోయావు. నేనప్పుడు నీమాట వినివుంటే దాని పరిణామం బాగుంటుందనే నీవాలోచిస్తున్నావా? మన జీవితం చాలా కష్టమైపోయేది — భారమైపోయేది గాదా? నీకు అందులో ఏమీ హాని కలుగలేదు. మనమిప్పుడు మొదటివలె మిత్రులుగా ఎందుకుండగూడదు?"

కిటీ నవ్వింది.

"నన్ను మృత్యు ముఖంలోకి విసరేసింది నీవేననే విష యాన్ని నేను మర్చి పోయాననుకుంటున్నావా?"

"ఇది వ్యర్థ విషయం కొంచెం జాగ్రత్తగా వ్యవరించు కుంటే అక్కడేమీ భయంవుండదని నేను నీతో చెప్పనే చెప్పాను. ఏమీ ఆలోచించకుండానే నిన్నక్కడకు పంపానని నీవనుకుంటున్నావా?"

"నీ వంతా తెలుసుకున్నావు, నీవు నన్ను పంపివేయ గోరావు. నీవు మొదటి తరగతి స్వార్థపరుల్లోని వాడవు."

"సరే, మనిషిని పరిశీలించే ఏదైనా చెప్పవచ్చు. నీ విప్పుడు తిరిగి వచ్చావు, నేనన్నమాటను నీవు చెడుగా భావించకపోతే ఒక విషయం చెప్తాను, నీవు మొదటి కంటే అందంగా తిరిగి వచ్చావు."

"మరి వాల్టర్?"

చార్లీ నోటిపైకివచ్చిన జవాబును ఆపుకోలేక, "నీకు నల్లని దుస్తులు ఎంతందమిస్తాయో మరేవీ అంతగావుండవు." అని అన్నాడు.

ఒక క్షణం కిటీ చార్లీ వంకచూసి ఏడ్వసాగింది. ఈ మాట విని ఆమెకు దుఃఖం కల్గింది.

"దయయుంచి ఏడ్వబోకు నేను నీకు బాధ కల్గించాలని అనలేదు. ఏదో పరిహాసంగా అన్నాను. నీ దుఃఖం వలన నేనెంత బాధపడ్తున్నానో నీకు తెలుసా?"

"దుర్మార్గుడా! నోరు మూసుకో!"

"నా ప్రయత్నం దేనివల్లనైనా వాల్టర్ తిరిగి రాగలిగితే అందుకు నేను సిద్ధంగా వున్నాను."

"సీ, నామూలకంగానే అతడు మరణించాడు. చార్లీ కిటీ చేయిపట్టుకున్నాడు, కాని ఆమె వదిలించుకొంది.

ఏడుస్తూ అంది, "ఇక్కడనుంచి వెళ్లిపో. అదే నీవు చేసే పెద్ద ఉపకారం, నీవంటే నాకు ద్వేషం, అసహ్యం, నీలాంటి పదిమందికూడా వాల్టర్‌కు సరిరారు. నేను మొదట తెలుసుకోలేక పోయాను, నా అజ్ఞానం, వెళ్లు—వెళ్లిపో."

చార్లీ ఇంకాఏదో మాట్లాడయత్నించటం గమనించి కిటీ వెంటనే సోఫాలోనుంచి దుమికి తనగదిలోనికి వెళ్ళిపోయింది. చార్లీ ఆమె వెనుకనేవెళ్లాడు. గదిలో ప్రవేశించగానే చార్లీ కిటికీ మూసివేశాడు. గదంతా అంధకారమైంది.

కిటీని కౌగిలిలోకి తీసుకుంటూ, "నేనీస్థితిలో నిన్నొదలలేను. నేనునీకు కష్టం కలిగించదలచటంలేదు," అన్నాడు.

"నన్ను ముట్టుకోవద్దు— తాకకునన్ను— దయయుంచి వెళ్ళిపో."

"డార్లింగ్! నేనెప్పుడూ నిన్ను ప్రేమించాను; ఇంకా ఇప్పుడు మొదటికంటే ఎక్కువగా కోరుతున్నాను."

"నీవింతఅబద్ధాలెలా ఆడతావు, నన్నువదలు, వెళ్ళనివ్వునన్ను."

"అంతనిర్దయగావుండకు కిటీ, నీయెడ నేను సరిగా వ్యవహరించలేకపోయినందుకు నన్ను క్షమించు."

కిటీ ఏడుస్తూవుంది— కంపిస్తూవుంది. ఆమె చార్లీ బాహువుల్నించి వదిలించుకోడానికి యత్నిస్తుంది. దానితో

పాటు ఆ బిగి కౌగిలింత ఆమెకు సౌఖ్యంగానూవుంది. ఎప్పటి నుంచో ఒక్కసారి ఆ బాహువుల్లో బంధించబడాలనే ఆశ తోనూవుంది. ఆమెశరీరమంతా కంపించిపోతుంది. తానుచాల్లా బలహీనంగా వున్నట్లు భావిస్తుంది. తన ఎముకలు కరిగిపోతు న్నట్లనిపించసాగింది. వాల్టర్ యందు దుఃఖానికి బదులు తన యందే జాలిగలుగసాగింది.

ఏడుస్తూ నేఅంది— "నీవు నాయందంత నిర్దయగా ఎం దుకు వ్యవహరించావు? నేను నీకు అర్పితమైపోయానని నీకు తెలియలేదా?"

"డార్లింగ్!"

చార్లీ ఆమెను ముద్దులతో నింపేశాడు. ఆమె అరచింది "వద్దు వద్దు."

చార్లీ ఆమె ముఖాన్ని పొందాలనుకున్నాడు, కాని ఆమెముఖాన్ని ఇంకోవేపుకు తిప్పకుంది— అతడామె పెదవుల్ని పొందాడు. చార్లీ కష్టంగా మాట్లాడుతున్నాడు. ఉద్వేగం వలన అతడిమాటలు స్పష్టంగాలేవు, అతడు కిటీని తన బాహు వుల్లో బంధించుకున్నాడు. తప్పిపోయిన పిల్లవాడు తిరిగి ఇంటికి వచ్చినట్లనిపించింది కిటీకి. ఆమె నెమ్మదిగా మూల్గింది. ఆమె కన్నులు మూతబడ్డాయి— చెక్కిళ్లు కన్నీటితో తడసిపోయాయి. ఆమెపెదవులపై చార్లీపెదవులున్నాయి. తనశరీరంలో బంగారు కాంతి మేల్కొన్నట్లుగావుంది కిటీకి. తనస్వప్నాల్లో ఆమె ఈ దృశ్యాన్ని అనేకపర్యాయాలుచూసింది. ఇప్పుడతడు తననేమి కోరుతున్నాడు? ఇప్పుడు కిటీ స్త్రీగాదు కిటీ స్థానంలో సాకా రేచ్ఛ తలెత్తింది. చార్లీ ఆమెను ఒడిలోనికి ఎత్తుకున్నాడు.

ఆమె ఎంత తేలికగావుంది. మరుక్షణంలో తల తలగడపై వుంది, మరి......

# 75

ముఖాన్ని చేతుల్లో దాచుకుని కిటీ మంచంమీద ఒక మూలగా కూర్చుని వుంది.

"మంచి నీరు త్రాగుతావా?"

కిటి తలవూపి సమ్మతి తెల్పింది. చార్లీ గ్లాసునింపి కిటీ కిచ్చాడు.

కొంచెం నీరు త్రాగితే మనస్సు కుదుటపడింది."

చార్లీ గ్లాసును కిటీ పెదవుల కందించాడు. కిటీ భీతి జెందినట్లు అదే పనిగా చార్లీవంక చూస్తుంది. చార్లీ ఆమె సమీపంలోనే ఎదురుగా నిలబడివున్నాడు. ఆతని కనుల్లో ఆత్మ సంతృప్తి గోచరిస్తుంది.

నేనేమైనా చెడ్డపని చేశానని నీవనుకుంటున్నావా?"

కిటీ రెప్పలు వాలి పోయాయి.

"అవును నేను మాత్రం నీకంటే మంచేముంది? నీవు కృతఘ్నుడవు. సరే ఇక్కడనుంచి ఇక వెళ్ళిపో."

"నిజానికి నేనిక వెళ్లాలికూడా నేను డొరొథి రాక పూర్వమే వెళ్లిపోవాలను కుంటున్నాను."

చార్లీ గదినుంచి వెళ్లిపోయాడు.

కిటీ కొంతసేపటి వరకు అలాగే కూర్చుని వుంది. ఆమె మనస్సంతా శూన్యంగా వుంది. ఆమె లేచి డ్రెస్సింగ్ టేబిలు ముందున్న కుర్చీలో కూర్చుంది. ఆమె అద్దంలో 'తన ఆకారాన్ని చూచుకుంటుంటే, ఆమె కన్నులు ఏడ్చి ఏడ్చి ఉబ్బిపోయాయి. ఆమె ముఖంలో కన్నీటి మచ్చలు పడ్డాయి—ఒక చెక్కిలి ఇంత వరకు ఎర్రగావుంది. ఆమె అప్పుడు తనకే భయపడుతుంది.

"ఛీ కుక్కా!" అంది.

చేతులపై తల ఆన్చుకుని వెక్కి వెక్కి ఏడ్వసాగింది. ఇంతకూ తనకేమి వచ్చిందాయని ఆలోచించసాగింది. ఎంత ద్వేషించదగినది. ఆమెకు చార్లీయందు ద్వేషం కలుగుతూంది—తనయందూ ద్వేషం కలుగుతూంది. ఇంకెన్నడూ ఆమె చార్లీని చూడదలచటం లేదు.

చార్లీ తనను వివాహమాడక పోవటం ఉచితమే అయింది. తాను పూర్తిగా వ్యర్థమైన స్త్రీ. కడుపుకోసం అమ్ముడుపోయే స్త్రీలకంటెకూడా తాను నికృష్టురాలు. ఆపద సమయంలో డొరొథి తనను నిలిపిన ఈ యింటిలో తాను పతనమైపోయింది. అంతా అయిపోయింది. తానికి పూర్వపు కిటీ కాదని తలంచింది—తాను తనను శక్తిగాలిగా ఎంచ సాగింది—తాను సన్మానితస్త్రీగా హాంగ్ కాంగ్‌కు తిరిగి వచ్చింది—తన ఆలోచనలో జీవితంయెడ నూత్నాను రాగం ఉత్పన్నమైంది. ఆమె తన భవిష్యత్తును ఉజ్వలంగా చేసుకోవాలని కాంక్షించింది. తన మార్గాని అందంగా నిర్మాణం చేసుకో గలుగుటకు తనకు స్వతంత్రం లభించింది. తన ఎదుట

ప్రపంచ మొక ప్రశస్తమైన బాట, దానిపై తాను సగర్వంగా నడవ గలుగుతుంది. ఇచ్ఛాశక్తిని జయించానని ఆమె తలచింది—తాను స్వతంత్రురాలయింది, ఇక తాను పరిశుద్ధమైన జీవితాన్ని గడుపుకో దలుచుతుంది—కాని తాను దాసీకంటే హీనమైనది. బలహీనురాలు—బలహీనం తప్ప మరేమీ గాదు—తన స్థితి హేయమైనది.

కిటీ రాత్రి భోజనానకి వెళ్ళలేదు. తనకు తలనొప్పిగా వుందనీ, గదిలోనే విశ్రాంతి తీసుకుంటానని నౌకరుతో చెప్పి పంపింది. డొరొథి ఆమె నద్దకు వచ్చింది. ఆమె ఎర్రబడిన కిటీ ముఖాన్ని చూపింది—ఉబ్బిపోయిన కళ్ళను చూసింది. ఆమె కిటీని ఓదార్చ యత్నించింది. నేను వాల్టర్ కోసం ఏడుస్తున్నాననే నమ్మకంతోనే డొరొథి సానుభూతి చూపుస్తుందని కిటీ ఆలోచించింది.

“నాకు తెలుసు కిటీ, ఇది ఎంత ఆపద! ధైర్యం పోగొట్టుకోకు. నీవు దుఃఖపడటంచూసి నీ భర్త ఆత్మశాంతంగా వుండ లేదు.

# 76

మరునాడుదయం తానేదో పనివలన బయటకు వెళ్ళున్నట్లు కిటీ డొరొథికి వుత్తరంవ్రాసింది—బయటకువచ్చి ట్రాము ఎక్కింది మోటార్లు, బళ్ళతో క్రిక్కిరిసిన రోడ్డుగుండా ట్రాము వెళ్తూవుంది. చైనీయులు, తదితరులు తమతమ అఫీసులకు వెళ్తున్నారు. ఒకఓడ రెండురోజుల్లో వెళ్ళనుంది. తాను దానిలోనే వెళ్ళిపోవాలని ఆమె నిశ్చయించుకుంది. ఓడలో

చోటులేదని గుమాస్తా చెప్పినప్పుడు ఆమె తిన్నగా కంపెనీ చీఫ్ ఏజంటువద్దకు వెళ్ళింది. చీఫ్ఏజంటుకు ఆమె పరిస్థితి తెలుసు. అతడుయాత్రికుల లిష్టు తెప్పించిచూశాడు.

"నేను త్వరగావెళ్ళటానికి సహాయపడతారని నా ప్రార్థన," అందికిటీ.

"మిసెస్ సేన్! ఈ నలసమొత్తంలో మీకు సహాయ పడగోరనివారంటూ ఎవరూవుండరు."

అతడొక గుమాస్తాను పిలిచి అవసరమైన విషయాన్ని తెలుసుకున్నాడు.

"నేను ఒకరిద్దరిపేర్లు తొలగిస్తున్నాను. మీరు త్వరగా వెళ్ళే ఏర్పాట్లుచేసి సహాయపడాల్సిందే. నేను మీకొక చిన్న కేబిన్ ఇవ్వగలను, అదిమీకు సరిపోతుందనే నా వుద్దేశ్యం."

కిటీ నమస్కారంచేసి సంతోషంగా తిరిగివచ్చింది. పారిపో, ఇదే ఆలోచన మాటిమాటికి కలుగుతుంది–వెళ్ళు–త్వరగావెళ్ళు. ఆమెవెంటనే తాను వస్తున్నట్లు తండ్రికి వైరిచ్చింది. వాల్టర్ మరణం విషయం వైర్ద్వారా అంతకుముందే తెలియపర్చివుంది. ఆమె తిరిగి చార్లీ యింటికి వచ్చి డొరొథికి తన కర్తవ్యనిర్వహణను తెలియజేసింది.

"నీవు వెళ్ళటం మాకు చాలా బాధకలిగిస్తుంది– కాని గత్యంతరంలేదు, నీవు నీతల్లిదండ్రుల వద్దకు వెళ్ళగోరుతున్నావనే ఏభావాన్ని తెలుసుకుంటున్నాను." అంది డొరొథి.

హాంకాంగ్ వచ్చినతరువాత కిటీకి తనయింటిలో అడుగు పెట్టాలనిపించలేదు. అక్కడకు వెళ్ళి పాతస్మృతుల్లో మునిగి

పోతానని భయపడుతుంది. కాని ఇప్పుడిక గత్యంతరంలేదు. చార్లీ పర్నిచరు అమ్మేఏర్పాటుచేశాడు— కొనేవాళ్లు లభించారు— పైగా అవిగాక ఇంటిలో వాల్టర్ దుస్తులు చాలా పడివున్నాయి. వారు మి-తాన్-ఫ్లూ ఎక్కువ సామాను తీసుకు వెళ్ళలేదు. ఇంట్లో పుస్తకాలున్నాయి— చిత్రాలున్నాయి— చాలా సామానువుంది. కిటీ ప్రతివస్తువుయందు విముఖంగానేవుంది. —కాని ఆమె ఆ వస్తువులన్నింటిని వేలం వేసి జనంమనస్సుల్లో సందేహం కల్గించదలచలేదు. ఈసామానంతా తనవెంట తీసుకు వెళ్ళటానికి నిర్ణయించుకుంది. మధ్యాహ్నభోజనం తరువాత ఈ వుద్దేశ్యంతోనే వాటిని పాక్ చేయటానికని అక్కడకు వెళ్ళింది. డొరొథి ఆమెకు సహాయంగా వెళ్ళగోరింది, కాని కిటీ తాను ఒంటరిగానే వెళ్తానంది. డొరొథి ఆమెతో ఇద్దరు కుర్రవాళ్ళను పంపింది. సామానుకట్టడంలో ఆమెకు సహాయం చెసేందుకే.

యింటిని ఒక పాత నౌకరుకు అప్పగించి వెళ్లారు. కిటీ వెళ్ళగానే అతడు తలుపు తెరచాడు. ఇంటిలో ప్రవేశించినప్పుడు ఆమెకు అంతా క్రొత్తగా తానిదే మొదటిసారిగా వచ్చినట్లనిపించింది. ఇల్లంతా పరిశుభ్రంగా వుంది. ప్రతి వస్తువు వాటి వాటి స్థానాల్లో అమర్చబడి వుంది.

బయట చాలా వేడిగా వున్నా ఇంట్లోని గదులు చల్లగా వున్నాయి. ఫర్నిచరంతా చక్కగా అమర్చబడి వుంది. ఫ్లవర్ స్టాండుల్లో పుష్పాలుకూడా అలంకరించబడి వున్నాయి. ఇదంతాచూస్తే యింటి యజమాని కొద్ది క్షణాలకు పూర్వమే బయటకు వెళ్లినట్లనిపిస్తుంది. కాని ఆక్షణం ఎంతదీర్ఘమైపో

యింది—ఆయింటిలో తిరిగి ఎప్పుడైనా కిల కిల రవాలు విన్పి. స్త్రాయని ఆ తరువాత ఎవరాలోచించగలరు. పియానో ఇక తనను వాయిస్తారన్నట్లుగా నిరీక్షిస్తుంది—ఇక ప్రయోగిస్తారన్న ట్లుగానే వుంది. ఒక వేళ ప్రయోగించినా దానినుంచి ఏమీ ధ్వనిరాదనిపించింది కిటీకి. వాల్టర్ గది పూర్వం అతడున్నప్పటి వలెనే పరిశుభ్రంగా వుంది. అతడి గదిలో బట్టల బీరువాపై కిటీ చిత్రాలు రెండున్నాయి. అందులో ఒక దానిలో ఆమె. తన పెళ్ళినాటి దుస్తులు ధరించి వుంది.

నౌకర్లు గదులలోనుంచి పెట్టెలు తెచ్చి సామాన్లు కట్టే యత్నంలోవున్నారు. వారు పనిచేస్తుంటే కిటీ చూస్తుంది. రెండురోజుల్లో పనంతా తేలికగా అయిపోవాలని కిటీ ఆలో చించింది. వ్యర్థ విషయాల్లో చిక్కుకోక తాను తనపని చేసు కోవాలి. వ్యర్థ విషయాలకు తనకవకాశంలేదు. ఇంతలో ఆమె తనవెనుక అడుగుల ధ్వనివింది. వస్తూందిచార్లీ. కిటీ హృదయం గట్టిగా కొట్టుకుంది.

"ఏంకావాలినీకు?" కిటీ ప్రశ్నించింది.

"నీవు కొంచెం గదిలోనికి వస్తావా? అవసరమైన విష. యం మాట్లాడాలి."

"నాకు చాలా పనివుంది."

"అయిదు నిముషాలకంటే నేను ఎక్కువవుండను."

ఆమె ఏమీ మాట్లాడలేదు. నౌకర్లను పనిచేయమని ఆదేశించి ఆమెగదిలోనికివెళ్ళింది. ఆమెకూర్చోలేదు— తన కవ కాశం లేదనేది తెలియజేయాలనుకుంది. కాని కిటీ హృదయ

గమనం హెచ్చించింది. అయినా ఆమె శాంతంగా క్రోధంగా చూస్తూ చార్లీ నడిగింది.

"ఏమిటిపని?"

"నీవు ఎల్లుండి వెళ్తున్నావని నాకిప్పుడే డొరొథి చెప్పింది. నీవిక్కడ సామానుసర్దిస్తున్నావనికూడా ఆమే చెప్పింది. నేను చేయగలిగినదేమైనావుంటే అడిగి చేయవలసిం దని ఆమె చెప్పింది"

"అనేక నమస్కారాలు. నేనుస్వయంగానే చేసుకుం టాను."

"నావుద్దేశ్యంకూడాఅదే. కాని నేను అది అడగటానికే రాలేదు. వెళ్ళటానికి ఇంత త్వరపడటానికి కారణం నిన్నటి ఘటనేనేమో తెలుసుకోవాలని వచ్చాను."

"మీరు, డొరొథి చాలా దయచూయించారు. మీ సహృదయతకు నేను అనుచితమైన లాభాన్ని పొందుతున్నా నని మీరు భావించాలని నేను కోరటంలేదు."

"ఇది స్పష్టంగా జవాబుగాదు."

"మీకేమిభేధం కన్పిస్తుంది."

"చాలాభేదం కన్పిస్తుంది. నాతప్పువలన నీవిక్కడ నుంచి త్వరగా వెళ్ళటం నాకిష్టంలేదు,"

కిటీ బల్లనానుకుని నిలబడివుంది. ఆమె తనకన్నుల్ని క్రిందికిదించేసుకుంది. ఆమెచూపు ఒక చిత్రంపై నిలచింది, వాల్టర్ మానసిక బాధపడేప్పుడు తరచు ఆ ప్రాచీనచిత్రం

వంక చూసేవాడు. ఇప్పుడు వాల్టర్          , ఆమె తలపై కెత్తింది.

"నేను పూర్తిగా పతనమైపోయాను. నేను నన్ను ద్వేషించుకున్నంతగా నీవుకూడా ద్వేషించలేవు."

"కాని నేను ద్వేషించటంలేదు. నేను నిన్న చెప్పిన దానిలో ప్రతిశబ్దమునిజమే.

ఈవిధంగా పారిపోయినందువలన లాభంఏమిటి? మనం మిత్రులవలె ఎందుకుండలేమో నాకర్థంకావటంలేదు. నేను నీతో చెడుగా వ్యవహరించాననే నీ అభిప్రాయాన్ని ద్వేషిస్తున్నాను."

"నీవునన్ను ఒంటరిగాఎందుకు వదలిపెట్టడంలేదు?"

"అదంతా తగలబెట్టు. నేను క్రైస్తునూగాదు, రాతినీ గాదు. ఎంత అర్థంలేనిమాట మాట్లాడుతున్నావు— నీవెంత కుత్సితదృష్టితో అంతా అర్థంచేసుకుంటున్నావు. నిన్నటి ఘటన తరువాత నీకు నాయందు అనురాగం ఎక్కువవుతుందని నేను తలచాను. ఎంతైనా మనందరం మనుషులం."

"మనం మనుషులమని నేను తలచడంలేదు. జంతువుల మనే నాకనిపిస్తుంది. పందులం— లేకపోతే కుక్కలం. నేను నిన్ను నిందించటంలేదు— నేనే చెడ్డదానిని. నేను పతనమైపోయాను, నేను నిన్నుకోరుతున్నానుగనుకే. కాని అది నేను కాదు— నేనంతగా పతనమవలేదు— నేనింతగా పతనమవలేదు— నేను మూర్తీభవించిన కోర్కెనుగాను. నాలోవున్న ఆ స్త్రీ అంటే నాకు తగనిద్వేషం. నేను వా స్వరూపంలో నీతో

మంచం మీాదవుండివుండలేదు— నేను నాభర్త శరీరమింకా సమాధిలో చల్లారలేదు; నీభార్య ఆతనిభార్యను ఇంతమర్యాదగాచూసింది. నాలో ఏదో పశువువుంది -ఏదో భూతముంది— దానిని నేను ద్వేషిస్తాను. నే నా స్త్రీపై ఉమియాలనిపిస్తుంది నాకు.''

చార్లీ కిటీమాటవిని కొంచెం భయపడ్డాడు.

"సరే నేనంతగా ఏబాధలువున్న మనిషినిగాదు, కాని. అప్పుడప్పుడు నీమాటలువిని నాకు బాధ కల్గినట్లుంది.''

"అందుకు నాకు విచారంగావుంది. ఇప్పుడిక మీారు వెళ్తే చాలామంచిది. నీవు పూర్తిగా మూర్ఖుడవు, నీతో గంభీరంగా సంభాషించటం మూర్ఖత్వమే.''

చార్లీ ఏమీా జవాబుచెప్పలేదు. కిటీకి అతడి కన్నుల్లో క్రోధం కన్పించింది. కిటీనిపంపి హాయి ఊపిరిపీల్చుకోవచ్చునని అతడాలోచిస్తున్నట్లుగావుంది. కిటీ తాను వెళ్లే సమయపు దృశ్యాన్ని యోచించింది. అతడు కరస్పర్శచేసి ఆమె ప్రయాణం శుభప్రదంకావాలని కోరుతున్నట్లు ఆమె చూసింది. తాను అతని అతిథిసత్కారానికి ధన్యవాదాలర్పిస్తుంది. ఇంతలోనే ఆమె చార్లీ భావపరివర్తనను గమనించింది.

"నీకుబిడ్డకలుగనున్నదని డొరొథి చెప్పింది,''అన్నాడు చార్లీ.

కిటీ తెల్లబోయింది, అయినా నిగ్రహించుకుంది.

"అవును.''

"నేనాబిడ్డ తండ్రినా?''

"కాదండి! వాల్టర్ బిడ్డే."

కిటీ గట్టిగానొక్కి ఈమాటలంది. కాని ఆమెకు తన కంఠమంత ప్రభావం కల్గించేదిగా కన్పించలేదు.

"నీకు పూర్తిగా నమ్మకంవుందా?" చార్లీ ముఖంలో కొంటెతనం తొంగిచూస్తుంది. "చాలాసంవత్సరాలైంది వాల్టరుతో నీకు వివాహమై, కాని ఏమీ జరగలేదు. తారీఖులు కూడా సరిగ్గానే కన్పిస్తున్నాయి. బిడ్డకు వాల్టర్‌గాక నేనే తండ్రినని అనుకుంటున్నాను."

"ఒక వేళ నీ బిడ్డే అయితే నేను చంపేసాను."

"ఛీ! మూర్ఖంగా మాట్లాడకు, నేను గర్విస్తాను. ఆడపిల్ల కలగాలని నేను వాంఛిస్తున్నాను. నాకు మొగ సంతానం వుండనే వుంది. నీ కెంతోకాలం ఆసందేహం వుండదు. నా బిడ్డల పోలికలన్నీ నాకు సరిపోతాయి."

చార్లీ తిరిగి తన మొదటి ధోరణిలోకి వచ్చాడు. ఈ పరివర్తన ఎందుకో కిటీకి తెలుసు.

ఆమె అతనిని కల్సుకో లేక పోయినా చార్లీ వంటి బిడ్డ కలగటమంటే తానతని ఛాయనుంచి తప్పించుకోలేనని కిటీ ఆలోచించింది. చార్లీ శక్తి తనను వెంటాడుతుంది, తన నిత్య జీవితంలో ఆ ప్రభావం వుంటూంది.

"నీవు పూర్తిగా వ్యర్థుడవు, గర్విష్ఠివి. నీ వంటి వ్యక్తిని కలుసు కొనడమే నా దురదృష్టం."

ఓడ మూార్సెయ్ చేరినప్పుడు కిటీ రేవులో పడుతున్న సూర్యకిరణ ప్రభావాన్ని చూస్తూంది. వాతావరణమంతా ప్రకాశవంతంగా వుంది. ఆకస్మికంగా ఆమె దృష్టి ఎదురుగా వున్న చర్చిపైకి పోయింది. ఆ చర్చిపై వర్జిన్ మేరీ బంగారు రంగు విగ్రహం ప్రతిష్ఠింపబడి వుంది. అది నావికులకు ఆశీర్వాద స్వరూపంగా వుంది. మీ-తాన్-ఫూ కాన్వెంట్‌లోని సన్యాసినులు ఈప్రదేశాన్ని వదలి వున్నప్పుడు, ఓడ దీనినుంచి దూరమైన కొద్దీ వారి వియోగం పెరిగి వుంటుందని ఆమె ఆలోచించింది. వారీ బంగారు వర్ణ విగ్రహాన్ని తదేకంగా చూస్తూ వుండి వుంటారు. చివరకు వారి కీవిగ్రహం ఒక దైవిక జ్యోతివలె కన్పించ సాగివుంటుంది—తన స్థితి తెలుసుకున్నప్పుడు ఏ అదృశ్య శక్తికారణంగా తనచేతులు జోడించుకున్నారో ఆమె తెలుసుకో లేక పోయింది.

తన దీర్ఘ ప్రయాణంలో కిటీ తనపై జరిగిన దానిని గురించే ఆలోచిస్తూ వుంది. తనను తానర్థం చేసుకొనటమే కష్టమైంది. తన ఎడ జరిగినదంతా, సర్వమూ తలవని తలంపుగా అవాంఛితంగా జరిగిందే. తాను చార్లీని ద్వేషిస్తూ కూడా ఆతడి సైగకు ఆడటానికి తనపై పనిచేసిన ప్రభావమేమిటి. ఆమెకు తనపై తనకే కోపంవచ్చింది—తనపై తనకే ద్వేషం కలుగ సాగింది. తనను తానెప్పుడూ క్షమించుకోలేనని తలచింది. ఆమె విపరీతంగా ఏడ్చింది. హాంకాంగ్‌నుంచి దూరమైన కొద్దీ ఆమె దుఃఖం తక్కువకాజొచ్చింది. అక్కడ తనకు జరిగిన దంతా—మరొక ప్రపంచంలో జరిగినట్లనిపిం

-చిందామెకు. తన పిచ్చితనం తరువాత సరిగ్గా తెలివి తెచ్చు-కుని పిచ్చితనంలోని గత విషయాలను ఆలోచించుకునే పిచ్చివానివలె కన్పించింది ఆమెకు తన ప్రస్తుత స్థితి. పిచ్చితనంలో తనేమి చేస్తున్నాడో తానే తెలుసుకునే స్థితిలో లేదని తనకు తెలుసు గనుక ఎవరు క్షమించక పోయినా తనను నిర్దోషిగానే భావిస్తాడతడు.

తనస్థితి తెలుసుకుని ఏ సహృదయుడు తనదే దోషమని ఆరోపించలేరని పైగా తనయందు దయచూయిస్తారనీ కిటీ ఆలోచించింది. ఆమెకు తనఆత్మవిశ్వాసం ఖండితమవుతున్నట్లు కన్పించింది. తిన్నగా సాఫీగా కన్పించిన తనభవిష్యత్ మార్గం ఆమెకిప్పుడు వంకరటింకరగా గోతులుగతుకులతో నిండి వున్నట్లు కన్పించింది. సముద్రప్రయాణంలో సూర్యోదయ సూర్యాస్తమాయాలెవ్వుడైనా ఆమె బాధను మరపించేవి. ఆమె ఏదోవిధంగా తిరిగి ఆత్మవిశ్వాసాన్ని పొందగలిగితే ఎంతబాగుంటుంది! సరే, తాను తనశక్తియంతటితో జీవిత మార్గంలో నడుస్తుంది.

ఆమె భవిష్యత్తు కఠినమైనది— పూర్తిగా ఏకాకిమైనది. పోర్టుసయద్‌లో ఆమెకు తనతల్లి నుంచి జవాబువచ్చింది. ఉత్తరం చాలాదీర్ఘమైనది, చాలా అందంగా వ్రాయబడివుంది. కిటీకి దానిలో ఆడంబరం కన్పించింది. శ్రీమతి గార్టిసన్ వాల్టర్ మరణానికి తన దుఃఖాన్ని ప్రకటించింది. కిటీ జీవితభృతినిగురించి ఆమె భయాన్ని కనబర్చింది, వలస ప్రభుత్వం ఆమెకు తప్పక పెన్షన్ ఇస్తుందనే ఆశనుకూడా వెలిబుచ్చింది. కిటీ ఇంగ్లండు రాకకు సంతోషాన్ని వ్యక్తంచేసింది— కాని

దానితోపాటు ఆతల్లి ఇదికూడా సూచనప్రాయంగా వ్రాసింది_ తండ్రివద్ద కిటీ ప్రసవించేవరకు మాత్రమే వుండగలుగుతుంది. ఆ తరువాత కిటీకి కొన్ని ఆదేశాలిచ్చింది. మరి తనసోదరి డోరిస్ ప్రసవకాలాన్ని సూచిస్తూ ఆ ఆదేశాలను మన్నించ వలసిందిగా సలహాయిచ్చింది. డోరిస్‌కు మరల బిడ్డ కలుగ నున్నట్లుకూడా వ్రాసింది.

తన తల్లిదండ్రులవద్ద వుండటానికి అనుమతి లభించింది గాని అది ఒక నిర్ణీత సమయం వరకేనని కిటీ గమనించింది. ఆమెతల్లి వితంతుకుమార్తెను ఎక్కువకాలం తన సామాన్యపరి స్థితుల్లో వుంచుకోగోరటంలేదు. తనతల్లి తనను ప్రాణాలకంటే మించి కోగుతుందని ఆలోచించినప్పుడు ఆమెకు కొంచెందెబ్బే తగిలింది. బిడ్డలు తల్లిదండ్రుల సంబంధంకూడా ఎంతవిలక్షణ మైనది! బిడ్డలు చిన్నవారుగావున్నప్పుడు తల్లిదండ్రులు వారికి అర్పితమైపోతారు పిల్లలకు వచ్చే ప్రతికష్టానికి వారు పిచ్చి వారైపోతారు. తరువాత కొంచెంపెద్దవారైనప్పుడు తల్లిదం డ్రులకంటె అన్యులు వారినెక్కువ గమనిస్తారు. మరి అప్పు డప్పుడు బిడ్డలుండటం తల్లిదండ్రుల కార్యకలాపాలకు విఘ్నం కలుగుతుంది. తల్లికి తనవిచారమెందుకు కల్గిందా అనిఆలోచిం చింది. తాను సాధ్యమైనంత త్వరగా వేరుగావుండే ఏర్పాట్లు చేసుకుంటుంది_ కాని అవన్నీ చేసుకొనుటకు తనకు కొంత వ్యవధికావాలిగా. స్పష్టంగా తానేమీ నిర్ణయించుకోలేనంత అనిశ్చితంగా వుందిప్పుడు తన భవిష్యత్తు. ప్రసవసమయంలో తాను చనిపోవచ్చు, అప్పుడుఅదే అన్ని ఆపదల్నినివారిస్తుంది.

కాని కిటీ డెక్‌పైకి వెళ్ళినప్పుడు ఆమెకు మరిరెండు

ఉత్తరాలు అందాయి. ఆమెకు తన తండ్రివ్రాతనుచూసి ఆశ్చర్యం కల్గింది. తండ్రికూడా తనకెప్పుడైనా ఉత్తరం వ్రాశాడేమో ఆమెకుగుర్తురాలేదు. ఉత్తరం చాలా సరళంగావుంది–వ్రాశాడుగదా– డియర్ కిటీ, నేను నీకు నీ తల్లికి బదులుగా వ్రాస్తున్నాను; ఎందుకనగా ఆమె జబ్బుపడింది, ఆపరేషన్ కొరకు హాస్పటల్ పంపవలసివచ్చింది. నీవు భయపడాల్సిన అవసరంగాని, విచారించవలసిన అవసరంగాని ఏమీలేదు. ఇతరత్రా ఎక్కువ ఖర్చవుతుంది గనుక నీవు ఇంగ్లండుకు సముద్ర ప్రయాణం చేరరాలి. రెండవవుత్తరం ఆమెచెల్లెలు డోరిస్‌ది. దాన్నిచూసి ఆమెచాలా సందిగ్ధంలో పడింది. కిటీ డార్లింగ్! డోరిస్ కిటీని ఎక్కువగా కోరుతుందిగనుక ఈవిధంగా వ్రాయలేదు, ఆమె తనపరిచితులందర్ని ఈవిధంగానే సంబోధిస్తుంది. కిటీ డార్లింగ్! నాన్నగారుకూడా నీకు ఉత్తరంవ్రాసివుంటారనే ఆశించుచున్నాను. అమ్మగారు ఆపరేషను నిమిత్తం హాస్పటల్లో చేరవలసివచ్చింది. ఒకసంవత్సరంనుంచి ఆమెకు ఆరోగ్యం సరిలేనట్లుగావుంది–ఆమెకు డాక్టర్లంటే తగనిద్వేషమని నీకుతెలుసు, అందుకనే ఆమె పేటెంటుమందుల్నే వాడుకునేది. నాకు ఆమె జబ్బువిషయం పూర్తిగా తెలియదు– ఆమె ప్రతివిషయాన్ని అతిరహాస్యంగా వుంచుకునే అలవాటుంది– పైగా ఏదైనా అడిగితే వెంటనే ఆగ్రహించుకుంటుంది. ఆమె పరిస్థితి బాగా చెడిపోయింది. నేను నీస్థితిలోవుంటే మార్సెయ్‌నుంచి వీలైనంత త్వరలో ఇక్కడకు చేరుకునేదానిని. నేనింత త్వరగా నిన్ను పిలిపించినట్లు ఇక్కడకు వచ్చినప్పుడు నీవామెతో అనకు. ఒక వారం రోజుల్లో ఇంటికి పంపాలని అమ్మగారు డాక్టర్లవద్ద మాట తీసుకుంది. చాలాచాలా ప్రేమ–డోరిస్.

నోటు : వాల్టర్ మరణవార్తవిని నేనుచాలా దుఃఖించాను. నీ కెంతకష్టం గలిగి వుంటుంది. నేను నిన్ను వెంటనే కలుసుకోగోరుతున్నాను. మనిద్దరికి పిల్లలు పుట్టనుండటం ఎంత అద్భుతమైన విషయం. ఇద్దరు పిచ్చివాళ్లు ఒకచోచేరి కూర్చున్నప్పుడు ఎంతందంగా వుంటుంది.

కిటీ ఆలోచనలలో మునిగిపోయింది. ఆమె డెక్‌పై స్తబ్దంగా నిలబడివుంది. ఆమె తనతల్లికి జబ్బు అనేదుండనే ఎన్నడూ ఆలోచించలేదు. తనతల్లి జబ్బుపడినట్లుకూడా ఆమె కెప్పుడూ గుర్తులేదు. ఇతరులకు జబ్బుచేస్తేనే ఆమెవిసుగు చెందేది. ఇంతలో ఓడలోని గుమాస్తావచ్చి ఆమెకు టెలిగ్రాం అందించాడు.

"నీతల్లిగారు ఈరోజుఉదయమే స్వర్గప్రాప్తిచెందిందని తెలియపర్చుటకు చింతించుచు. ―తండ్రి.

# 78

హైరింగ్‌టన్ గార్డిన్స్‌లో తనయింటికివెళ్ళి కిటీ కాలింగ్ బెల్ నొక్కింది. తనతండ్రి రీడింగ్‌రూమ్‌లో వున్నాడని చెప్పారు.. ఆమె ఆయనగదివద్దకు వెళ్ళి నెమ్మదిగా తలుపుతెరచింది. పొయ్యిముందు కూర్చుని సాయంత్రపు పేపరుచదువుచున్నాడు.. కిటీ ప్రవేశించటం చూసి ఆయనఎగిరిగంతేశాడు.

"ఓ! కిటీ! నీవు తరువాత బండిలో వస్తావనుకున్నాను."

"మిమ్మల్ని స్టేషనుకు రప్పించి కష్టపెట్టదలచలేదు, అందుకే నేనువచ్చే సరియైనసమయాన్ని తెలియజేయలేదు."

కిటీ చిన్నతనంలోవలె తనతండ్రి చెక్కిలిపై ముద్దు పెట్టుకుంది.

'నేను కొంచెం పేపరు చదువుతున్నాను."

"గతరెండు రోజుల్నుంచి నేను పేపరే చదవలేదు."

తండ్రి తనదినచర్యలో మునిగివుండటం వలన చెప్ప వలసివచ్చిందని ఆమె గమనించింది.

"మీరు అలసిపోయివుంటారు. తల్లిగారిమరణం మీకు చాలా బాధ కల్గించివుంటుంది."

ఆయన మొదటికంటే ఎక్కువ వృద్ధుడుగా, బలహీనంగా, గంభీరంగా వున్నట్లు కిటీ ఆయన్ను చూసి అనుకుంది.

"ఆమెబ్రతికే ఆశలేదని సర్జన్ చెప్పాడు. మీతల్లి ఆరోగ్యం గతసంవత్సరంనుంచీ చాలా గడబడగానే వుంది— కాని ఆమె డాక్టరు వద్దకు వెళ్ళటానికే నిరాకరించేది. ఆమెకు విడవకుండా నొప్పివుండేదని డక్టరుచెప్పాడు. మీ అమ్మ కనుకనే అదంతా సహించగలిగింది."

"ఆమె ఎప్పుడూ చెప్పలేదా?"

"తన ఆరోగ్యం బాగులేదని మాత్రమే చెప్పేది, అంతే నొప్పి విషయమే ఆమె ఎన్నడూ తలచలేదు." అతడు ఆగి కిటీవంకచూస్తూ "ప్రయాణంలో నీవు అలసిపోయివుంటావు," అన్నాడు.

"లేదు, అటువంటిదేమీ లేదు."

"పైకివెళ్ళి ఆమెనుచూడాలనుకుంటున్నావా?"

"ఆమె ఇక్కడే వుందా ?

"అవును హాస్పటల్‌నుంచి ఆమె నిక్కడకు తీసు కొచ్చాం."

"నేను కూడా వెంటరానా?"

తన తండ్రి కంఠస్వరం ఆదోవిధంగా వుండటవలన కిటీ వెంటనే అయన ముఖంవంక చూడాలనుకుంది, కాని ఆయన తన ముఖం రెండవవైపుకు తిప్పుతున్నారు. కిటీ తనను చూడటం ఆయన కిష్టంలేదు. కిటీ ఇతరుల మనోభావాల్ని చదవటం నేర్చుకుంది. ఆమె తన భర్త మనోభావాన్ని చదు వుతూనే వుండేది.

తన తండ్రి తననుంచి ఏవిషయాన్ని దాచదలచాడో ఆమె వెంటనే గ్రహించింది. ఆయన సంతోషంగా వున్నాడు —తనను తానే భయపడుతున్నాడు. గత ముప్పది సంవత్స రాలుగా అతడు భార్య పరాయణుడు. ఆయన ఎప్పుడూ తన భార్యను నిందించ లేదు.

"వద్దు, నేను ఒక్కతెనే వెళ్తాను," అంది కిటీ.

ఆమెపై అంతస్తు పెద్దగదిలోకి వెళ్లింది; అక్కడే ఎన్నో సంవత్సరాలనుంచి తన తల్లి నిద్రపోతూవుండేది. ఆగో డలపై వున్న విలువైన పనితనం ఆమెకుగుర్తొంది. ఆమె డ్రెసింగ్ టేబిలుమీద సామానంతా యత్నంగా సరదబడివుంది. ఆమె జీవితమంతా ఈ విషయానికి చాలా విలువిచ్చింది. పుష్ప ములు చిందరవందరగా పడి వున్నాయి. పడకగదిలో పుష్ప ములతో పనేమిటని తన తల్లి ఆలోచించివుంటుంది.

ఆమె తల్లిని ఆమె మంచంపైనే పరుండబెట్టారు. రెండు చేతులు వక్షముపై పెట్టబడివున్నాయి. జీవితంలో మరెప్పుడూ లేనంత సమగ్రంగా కన్పిస్తుందామె. ఆమె ముఖము, అవయవాలుకూడా అందంగా వుండటంవలన చాలా సౌందర్యంగానే కన్పిస్తుంది. జబ్బువలన, మనోవేదనవలన ఆమె చెక్కిళ్లు గుంటపడినప్పటికీ—కణతలు పీక్కుపోయినప్పటికీ, మరణాంతరం ఆమె ముఖములోని కాఠిన్యం మాయమైపోయినట్లయింది. ఇప్పుడామె ముఖంలో ఆమె స్వభావం స్పష్టంగా కన్పిస్తుంది. ఆమె ఒక మహారాణివలె కన్పడుతుంది. కిటీ చనిపోయిన వారిలో ఇంత ఆకర్షణవుండటం మొదటిసారిగా చూసింది. ఆమెకు తల్లి మరణానికి దుఃఖం కలుగ లేదు. ఆమెకు తల్లికి మధ్య ఎల్లప్పుడూ కాఠిన్యమే కాపురంచేసింది. దాని వలస తల్లియందు స్నేహమనేదే లేకుండా పోయింది. కాని అప్పుడు దోచుకోబడిన కాంక్షల, మృత్యుదేవత వడిలో పడివుండగా తన తల్లిని చూసినప్పుడు ఆమె హృదయం ద్రవించింది.

ఆమె తల్లి తన జీవితమంతా ఉపాయాల విచారాల్లోనే చిక్కుకుని వుంది—ఎన్నడూ తన హోదాకు తక్కువైన కోర్కెలనెన్నడూ కోరియుండ లేదు.

డోరిస్ ప్రవేశించింది.

"నీవీ బండిలో వస్తావని నేనాలోచించాను. నేనుకూడా ఇక్కడకువచ్చి ఒక క్షణం ఈదృశ్యాన్ని చూడాలనుకున్నాను పాపం—అమ్మ."

ఆమె వెక్కి వెక్కి ఏడ్వసాగింది. కిటీ ఆమెను కౌగలించుకుని ముద్దులతో ఓదార్చసాగింది. తల్లి తనకోసం డోరిస్‌ను ఎంతగా మర్చిపోయిందో ఆమెకు గుర్తొచ్చింది. ఆమె అమాయకమైనది కావటమే ఇందుకు కారణం, డోరిస్‌కు నిజంగానే దుఃఖంగావుంది. డోరిస్ ఎప్పుడూ సాధువైనదే. ఆమె బిగ్గరగా ఏడ్వాలను కుంటుంది. డోరిస్ మాతృమరణాన్ని నిగ్రహించుకోలేకపోతుంది. తానిప్పటికే ఇన్ని దుఃఖాలు సహించివుంది, గనుక ఇక తను దుఃఖాన్నిచూసి ద్రవించలేదనిపించింది తనవిషయంలో.

డోరిస్ కన్నీరుఆగగానే, "వెళ్దాం, తండ్రిగారిని కలుసుకుందామా?" అందికిటీ. డోరిస్ కన్నీరు తుడుచుకుంది. గర్భవతి అయిన తరువాత డోరిస్ చాలా అందంగా వున్నట్లు కిటీ గమనించింది- నల్లనిదుస్తులలోకూడా ఆమె వికసిస్తూవుంది.

"లేదు, ఇప్పుడే నాన్నగారి దగ్గరకు వెళ్ళను. అక్కడ మరల ఏడుస్తాను. పాపం ఆయన చాలా కష్టంగా ఈ దుఃఖాన్ని భరిస్తున్నారు."

కిటీ చెల్లెల్ని తీసుకుని గదిబయటకువచ్చింది- ఆమెవద్ద శలవుతీసుకుని కిటీ తండ్రివద్దకువెళ్ళింది. తండ్రి పొయ్యిముందు నిలబడివున్నాడు. తానిప్పుడు చదవటం లేదనేది కిటీచూడాలనే ఆయన కోరుతున్నాడు.

"నేను రాత్రి భోజనానికి దుస్తులు మార్చుకోలేదు. అదంత అవసరంకాదనే నేను తలుస్తున్నాను."

భోజన సమయంలో గార్రిసన్ కిటీకి ఆమెతల్లి జబ్బు పడినదగ్గరనుంచి మరణం వరకు సంబంధించిన విషయాలన్నీ చెప్పాడు. బంధువులు మిత్రులు అందరూ ఉత్తరములద్వారా తమ దుఃఖాన్ని తెలియజేశారని కూడా చెప్పాడు. ఆ తరు వాత అంతిమ సంస్కారపు ఏర్పాట్లనుగురించి చర్చించాము. ఇద్దరూ భోజనాలు ముగించుకొని రీడింగ్‌రూములోకి వెళ్ళారు. బంగళా అంతటిలో చలికాచుకుంటానికి పొయ్యి అమర్చినగది అదొక్కటే. గదిలోనికి వెళ్ళినతరువాత గార్రిసన్ తన 'పైప్' తీసుకుని పుగాకుపొడి నింపుతూ కిటీవంక సందేహంగాచూసి తిరిగి దానినక్కడే పెట్టేశాడు.

"మీరు 'పైప్' త్రాగరా?" అని అడిగింది కిటీ.

"మీ అమ్మకు 'పైప్' పొగ యిష్టంలేదు. చుట్టత్రాగ టం నేను గత యుద్ధకాలంనుంచి మానేశాను."

కిటీకి ఏదో దెబ్బతగిలినట్లైంది. ఒక అరువది సంవత్స రాల పురుషుడు తనగదిలోకూడా తనకిష్టమైన ధూమ్రపానం చేయలేకపోవటం కంటే మించిన హాస్యాస్పదమైన విషయం మరేముంటుంది.

"నాకు 'పైప్' సువాసన చాలా బాగుంటుంది," అంది కొంచెం నవ్వుతూ కిటీ.

గార్రిసన్‌కు చాలాసంతోషం కలిగినట్లైంది. ఆయన 'పైప్' తీసుకుని వెలిగించాడు, పొయ్యికి చెరో ప్రక్కనా

కూర్చున్నారు తండ్రికుమార్తెలిద్దరూ. కిటీ దుఃఖానికి సానుభూతి చూపాలని గార్ట్సన్ యోచించాడు.

మీ తల్లి వ్రాసిన వుత్తరం నీకు పోర్టుసయద్‌లో అంది వుంటుందని నా అభిప్రాయం. వాల్టర్ మరణ సమాచారం విని మా యిద్దరికి చాలా దుఃఖం కల్గింది.—పాపం! చాలా మంచివాడు.''

కిటీ మౌనంగా వుంది.

''నీవు బిడ్డ తల్లివి కాబోతున్నావని మీ తల్లి చెప్పింది.''

''అవునండి.''

''ఎంత కాలంలో?''

''నాలుగు మాసాలలో కావచ్చు.''

''బిడ్డను చూచుకొని నీకు కాస్త ధైర్యం కలుగుతుంది; నీవు డోరిస్ కొడుకును చూడు. చాలా అందంగావుంటాడు.''

ఇద్దరు పరిచితులు చాల కాలం తరువాత కలుసుకున్నట్లుగా తండ్రి కుమార్తెలిద్దరూ ఇటువంటి విషయాలను సంభాషిస్తున్నారు—ఇద్దరికి ఒకరియందు ఒకరికి అభిరుచి కలగటానికి కారణం వారిని ఒక సూత్రంలో బంధించిన అతీతం ఇంకా వారి మధ్యవుండటమేనన్నట్లుగా వుంది. తానెన్నడు తన తండ్రి స్నేహాన్ని పొందలేదనేది కిటీకి తెలుసు. తన తండ్రికి ఇంటిలో మర్యాద లేదు, తిండి బట్టలు మినహా అతడు సమకూర్చిందేమీ లేదు. తండ్రి అయినకారణంగా వారిలో ఆమె

యందు స్నేహంవుంటే వుండవచ్చు. తనతండ్రికి తనయందు స్నేహమేమీ లేదని ఒకవేళ ఆమెకు తెలియడమే జరిగితే ఆమెకు ఎంతో కదుఃఖం కలుగవచ్చు.

ఇంటిలో తండ్రివున్న సమయమందు అందరికీ అసౌకర్యంగానేవుండేది— వారందరివలనకూడా ఆయనకు అసౌకర్యంగావుందని ఎవరైనా ఆలోచించారా? ఆయనెప్పుడు వినయంగానూ, సహృదయుడుగానూ వున్నాడు.

"ప్రసవించేవరకు ఇక్కడే వుంటావని మీతల్లి చెప్పింది. ఆమె నీగదిని సర్దించాలనుకుంటూనేవుంది."

"నాకు తెలుసు, నేనుమిమ్మల్ని కష్టపెట్టను."

"విషయమదిగాదు, పరిస్థితులనుబట్టిచూస్తే తల్లిదండ్రులవద్ద మనహాసీవుండగల్గిన ప్రదేశమ్మూలేదు, కాని నాకు బహామాలో చీఫ్ జస్టిస్‌పదవి వచ్చింది, నేను అంగీకరించాను కూడా."

"నాన్నగారూ, ఇది విని నాకు నిజంగాచాలా సంతోషం కల్గింది. నేను హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను."

"మీతల్లి మరణానంతరం నాకీవిషయం తెలియజేయబడింది. ఆమెకుకూడా తెలిసివుంటే మరణించేముందు పూర్తి సంతృప్తిజెందివుండేది."

విధిపరిహాసం. తనుపడ్డపరిశ్రమ, ఆదేశాలు—అనుజ్ఞలు, నిరాశల తరువాతకూడా పాపం శ్రీమతి గార్టిసన్ అసంపూర్తి కోర్కెలను వదలి స్వర్గస్తురాలైంది.

"నేను వచ్చేనెల ప్రారంభంలోనే వెళ్తాను. ఇల్లు ఎవరైనా ఏజంటుబాధ్యతకు వదలిపెడ్తాను. ఫర్నీచరు అమ్మివేస్తాను. నీవిక్కడ వుండజాలనందుకు నాకు చాలా దుఃఖం కల్గుతుంది, నీవు మరొక ఇంటికి కావాలంటే నీయిష్టంవచ్చినంత ఫర్నీచరు ఇక్కడినుంచి తీసుకు వెళ్ళవచ్చు. కిటీ పొయ్యి వంక చూస్తూంది. ఆమెహృదయగమనం హెచ్చింది. ఆకస్మికంగా ఆమె హతాశురాలైంది. ఆమెకంఠం కంపనంచెందుతుంది. "నాన్నగారూ! నేను మీవెంటరాగూడదా?" అని కంపితస్వరంతో అడిగింది.

"నీవా అమ్మా!" ఆయన కన్నులు క్రిందికి వాలిపోయాయి." కాని డోరిస్‌కు, నీకు పరిచయమైన వాళ్ళెందరో ఇక్కడవున్నారు. లండన్‌లో ఇల్లుతీసుకుని నీవు సంతోషంగా వుంటావని నేనుభావించాను. నీపరిస్థితులన్నీ నాకు తెలియకపోయినప్పటికీ ఇంటిఅద్దెనేనే తప్పక ఇస్తూవుంటాను."

"నావద్ద జీవితానికి సరిపడినంతగా వుంది."

"నేను క్రొత్తప్రదేశానికి వెళ్తున్నాను. అక్కడిస్థితి నాకే అంతగా తెలియదు."

"నాకు క్రొత్తప్రదేశాలు బాగుంటాయి— లండనులో నాకేమీ అభిరుచిలేదు. ఇక్కడైతే కుమిలిపోతాను."

ఒకక్షణం కిటీ తండ్రి కన్నులు మూసుకున్నాడు. ఆయన ఏడుస్తాడేమో అనుకుంది కిటీ. ఆయనముఖంలో చాలా దయనీయమైనభావం వెల్లుబికింది. కిటీకి చాలా బాధ కల్గింది. తల్లి మరణానంతరం తండ్రిజీవితం కొంత తేలికపడు

తుందనే ఆమె ఆలోచననిజమే. ఆయనకిక గతంతో ఏమీ సంబంధముండదు, ఆయన స్వేచ్ఛపొందుతాడు. ఇప్పుడాయన ఎదుట ఒక క్రొత్తజీవితం కన్పిస్తూంది—ఇప్పుడిప్పుడ నేసంతోషం ఎండమావిలాంటిదే. ముప్పదిసంవత్సరాల బాధలు, కష్టాలు ఆయనను విరగ్గొట్టేశాయని కిటీకి బాగుగా తెలుసు. ఆమెతండ్రి కన్నులు తెరచాడు— ఒకసారి దీర్ఘంగానిట్టూర్చి, "నీకు నా వెంట రావటంవలన సౌఖ్యంగా వుంటుందంటే నేను చాలా సంతోషంగా నిన్ను తీసుకు వెళ్తాను," అని అన్నాడు.

అరే, ఇదిచాలా తేలికగా విడిపోయింది. తండ్రి సంతానం ఎడగల కర్తవ్యం కొరకు అర్పితమైయాడు. కిటీ తన కుర్చీనుంచి లేచివెళ్ళి వంగి తండ్రిచేతుల్ని తనచేతుల్లోకి తీసుకుంది.

"లేదు నాన్నగారూ! మీకిష్టంలేనిచో నేనురాను. మీరిప్పటికే చాలా త్యాగంచేశారు. మీరు ఒంటరిగా వెళ్ళగోరిన ఒంటరిగానే వెళ్ళండి— నన్ను గురించి ఏమీ విచారించకండి."

తండ్రి తనచేతిని విడిపించుకొని కుమార్తె తల నిమిరాడు.

"అమ్మా! నిన్ను నావెంటతీసుకువెళ్ళటం నాకు సంతోషమే కలుగుతుంది. నేను నీతండ్రినేగా, నీ వీ సమయమందు అనాథవు, ఏకాకివి. నీవు నాదగ్గరవుండగోరుతుంటే నిరాకరించి నిర్దయుణ్ణికాలేను."

"కాని నేను పుత్రికనైకూడా మీపై అధికారం చేయగోరటంలేదు."

"అమ్మా!"

"నాకేమీ అధికారంలేదు," కిటీ గట్టిగానే చెప్పింది. "జీవితమంతా మేము మీకు భారంగానేవుండి దానికిబదులుగా మీకేమీ ఇవ్వలేకపోతున్నాం అనే విషయాన్నాలోచించి నప్పుడు నాహృదయం ద్రవించిపోతుంది.— మీయందు కొద్ది స్నేహాన్నికూడా చూపలేకపోయాము. మీ జీవితం ఆనం దంగానేలేదు. మీరు నాకు గతంలోపాలను సవరించుకొనే అవకాశాన్నివ్వరా?"

కిటీ భావోద్రేకం ఆయనను సందిగ్ధంలో పడవేసింది.

"నీమాటలు నాకర్థంకావటంలేదమ్మా! నీ వలన నా కెప్పుడూ ఏమీ బాధలేదే!"

"నాన్నగారూ! నేను చాలాబాధలుపడ్డాను. ఇక్కడి నుంచి వెళ్లేటప్పటి కిటీ ఇప్పుడులేదు. ఇప్పుడు నాకు ఏమాత్రం శాంతిలేకుండాపోయింది— కాని అప్పుడున్నంత మురికితనం ఇప్పుడు నాలోలేదు. ఇప్పటికైనా మీరు నాకు అవకాశాన్ని యివ్వరా? మీరు తప్ప నాకీప్రపంచంలో ఎవరున్నారు? మీరునన్ను మీ స్నేహచ్ఛాయలోవుండే అదృష్టాన్ని కల్గిం చరా? నాన్నగారూ, నేను పూర్తిగా ఏకాకిని, దుఃఖితను. మీ స్నేహం నాకిప్పుడు మరెప్పుడూ లేనంతగా అవసరంవుంది."

కిటీ తన ముఖాన్ని తండ్రి ఒడిలోదాచుకుంది. ఆమె సహాన కట్టలు తెగిపోయింది, ఏడ్వసాగింది.

"బిడ్డా! అమ్మా!"

కిటీ తండ్రివంకచూసి తనచేతుల్ని ఆయన మెడకు పెన వేసింది.

"నాన్నగారూ! నాయందు దయచూయించండి. మనిద్దరం ఒకరి దుఃఖాన్నొకరు పంచుకోవాలి."

తండ్రి కుమార్తె పెదవుల్నిచుంబించాడు. కిటీకన్నీరు ఆయన చెక్కిళ్ళను తడిపేశింది.

'నీవు నావెంటరా."

"మీరునిజంగానే నన్ను మీవెంట తీసుకువెళ్ళగోరుతున్నారా— ఇదినిజమేనా?"

"అవునమ్మా!"

"నాన్నగారూ, నేను కృతజ్ఞతనెలా తెలియచేయను?"

"అమ్మా! అలామాట్లాడకు. వాటివలన నాకు బాధ కలుతుంది.

తన రుమాలుతో ఆయన కిటీ కన్నీటిని తుడిచాడు. ఇప్పుడాయన ముఖంలోవున్నటువంటి మందహాసాన్ని కిటీ ఇంతకు ముందెప్పుడూ చూసివుండలేదు. మరొకసారి ఆమె ఆహ్లాదంతో తండ్రిమెడను చుట్టేసింది.

"నాన్నగారూ, మనిద్దరం ఒకచోట కలిసివుండాం.

'నీవు తల్లివికాబోతున్నావనే విషయం మర్చిపోకు."

'నాకు చాలా సంతోషం, నాబిడ్డ నిర్మల ఆకాశం క్రింద, సాగర గర్జనధ్వనిలో జన్మిస్తుంది."

"అయితే అమ్మాయేననే విషయంకూడా నీకు తెలిసిందా?" తండ్రి ముఖంలో నీరస మందహాసం వెలిసింది.

"అమ్మాయే కావాలి నేను కోరుతున్నాను. నేను చేసిన పాపాలు ఆమె చేయకండా ఆమెను పెంచుతాను. నేను నాగతంవంక తిరిగి చూసినప్పుడు నాయందు నాకేద్వేషం కలుగుతుంది—కాని నేను బాగవటానికి అవకాశమే లభింలేదు. నేను నాబిడ్డకు స్వశక్తిపై నిలబడటం నేర్పుతాను. ఆమె యౌవనంలో ఎవరైనా పురుషుడు తిండి గుడ్డల ఆధారాన్నిచూయించి ఆమెను దోచుకునేందుకు వీలుగానే నామెను పెంచను, నేనామె నావిధంగా ప్రేమించనుకూడా."

తన తండ్రి భంగిమ కఠోరంగా మారటం కిటీ గమనించింది. తనమాట విని ఆయనకు బాధకల్గినట్లుంది.

"నాన్న గారూ, నన్నొకసారి అంతా చెప్పివేయనీయండి; ఒక్కసారి మాత్రమే. నేను అజ్ఞానురాలను, ద్వేషార్హతను—నాకు దానికి కఠిన శిక్షే లభించింది దీనంతటినుండి నేను నాబిడ్డను రక్షించుకో గోరుతున్నాను. నేనామెను నిర్భయంగానూ, స్పష్టంగా మాట్లాడే దానిగా తయారు చేస్తాను. నేనామెకు ఆత్మనిగ్రహం నేర్పుతాను. నేనామెకు స్వాతంత్రపు విలువ తెలియ బరుస్తాను, దానివలన ఆమె ఒక స్వతంత్ర ప్రాణిగా జీవించ గలుగుతుంది—నా కంటే ఎంతో మంచి జీవితాన్ని గడుపుకో గలుగుతుంది."

"కాని అమ్మా కిటీ! నీవు సగం వయస్సు చెల్లిన వృద్ధ స్త్రీవలె మాట్లాడతా వెందుకు. నీకుందింకా పర్వతమంత జీవితముంది. నీవు ధైర్యం గోల్పోతా వెందుకు?"

కిటీ కొంచెంగా మందహాసం చేసింది.

"నేను ధైర్యం కోల్పోవటంలేదు నాన్నగారూ! నాలో ధైర్యము, విశ్వాసము పూర్తిగా నిండివుంది. గతించిన దానిని మరచి పోయాను. అంతా అనిశ్చితం కాని సహించవలసిన దేదైనా సరే, ధైర్యంగా దృఢ నిశ్చయంతో భరిస్తాను. ఇంకా నేను తెలుసుకోవలసింది ఎంతో కొండంత వుంది. నేను చదవగోరుతున్నాను, నేర్చుకో గోరుతున్నాను, నేను ప్రపంచంలోని అందమైన ఆటల్ని చూడాలి. ప్రపంచప్రాణుల్ని చూడాలి, నేను విశ్వసంగీతంవినాలి, దానినృత్యం చూడాలి; నేను విశ్వ సౌందర్యాన్ని చూడాలి; దాని సముద్రాల్ని చూడాలి, ప్రపంచములో సూర్యోదయ, సూర్యాస్తమ యాల్ని చూడాలి, నక్షత్రాలతో నిండిన ఆకాశాన్ని చూడాలి. నాన్నగారూ! ఇదంతా ఒక విలక్షణమైన చిక్కు, అయినప్పటికీ నేనొక అస్పష్టమైన చిత్రాన్ని తయారుచేశాను. నేను ప్రపంచములోని అపారవైభవాన్ని చూడాలి, దాని రహస్యాని తెలుసుకోవాలి, ప్రతి వస్తువు నాకు అపరిచితం దానే వుంది, అవన్నీ తెలుసు కోవాలి. అనుభవంతోకూడిన జ్ఞానాన్ని పొందాలి. నేను మార్గాన్ని చూడాలి, ఆమార్గం లోని బాటసారిని చూడాలి, నాన్నగారూ, చివరకు నేను ప్రభువును కలుసు కోవాలి.

సమాప్తం